# గాయత్రీ మహావిజ్ఞాన్

Super Science of Gayatri

1 భాగం




హిందీమూలం : వేదమూర్తి, తపోనిష్ఠ, నవయుగద్రష్ట 'శ్రీరామశర్మ ఆచార్య'

# GAYATHRI MAHAVIGNAN - I

# గాయత్రీ మహావిజ్ఞాన్

## ప్రథమ భాగం


హిందీ మూలము :

వేదమూర్తి, తపోనిష్ఠ, నవయుగద్రష్ట

**పండిత శ్రీరామశర్మ ఆచార్య**

తెలుగు అనువాదం :

**ఆకుల వెంకటేశ్వరరావు**



ప్రచురణ, ప్రతులకు :

**వేదమాత గాయత్రీ ట్రస్ట్**

గాయత్రీ శక్తిపీఠం, నారాకోడూరు - 522 212.

ఫోన్ : 0863 - 2534440

# గాయత్రీ మహావిజ్ఞాన్

## మొదటి భాగము

విషయసూచిక

# వేదమాత గాయత్రి ఉత్పత్తి

జ్ఞానమును వేదమని యందురు. జ్ఞానము నాలుగు రకములు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము. కళ్యాణప్రదము, ప్రభు ప్రాప్తి, ఈశ్వర దర్శనము, ఆత్మశక్తి, బ్రహ్మనిర్వాణము, ధర్మభావన, కర్తవ్యపాలన, ప్రేమ, తపస్సు, దయ, ఉపకారము, ఉదారత, సేవ మొదలైనవి ఋక్కులు. పరాక్రమము, పురుషార్థములు (ధర్మార్థ కామ మోక్షములు) సాహసము, వీరత్వము, రక్షణ, ఆక్రమణము, నేతృత్వము, యశస్సు, విజయము, పదవి, ప్రతిష్ఠ యజుర్వేదాంతర్గతములు. క్రీడలు, వినోదము, మనోరంజనము, సంగీతకళ, సాహిత్యము, స్పర్శేంద్రియపు స్థూల భోగములు, ఈ భోగములను గూర్చిన చింతన, ప్రియమైన విషయాసక్తి గతిశీలత, రుచి, తృప్తి, మొదలైనవి సామవేదాంతర్గతములు. ధనము, వైభవము, వస్తుసంగ్రహణము, శాస్త్రము, ఓషధులు, అన్నము, వస్తువులు, ధాతువులు, గృహములు, వాహనములు, మొదలైన సుఖ సాధనములు, తత్సామాగ్రి అధర్వణ వేద పరిధిలోనికి వస్తాయి.

జీవించి ఉన్న ఏ ప్రాణిని పరిశీలించినప్పటికీ, ఆ ప్రాణి స్థూల, సూక్ష్మ, అంతర్గత, బహిర్గత, కల్పనలను, గంభీర భావములను, వైజ్ఞానిక శక్తినీ, విశ్లేషించిన యడల, పైన ఉదహరింపబడిన నాలుగు క్షేత్రములలో, ఆ ప్రాణి సమస్త చేతనత్వము పరిభ్రమిస్తూ వుంటుంది. (1) ఋక్-కళ్యాణప్రదము (2) యజు-పౌరుషము (3) సామ-క్రీడ (4) అధర్వ-అర్థము-ఈ నాలుగు మినహా ప్రాణుల జ్ఞానధార మరే దిశలోనూ ప్రవహించదు.

ఋక్ అనగా ధర్మమనియు, యజుర్ అనగా మోక్షమనియు, సామమునకు కామమనియు, అధర్వమును అర్థమనియు చెప్పుదురు. ఇవియే బ్రహ్మదేవుని చతుర్ముఖములు.

ఏక ముఖముతో నాలుగు విధముల జ్ఞానధారలను ప్రకటించినందున బ్రహ్మదేవునకు చతుర్ముఖుడను పేరు వచ్చినది. 'వేదము' అను పదమునకు జ్ఞానము అని అర్థము. ఈ విధంగా బ్రహ్మతత్వము ఒక్కటైనప్పటికీ, ప్రాణులఅంతఃకరణములలో నాలుగు విధములుగా ద్యోతకమౌతుంది. అందువలన వేదము (జ్ఞానమును) సులభంగా తెలిసికొనుటకు, నాలుగుగా విభజింపబడినది. విష్ణు భగవానుని నాలుగు భుజములన్న ఇవియే. ఈ నాలుగు విభాగములకు ప్రత్యేక స్వేచ్ఛ కల్పించుటకై నాలుగు ఆశ్రమములు, నాలుగు వర్ణములు వ్యవస్థీకరింపబడినవి. బాల్యము క్రీడావస్థ లోను, తరుణ వయస్సు అర్థావస్థలోను, వానప్రస్థము పౌరుషావస్థలోను, కళ్యాణావస్థ సన్యాసములోను ఉంటాయి. బ్రాహ్మణులు ఋక్, క్షత్రియులు యజుర్వేదము, వైశ్యులు అధర్వణ వేదము, శూద్రులు

సామవేదములకు ప్రతీకలు. ఈ విధంగా చతుర్విధ విభజన జరిగినది. సృష్ట్యారంభంలో బ్రహ్మదేవుడు స్ఫురణ మాత్రంగా ఏ చైతన్య శక్తిని ఉత్పన్నం చేశాడో అదియే జ్ఞానము లేక వేదము. దీనిని శాస్త్రజ్ఞులు గాయత్రి అనే నామముతో వ్యవహరిస్తారు. ఈ విధంగా నాలుగు వేదములకు "మాత" "గాయత్రి". అందువలనే 'గాయత్రి'ని వేదమాత అని వ్యవహరిస్తారు. మనము జలతత్వాన్ని మంచు, వర్షము, మేఘము, ఆక్సిజను, కదలికల ద్వారా కనుగొంటాం. ఆ విధంగా 'జ్ఞాన గాయత్రి' నాలుగు వేదములు నాలుగు రూపాలుగా దర్శనమొసగుతుంది. గాయత్రి మాతకాగా, నాలుగు వేదములు నలుగురు పుత్రులు.

ఇది సూక్ష్మ గాయత్రి, సూక్ష్మ వేదమాత స్వరూపము. ఇపుడు గాయత్రి యొక్క స్థూల స్వరూపాన్ని గురించి ఆలోచిద్దాం. బ్రహ్మ నాలుగు వేదములను రచించకముందు '24' అక్షరములతో కూడిన గాయత్రీ మంత్రాన్ని రచించాడు. ఈ మంత్రంలోని ఒక్కొక్క అక్షరం సూక్ష్మతత్వంపై ఆధారపడివున్నది. పల్లవించుటవలన వేదముల శాఖ ప్రశాఖలు, ఆకులు, పండ్లు ఏర్పడతాయి. అపుడా వృక్షము బీజముకన్నా అనేక కోట్ల రెట్లు అధిక పరిమాణంలో ఉంటుంది. గాయత్రిలోని 24 అక్షరములు అటువంటి బీజమే. మహోన్నతంగా విస్తరించి వేదస్వరూపంగా వెలసినది.

వ్యాకరణ శాస్త్రములోని పదునాలుగు సూత్రాలు మహేశ్వరుని డమరుక మండి ఉద్భవించాయి. ఒకసారి మహాదేవుడు (ఈశ్వరుడు) ఆనందంతో తన డమరుకను మ్రోగించాడు. ఆ డమరుకనుండి పదునాలుగు ధ్వనులు వెలువడ్డాయి. అవి 'అ, ఇ, ఉణ్, ఋ, లుక్, ఏ, ఓంగ్, ఐ, ఔచ్, హ య వ రట్, మొదలైనవి. పదునాలుగు సూత్రాలాధారంగా 'పాణిని' మహావ్యాకరణ రచన చేశారు. ఆ వ్యాకరణానికి అనేక వ్యాఖ్యలు అవతరించాయి. అవన్నీ ఒకచోట సేకరించబడినట్లయితే ఒక పెద్ద సంగ్రహం అయిపోతుంది. అటులనే గాయత్రీ మంత్రంలోని ఇరువది నాలుగు అక్షరాలు వైదిక సాహిత్యమునకు అంగప్రత్యంగంగా రూపొందినాయి. గాయత్రి వైదిక ఋక్కులకు విస్తృతమైన వ్యాఖ్య.

## బ్రహ్మదేవుని స్ఫురణ మాత్రంచే గాయత్రి ప్రాదుర్భావం :

అనాదిలో పరమాత్మతత్వం ఈ సకల చరాచర సృష్టిని బ్రహ్మదేవుని ద్వారా ఉత్పన్నం చేసినది. సృష్టి కార్యపు సంకల్పం కలిగినంతనే బ్రహ్మదేవునికి స్ఫురణ కలిగినది. దాని నామము 'శక్తి' శక్తి ద్వారా రెండు రకముల సృష్టి జరిగినది. ఒకటి జడము, రెండవది చైతన్యము. 'జడసృష్టి'ని నడిపించునది ప్రకృతి. చైతన్య సృష్టిని ఉత్పన్నం చేసే శక్తి 'సావిత్రి'.

పురాణాలలో సృష్ట్యాదిన భగవంతుని నాభినుండి కమలము ఉద్భవించినదని వర్ణింపబడినది. కమలము నుండి బ్రహ్మ ఉద్భవించాడు. బ్రహ్మవలన సావిత్రి, బ్రహ్మ సావిత్రి సంయోగము వలన వేదములు ఆవిర్భవించాయి. వేదముల నుండి అన్నిరకముల జ్ఞానము వెలువడినది. తరువాత బ్రహ్మ ఈ పాంచభౌతిక సృష్టి నొనరించినాడు. ఈ అలంకారిక కథా రహస్యమేమంటే 'నిర్లిప్త, నిర్వికార, నిర్వికల్ప తత్వమనే నాభినుండి అనగా కేంద్రమునుండి అంతఃకరణము నుండి కమలముత్పన్నమై, పుష్పమువలె వికసించినది. అవి శృతి ప్రకారం సృష్ట్యాదిన పరమాత్మ కోర్కెననుసరించి 'ఏకోహం బహుశ్యామ్' ఒకటి అనేకమైనది. ఈ సృష్టి ఆ పరమాత్మ 'ఇచ్ఛ' స్ఫురణ నాభి దేశమునుండి ప్రావిర్భవించినది. అనగా కమలము యొక్క 'లతిక'ద్వారా చిన్న మొగ్గ పుష్పించినది.

ఇపుడు బ్రహ్మ సృష్టి ప్రారంభమైనది. బ్రహ్మ సృష్టి రెండు రకములు. ఒకటి చైతన్యము. రెండవది 'జడము'. చైతన్య సృష్టి అనగా సకల జీవుల సృష్టి. ఇందులో ఇచ్ఛ, అనుభూతి, అహంభావముంటాయి. చైతన్యము స్వతంత్ర సృష్టి. ఈ విశ్వమునకు చైతన్యసృష్టి 'ప్రాణమయకోశము', సకల విశ్వానికి చైతన్య తత్వము 'ప్రాణము అనే పేరుతో పిలువబడుతోంది. ఆలోచన, సంకల్పము, భావము, ప్రాణతత్వములోని మూడు భాగాలు. సత్వ, రజ, తమము అనే మూడు గుణాలుకూడా ప్రాణతత్వం లోనివే. ఈ తత్వముల ఆధారంగా ఆత్మకు 'సూక్ష్మ' కారణ, లింగ దేహములు ప్రాప్తిస్తాయి. అన్ని ప్రాణులకు ఈ ప్రాణతత్వం చైతన్యాన్ని, జీవనశక్తిని ఇస్తుంది.

జడసృష్టికోసం బ్రహ్మ పంచభూతములను నిర్మించాడు. పృథ్వి, జలము, వాయు, అగ్ని, ఆకాశములద్వారా సృష్టిలోని పరమాణుమయ పదార్థం నిర్మించబడినది. పరమాణు ప్రకృతి ఘన, ద్రవ, వాయు రూపాలలో తన గతి విధానాన్ని పరిపాలిస్తుంది. నదులు, పర్వతాలు, భూమి మొదలైనవిపాంచభౌతికపు క్రీడలు, ప్రాణుల స్థూల శరీరాలు ఈ ప్రకృతియొక్క పంచభూతములచే తయారైనవే.

జడ, చైతన్య సృష్టి రెండింటిలోను క్రియ ఉన్నది. ప్రాణమయ చైతన్యసృష్టి యొక్క అహంభావము సంకల్పము, ప్రేరణ పోకడలు అనేక రూపములలో కన్పిస్తాయి. జడమయ సృష్టిలో శక్తి, బలము, స్వభావముల ఆధారంగా పరమాణు పదార్థము అనేక విధాలుగా రూపములో, వర్ణములో, ఆకారములో మార్పులు చెందుతూ, ఉంటుంది. జడమయ సృష్టికి ఆధారం పరమాణువు. చైతన్య సృష్టికి ఆధారం సంకల్పము. ఈ రెండింటికి ఆధారము అత్యంత సూక్ష్మము. అత్యంత బలమైనది. దానికి నాశనములేదు. కాని రూపాంతరమున్నది.

జడచేతన సృష్టి నిర్మాణంలో బ్రహ్మయొక్క రెండు శక్తులు పని చేస్తాయి. (1) సంకల్పశక్తి, (2) పరమాణుశక్తి. ఈ రెండింటిలో ప్రథమంగా సంకల్పశక్తి అవసరమైనది. ఏలనన సంకల్పము లేనిదే చైతన్యము కలుగదు; చైతన్యము లేనిదే పరామాణువు ఉపయోగింపబడలేదు. చైతన్యరహిత సృష్టి చైతన్య హీనమై జ్ఞానము లేక, నిష్ప్రయోజన మౌతుంది. చైతన్యము బహిర్గతమగుటకు కావలసిన సాధన సామాగ్రి రూపంలో బ్రహ్మ చైతన్యాన్ని సృజించి, జ్ఞాన సంకల్పాన్ని ఆవిష్కరించాడు. పౌరాణిక భాషలో సర్వప్రథమంగా వేదాలు చెప్పబడ్డాయి.

పురాణాలలో బ్రహ్మయొక్క శరీరంనుండి ఒక సర్వాంగ సుందరి ఉద్భవించినది. ఆయన అంగమునుండి ఉద్భవించినది. కనుక ఆమె ఆయనకు పుత్రిక ఔతుంది. ఈ తరుణి సహాయముతో తన సృష్టి కార్యాన్ని ప్రారంభించాడు. తరువాత రూపవతియైన తరుణిని జూచి మోహించి, మనోవికారమును పొందినవాడై ఆమెను భార్యగా స్వీకరించి రమించాడు. ఈ మైధునము వలన, పాంచభౌతిక సృష్టి జరిగినది. అలంకారిక కథ ఇది. ఈ కథ యొక్క రహస్యాన్ని తెలిసికొనక ప్రాచీన త్వాన్ని అవహేళనతో, అవినీతికరంగా భావించి, అశ్రద్ధతోను, అవిశ్వాసంతోను భావిస్తారు. బ్రహ్మ మానవుడు కాదని, ఆయనచే సృష్టించబడిన శక్తి స్త్రీ గాదనీ, వారు స్త్రీ పురుషులవలె సంగమించి బీజోత్పత్తి చేయలేదని గ్రహించాలి. సృష్టికార్య స్వరూపాన్ని గూఢంగా కవితాకళా కౌశల్యాన్ని ఉపయోగించి కథగా చెప్పబడినదని తెలియవలెను.

బ్రహ్మ నిర్వికార పరమాత్మ శక్తి. ఇదియే సృష్టి నొనరించునది. ఈ కార్యాన్ని నిర్వహించడానికి గాను 'పరమాత్మ శక్తి'కి రెండు భుజములున్నాయి. అవి (1) సంకల్ప శక్తి (2) పరమాణుశక్తి. సంకల్పశక్తి చైతన్య సత్ సంభవము గనుక బ్రహ్మకు భార్యయైనది. ఈ విధంగా, గాయత్రి లేక సావిత్రి బ్రహ్మకు పుత్రిక లేక భార్యగా ప్రసిద్ధి చెందినది.

## గాయత్రి సూక్ష్మశక్తుల 'స్రోత' :

మనకిప్పుడు అవ్యయమై, నిర్వికారము, అజరము, అమరమునైన పరమాత్మ ఒకటే అనేకంగా రూపొందడానికి సంకల్పశక్తిగానైనది తెలిసినది. ఈ ఇచ్ఛా, సంకల్ప, స్ఫురణ శక్తినే 'బ్రహ్మ పత్ని' అంటారు. ఈ విధంగా బ్రహ్మ ఒకటి నుండి రెండైనాడు. ఇపుడు దానినే మనం 'లక్ష్మీనారాయణ' 'సీతారామ్' 'రాధేశ్యామ్' 'ఉమామహేష్' 'శక్తి శివ' 'మాయాబ్రహ్మ' 'ప్రకృతి పరమేశ్వర' అనే పేర్లతో సంబోధిస్తున్నాం.

ఈ శక్తి ద్వారా అనేక పదార్థముల నిర్మాణం కావలె. అందువలన తను స్వయంగా మూడు భాగములుగా విభజింపబడవలసి వచ్చినది. తద్వారా బహుసమ్మిశ్రితములు

తయారవడానికి ఆస్కారముంటుంది. దాంతో వివిధ గుణ, కర్మ, స్వభావములు గల జడచేతన పదార్థములు తయారవగలిగాయి. ఆ బ్రహ్మ శక్తియొక్క మూడు ముక్కలు. (1) సత్ (2) రజ్ (3) తమ అను పేర్లతో వ్యవహరింపడుతున్నాయి. సత్ అనగా ఈశ్వరుని దివ్యతత్వము. 'తమ' అనగా నిర్జీవ పదార్థములోని పరమాణువుల అస్థిత్వము 'రజ్' లేక రజస్సు అనగా, జడపదార్థ, ఈశ్వరీయ తత్వముల మిశ్రమముచే ఉత్పన్నమయిన ఆనందదాయక చైతన్యము. ఈ మూడు స్థూల సృష్టికి మూల కారణములు. తదనంతరము స్థూల రూపంలో పృథ్వి, జలము, అగ్ని, వాయు, ఆకాశము అను పంచతత్వములు ఆవిర్భవించాయి. ఈ పంచతత్వముల పరమాణువులు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు సృష్టి కార్యాన్ని కొనసాగిస్తున్నాయి. వీటినే 'పంచతన్మాత్రలు' అని అంటారు.

ప్రకృతి రెండు భాగములు. ఒకటి సూక్ష్మప్రకృతి. ఈ ప్రకృతిశక్తి ప్రవాహరూపంలో ప్రాణుల సంచార(కదలిక, mobility) కార్యరూపాన్ని నిర్వహిస్తుంది. 'సత్యము', 'రజము', 'తమము' ల మయమైన స్థూల ప్రకృతి వలన దృశ్య పదార్థముల నిర్మాణము, ఉపయోగము జరుగుతుంది. ఇది పరమాణుమయశక్తి. పృథ్వి, జలము, అగ్ని, వాయురాకాశముల ద్వారా తన చలన శక్తిని ఆజ్ఞాపిస్తుంది. పైన చెప్పబడిన దాని వలన 'పాఠకులకు' ఈ విధంగా అర్థమవుతుంది. ప్రథమంగా బ్రహ్మ. ఆయన స్ఫురణవల్ల ఆదిశక్తి ఉద్భవించింది. ఈ ఆదిశక్తి పేరు గాయత్రీ. బ్రహ్మ తన గాయత్రీని మూడు భాగాలుగా చేశాడు. (1) సత్ – దీనిని 'హ్రీం' లేక సరస్వతి అంటారు. (2) రజస్సు – దీనిని 'శ్రీం' లేక లక్ష్మి అను పేరుతో గుర్తిస్తారు. (3) తమ – దీనిని 'క్లీం' లేక 'కాళీ' అని పేరు. ప్రథమంలో వస్తుతః రెండు భాగములే. అవి(1) సత్ (2) తమము. ఈ రెంటి సంయోగము వలననే ఉత్పన్నమైన ధారనుండి 'రజస్సు' ప్రావిర్భవించినది. గంగా, యమునా, నదుల సంగమముల వలన ఏర్పడిన మిశ్రమధారను మనమెలా సరస్వతిగా భావిస్తామో అటులనే 'రజస్సు' ఉద్భవించి త్రివిధ ప్రకృతియైనది.

అద్వైతవాదము, ద్వైతవాదము, త్రైతవాదముల మధ్య స్వర వ్యతిరేకత కన్పిస్తుంది. ఈ భేదము అజ్ఞత వలన వచ్చినది. బ్రహ్మ, జీవుడు, ప్రకృతి ఈ మూడుఅస్థిత్వము కలిగి ఉన్నాయి. ప్రథమంగా ఒక బ్రహ్మ ఉన్నాడు. ఇది నిజమే. అందువలన అద్వైత వాదముగూడా నిజమే. తరువాత బ్రహ్మ మరియు శక్తి (ప్రకృతి) రెండూ ఏర్పడ్డాయి. కావున ద్వైతవాదముగూడ సరియైనదే. ప్రకృతి పరమేశ్వర సంపర్కమువలన ఉద్భవించిన రసానుభూతి మరియు చైతన్య మిశ్రిత ఉత్పన్న రజస్సే 'జీవుడు'గా సంబోధింపబడినది. ఈ విధంగా త్రైతవాదము (విశిష్టాద్వైతము) గూడా సరియైనదే. ముక్తి చేకూరినంతనే

జీవశక్తి నశిస్తుంది. కావున జీవుని వర్తమానశక్తి, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారంల్పై ఆధారపడి వుంటుందనీ, అదియొక మిశ్రమ సూత్రమని స్పష్టమౌతుంది.

తత్వ దర్శనపు గంభీర విషయంలో ప్రవేశించి ఆత్మయొక్క సూక్ష్మ విషయాల్పై దృష్టి సారించుట ఇచట అవసరం. ఈ పంక్తులలో (ప్రకృతిలోని స్థూల, సూక్ష్మ భేదములను తెలియజేయవలె. విజ్ఞానముయొక్క రెండు భాగములు ఇచట నుండియే ఏర్పడుతున్నాయి. పంచతత్వములద్వారా పనిచేస్తున్న స్థూల ప్రకృతిని అన్వేషించిన మనిషి 'భౌతిక విజ్ఞాని' అంటారు. ఈ భౌతిక విజ్ఞానులే తమ బుద్ధి బలముద్వారా, పంచతత్వముల బేధ, ఉపబేధములను గ్రహించి, అనేక ప్రయోజనములను, సాధనములను పొందారు. రసాయన, కృషి(వ్యవసాయం) విద్యుత్, భాష్ప (గాస్) శిల్పము, సంగీతము, భాష, సాహిత్యము, వాహనములు, గృహనిర్మాణము, చికిత్స, శాసనము, ఖగోళ విజ్ఞానము, శాస్త్రము, అస్త్రములు, వేదాంతము, భూపరిశోధనము మొదలైన అనేక విధాలుగా సుఖ సాధనములను శోధించి కనుగొన్నారు. రైలు, మోటారు, తంతి తపాలా, రేడియో, దూరదర్శిని, ఫోటో మొదలైన వివిధ వస్తువులను నిర్మించడానికి భారీ యంత్రములను తయారుచేశారు. ధనము, సుఖము, హాయి, విశ్రాంతి పొందుటకు సాధనములు సులభతరమైనాయి. ఈ మార్గముద్వారా పొందుచున్న లాభములకు, శాస్త్ర పరిభాషలో 'శ్రేయస్సు' లేక 'భోగము' అని అంటారు. ఈ విజ్ఞానము భౌతిక విజ్ఞానముగా చెప్ప బడుతుంది. ఇది స్థూల ప్రకృతిని ఉపయోగించుకునే విద్య.

ఆదిశక్తి గాయత్రిచే ఉత్పన్నమైంది. సరస్వతి, లక్ష్మి, దుర్గ రూపములలో ప్రచ్ఛన్నమైనదియే సూక్ష్మ ప్రకృతి నదీ జలాలపైనున్న అలలపై గాలి తాకిడివలన ఏర్పడిన కలకలముతో కలిపి ఒకానొక ప్రత్యేక ధ్వని ఉత్పన్నమౌతుంది. అలాగే సూక్ష్మ ప్రకృతి శక్తిధారల వలన త్రివిధములైన ధ్వనులుద్భవించుతాయి. సత్త్వప్రవాహంలో 'హ్రీం', రజోప్రవాహంలో 'శ్రీం', తమో ప్రవాహంలో 'క్లీం' అను ధ్వనులు కలిసి రూపొందుతాయి. వీటికన్నా సూక్ష్మమైనది బ్రహ్మ యొక్క 'ఓం' కార ధ్వని ప్రవాహము. నాద యోగసాధకులు, ధ్యానమగ్నులై ఈ ధ్వనులను పట్టుకుంటారు. ఈ ధ్వనుల సహాయంతో సూక్ష్మ ప్రకృతిని అధిగమించి, బ్రహ్మ సాయుజ్యాన్ని చేరుకుంటారు. దీనిని గురించి గాయత్రి మహావిజ్ఞాన్ మూడవ భాగంలో వివరింపబడుతుంది.

ప్రాచీనకాలంలో పూజనీయులైన మన పూర్వజులు, ఋషులు, తమ తీక్షణ దృష్టిలో, విజ్ఞానంతో ఈ సూక్ష్మతత్వాన్ని గ్రహించారు. దీనిని శోధించుటకు, సఫలత నొందుటకు తమ తమ శక్తులను కేంద్రీకరించారు. తత్ఫలితంగా వర్తమాన కాలంలోని భౌతిక విజ్ఞానాని కన్నా, అనేకరెట్లు లాభదాయకమైనదిగా సూక్ష్మతత్వాన్ని సాధించారు.

వారు ఆదిశక్తియొక్క సూక్ష్మశక్తి అధికారాన్ని సంపాదించి, దానిని తమ ఆధీనంలో ఉంచుకొనగలిగారు. మనుష్య శరీరంనుండి అనేక శక్తులు ఉద్భవించగలవనునది సత్యము. మన ప్రాచీన ఋషులు యోగసాధన ద్వారా, శరీరంలోని అనేక భాగాలలో అంతర్గతంగా, నిక్షిప్తంగానున్న శక్తి కేంద్రములను, చక్రముల ద్వారా, గ్రంథులను మాత్రుకలను, జ్యోతులను, భ్రమరములను మేల్కొలిపి, ఆజాగ్రృతప్రవాహ శక్తిని ఏయే వాటికి అవసరమో గుర్తించి, సంధించెదరు. రేడియో ట్రాన్స్‌మీటరు స్టేషను సంధించి నపుడు, విద్యుత్ సమశ్రేణిలో ప్రవహించుటవలన ఆ స్టేషనుకు సంబంధం కలిగి అచటి ప్రసారములు ఎటుల వినిపించుతాయో, అటులనే సాధన ద్వారా శరీరంలోని అంతర్భాగాలలో నిగూఢంగానుండి, నిద్రావస్థలోనున్న కేంద్రములను మేల్కొలిపి సూక్ష్మ ప్రకృతి శక్తితో సంబంధము కల్పించుకొనవచ్చు. ఈ సంబంధము వలన ఆద్య శక్తిలో నిమిడిఉన్న రహస్యములను తెలుసుకోవచ్చు. వాటిని మనకవసరమైన రీతులలో నుపయోగించి ప్రయోజనము పొందవచ్చు. ఏలనన సంసారము (ప్రపంచము) ఆదిశక్తిలోనిది. ప్రపంచములోని అన్ని పదార్థములతోను, అన్నింటితోను, అటువంటి వ్యక్తి సంబంధాలను పెంపొందించుకొనుటకు శక్తుడవుతాడు.

ప్రస్తుతము వర్తమానకాలంలో, వైజ్ఞానికులు, పరిమిత స్థూల ప్రకృతికి పంచ తత్వాలకు సంబంధము కల్పించడానికి, పెద్ద పెద్ద యంత్రాలను, విద్యుత్‌ను, వాయువును, జలమును, పెట్రోలు మొదలైన వాటిని ప్రయోగించి తక్కువ ప్రయోజనాన్ని పొందుచున్నారు. ఈ పద్ధతి శ్రమసాధ్యము, కష్టసాధ్యము, ధనమువలన సాధ్యము. ఎంతో సమయాన్ని తీసుకుంటుంది. ఈ యంత్రములను నిర్మించుటకు, స్థాపించుటకు, ఎంతో కాలము పడుతుంది. వీటి రక్షణ కూడ కష్టముతో కూడిన పని. ఈ యంత్రము లను పనిచేయించుటకు నిపుణులు కావలెను. పనివారు రోజంతా పనిచేయవలె. వీటిని మార్పు చేయవలెనన్న సమయము, ధనము ఖర్చవుతుంది. ఈ ఝంఝాటమంతా భారతీయ యోగ విజ్ఞానవేత్తలకు అవసరంలేదు. వారు ఎటువంటి యంత్రసహాయము లేకుండా, విద్యుత్, పెట్రోలు, సంచాలకుడు లేకుండా తమ శరీరములోని కేంద్రములను జాగృతపరచి, సూక్ష్మ ప్రకృతితో సంబంధము కల్పించి, నేటి విజ్ఞాన శాస్త్రవేత్తలు ఊహించనటువంటి, ఆశ్చర్యజనిత కార్యాలను చేయగలిగారు.

మహాభారతయుద్ధంలోను, రామాయణ సంగ్రామంలోను, ప్రయోగింపబడిన అస్త్రశస్త్రములలో నేడు కొన్ని మాత్రమే ఆయుధముల రూపంలో కన్పిస్తున్నాయి. రాడార్లు, గ్యాస్ బాంబులు, కీటక బాంబులు, రసాయనిక బాంబులు, ఆటంబాంబులు, లాసర్ కిరణాలు, ప్రస్తుతం తయారవుతున్నాయి. ప్రాచీనకాలంలో, సమ్మోహనాస్త్రం,

బ్రహ్మ పాశం, నాగపాశం, వారుణాస్త్రం, ఆగ్నేయ అస్త్రం మొదలైనవి శత్రువులను నిర్జించి, తిరిగి వచ్చేవి. ఉపయోగంలో ఉండేవి. శబ్దభేది కూడా ప్రయోగించేవారు. అలాంటి అస్త్ర శస్త్రములు ఖరీదైన యంత్రాలద్వారాకాక, మంత్రబలంతో ప్రయోగింపబడేవి. మంత్రబలంతో 'శక్తులను' 'ఘాతినీ' అను ప్రయోగించేవారు. లంకలోనున్న రావణుడు,అమెరికాలోనున్న అహిరావణుడు తమలో తాము ఇష్టాగోష్టి వార్తలను చెప్పుకొనేవారు. వారికి రేడియో అవసరంగాని, ట్రాన్సిమీటరు అవసరంగాని లేదు. పెట్రోలు లేకుండా కేవలం మనశ్శక్తితో విమానము నడిచేది.

అష్టసిద్ధులనుగూర్చి, నవవిధులుగూర్చి శాస్త్రములలో అనేక చోట్ల వర్ణింపబడి ఉన్నది. అగ్నిప్రవేశం చేయడం, నీటిపై నడవడం, వాయువేగంతో ప్రయాణం చేయడం, అదృశ్యం కావడం, మనుష్యుడు జంతు, పక్షిరూపాన్ని ధరించడం (కామరూప విద్య), శరీరాన్ని చిన్నదిగా చేయడం, శరీరాన్నితేలికగాను, బరువుగాను చేయడం, శాపంద్వారా అరిష్టాన్ని కలుగచేయడం, వరాలను ప్రసాదించడం వలన మంచిని ఒనగూర్చడం. మృత్యువును నిరోధించుట, పుత్రకామేష్టి యజ్ఞము, భవిష్యత్ జ్ఞానము, ఇతరుల అంతర్యమును గ్రహించుట, క్షణంలో కావలసినంత ధనాన్ని పొందుట, ఋతువులను, నగరములను, జీవజంతువులను, ధాతువులను మొదలైనవాటినిసృష్టించుట, సమస్త బ్రహ్మాండము యొక్క పొకడను గుర్తించుట, వస్తువుల స్వరూపాన్ని మార్చుట, ఆకలి; దాహం, నిద్ర, శీతలము, వేడిని జయించుట, ఆకాశయానము మొదలైన అనేక ఆశ్చర్యకరమైన పనులను కేవలం మంత్ర బలంతోను, యోగశక్తితోను, ఆధ్యాత్మిక జ్ఞానంతోను జరిగేవి. ఈ వైజ్ఞానిక ప్రయోజనాలకోసం ఏవిధమైన యంత్రాలుగాని, పెట్రోలుగాని, విద్యుత్ అవసరంగాని లేదు. ప్రకృతియొక్క సూక్ష్మ ప్రవాహంతో సంబంధం ఏర్పరచుకొనినందువలన సులభంగా జరిగేవి. ఇదియే భారతీయ విజ్ఞానము. దీనికి ఆధారం-సాధన!

సాధనద్వారా, పైన చెప్పబడిన చమత్కారములు జరుగుటయేగాక, ఆనందంగూడా పొందవచ్చు. భౌతిక చమత్కారములు 'తమస్సు' తత్వమునకు సంబంధించినవి. ఆనందం 'రజస్సు' తత్వమునకు సంబంధించినది. హాని, శోకము, వియోగము, ఆపదలు, వ్యాధులు, అపజయము, విరోధము,.గాయములు తగులుట మొదలయిన విపత్కర పరిస్థితులయందు తగుల్కొని, సాధారణ మనోభూమిగల మనుష్యులు, మృత్యుతుల్య మానసిక కష్టములను పొందుచున్నారు. కాని ఆత్మశక్తి నుపయోగించి విద్య తెలిసిన వ్యక్తులు వివేకము, జ్ఞానము, వైరాగ్యము, ఆశ, పరమేశ్వరునిపై అచంచల విశ్వాసమాధారంగా కష్టాలను నవ్వుతూ, సులభంగా భరిస్తారు. పెద్ద పరిస్థితులలోను

సాధారణ పరిస్థితులలోను, తమ ఆనందాన్ని పెంచుకోవడానికి మార్గాలను అన్వేషిస్తారు. వారు తమ జీవితాలను, ఉత్సాహంతోను, మహదానందంతోను, మనోరంజకంగా గడుపుతారు. అటువంటి జీవితం కోటీశ్వరుని లలాటరేఖ గూడా సమకూర్చలేదు. ఏవ్యక్తి యొక్క శారీరక, మానసిక ఆరోగ్యం ఆత్మబలం సరిగా ఉంటుందో, ఆ వ్యక్తికి భాగ్యవంతునికన్నా ఆనందమయ జీవితాన్ని గడిపే సౌభాగ్యం సునాయాసంగా లభిస్తుంది. రజోశక్తి నుపయోగించినందువలన భౌతిక విజ్ఞానం ద్వారా లభించిన లాభంకన్నా అనేకరెట్లు శక్తి లభిస్తుంది.

సత్వతత్వపు లాభాలను వర్ణించడానికి 'లేఖిని'కి గాని, వాణికి గాని శక్తిలేదు. ఆత్మయందు ఈశ్వరతత్వము వృద్ధి పొందుచున్నప్పుడు, దయ, కరుణ, ప్రేమ, మైత్రి, త్యాగము, సంతోషము, శాంతి, సేవాభావము, ఆత్మీయత, సత్యనిష్ఠ నిజాయితీ, నిగ్రహము, నమ్రతాభావము, పవిత్రత, శ్రమశీలత, ధర్మపరాయణత మొదలయిన సద్గుణములు ప్రతిదినం మహావేగంతో వృద్ధి పొందుతాయి. అట్టి వారికి ఫలస్వరూపంగా, ప్రశంసలు, కృతజ్ఞత, ప్రత్యుపకారమువలన సంతృప్తి కలుగుతుంది. ఇదిగాక సద్గుణాలు ఎంత మధురమైనవంటే, ఏ హృదయంలో వీటికి స్థానముంటుందో అచట ఆత్మ సంతోష శీతల ప్రవాహము సదా ప్రవహిస్తుంటుంది. అట్టివారు జీవనం గడుపుతున్నా, మృత్యుస్థానంలోనున్నా, జీవన్ముక్తి, స్వర్గము, పరమానందము, బ్రహ్మానందము, ఆత్మ దర్శనము, భగవత్ ప్రాప్తి, బ్రహ్మ నిర్వాణము, తురీయావస్థ, నిర్వికల్ప సమాధుల సుఖప్రాప్తి కలుగుతుంది. ఇదియే జీవన లక్ష్యము. ఈ స్థితి పొందినపుడు ఆత్మ తృప్తితో ఆనందసాగరంలో లీనమౌతుంది.

సుఖము మూడు రకములు. ఆత్మసుఖము, మానసిక సుఖము మరియు సాంసారిక సుఖము ఈ మూడు సుఖములు, గాయత్రీ సత్వ, రజ, తమోమయధారలను చేరుటతో సాధకుడు సుగమంగా పొందుతాడు. సరస్వతి, లక్ష్మి, కాళికాదేవి సిద్ధులు వేర్వేరుగా ప్రాప్తిస్తాయి.

పాశ్చాత్య దేశాలలోని భౌతిక విజ్ఞానులు 'క్లీం' తత్వపుకాళీశక్తిని ఆరాధించడంలో, అన్వేషించడంలో నిమగ్నులైనారు. బుద్ధివాదులు, ధర్మప్రచారకులు, ఉద్ధరణవాదులు, గాంధీవాదులు, సమాజ సేవకులు, వ్యాపారులు, శ్రామికులు, ఉద్యోగస్థులు, సమాజ వాదులు, కమ్యూనిష్టులు, 'శ్రీం' శక్తియొక్క సువ్యవస్థ 'లక్ష్మి' సంపాదన కొరకు అహరహం ప్రయత్నిస్తున్నారు.

యోగులు, బ్రహ్మవేత్తలు, ఆధ్యాత్మవాదులు, తత్వదర్శకులు, భక్తులు, వేదాంతులు, పరమార్థాన్ని కాంక్షించే వ్యక్తులు. 'హ్రీం' తత్వపు సరస్వతీ శక్తిని ఆరాధిస్తున్నారు. ఈ

మూడు వర్గములు గాయత్రీ ఆద్యశక్తి యొక్క ఒక్కొక్క పాదమును ఉపాసన చేయుచున్నారు. గాయత్రిని "త్రిపద" అని అంటారు. ఆమెకు మూడు చరణములున్నాయి. ఈ త్రివేణి, పైనుదహరింపబడిన మూడు ప్రయోజనములను సంప్రాప్తింపజేస్తాయి. మాతృదేవి కుమారుని సర్వపనులు చేస్తుంది. అవసరాన్నిబట్టి దాసిగా, వంటమనిషిగా, గుబ్బంగా, దాతగా, చాకలిగా, కాపలాదారుగా, పాకీగా, దుబాసీగా, దర్జీగా పనులు చేస్తుంది. అటులనే మానవులు ఆత్మశక్తిని, ఆద్యశక్తితో సంధించుటనే విద్య నేర్చినపుడు తాము ఆ తల్లికి సుసంతతిగా పరిఢవిల్లుతారు. వారు సర్వశక్తిమయి గాయత్రిమాత చల్లని దీవెనతో ఇష్టమైన ప్రయోజనాలను పొందుతారు.

ప్రపంచంలో దుఃఖానికి కారణాలు మూడు. (1) అజ్ఞానము, (2) శక్తిహీనత, (3) అభావము. ఈ మూడు దుఃఖములను గాయత్రి సూక్ష్మ ప్రకృతియొక్క మూడు ధారలను సద్వినియోగం చేయడం ద్వారా నివారింపవచ్చును. 'హ్రీం' అజ్ఞానాన్ని, 'శ్రీం' అశక్తిని పోగొడతాయి. భారతీయ సూక్ష్మ విద్యా విశేషజ్ఞులు సూక్ష్మ ప్రకృతిపై అధికారాన్ని పొంది, తమ అభీష్టానందాన్ని పొందడానికి, ఏ విజ్ఞానాన్ని ఆవిష్కరించారో, ఆ విజ్ఞానానికి అది అన్ని దృక్కోణములనుండి గూడా అసాధారణము, అపూర్వము. ఈ ఆవిష్కారానికి మరోపేరు సాధన. సాధన వలన సిద్ధి కలుగుతుంది. గాయత్రి సాధనచే అనేక సిద్ధుల జ్ఞానము కలుగుతుంది.

## గాయత్రి సాధనవలన శక్తి కోశములు ఉద్భవించుట

ఇంతకు ముందు గాయత్రి, దేవి-దేవతాకాదని, భూతప్రేతము గాదని, బ్రహ్మ స్ఫురణ వలన జన్మించిన ఆద్యశక్తియని, అది ఈ ప్రాపంచిక పదార్థానికి మూలకారణమని, ఆ శక్తి వలననే జడ చేతన సృష్టికి గమనము, శక్తి, ప్రగతి, ప్రేరణ, పరిణితి కలిగాయని వ్రాయడమైనది. రేడియో సంబంధమైన విశ్వవ్యాపిత ఈథర్ (Eather) తరంగాలద్వారా మన ఇంట్లో కూర్చుని దేశవిదేశాలలోని ప్రత్యేక ప్రసారాలను సులభంగా ఎలా వినగలమో అదేవిధమున ఆత్మశక్తివలన విశ్వవ్యాప్తమైన గాయత్రితో సంబంధము ఏర్పరచుకొని సూక్ష్మప్రకృతిచే జరుగుచున్న అన్ని సంగతులను తెలిసికొనగలము. సూక్ష్మశక్తిని ఇచ్ఛానుసారం ఉపయోగించుకొనే కళను తెలుసుకొన్నప్పుడు, సాంసారిక, మానసిక, ఆత్మిక క్షేత్రాలలో ప్రాప్తించగల సకల సంపదలను పొందటానికి గల ఏకైక మార్గము-సాధన.

మనకు ఈశ్వర ప్రాప్తి, ఆత్మదర్శనము, జీవన్ముక్తి కావలెగాని, గాయత్రి యొక్క సూక్ష్మ ప్రకృతి ఆకర్షణలో పడినందువలన ప్రయోజనమేమని అనేకులు ఆలోచిస్తారు.

మనకు ఈశ్వరారాధనమే కావలె. బ్రహ్మ సర్వదా నిర్వికార, నిర్లిప్త, నిరంజన నిరాకార గుణాతీతుడు. ఆయనకు ప్రత్యేకించి ఎవరిపైనా ద్వేషము లేదు. ప్రేమా లేదు. ద్రష్ట మాత్రమే, కారణ రూపుడు మాత్రమే. అంతవరకు సరాసరి మనమెటువంటి ఆటంకమూ లేకుండా వెళ్లలేము. ఏలనన జీవబ్రహ్మల మధ్య సూక్ష్మ ప్రకృతి (Energy) శక్తియొక్క నీలాచ్ఛాదన ఉన్నది. ఈ ఆచ్ఛాదన నతిక్రమించడానికి ప్రకృతి సాధనాలు ద్వారానే వీలవుతుంది. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, కల్పన, ధ్యానము, సూక్ష్మ శరీరము, షట్చక్రాలు, ఇష్టదేవతా ధ్యాన,ప్రతిమ, భక్తిభావన, ఉపాసన, వ్రతము, అనుష్ఠానము, సాధన - ఇవన్నీకూడ మాయా నిర్మితాలు. ఇవన్నీ వదలి బ్రహ్మ ప్రాప్తి ఎలా సంభవిస్తుంది? పై ఆకాశాన్ని చేరడానికి వాయుయానమెంత అవసరమో, బ్రహ్మప్రాప్తి కొరకు ప్రతిమా మూలకమైన ఆరాధనను ఆశ్రయించుట యటులనే అవసరమవుతుంది. గాయత్రి ఆచరణలో ఉంటూనే ఆవలికిచేరినంతనే బ్రహ్మసాక్షాత్కారం జరుగుతుంది. ఈ స్థితిని అతిక్రమించినపుడు సూక్ష్మేంద్రియాలతో పాటు వాటి అనుభవశక్తి కూడా లుప్తమౌతుంది. అందుచేత ముక్తిని, ఈశ్వరప్రాప్తిని కాంక్షించేవారు గాయత్రీ మిశ్రిత బ్రహ్మను, రాధేశ్యామ్‌ను, సీతారాముని, లక్ష్మీనారాయణుని ఉపాసన చేస్తారు. బ్రహ్మ యెపుడు 'అనేకము' నుండి 'ఏక' మవడానికి ఇష్టపడతాడో, ఆత్మలన్నిటిని సమ్మేళన పరచుకొని తమయందు ఇమిడ్చుకొంటాడో, అపుడు 'నిర్వికార' బ్రహ్మ సాయుజ్యము పొందుతాడు. అంతకు పూర్వము 'సవికార' బ్రహ్మలోనే అన్ని ఆత్మలు సారూప్య, సాయుజ్య, సామీప్యమవుతాయి. ఈ విధంగా గాయత్రీ మిశ్రిత సవికార బ్రహ్మమే మన ఉపాస్యమౌతుంది. దానిని పొందడానికి ఏ విధమైన సాధన చేసినప్పటికీ, అవన్నీ సూక్ష్మ ప్రకృతి గాయత్రి ద్వారానే జరుగుతాయి. అందుచేత బ్రహ్మ ప్రాప్తికి గాయత్రి అనవసరమని తలంపరాదు. గాయత్రి అనివార్యము. గాయత్రి నామాన్ని ఏవరైనా అంగీకరించని యెడల అది వారి ఇష్టము. కాని, గాయత్రి తత్వము నుండి తప్పించుకొని ఇతర మార్గము అనుసరించుట అసంభవము.

అనేకమంది తాము నిష్కామ సాధన చేస్తామంటారు. ఫలాపేక్ష లేదు. కాబట్టి సూక్ష్మ ప్రకృతినేల ఆశ్రయించవలె ? అని ప్రశ్నిస్తారు. అలాంటివారు నిష్కామ సాధనకు అర్థమేమో తెలుసుకోవాలి. అనగా భౌతిక ప్రయోజనాన్ని కోరకుండా ఆత్మిక సాధన గావించాలి. పరిణామాన్ని గణించకుండా దీనిని ఆశ్రయిస్తే ఏ కార్యములోనైనా ప్రవృత్తికూడా కలుగనేరదు. ఒకవేళ కొంచెమేదైనా ప్రాప్తించినా దానివల్ల సమయం, శక్తి వృధా అవడం తప్ప మరే ఇతర పరిణామము సంభవించదు. నిష్కామ కర్మకు తాత్పర్యము దైవీ, సత్వగుణము, ఆత్మిక కోర్కెల కొరకే. ఇలాంటి కోర్కెలు గాయత్రి

ప్రథమ పాదమైన "హ్రీం" తత్వములో సరస్వతీ భాగము క్రిందకు వస్తుంది. కావున నిష్కామ భావనా ఉపాసన కూడా గాయత్రీ క్షేత్రమునకు వేరుగా లేదు.

మంత్రవిద్య తెలిసిన వైజ్ఞానికులు నాలుక నుండియే శబ్దము వెలువడినా దాని ఉచ్చారణ కంఠము, దౌడలు అంగిట, పెదవులు, దంతములు, జిహ్వామూలము మొ॥ విభిన్న ముఖ అంగాల ద్వార జరుగుతుందని భావిస్తారు. ఈ ఉచ్చారణ కాలంలో ముఖము నందలి ఏ భాగమునుండి ధ్వని వెలువడుతుందో ఆ అంగాల నాడీతంతువులు శరీరపు విభిన్న భాగాలకు వ్యాపిస్తాయి. అక్కడ అనేక గ్రంథులుంటాయి. ఈ గ్రంథులపై ఉచ్చారణయొక్క వత్తిడి పడుతుంది. కొంతమందికి కొన్ని సూక్ష్మ గ్రంథులు పాడై పోవడంగాని, రోగగ్రస్తమవడంగాని జరుగుతుంది. వారి ముఖము నుండి కొన్ని ముఖ్యమైన శబ్దాలు అస్పష్టంగా ఆగి, ఆగి వెలువడతాయి. దీనినే నంగి మాటలని అంటాము. శరీరంలో అనేకమైన చిన్న, పెద్ద గ్రంథులుంటాయి. ఇవి కొన్ని దృశ్యంగాను, కొన్ని అదృశ్యంగాను ఉంటాయి. ఆ కోశాలలో ఏదో ఒక శక్తి భండారము నిక్షిప్తమై ఉంటుందని యోగులకు తెలుసు. సుషుమ్నలో కూడిన షట్చక్రాలు ప్రసిద్ధమైనవి. అట్టి గ్రంథులు శరీరంలో లెక్కలేనన్ని ఉన్నాయి. వివిధ శబ్దోచ్చారణ వివిధ గ్రంథులపై తన ప్రభావాన్ని ప్రసరింపచేస్తుంది. ఆ ప్రభావం వలన అపుడు, ఆయా గ్రంథులలో నిక్షిప్తంగా ఉన్న శక్తి భాండారము జాగృతమౌతుంది. మంత్రశక్తి దీనిపై ఆధారపడి ఉంటుంది.

గాయత్రీ మంత్రములో 24 అక్షరాలున్నాయి. శరీరంలో ఉన్న 24 గ్రంథులకు గాయత్రీ మంత్రానికి సంబంధమున్నది. గాయత్రీ మంత్రోచ్చారణ వలన శరీరమనే "సితార్" 24 స్థానాలలో ఝంకారమును పొందుతుంది.

ఇంకా దీనివలన ఒక ప్రత్యేకమైన స్వరలహరి ఉద్భవిస్తుంది. దీని ప్రభావము అదృశ్య ప్రపంచపు మహత్వపూర్ణమైన తత్వాలపైన పడుతుంది. ఈ ప్రభావంకూడా గాయత్రీ సాధన ఫలస్వరూప ప్రభావానికి కారణము.

శబ్దాల ధ్వని ప్రభావము అల్పమైనదేమి కాదు. శబ్ద విద్య తెలిసిన ఆచార్యులకు శబ్దమెంత శక్తివంతమైనదో తెలుసు. ఆ శక్తి యొక్క అజ్ఞాన గమనం ద్వారా ఎట్టి పరిణామము సంభవిస్తుందో వారికి స్పష్టంగా గోచరిస్తుంది. శబ్దాన్ని బ్రహ్మ అని చెబుతారు. (శబ్దబ్రహ్మ) బ్రహ్మస్ఫురణము ప్రకంపాలను సృష్టిస్తుంది. ఆ ప్రకంపనాలు బ్రహ్మను స్పృశించి 'ఓం' అనే ధ్వనితో ఏడుసార్లు ధ్వనిస్తాయి. గడియారంలోని లోలకము ఊగుతూ గడియారపు ముల్లులలో కదలిక కలిగిస్తుంది. అలాగే 'ఓం' కార ధ్వని కూడా సృష్టిని నడిపించే గమనాన్ని సృష్టిస్తుంది. కొంత దూరం ఆ ప్రవాహం

సాగి 'హ్రీం', 'శ్రీం', 'క్లీం' అను మూడూ, సత్వ, రజస్, తమములైన మూడు పాయలుగా పారుతుంది. తరువాత అవి అనేక ప్రవాహములుగామారి "బీజమంత్రాలు" అనే పేరుతో పిలువబడతాయి. ధ్వనులు తమ తమ క్షేత్రాలలో సృష్టి కార్యాన్ని నడిపిస్తాయి. కావున ఈ సృష్టి నిర్వహణము శబ్ద తత్వము ద్వారానే జరుగుతుంది. అటువంటి శక్తిని అల్పమైనదిగా భావించరాదు.

గాయత్రి మంత్రము విశిష్ట అక్షర క్రమములో దర్శింపబడినది. ఆ శబ్దాలలో క్రమము, విశేషత ఉన్నందువలన తనదైన పద్ధతిలో అద్భుతశక్తి ప్రవాహాన్ని సృష్టిస్తుంది.

'దీపక్' రాగమాలపిస్తే ఆరిపోయే దీపం ప్రజ్వలిస్తుంది. 'మేఘమల్హార్' రాగం వలన వర్షమొస్తుంది. వేణునాదం వలన సర్పము పడగవిప్పి నాట్యం చేస్తుంది. లేళ్ళుతమను తాము మరచిపోతాయి. ఆవులు అధికంగా పాలిస్తాయి. కోయిల కూజితము 'కామ' భావాన్ని మేల్కొల్పుతుంది. సైనికుల పదవిన్యాసపు కలయిక వలన ఏర్పడిన శబ్దముచే లోహ నిర్మితమైన వంతెన కూడా కూలిపోగలదు. అందువల్లే దాటేటప్పుడు సైనికులు క్రమపద్ధతిలో అడుగులు వేయరాదని ఆజ్ఞలిస్తారు. అమెరికాలోని డాక్టరు హచిన్‌సన్ వివిధ సంగీత ధ్వనులచే అనేక కష్టమైన వ్యాధులను కుదిర్చి రోగులను కాపాడారు. ఎంతో ఖ్యాతి గడించారు.

భారతదేశంలోని తాంత్రికులు కడవలపై పళ్ళెములనుంచి అనేక రీతులలో మ్రోగిస్తారు. ఆ మ్రోతలతో సర్పదంష్ట్రలను, తేలుకుట్టినవారిని, కంఠమాల ,విషవేలము, భూతోన్మాదము మొదలైన వారిని బాగుపరిచి పంపుతారు. కారణమేమంటే శబ్దముల వలన జనించిన ప్రకంపనాలు సూక్ష్మ ప్రకృతిచే తమ జాతికి సంబంధించిన అన్య పరమాణువులతో కలసి 'ఈథర్' పరిభ్రమించి తన ఉద్గమ కేంద్రానికి కొన్ని క్షణాలలోనే తిరిగి వస్తాయి. అటుల వస్తూనే ఆ ధ్వనులలో తనదైన విద్యుత్ శక్తి నింపుట వలన పరిస్థితి కనుగుణ్యంగా అవసరమైన క్షేత్రాలలో ఆశక్తి యొక్క విశిష్ట ప్రభావము పడుతుంది. మంత్రము ద్వారా విలక్షణ కార్యములు జరుగుటకిదియే కారణము. గాయత్రి మంత్రము ద్వారా కూడా ఈ విధమైన శక్తి ఆవిర్భవిస్తుంది.

మంత్రోచ్చారణలో ముఖంలోని ఏ అంగాలు క్రియాశీలమౌతాయో ఆ భాగాల లోని నాడీ తంత్రులలో కొంత విశేషమైన గ్రంధులలోస్పందన జరుగుతుంది. వాటిలో స్ఫురణ జాగృతి చెందినందువలన వైదిక ఛందస్సుయొక్క క్రమబద్ధమైన యోగసంగీత ప్రభావము 'ఈథర్' తత్వములో వ్యాపించి, కొన్ని క్షణాలలోనే విశ్వము నుండి తన స్వజాతీయ తత్వసేనాసమూహంతో తిరిగి వస్తుంది. ఇది అభీష్టసిద్ధి ప్రాప్తించుటకు సహాయపడుతుంది.

శబ్ద సంగీతపు శక్తివంతమైన కంపనాల పాంచభౌతిక ప్రవాహము మరియు ఆత్మశక్తియొక్క సూక్ష్మ ప్రకృతి భావన, సాధన, ఆరాధనలపై ఆధారపడి ఉత్పన్నమైన సంబంధము, ఈ రెండు కారణాలవల్ల గాయత్రీ శక్తి మహాశక్తివంతమై సాధకులకు దేవి యొక్క వరదానాలు సిద్ధిస్తాయి.

గాయత్రీ మంత్రము ఇంకా అధిక సూక్ష్మ మవడానికి కారణము సాధకుని 'శ్రద్ధామయ విశ్వాసము'. మనో విజ్ఞానవేత్తలందరికీ విశ్వాసము యొక్క శక్తి విదితమే. మేము మా పుస్తకాలలో, వ్యాసములలో, సిద్ధి, విశ్వాసము వలననే ఎవరికైనా ప్రాప్తిస్తుందని, ప్రజలు భయ భీతులైనప్పుడు కేవలము విశ్వాసమాధారంగా మృతప్రాయులకు నవ జీవనము లభ్యమౌతుందని, అనేక ఉదాహరణలిచ్చాము. రామాయణంలో తులసీదాసుల వారు "భవానీ శంకరానందే శ్రద్ధా విశ్వాసరూపిణో" అని కీర్తిస్తూ శ్రద్ధ, విశ్వాసానికి, భవానీ శంకరుని ఉపమానమిచ్చారు. గాలికి భూతస్వరూపమును, రజ్జువు (త్రాడు)నకు సర్పభ్రాంతిని, విగ్రహానికి దైవత్వాన్ని ఇవ్వగలిగిన ఓర్పు విశ్వాసంలోనే ఉన్నది. మనుష్యులు తమ విశ్వాసములను పరిరక్షించుకోవడానికి తమ ధనాన్ని, విశ్రాంతిని, ప్రాణములను సైతము నవ్వుతూ వదలివేస్తారు. ఏకలవ్యుడు, కబీరు, మొదలుగాగల **అనేక ఉదాహరణలు, గురువుద్వారా గాక తమ శ్రద్ధ ద్వారా, గురువుచేత ఈయబడిన శిక్షణ కంటె ఎక్కువ విద్యలను పొందవచ్చునని ప్రకటిస్తున్నాయి.** రోగికి తన వచనములపై విశ్వాసాన్ని కలిగించి తన కోర్కెలకనుగుణ్యంగా 'హిప్నొటిజమ్' ఆధారంగా, పనులు చేయించగలము గదా!

తాంత్రికులు మంత్రసిద్ధి కొరకై కఠోరసాధనలద్వారా తమ మనస్సులలో అపార శ్రద్ధను సంపాదిస్తారు. సాధారణంగా మనస్సులో తాము జపించే మంత్రము ఎంత ప్రగాఢ విశ్వాసముంటుందో ఆ తాంత్రికునకు అంతశక్తివంతంగా ఆ మంత్రము పని చేస్తుంది. శ్రద్ధాళువైన తాంత్రికుడు ఏ మంత్రంచే చమత్కార కార్యాన్ని చేసి చూపెడతాడో అశ్రద్ధాళువులకు ఆ మంత్రం వలన శత సంవత్సరములు ప్రయత్నించి నప్పటికి ప్రయోజనముండదు. గాయత్రీ మంత్ర విషయంలో గూడా ఇది తథ్యము. చాలా వరకు పనిచేస్తుంది. సాధకుడు శ్రద్ధ మరియు విశ్వాసపూర్వక ఆరాధన ఎప్పుడు చేస్తాడో అప్పుడు శబ్దవిజ్ఞానము, ఆత్మజ్ఞానము యొక్క సంయుక్త శక్తిచే గాయత్రీ ప్రభావము ఇంకా ఎక్కువై, అద్వితీయమైన శక్తి సంప్రాప్తిస్తుంది.

ప్రక్కనున్న పుటలోని చిత్రములో గాయత్రి యొక్క ప్రత్యేక అక్షరమునకు ఏయే స్థానములతో సంబంధమున్నదో చూపబడినది. ఆ స్థలములపై ఏయే యోగ గ్రంధి చక్రములున్నవో అవి ఈ క్రింద తెలియజేయబడినవి.

| అక్షరము | గ్రంధపేరు | అందులో నిబిడీకృతమైవున్న శక్తి |
|---|---|---|
| 1. తత్ | తాపిని | పరాక్రమము |
| 2. స | సఫలత | సఫలత |
| 3. వి | విశ్వా | రక్షణ, పోషణ, నిర్వహణ |
| 4. తుర్ | తుష్టి | కల్యాణము |
| 5. వ | వరదా | యోగము |
| 6. రే | రేవతి | ప్రేమ |
| 7. ణి | సూక్ష్మ | ధనము |
| 8. య | జ్ఞానము | తేజస్సు |
| 9. భర్ | భర్గా | రక్ష |
| 10. గో | గోమతి | బుద్ధి |
| 11. దే | దేవిక | ఆత్మనిగ్రహము, ఇంద్రియ నిగ్రహము |
| 12. వ | వరాహి | నిష్ఠ |
| 13. స్య | సింహానీ | ధారణాశక్తి (జ్ఞాపకశక్తి, సంకల్పశక్తి, నిలకడశక్తి) |
| 14. ధీ | ధ్యానము | ప్రాణము |
| 15. మ | మర్యాదా | సంయమనము |
| 16. హి | స్ఫుటా | తపస్సు,వేడి |
| 17. ధి | మేధా | దూరదర్శనము |
| 18. యో | యోగమాయ | జాగృతి |
| 19. యో | యోగిని | ఉత్పాదనశక్తి |
| 20. నః | ధారిణి | శోభ,రసయుక్తమగుట |
| 21. ప్ర | ప్రభవా | ఆదర్శము |
| 22. చో | ఉష్మా | సాహసము |
| 23. ద | దృశ్యా | వివేకము |
| 24. యాత్ | నిరంజన్ | సేవా |

పైన చెప్పబడిన 24 శక్తులను, 'గాయత్రీ' సాధకుని యందు జాగృత మొనర్చుతుంది. ఈశక్తులను జాగృత మొనర్చడంతో పాటు అనేక విధములైన ప్రయోజనములు సిద్ధులు, సంపదలు ప్రాప్తించుట ఆరంభమౌతుంది. ఇది గాయత్రీ మహత్వ పూర్ణగుణము.

ఈ ప్రయోజనము ఇతర దేవతల నారాధించినప్పటికీ లభ్యమైతుందని అనేకమంది భావిస్తారు. కారణమేమనగా వీరు తమ లోపల జరిగే సూక్ష్మ తత్వముల ప్రగతిని, పరిణితిని గుర్తించి తెలుసుకోలేకపోతున్నారు. తమ సాధనల వలన ఏఏ సూక్ష్మ ప్రక్రియలు జరుగుతున్నాయో తెలుసుకోగలిగితే, అప్పుడు తమకు లభ్యమయ్యే సర్వశక్తులూ అనాయాసంగా ఎచటనుండో దానంగా రాలేదని, ఆత్మవిద్యయొక్క సువ్యవస్థిత వైజ్ఞానిక ప్రక్రియ ద్వారా ఇట్టి పరిణామము జరుగుతుందని గుర్తించుటకు ఆలస్యముండదు. గాయత్రీసాధన అంధ విశ్వాసము గాదు దృఢమైన వైజ్ఞానిక కృత్యము. ప్రయోజనము సునిశ్చితము.

## గాయత్రియే కామధేనువు

సురలోకంలో దేవతలవద్ద "కామధేనువు" అనే గోవు వున్నదని పురాణాలలో ఉల్లేఖింపబడినది. ఆ గోవు అమృతోపమ క్షీరములనిస్తుందని, దేవతలు ఆపాలను త్రాగిఎల్లప్పుడును సంతుష్టితోప్రసన్నులై, సుసంపన్నులై వుంటారని వ్రాయబడినది. ఎవరైనా తమ కోర్కెలు తీరుటకొరకై 'కామధేనువు' నాశ్రయిస్తే వారి కోర్కెలను సత్వరమే ఆ గోవు తీరుస్తుంది. ఇది ఆ గోవు యొక్క విశేషము. కల్పవృక్షములాగే కామధేనువు గూడా తన వద్దకు వచ్చిన వారి మనోకామనలను పూర్తిచేస్తుంది.

గాయత్రి కూడా కామధేనువే. ఈ మహాశక్తిని, దేవతలుగాని, దివ్యస్వభావముగల మనుష్యులుగాని ఉపాసనచేస్తే వారు మాతృస్తనముల నుండి మాదిరిగా ఆధ్యాత్మిక దుగ్ధ ధారలను త్రాగుతారు. వారికి ఏవిధమైన కష్టము కలుగనేరదు. రాదు. ఆత్మ స్వతహాగా ఆనందస్వరూపమై యున్నది. ఆనందమగ్నమగుట ఆత్మయొక్క విశిష్ట గుణము దుఃఖములను తొలగించుకొని, అవి నాశనమైనంతనే ఆత్మ మూలస్వరూపాన్ని చేరుకుంటుంది. దేవతలు స్వర్గంలో ఎల్లప్పుడూ ఆనందంతో ఉంటారు. మానవులుగూడా, తమ కష్టకారణము నివారింపబడినట్లయితే, భూలోకంలో దేవతల మాదిరిగా ఆనందంగానుండగలరు. గాయత్రీ కామధేనువు మనుష్యుల కష్టాలన్నింటినీ నివారించుతుంది.

### త్రివిధ దుఃఖముల నివారణ :

సమస్త దుఃఖములకు కారణములు మూడు (1) అజ్ఞానము, (2) అశక్తత, (3) అభావము (లేమి, కొరత). ఈ మూడు కారణములకు ఎవరైనా ఎంతదూరంలో సంచరించకలుగుతారో వారికి అంత సుఖము ప్రాప్తిస్తుంది.

అజ్ఞానము వలన మనుష్యుని దృష్టికోణము కళంకితమౌతుంది. అతనికి తత్వజ్ఞానముతో పరిచయము లేనందువలన అస్తవ్యస్తంగా ఆలోచిస్తాడు. అలాగే వ్యతిరేకంగా పనిచేస్తాడు. తదనుసారంగా సమస్యలు, చిక్కులు అధికమవుతాయి. దుఃఖములు సంక్రమించి, దుఃఖిస్తాడు. స్వార్థము, భోగము, లోభము, అహంకారము కాఠిన్యము, క్రోధ భావనలు మనుష్యుని కర్తవ్యచ్యుతుని జేస్తాయి. అతడు దూరదృష్టిని వదలివేసి, క్షణికము, క్షుద్రము, హీనమైన వాటినాలోచించి, వాటినే ఆచరిస్తాడు. తత్ఫలితంగా అతని ఆలోచనలు, కార్యములు, పాపభూయిష్టమౌతాయి. పాపములకు, నిశ్చయమైన పరిణామము, దుఖము కాగా, అజ్ఞానవశంతో ఇతరుల సాంసారిక పోకడల మూల కారణము తెలుసుకోలేకపోతున్నాడు. ఫలితంగా అసంభవమైన ఆశలతోను, తృష్ణలతోను, కల్పనలతోను సతమతమవుతున్నాడు. ఈవిధమైన అపసవ్య దృష్టి వలన సాధారణమైనవి గూడా అతనికి దుఃఖకారక మవుతున్నాయి. అందువలననే అతడు రోదిస్తూ, దూషిస్తూ జీవిస్తాడు. ఆత్మీయులమృతి, సాటివారి విలక్షణ స్వభావము, పరిస్థితులలో ఎగుడు దిగుడులు స్వాభావికము. అజ్ఞాని అటుల తలంపక, తాను కోరినవిధంగా సర్వమూ జరగాలని తలుస్తాడు. ప్రతికూలతనెప్పుడూ దరికి రాగూడదని కోరతాడు. ఇలాంటిది అసంభవం, ఆశకు వ్యతిరేకంగా జరిగినపుడు అతడు శోకిస్తాడు,కేకలువేస్తాడు. మూడవది అజ్ఞానం కారణంగా అనేక పొరపాట్లు జరుగుతాయి. అవకాశములు సమీపంలో నున్నప్పటికీ వంచింపబడతాడు. ఇదికూడా దుఃఖహేతువే. ఈవిధంగా అజ్ఞానంవలన మనుష్యునకు అనేక దుఃఖములు సంప్రాప్తిస్తాయి.

అశక్తి అనగా నిర్బలత్వమని అర్థము. శారీరక, మానసిక, సామాజిక,బౌద్ధిక (బుద్ధి),ఆత్మిక నిర్బలత్వమువలన, మనుష్యుడు తనస్వభావానికి అనుగుణ్యాంగా, జన్మసిద్ధమైన అధికారభావాన్ని తన భుజస్కంధములపై మోయడానికి అసమర్థు డవుతాడు. ఫలితంగా దానివలన వంచింపబడవలసి ఉంటుంది. ఆరోగ్యము చెడినపుడు వ్యాధి శరీరాన్ని పూర్తిగా ఆక్రమించినపుడు, స్వాదిష్టభోజనము, రూపవతి యైన తరుణి,మధురమైన గీతావాద్యము, సుందరదృశ్యములు నిరర్థకములు, ధనము, ఐశ్వర్యమువలన పొందగలిగిన సుఖములు నిష్ప్రయోజనములు.

బౌద్ధిక (బుద్ధిలోపము) నిర్బలత్వమున్నపుడు, సాహిత్య, కావ్య, వేదాంతమనన చింతనల రసస్ఫూర్తి కలుగదు. ఆత్మిక నిర్బలత్వము వలన, సత్సంగము, ప్రేమ భక్తివలన కలుగు ఆత్మానందము దుర్లభమవుతుంది. ఇదేకాదు ఉత్తముల రక్షణ అనే ప్రకృతి సిద్ధాంతము బలహీనతలను రూపుమాపే పని చేస్తుంది.బలహీనులను బాధించడానికి, తొలగించడానికి అనేకమంది ముందుకొస్తారు.

నిర్దోషిత్వము, మంచితనము, నిష్కాపట్యముగూడా నిర్బలునకు అనుకూలించవు. చలి బలవంతుని బలమును పెంచుతుంది; రసికులకు రసస్ఫూర్తినిస్తుంది. బలహీనులను నిమోనియా వ్యాధిగ్రస్తులను చేస్తుంది. ఏ తత్వమైతే నిర్బలులకు ప్రాణఘాతక మౌతుందో,అదే తత్వము బలవంతులకు సహాయం చేస్తుంది.. నిస్సహాయ నిర్బల మేషము (మేక) అడవి జంతువులకు ఆహారంగా కావాలి. సింహాన్ని వన్యపశువులు తేరిపార చూడలేవు. గొప్పగొప్ప రాజులు కూడా తమ రాజ్య చిహ్నంగా నుంచుకొంటారు. శక్తిహీనుడు దుఃఖము పొందుతాడు. అతనికి మంచి కూడా కోరినది సిద్ధించుటకు సహాయపడదు.

అభావజన్య దుఃఖమనగా పదార్థముల కొరత. అన్నము, వస్త్రము, నీరు, గృహము, పశువులు, భూమి, సహాయకులు, స్నేహితులు, ధనము, ఔషధము, పుస్తకములు, శాస్త్రములు, గురువు మొదలైనవి లభించకపోవడం వలన, బాధలను, కష్టములను అనుభవించవలసి వుంటుంది. అవశ్యకతలను విస్మరించవలసివస్తుంది. జీవితంలోని అమూల్యక్షణాలు మట్టిలో కలసి నష్టపోవలసి వుంటుంది.

యోగ్యుడు, సమర్థుడైన వ్యక్తి గూడా పరికరముల కొరతవలన సిగ్గుపడవలసిన అనుభవము కలుగుతుంది. దానివలనదుఃఖము సంభవిస్తుంది.

గాయత్రి కామధేనువు. ఎవరైతే ఆగాయత్రిని పూజిస్తారో, ఉపాసిస్తారో,ఆరాధిస్తారో, అభిభావన చేస్తారో వారు ఆ తల్లి అమృతోపమైన దుగ్ధములను గ్రోలి, ఆనందానుభూతిని పొందుతారు. సమస్త అజ్ఞానముల అశక్తుల అభావముల కారణంగా వచ్చిన కష్టములను గడచి మనోవాంఛాఫలములను పొందుతారు.

## గాయత్రీ, బ్రహ్మల ఏకత్వం

గాయత్రీ స్వతంత్రమైన దేవిగాని, దేవతగానికాదు. గాయత్రీ పరబ్రహ్మ పరమాత్మయొక్క క్రియా భాగము. బ్రహ్మ నిర్వికారుడు అచింత్యుడు. బుద్ధికవ్వా వేరైనవాడు. సాక్షిరూపుడు. కానితనకు క్రియాశీలచైతన్య శక్తిరూపమున్నందు వలన ఉపాసనీయుడైనాడు. ఆ ఉపాసనవల్ల అభీష్టసిద్ధిప్రాప్తిస్తుంది. ఈశ్వరభక్తి, ఈశ్వరోపాసన, బ్రహ్మసాధన, ఆత్మ సాక్షాత్కారము, బ్రహ్మ దర్శనము, ప్రభు (దేవుడు) పరాయణత, మొదలైన పురుష వాచక శబ్దములకే తాత్పర్యము, ఉద్దేశ్యము న్నదో అదే గాయత్రీ ఉపాసన మొదలైనస్త్రీ వాచక శబ్దములకూ వున్నది.

వస్తుతః గాయత్రీ ఉపాసన, ఈశ్వరోపాసనకు అత్యుత్తమమైన, సరళమైన, శీఘ్రఫల ప్రాప్తినిచ్చు ఏకైకమార్గము. ఈ మార్గమునపయనించు వ్యక్తి సురమ్యమైన జీవనోద్యానముగుండా ప్రయాణించి అంతిమ లక్ష్యమైన ఈశ్వరప్రాప్తిని పొందుతాడు. బ్రహ్మ గాయత్రీల మధ్య శబ్దభేదమేగాని ఆరెండూ ఒకటే. ఈ ఏకత్వానికి ప్రమాణము క్రిందనీయబడినది.

'గాయత్రీ ఛందసామహమ్' – శ్రీమద్భగవద్గీత – 10 అ.శ్లో. 35

వైదిక ఛందస్సులలో నేను గాయత్రీ ఛందస్సును

భూర్భువః స్వరితి చైవ చతుర్వింశత్యక్షరారస్తథా
గాయత్రీ చతురోవేదా ఓంకారః సర్వమేవతుః – వృ–యో–యాజ్ఞ–అ

భూ,ర్భువః, స్వః ఈ మూడింటిచే మహత్తరంగా వ్యాపించిన 24 అక్షరముల గాయత్రీ, నిస్సదేహంగా ఓంకార (బ్రహ్మ) స్వరూపమే.

దేవస్య సవితుర్వశ్య ధియో యోనః ప్రచోదయాత్।
భర్గో వరేణ్యం తద్బ్రహ్మ ధీమహీత్యధి ఉచ్యతే ।

దివ్యతేజో బ్రహ్మను మనము ధ్యానిస్తున్నాము. దానివలన మన బుద్ధి సన్మార్గము వైపు ప్రేరేపింపబడుతుంది.

"యధావదామి గాయత్రీ తత్త్వరూపాంత్రయీమయీ
యధా ప్రకాశ్యతే బ్రహ్మ సచ్చిదానందలక్షణం" – గాయత్రీతత్వము శ్లో. 1

త్రివేదమయి, తత్వరూపిణి యగు గాయత్రీ వలననే, సచ్చిదానంద లక్షణములతో బ్రహ్మ ప్రకాశిస్తున్నాడు. అనగా తెలియబడుచున్నాడు.

"గాయత్రీ ఇదం సర్వమ్" – నృసింహ పూర్వతాపనీయోపనిషత్ – 412

సమస్తమూ గాయత్రియే.

"గాయత్రీ పరమాత్మ" – గాయత్రీ తత్వము

గాయత్రియే పరమాత్మ.

"బ్రహ్మ గాయత్రీ – బ్రహ్మవై గాయత్రీ"

– శతపథ బ్రాహ్మణమ్ – 12/3/7

ఐతరేయ బ్రాహ్మణమ్–అ.27.ఖం. 5

బ్రహ్మయే గాయత్రి, గాయత్రియే బ్రహ్మ.

"సప్రభం సత్యమానందం హృదయే మండలేఽపిచ
ధ్యాయజ్జపేత్తదిత్యథ నిష్కామో ముచ్యతేఽచిరాత్" – విశ్వామిత్ర

ప్రకాశిత సచ్చిదానంద స్వరూప బ్రహ్మను హృదయమందు, మరియు సూర్యమండలాంతర్గతునిగాను ధ్యానిస్తూ, నిష్కామంతో గాయత్రీ మంత్రాన్ని జపించిన యెడల శీఘ్రముగా సంసారపు జనన మరణములనుండి ముక్తుడౌతాడు.

"ఓంకార స్తత్పరంబ్రహ్మ సావిత్రస్యాత్తదరమ్"

**– కూర్మ పురాణము, ఉ.విభాగం. అ 14/55**

ఓంకారము పరబ్రహ్మ స్వరూపము. గాయత్రీ కూడా అవినాశియగు బ్రహ్మయే.

"గాయత్రీ తు పరం తత్వమ్ గాయత్రీ పరమాగతిః"

**– బృహత్పరాశరః. సం. అ. 35**

గాయత్రియే పరమతత్వము. గాయత్రియే పరమాగతి.

"సర్వాత్మాహి సా దేవీ సర్వభూతేషు సంస్థితా
గాయత్రీ మోక్ష హేతుశ్చ మోక్షస్థానమలక్షణమ్" **– ఋష్యశృంగుడు**

గాయత్రీ దేవి సమస్త ప్రాణులలో ఆత్మరూపముగా నున్నది. గాయత్రీ మోక్షమునకు మూలకారణమైన సారూప్య ముక్తికి స్థానము.

గాయత్రేవ పరోవిష్ణుర్గాయత్రేవ పరః శివః
గాయత్రేవ పరోబ్రహ్మ గాయత్రేవ త్రయీయుతః ।

**– బృహత్సంధ్యాభాష్యము**

గాయత్రీ ద్వితీయ విష్ణువు శంకరుడు రెండవ గాయత్రీ బ్రహ్మకూడా గాయత్రీ పారాయణుడే. ఏలనన గాయత్రీ త్రిమూర్తుల స్వరూపము.

"గాయత్రీ పరదేవతేతి గదితా బ్రహ్మైవ చిద్రూపిణీ" **– గాయత్రీ పురశ్చరణ**

గాయత్రీ పరమ శ్రేష్టమైన దేవతా, చిద్రూపి బ్రహ్మయని చెప్పబడుతుంది.

"గాయత్రి వా ఇదం సర్వభూతం యదిదం కించ" **– ఛాందోగ్యోపనిషత్తు**

ఈ విశ్వమంతయు యేదైె యున్నదో ఆ సమస్తము గాయత్రీ మయమే

"న భిన్న ప్రతిపద్యతే గాయత్రీ బ్రహ్మణాసహ
సో ఽ హమస్మి త్యుపాసీత విధినాయేన కేనచిత్ ।" **– వ్యాసమహర్షి**

గాయత్రీ బ్రహ్మలకు భిన్నము (తేడా) లేదు. ఎవరైనాబ్రహ్మ స్వరూపమైన గాయత్రీని ఏ రూపముతో ఉపాసించినప్పటికీ ఒకటే.

"గాయత్రీప్రత్యగ్బ్రహ్మైక్యబోధికా" । **– శంకరభాష్యము**

గాయత్రీ అద్వైత బ్రహ్మను తెల్పు గురువు

పరబ్రహ్మ స్వరూపాచ నిర్వాణ పదదాయినీ।
బ్రహ్మతేజో మయీ శక్తిస్త దధిష్ఠాత్రు దేవతా ।

– దేవీభాగవతం, స్కం. 6 అ. 1/42

గాయత్రీ మోక్షమిచ్చే పరమాత్మ స్వరూపము. బ్రహ్మతేజస్సహిత శక్తి మంత్రాధిష్ఠాన దేవత

"గాయత్రాఖ్యం బ్రహ్మ గాయత్రానుగతం
గాయత్రీ ముఖం వోక్తమ్" –ఛాందోగ్య – శంకరాభాష్యమ్ ప్రణ 3 ఖం. 12 మ. 5

గాయత్రి స్వరూపమై, గాయత్రీచే ప్రకాశించు బ్రహ్మ గాయత్రీ పేరుచే వర్ణింపబడుచున్నది.

"ప్రణవ వ్యాహృతిభ్యాంన్చ గాయత్ర్యాత్రితయేనచ
ఉపాస్యం పరమం బ్రహ్మ ఆత్మా యత్ర ప్రతిష్ఠతః" ।

– తారానాథ్ కృ. గా. వ్యా. పృ. 25

ప్రణవ, వ్యాహృతి, గాయత్రీ యీ మూటితో పరంబ్రహ్మ నుపాసించవలె. ఆ బ్రహ్మలో ఆత్మస్థిరముగా నున్నది.

తేవా ఏతే పంచబ్రహ్మ పురుషాః స్వర్గస్యలోకస్య
ద్వారపాలస్య ఏతానేవం పంచబ్రహ్మ పురుషాన్
స్వర్గస్య, లోకస్య, ద్వారపాలంవేద్యాస్యకులే వీరో
జాయతే ప్రతిపద్యతే స్వర్గలోకమ్ । – ఛం । 3/13/6

హృదయ చైతన్యజ్యోతి గాయత్రీ రూప బ్రహ్మకు, ప్రాణ, వ్యాన, అపాన, సమాన, ఉదానములనియెడి ఐదు ద్వారపాలకులు. వీరిని వశపరచుకొంటే. గాయత్రీ స్వరూపబ్రహ్మ ప్రాప్తిస్తుంది. ఉపాసించేవారికి స్వర్గలోకము సంప్రాప్తిస్తుంది. అట్టివారి వంశంలో వీరపుత్రుడుగాని, మహానుభావుడైన శిష్యుడుగాని జన్మిస్తారు.

భూమిర న్తరిక్షమ్ ద్యౌరిత్యష్టావక్షరాణ్యష్టాక్షరం
హవాఏకం గాయత్ర్యై పదమేతదుహై వాస్యా ఏతత్స
యావదేషు త్రిషులేకషుతవద్ది జయతియోఽస్యా
ఏతదేవం పదం వేద । – బృహ– 5/1/41

భూమి, అంతరిక్షము, ఉభయులు– ఈమూడు గాయత్రీ ప్రథమ పాదములోని ఎనిమిది అక్షరములకు సమానము ఒకవేళ గాయత్రీ ప్రథమ పాదము మాత్రమే తెలిసికొంటే అతడు త్రిలోక విజయుడౌతాడు.

నవైనెవరేమేతస్మాదేకాకి నరమతే సద్వితీయ
మైచ్ఛత్, సహై తావానాస । యథా స్త్రీపున్మాసౌ
సంపారిక్ష్వాస్వ । ఇమమేవాత్మాయం
ద్వేధాపాత యత్తతః పతిశ్చ పత్నీచాభవతామ్ । – శక్తి ఉపనిషత్తు

అనగా బ్రహ్మ రమించలేకపోయినాడు. ఒంటరిగా ఎవ్వరూ రమించలేరు ఆయన స్వరూపము స్త్రీ, పురుష సంయుక్త స్వరూపము రెండవ వారికొరకు ఇష్టపడ్డారు. తన సంయుక్త స్వరు సొన్ని రెండుగా చేశారా బ్రహ్మ ఆరెండు రూపములే పతి, పత్నీగా రూపొందినాయి.

నిర్గుణః పరమాత్మా తు త్వదాశ్రయత యాస్థితః ।
తస్య భట్టారికాసి త్వం భువనేశ్వరి భోగదా । – శక్తి దర్శనము

పరమాత్మ నిర్గుణుడు. కాని నీ ఆశ్రయముతో విశ్రమించి యున్నాడు. నీవే ఆయన సామ్రాజ్ఞివి. సుఖానుభవము నిచ్చుదానివి.

శక్తిశ్చ శక్తిమద్రూపాత్ వ్యతిరేకం కన్నవాన్ఛతి
తాదాత్మ్య మనయో నిత్యం వహ్నిదాహి కయోరివ । – శక్తిదర్శనం

శక్తి, శక్తిమంతులకు భేదములేదు. వహ్ని దాహకత్వములకువలె (నిప్పునకు కాల్చేశక్తికి ఐక్యమున్నటుల) శక్తి, శక్తిమంతులకు ఎల్లప్పుడును ఐక్యమే ఉండును.

సదైకత్వం నభేదోస్తి సర్వదైవ మ మాస్యచ ।
యోఽసౌ సాహమహం యా సౌ భేదోస్తి మతిభ్రమాత్ । – దేవీ భాగవతము

నా శక్తికి, ఆ శక్తి వంతుడైన పురుషుడునకు ఎల్లప్పుడూ సంబంధమున్నది. తేడా ఎప్పుడూ లేదు. ఆ పురుషుడేదో నేనూ అదే. నేనేదో ఆ పురుషుడు గూడ అదే. ఏదైనా ఉన్నట్లయిన అది బుద్ధి భ్రమయే.

జగన్మాతా చ ప్రకృతిః పురుషశ్చ జగత్పితా ।
గరీయసీ జగతాం మాతా మాతాశతగుణం పితుః – బ్ర.వై.పు.కృ.జ.అ. 50

ఈ ప్రపంచానికి జన్మనిచ్చినది ప్రకృతి. జగత్తును పాలించి పోషించునది పురుషుడు. వీరిద్దరు తల్లి దండ్రులు. ప్రపంచంలో తల్లి, తండ్రి కంటె నూరు రెట్లు గొప్ప శ్రేష్ఠము.

పైన చెప్పబడిన ప్రమాణములవలన గాయత్రీయే బ్రహ్మ మనియు, ఆ దేవి ఉపాసన బ్రహ్మ ప్రాప్తికి సర్వోత్తమ మైనదని స్పష్టమగుచున్నది.

# గాయత్రి ద్వారా సత్వగుణాభివృద్ధి యనే దివ్యమైన లాభము

గాయత్రీ సద్బుద్ధిదాయకమైన మంత్రము. సాధకుని మనస్సును, అంతఃకరణమును మస్తిష్కమును, ఆలోచనలను, సన్మార్గమువైపు ప్రేరేపిస్తుంది. 'సత్' తత్వమును వృద్ధిపొందించుట దాని ప్రధాన కార్యము. సాధకుడు గాయత్రీ మంత్రార్థాన్ని తెలిసికోవడానికిప్రారంభించినపుడు, ప్రపంచంలో సర్వోత్కృష్టమైన అభివృద్ధి, జీవితంలో ఉత్తమమైన ఫలితం, సద్బుద్ధి ప్రాప్తించినపుడే నని తెలుసుకుంటాడు. మంత్రాన్ని గురించి పూజ్యస్వభావము ధృడమైనపుడు సాధకుడు ఇచ్ఛాశక్తితో ఇదే తత్వాన్ని పొందడానికి ఉవ్విళ్ళూరుతాడు. ఈకోరిక మనోలోకంలో ఒక విధమైన స్పర్శను సృష్టించుతుంది. ఈ తీయని స్పర్శయొక్క ఆకర్షణ శక్తిచే. అఖిల ఆకాశ తత్వములోని ఈథర్‌లో తిరుగుతున్న సత్వగుణపూరిత భావములన్నీ, ఆలోచనా ప్రక్రియలన్నీ ప్రేరణలన్నీ మహత్తరంగా ఆకర్షించబడటం ప్రారంభిస్తాయి. గహనమైన ఆలోచనాశక్తి-యొక్క విజ్ఞానము అందరికి తెలిసినదే. ఒకే జాతికి సంబంధించిన ఆలోచనా విధానము ఆకాశమునుండి సజాతీయ ఆలోచనావిధానాన్ని తనవద్దకు ఆకర్షిస్తుంది. తత్ఫలితంగా మృతిచెందినా, జీవించియున్నా, సత్పురుషులచే వ్యాపింపచేయబడిన శాశ్వత సత్సంకల్పాలు శూన్యంలో వృత్తాకారంలో తిరుగుతూ ఉన్నవి. గాయత్రీ సాధకునివద్దకు దైవదత్తంగా, అనాయాసంగావచ్చి చేరుతాయి. అచట సంచిత మూలధనంవలె ఆ సత్సంకల్పాల భండారము తయారవుతుంది.

సత్వగుణ పరిమాణము శరీరములోను, మనస్సులోను, అధికమౌతున్నపుడు చేకూడే ఫలితాలు ఆశ్చర్యకరంగా ఉంటాయి. స్థూలదృష్టితో చూసినపుడు ఫలితం తెలియబడదు. అనుభవానికి రాదు దానియొక్క శక్తిని గుర్తించలేము. సూక్ష్మశరీర సంబంధ పరిజ్ఞానము కలవారికి మాత్రము తమస్సు, రజస్సుల సంఘటనలు, వాటిపై సత్వగుణపు ఆధిక్యత తెలుస్తుంది. శరీరంలో రోగము, మలము, విషము, విజాతీయ పదార్థాలుంటే ఎట్టి దుష్పరిణామాలు వాటిల్లుతాయో, అదే స్థానంలో శుద్ధమై, సజీవమైన, పరిపుష్టమైన రక్తమునుండి వీర్యస్థానము అభివృద్ధి చెందితే ఎంత సౌఖ్యంగా ఉంటుందో, అంతే తేడా సత్వగుణము వలన చేకూరుతుంది.

ఈ పరిణామము తెరచిన కనులకు ప్రాయశః కనిపించకపోవచ్చు. కాని సత్వగుణము ప్రసాదించే ఆరోగ్యము ఉన్నతంగా వుండడంలో ఎలాంటి సందేహము లేదు. సత్వగుణ చమత్కార ప్రభావము ఆరోగ్యముపై ఉంటుంది. ఈ ప్రయోజనం ఈశ్వరదత్తం అన్నంతమాత్రాన ఏకష్టమూ కలుగదు. శరీరానికి కాయకల్ప చికిత్స చేయడం వైజ్ఞానిక ప్రక్రియ దానికి కారణము నిశ్చయమైన ప్రయోజనము లభించుటయే ఈ ప్రయోజనము దైవికమా లేక మానవీయమా (మానవునిచే గావింపబడినది) యని భేదాభిప్రాయములు కలుగవచ్చు దానికంత గొప్పతనం లేదు.

గాయత్రి ద్వారా సత్వగుణము అభివృద్ధి చెందుతుంది. నిమ్న (తక్కువ) భావములు, తత్వములు నివారింపబడతాయి. తత్ఫలితంగా సాధకునకు సూక్ష్మమైన కాయకల్ప చికిత్స జరుగుతుంది. ఈ ప్రక్రియద్వారా జరిగే ప్రయోజనములు వైజ్ఞానికమా? దైవదత్తమా? ఈ ప్రశ్నపై కలహించుట నిష్ప్రయోజనము. రెండూ ఒకటే. ఏ కార్యమైనా సరే, ఏ విధంగా జరిగినప్పటికి ఈశ్వరశక్తి కంటే వేరుగా కాదు. అందువలననే ఈ ప్రపంచంలోనన్ని కార్యాలు ఈశ్వరేచ్ఛ వలననే జరుగుతాయంటారు. గాయత్రీ వలన సమకూరే లాభాలు వైజ్ఞానికాధారంపై ప్రాప్తించాయనవచ్చు, మరియు ఈశ్వరకృప వలనని గూడ అనవచ్చు. దోషమేమియు లేదు.

శరీరంలో సత్వగుణాభివృద్ధి జరుగుచున్నపుడు శరీరచర్య గమనంలో తీవ్ర సంచలనం జరుగుతుంది. ఇంద్రియముల భోగలాలసత మందగిస్తుంది. అన్నపాన పారాయణత్వం, వివిధ స్వాధు పదార్థములను ఆరగించవలననే ఆకాంక్ష, వెంట వెంటనేతినాలనే కోరిక, ఎక్కువ పరిమాణంలో తినడం, భక్ష్యము (తినతగినది) అభక్ష్యము (తినగూడనిది) అనే వివక్షత లేక పోవడం, సాత్విక పదార్థములయందు రుచిలేక పోవడం, తిండి పోతుతనం తీపి వస్తువులయందు, కఠినపు, కారపు వస్తువుల యందుప్రీతి, క్రమక్రమంగా తగ్గుతుంది.

తేలికగానుండి, సుపాచ్యమై, సరసమైన సాత్విక భోజనము వలన అతనికి తృప్తి కలుగుతుంది. మరియు రాజస, తామస పదార్థములయందు విముఖత ఏర్పడుతుంది. ఈవిధంగా విచారమువలన, కామేన్ద్రియముల ఉత్తేజము సంయమనము చెందుతుంది. ఈ మార్గములో వ్యభిచారానికి అలవాటుపడిన వాసనా మనస్సు నెమ్మదిస్తుంది. బ్రహ్మ చర్యమునందు శ్రద్ధ ఇనుమడిస్తుంది. ఫలస్వరూపంగా వీర్యరక్షణకు మార్గము ప్రాముఖ్యత పొందుతుంది. కామేంద్రియము. స్వాదేంద్రియము ప్రధానమైన ఇంద్రియాలు. రః

ఇంద్రియముల నియమము శరీర రక్షణకు, ఆరోగ్యరక్షణకు ప్రధాన హేతువులు. వీటి నిగ్రహంతోపాటు పరిశ్రమ, స్నానము, నిద్ర, పరుండుట, మేల్కొనుట శుభ్రత, సాధారణ జీవితము మరియు అన్య దినచర్యలలో సత్వగుణమున్నది. ఈ కారణమువలన ఆరోగ్యము, దీర్ఘాయువు, బలవృద్ధి లభిస్తాయి.

మానసిక క్షేత్రంలో సత్వగుణాభివృద్ధివలన కామ, మోహ, లోభ, మద మాత్స ర్యములు, స్వార్థం, వ్యసనములు, వ్యభిచారము, కపటము, అబద్ధము, వలన, విచారము, భయము, శోకము, నికృష్టమైన కసపు (చెత్త చెదారము) కు సమానమైన దోషములు ఉపశమించుతాయి. వీటి ఉద్భవము తగ్గినందువలన సంయమనము, నియమము, త్యాగము, సమత, నిరహంకారము, స్వచ్ఛత. నిష్కాపట్యము, సత్యనిష్ఠ నిర్భయత్వము, నిశ్చింత, నిరాలస్యము, శౌర్యము, వివేకము, సాహసము, ధైర్యము, దయ, ప్రేమ, సేవ, ఉదారత, కర్తవ్యపరాయణత, ఆస్తికత, మొదలైన సద్గుణములు అభివృద్ధి చెందడం ప్రారంభిస్తాయి. ఈ మానసిక కాయకల్పచికిత్స పరిణామంగా నిత్యమూ సంభవించే అనేక దుఃఖములు సహజంగా తగ్గుతాయి. ఇంద్రియ నిగ్రహము లేనందున మరియు దినచర్య కారణంగా శరీర రోగాలు తగ్గవు. వివేకము జాగృతమైన వెంటనే అజ్ఞానజన్యచింత, శోకము, భయము, కుశంక, మమత, హాని మొదలైన దుఃఖములనుండి విముక్తి లభిస్తుంది. పరమేశ్వరునిపై విశ్వాసమువలన మనస్సుస్థిరత్వము పొందుతుంది. భావి జీవనము గురించి నిశ్చింత కలుగుతుంది.

ధర్మ ప్రవృత్తివలన పాపము, అన్యాయము, కలుగనేరవు. ఫలస్వరూపంగా రాజదండన, సమాజ దండన. ఆత్మ దండన మరియు దైవదండన (ఈశ్వర దండన)లచే, తగిలిన గాయములవలన పీడన, బాధ వుండదు. సేవ, నమ్రత, ఉదారత, దానము, నిజాయతీ, లోకహితము మొదలైన గుణములచే, ఇతరులకు లాభం కలుగుతుంది.

చెరుపు కలుగుతుందనే శంక వుండదు. అందువలన బహుశః అందరు కృతజ్ఞులవుతారు. ప్రశంసిస్తారు. సహాయకులు, భక్తులై సహాయపడతారు. పారస్పరిక సద్భావనల పరివర్తనమువలన ఆత్మతృప్తి కారకమగు ప్రేమ, సంతోషములు దినదినాభి వృద్ధిపొంది జీవితాన్ని ఆనందమయం చేస్తాయి. ఈ ప్రకారంగా శారీరక, మానసిక క్షేత్రములయందు సత్వగుణాభివృద్ధి జరిగినందువలన, ఇరువైపుల ఆనందప్రవాహము పొంగి పారలుతుంది. గాయత్రీ సాధకుడందులో నిమగ్నుడై ఆత్మ సంతోషపు పరమానంద రసాస్వాదన చేస్తాడు.

ఆత్మ ఈశ్వరాంశయైనందు వలన, ఈశ్వర శక్తులు బీజరూపంలో అంతర్గతంగా దాగి వుంటాయి. ఈ శక్తులు నిద్రావస్థలో వుంటాయి. మానసిక తాపమువలన, విషయ వికారమువలన, దోషనిర్గుణ ఛాయవలన అణగివుండి, అజ్ఞానరూపంతో పడి వుంటాయి. మానవులు తాము దీనులమని, అశక్తులమని, హీనులమని భావిస్తారు. కాని సాధకుడు మనోవికారములనే ఆచ్ఛాదనను తొలగించి, నిర్మలమైన ఆత్మజ్యోతిని దర్శించుటకు సమర్థుడైనపుడు, సర్వశక్తివంతమైన ఈశ్వరీయజ్యోతి తన ఆత్మయందే ఉన్నదని గ్రహించి, తాను పరమాత్మకు నిజమైన ఉత్తరాధికారినని తెలుసుకుంటాడు. అగ్నిని ఆవరించిన నివురును తొలగించిన వెంటనే ప్రకాశవంతమైన అగ్ని బయటపడుతుంది. ఆ అగ్ని చిన్నదైనప్పటికి భయంకరమైన అగ్ని కణికలను సృష్టించడానికి పనికివస్తుంది. ఈ ఆచ్ఛాదన పగిలిన వెంటనే తుచ్ఛ మనుష్యుడు మహా ఆత్మ (మహాత్ముని) గా అవుతాడు. ఎందుకనగా ఆత్మయందు అనేక జ్ఞాన విజ్ఞాన సాధారణ, అసాధారణ, అద్భుతమైన, ఆశ్చర్యజనకమైన శక్తి భాండారము నిక్షిప్తమై యున్నది. అది బహిర్గతమైన వెంటనే అతడు సిద్ధియోగి రూపంలో గోచరించుతాడు. సిద్ధులు సిద్ధించడానికిబయటనుండి ఏదో కొంచెము తీసుకు రానక్కరలేదు. దేవ దానవుల కృపఅవసరము లేదు. కేవలము అంతఃకరణముపైనున్న ఆవరణలను తొలగించవలసి వుంటుంది. గాయత్రీ సత్వగుణ సాధనాసూర్యుడు, తామస అంధకారాన్ని తొలగించుతాడు. ఆత్మయొక్క సహజ ఈశ్వరీయ రూపము ప్రకటింపబడుతుంది. ఆత్మయొక్క ఈ నిర్మల స్వరూపము అన్ని వృద్ధి, సిద్ధులతో పరిపూర్ణమై వుంటుంది. గాయత్రీ ద్వారా కలిగిన సద్గుణాభివృద్ధి అనేకమై ఆధ్యాత్మిక, సాంసారిక సమృద్ధికి మాతృదేవి. శారీరక, మానసిక నిర్మలత్వము, సాంసారిక జీవనమును అనేకరీతుల సుఖశాంతిమయము చేస్తుంది. ఆత్మయందు వివేకము, ఆత్మబలాభివృద్ధి అధికమైనపుడు, ఇతరులకు పర్వసదృశంగా గోచరించే కష్టములు చాలా స్వల్పముగా, తేలికగా వుంటాయి. ఆ వ్యక్తి యొక్క ఏ కార్యమైనా ఆగదు. లేక అతని ఇచ్ఛానుసారము పరిస్థితులు మారుతాయి లేక పరిస్థితుల కనుగుణ్యంగా అతని ఇచ్ఛ పరివర్తన చెందుతుంది. క్లేశ కారణము, ఇచ్ఛ, పరిస్థితుల మధ్య ప్రతికూలత. వివేకవంతుడు ఈ రెంటిలో ఒకదాన్ని తనదిగా జేసికొని సంఘర్షణను అధిగమిస్తాడు. అతనికి ఈ పృథ్వియందే స్వర్గీయానందము మధురంగా ప్రవహిస్తుంది. సుఖవంతమైన జీవనము అనుభవిస్తాడు.

వాస్తవంగా సుఖము, ఆనందముల ఆధారమువేరే బయటనుండి వచ్చే సాధన సామాగ్రి కాదు. మానవ మనఃస్థితిపై ఆధారపడి వుంటాయి. మనోసాధనచే, ఒకానొక

సమయంలో రాజస భోజనంతోను, మెత్తటి సిల్కుతో కప్పబడిన శయ్యతోగూడి సంతృప్తి చెందని వ్యక్తి, మహాత్ముడైన సన్యాసిచే ఉపదేశింపబడి, త్యాగాన్ని, సన్యాసవ్రతాన్ని స్వీకరించి, అరణ్యములోని భూమినే అన్నిటికంటే ఉత్తమమైన శయ్యగాను, వనములలో దొరికే కందమూలములే సర్వోత్తమమైన ఆహారంగా గ్రహిస్తాడు. ఇదంతా అంతర్గతమైన మనోభావములు, ఆలోచనా విధానములోను మార్పువచ్చినందు వలననే సంభవిస్తుంది. గాయత్రీ బుద్ధికి అధిష్ఠాత్రియైన దేవి. ఆమెనుండి మనము సద్బుద్ధిని యాచిస్తాము. అందువలన గాయత్రీ ఉపాసనా ఫలితంగా, మన ఆలోచనా పంథా ఉన్నతంగా పరిఢవిల్లితే మానవ జీవితపు వాస్తవికతను గుర్తించి, మనము వర్తమానస్థితియందే ఆనందానుభవము పొందినయెడల అది అసంభవం కాదు.

చాలాకాలంగా మేము గాయత్రీ ఉపాసనా ప్రచారము చేయుచున్నాము. అందువలన అనేక సాధకులతో మాకు పరిచయమున్నది. వేలమంది వ్యక్తులు మానుండి ఈ దిశలో మార్గముతెలిసికొని ప్రోత్సహించబడినారు. ఇందులో దృఢమైన సాధనా మార్గమవలంభించిన వారిలో అనేకులు ఆశ్చర్యజనకమైన ప్రయోజనములను( లాభాలను) పొందారు. ఈ ప్రయోజనములను వారు గాయత్రీదేవి వరప్రసాదంగా భావించారు. వారు గాయత్రీ సూక్ష్మ వివేచనను గ్రహించాలనే కోర్కె లేకుండానే, కొన్ని వైజ్ఞానిక నియమములతో సాధన శ్రమచే మామూలు సాధారణమైన ఫలితాలను పొందారు. ఈ వివేచన (తారతమ్యాన్ని తెలిసికొనుటకుచేసే ప్రయత్నం) వారికి ప్రాయశః అరుచిగా నుండవచ్చును. భగవతి గాయత్రీ కృపకు ప్రతిగా కృతజ్ఞతయే మా యొక్క భక్తి భావనలను పెంపొందింపజేస్తుందని వారు వక్కాణిస్తారు. అందులో మాకు అధిక ప్రయోజన ముందంటారు. వారి అభిప్రాయము చాలా పరిమితంగా నిజమే. శ్రద్ధాభక్తులు ఇనుమడించడానికి ఇష్టదేవతా సాధనా స్వరూపమునందు అచంచలమైన ప్రేమ, కృతజ్ఞత, భక్తి, తన్మయత్వముండుట అవసరము. గాయత్రీ సాధన ద్వారా విజ్ఞాన సమ్మతమైన పద్ధతివలన ప్రయోజనము సంభవిస్తుంది. దీనిని గుర్తించి, దీని మహాతత్వమువలన ఆత్మ సంబంధమైన దృఢత్వము పొందుటకు, గాయత్రీ యందు కృతజ్ఞత, భక్తి భావనా పాత్రను అధికాధికంగా కలిగియుండుట అవసరము.

గాయత్రీ ఉపాసన ద్వారా అనేకులకు అనేక విధాలుగా మేలు చేకూరినది. వారు చెప్పిన జ్ఞాపకాలు నా మనోఫలకంపై ఇంకా వున్నాయి. వాటిలో కొన్నింటిని వచ్చే పుటలలో ఇవ్వదలచాను. ఈ పంక్తులద్వారా పాఠకులు అదే మార్గమునను సరించి లాభాన్వితులవుతారని ప్రయత్నము చేయబడినది.

# మహాపురుషుల ద్వారా గాయత్రి మహిమ కీర్తింపబడుట

హిందూధర్మంలో అనేకమైన గౌరవింపదగినవి ప్రాచుర్యంలో నున్నవి. అనేక విషయాలలో పరస్పర సిద్ధాంత సంబంధమైన భేదములున్నవి. కాని గాయత్రీ మంత్ర మహిమకు సంబంధించినంత వరకు, అందరూ అన్ని సాంప్రదాయాలవారూ, ఋషులందరూ, ఒకే తత్త్వముతో, ఒకే అభిప్రాయాన్ని కలిగివున్నారు.

అధర్వణవేదం 16.1.17లో గాయత్రీ స్తోత్రమున్నది. అందులో గాయత్రీ ఆయుష్షు, ప్రాణము, శక్తి, కీర్తి, ధనము మరియు బ్రహ్మతేజస్సును సాధించునదిగా చెప్పబడినది.

విశ్వామిత్ర మహర్షి "గాయత్రి మంత్రానికి సమానమైన మంత్రము నాలుగు వేదములలో లేదు. చతుర్వేదములన్నీ, యజ్ఞ, దాన, తపస్సులు, గాయత్రీ మంత్రపు ఒక కళకు కూడా సమానముకాదు" అని వ్రాక్కుచ్చారు.

**భగవాన్ మనువు ఈ విధంగా వచించారు :**

బ్రహ్మదేవుడు మూడు వేదముల సారాన్ని, గాయత్రీ మంత్రంలోని మూడు పాదములుగా పొందుపరచాడు. మనుష్యుని పవిత్రం చేయడానికి గాయత్రీ మంత్రం కన్న వేరేదీ లేదు. ఏ వ్యక్తి అయినా మూడు సంవత్సరములు నియమంగా గాయత్రీ జపించిన యెడల ఈశ్వరప్రాప్తి కలుగుతుంది. **ద్విజులు ద్విసంధ్యలయందు గాయత్రి జపిస్తే, వేదపఠన ఫలప్రాప్తిని పొందుతారు.** ఇతర సాధనలు చేసినా, చేయకపోయినా, కేవలము గాయత్రీ జపమువలననే సిద్ధి పొందగలరు. నిత్యమూ సహస్ర గాయత్రీచేయు వ్యక్తి పాపములనుండి, పాము కుబుసము నుండి విడివడినట్లు విముక్తుడౌతాడు. గాయత్రీ జపించని ద్విజుడు నిందాపాత్రుడు.

**యోగిరాజు యాజ్ఞవల్క్యుడు ఈ విధంగా భావించాడు :**

గాయత్రీ మరియు సమస్త మంత్రములు ఒక త్రాసులో తూయబడినవి. ఒకవైపు షడంగసమేతమైన వేదములు, రెండవవైపు గాయత్రీ ఉంచబడినపుడు, గాయత్రీవైపు పళ్ళెము బరువుగా నున్నది. వేదముల సారము ఉపనిషత్తులు, ఉపనిషత్సారము, గాయత్రీ యొక్క గౌరవము. గాయత్రీ సర్వలోక జనని. పాపవినాశని. ఈ మంత్రము

కన్నా అధికంగా పవిత్రమొనర్చే మంత్రము, స్వర్గ, మర్త్య లోకములలో లేదు. గాయత్రీ మంత్రార్థము తెలిసిన వ్యక్తికి సమస్తవిద్యలూ కరతలామలకంగా తెలుస్తాయి. శుభప్రదమైన శ్రోత్రియుడౌతాడు. ద్విజుడు గాయత్రీ పారాయణుడు కానపుడు వేద వేదాంగ పారంగతుడైనప్పటికి శూద్ర సమానుడే. అతడు చేసే ఇతర శ్రమలన్నీ వ్యర్థమే. గాయత్రిని తెలియని వ్యక్తి బ్రాహ్మణత్వమునుండి చ్యుతుడై, పాపయుక్తుడౌతాడు.

**పరాశర మహర్షి ఈ విధంగా నుడివారు :**

సమస్త జప శ్లోకాలలోను, వేదమంత్రములలోను, గాయత్రీ మంత్రము పరమ శ్రేష్ఠము. వేదము, గాయత్రీ రెండు త్రాసులో నుంచితే గాయత్రీ పళ్ళెము బరువుగా నున్నది. భక్తిపూర్వకంగా గాయత్రీ మంత్రాన్ని జపించే వ్యక్తి ముక్తుడై పవిత్రుడౌతాడు. వేద, శాస్త్ర, పురాణ ఇతిహాసములు చదివినప్పటికి గాయత్రీ హీనుడయినపుడు బ్రాహ్మణుడుగా గుర్తించరాదు.

**శంఖ ఋషి ప్రకారము :**

నరకరూప సముద్రంలోపడి మునిగిపోతున్న వ్యక్తికి, చేతిని ఆసరాగానిచ్చి రక్షించునది గాయత్రియే. గాయత్రీ మంత్రముకన్నా ఉత్తమమైన వస్తువు స్వర్గంలో కాని, పృథ్విలోకాని లేదు. గాయత్రిని తెలుసుకున్న వ్యక్తి నిస్సందేహంగా స్వర్గమును పొందుతాడు.

**శౌనక ఋషి అభిప్రాయము :**

ఇతర ఉపాసనలు చేసినా, చేయకపోయినా, కేవలము గాయత్రీ జపముచే ద్విజుడు జీవన్ముక్తుడౌతాడు. సాంసారిక పారలౌకిక, సమస్త సుఖములను అనుభవిస్తాడు. సంకట సమయములలో పదివేలు గాయత్రి జపించినచో విపత్తులు నివారింపబడతాయి.

**అత్రిముని కథనము ప్రకారము :**

గాయత్రి ఆత్మను మిక్కిలిగా శోధించే మంత్రము. ఈ మంత్ర ప్రభావమువలన, కఠినమైన దోషములు, దుర్గుణాలు పరిమార్జింపబడతాయి. గాయత్రీ తత్వాన్ని పూర్తిగా గ్రహించిన వ్యక్తికి ప్రపంచములో అనుభవించవలసిన సుఖశేషమేదియు నుండదు. అనగా అన్ని సుఖములు అనుభవించుతాడు.

**వ్యాసమహర్షి ఈ విధంగా ప్రవచించారు :**

ఏ ప్రకారంగా పుష్పసారము తేనె, క్షీరసారము ఘృతమో (నెయ్యి), అదే ప్రకారము సమస్త వేదముల సారము గాయత్రీ. సిద్ధి పొందబడిన గాయత్రీ కామధేనువునకు

సమానము (గాయత్రీ నియమంగా జపిస్తే కొంతకాలమునకామంత్రము సిద్ధిస్తుంది. అటుల సిద్ధి పొందబడిన గాయత్రి. గంగ శరీరమునకు ప్రాప్తించు పాపములను పోగొట్టు నటుల నిర్మలం చేస్తుంది. గాయత్రీ రూపమైన బ్రహ్మ గంగ వలన ఆత్మ పవిత్ర మౌతుంది. గాయత్రిని వదలి ఇతర ఉపాసన లెవరైతే చేస్తారో, వారు పక్వసిద్ధాన్నమును వదలి, భిక్షమెత్తువానికి సమానము. కార్య సఫలత, తపోవృద్ధి కొరకు గాయత్రికన్నా శ్రేష్టమైనది లేదు.

**భారద్వాజ ఋషి ఇలా వక్కాణించాడు :**

బ్రహ్మాది దేవతలు, గాయత్రిని జపిస్తారు. అది బ్రహ్మసాక్షాత్కారము గావిస్తుంది. అనుచిత కార్యము లొనరించే వారి దుర్గుణములు గాయత్రి కారణము వలన నివారింప బడతాయి. గాయత్రి రహితమైన వ్యక్తి శూద్రునికన్నా అపవిత్రుడు.

**చరక ఋషి భావనలో :**

బ్రహ్మచర్యమునవలంభిస్తూ, గాయత్రి నెవరు ఉపాసిస్తారో, మరియు తాజా ఫలములను సేవిస్తారో, వారు దీర్ఘాయువులౌతారు.

**నారద మహర్షి ఇటుల ఉటంకించారు :**

గాయత్రి భక్తి యొక్క స్వరూపము. ఎచట భక్తి రూపమైన గాయత్రీ ఉన్నదో అచట శ్రీమన్నారాయణుడు నివశిస్తాడు. ఇందులో ఏమాత్రము సందేహము లేదు

**వశిష్ట మహర్షి ఇలా వ్రాక్రుచ్చారు :**

మందమతి, కుమార్గగామి, అస్థిరమతి గూడా గాయత్రీ ప్రభావంచే ఉన్నతమైన పదవిని పొందుతాడు. మరల సద్గతిని పొందుతాడు. ఇది నిశ్చయము. ఎవరైతే పవిత్రతతో, స్థిరత్వంతో, గాయత్రిని ఉపాసిస్తారో వారు ఆత్మలాభాన్ని పొందుతారు.

పైన చెప్పబడిన అభిప్రాయములను క్రోడీకరిస్తే, బహుశః అందరు ఋషులు ఒకటే భావనను కలిగి ఉన్నారు. దీని వలన స్పష్టమవుతున్న దేమనగా, ఏ ఋషి అయినా ఇతర విషయాలలో భిన్న భావములు, భిన్న సాంప్రదాయములు కలిగి వుండవచ్చు. కాని, గాయత్రి విషయంలోమాత్రం అందరూ సమానమైన శ్రద్ధగలిగి తమ తమ ఉపాసనలతో గాయత్రీ మంత్రానికి ప్రథమ స్థానమిచ్చారు. శాస్త్రములలో ధర్మ గ్రంథములలో, స్మృతులలో, పురాణాలలో గాయత్రి మహిమను గురించి, అలాగే సాధన విషయముతో కాంతి విరజిల్లే వేలకొద్ది శ్లోకములు నిండి వున్నాయి.

వర్తమానకాలంలో, ఆధ్యాత్మికులు, వేదాంతులు కూడా గాయత్రీ మంత్రాన్ని ప్రాచీనకాలంలో తత్వదర్శకులైన ఋషులు స్వీకరించినట్లే అంగీకరించినారు. ప్రస్తుత యుగము, బుద్ధి, తర్క, ప్రత్యక్ష యుగము. ఈ శతాబ్దంలోని ప్రభావశాలురై గణుతి కెక్కిన వ్యక్తులు ఆలోచనా విధానంలో ధర్మ గ్రంథములపైగాని, పరంపరపైగాని ఆధారపడరు. వారు బుద్ధివాదాన్ని, తర్కాన్ని, ప్రత్యక్షవాదాన్ని తమ అన్ని కార్యములలో ప్రధాన స్థానాన్నిచ్చారు. అట్టి మహాపురుషులుగూడా గాయత్రీ తత్వాన్ని అన్ని దృష్టికోణముల నుండి శోధించి, పరిశీలించి, స్వచ్ఛమైన సువర్ణముగా భావించారు. క్రింద వాటిలో నుండి కొన్ని అభిప్రాయములీయబడినవి.

**మహాత్మా గాంధీగారు ఇలా అన్నారు :**

గాయత్రీ మంత్రపు నిరంతర జపము రోగుల రోగనివారణకు మరియు ఆత్మోన్నతికి ఉపయోగకారి. స్థిర హృదయంతోను, శాంతితోను చేయబడిన గాయత్రీ జపము. ఆపదకాలంలో కష్టములనుండి గట్టెక్కడానికి, ప్రభావము కలిగి యున్నది.

**లోకమాన్య తిలక్ గారు ఇలా నుడివారు :**

భారతీయ ప్రజల బహుముఖదాస్య శృంఖలాల నుండి విముక్తి పొందాలంటే కేవలం రాజనైతిక సంఘర్షణ చేసినంతమాత్రాన సరిపోదు. దానికొరకు అంతరాత్మలో ప్రకాశముత్పన్నమవాలి. సత్, అసత్‌ల వివేకం కావాలి. కుమార్గమును వదలి, శ్రేష్ఠ మార్గాన్ననుసరించేందుకు ప్రేరణ ప్రాప్తించాలి. గాయత్రీ మంత్రంలో ఈ భావన సిద్ధముగా నున్నది.

**మహామనీషి మదన మోహన మాలవ్యా ఈవిధంగా ఉటంకించారు :**

ఋషులు మనకిచ్చిన అమూల్య రత్నాలలో గాయత్రీ ఒక అనుపమ రత్నము. గాయత్రీ వలన బుద్ధి పవిత్రమౌతుంది. ఈశ్వర ప్రకాశము ఆత్మయందు మూర్తీ భవిస్తుంది. ఈ ప్రకాశమువలన అసంఖ్యాకమైన వ్యక్తులకు త్రాణ (రక్షణ) లభించింది. గాయత్రిలో ఈశ్వర పరాయణతా భావాన్ని ఉత్పన్నం చేసే శక్తి గలదు. దీనితోపాటు భౌతిక అభావములను (కొరతలను) పోగొడుతుంది. గాయత్రీ ఉపాసన బ్రాహ్మణుల కత్యంతావశ్యకము. గాయత్రీ జపమొనరించని బ్రాహ్మణుడు తన కర్తవ్యాన్ని విడనాడిన అపరాధి అవుతాడు.

**కవీంద్రుడైన రవీంద్రుడులు ఇటుల పలికారు :**

భారతవర్షాన్ని మేల్కొల్పగల మంత్రమెంత సరళమై నదనగా, ఒకేఒక శ్వాసలో దాని నుచ్చరించవచ్చు. అదియే గాయత్రీ మంత్రము. ఈ గాయత్రీ మంత్రాన్న భ్యసించినందున తార్కిక అపోహలు, అభిప్రాయ భేదములు, ఎటువంటి కలహములకు, చిక్కులకు ఆపదలకు, అవకాశముండదు.

అరవిందయోగులు అనేకచోట్ల గాయత్రీ జపము చేయవలెనని నిర్దేశించారు. మహత్వపూర్ణమైన కార్యములను చేయగలశక్తి గాయత్రీ మంత్రములో నున్నదన్నారు. అనేకమందికి వారు సాధనా పద్ధతిలో గాయత్రీ జపాన్ని ఉపదేశించారు.

**స్వామి రామకృష్ణ పరమహంస ఉపదేశ ప్రకారము :**

"నేను ప్రజలకు చెప్పునదేమనగా, దీర్ఘసాధనల అవసరము లేదు. చిన్నదైన గాయత్రీ సాధన చేసి చూడు. గాయత్రీ జపము వలన పెద్ద పెద్ద సిద్ధులు చేకూరుతాయి. మంత్రం చిన్నదే కాని దీని శక్తి అమోఘము"

**స్వామి వివేకానంద కథనం ప్రకారం :**

రాజు నుండి ఏదైనా వస్తువు కోరేటప్పుడు తన గౌరవానికి అనుకూలమై నదై వుండాలి. పరమాత్మనుండి కోరదగిన యోగ్యమైనది సద్బుద్ధియే. పరమాత్మ ఎవరియందు ప్రసన్నుడౌతాడో వానికి సద్బుద్ధిని ప్రసాదిస్తాడు. సద్బుద్ధి వలన సత్యమైన మార్గములో ప్రగతి చేకూరుతుంది. సత్కర్మ వలన అన్ని విధముల సౌఖ్యమొనగూరుతుంది. సత్య మార్గములో పయనించి ముందుకు సాగే వారి కెలాంటి సుఖములకు కొదువ వుండదు. గాయత్రీ సద్బుద్ధి మంత్రము. అందువలన గాయత్రీ మంత్రము అన్ని మంత్రములలో కెల్ల 'మకుటమణి'గా పేర్కొనబడినది.

**జగద్గురు శంకరాచార్యులకథనం ప్రకారం :**

గాయత్రీ మహిమను వర్ణించుట మానవ సామర్థ్యానికి అతీతము. సద్బుద్ధికలిగి వుండడం ఎంత బృహత్కార్యమనగా దానికి సమానమైనదీ ప్రపంచంలో దేని వలనగూడా సంభవము కాజాలదు. ఆత్మ ప్రాప్తి లభించుటకు కావలసిన దివ్యదృష్టి ఏ బుద్ధిలో సంప్రాప్తిస్తుందో, దానికి ప్రేరణ గాయత్రీ వలన జరుగుతుంది. గాయత్రీ ఆదిమంత్రము దాని అవసరము పాపములను నివారించుటకు, పుణ్యములను అభివృద్ధి పరచుటకై యున్నది.

**స్వామి రామతీర్థ ఇలా అన్నారు :**

రాముని పొందుట సర్వోత్కృష్టమైన కార్యము. గాయత్రీ ఉద్దేశ్యము, కామరుచిని విడనాడి రామరుచి యందు లగ్నమగుట. ఎవరి బుద్ధి పవిత్రమో వారే రాముని పొందగలరు. బుద్ధిఎంత పవిత్రంగావుండాలని గాయత్రీ నిర్దేశిస్తుందంటే, అతడు రాముని, కామముకంటె శ్రేష్టమని గ్రహించాలి.

**రమణ మహర్షి ఇలా ఉపదేశించారు :**

యోగ్యవిద్యకు అంతర్గమైన మంత్రవిద్య ప్రచండమైనది. మంత్రముల శక్తిచే అద్భుతమైన ఫలితాలు లభించుతాయి. గాయత్రీ మంత్రమెలాంటిదంటే, దానివలన ఆధ్యాత్మిక, భౌతిక లాభాలు రెండూ ఒనగూడుతాయి.

**స్వామీ శివానంద ఇటుల వచించారు :**

బ్రహ్మ ముహూర్తంలో గాయత్రీ జపిస్తే చిత్తశుద్ధి కలుగుతుంది. హృదయము నిర్మలమౌతుంది. శరీరము రోగరహితమౌతుంది. నమ్రతా స్వభావము బలపడుతుంది. బుద్ధి సూక్ష్మత కలుగుతుంది. అందువలన దూరదృష్టి అధికమవుతుంది. స్మరణశక్తి వికసిస్తుంది. కఠిన సమయాలలో గాయత్రీ ద్వారా దైవీ సహాయము లభిస్తుంది. గాయత్రీ ద్వారా ఆత్మదర్శనము కలుగుతుంది.

**బాబా విశుద్ధానందజీ ఈవిధంగా చెప్పారు :**

ప్రథమంగా గాయత్రీ యందు రుచి కలుగదు. ఈశ్వర కృపవలన రుచి ఏర్పడినట్లయితే అతడు కుమార్గగామి గాడు. గాయత్రీని హృదయమందుంచుకున్న వ్యక్తి మనస్సు భగవంతునివైపు మరలుతుంది. విషయ వికారముల వ్యర్థత అతనికి స్పష్టముగా అనుభవమౌతుంది. అనేకమంది మహాత్ములు గాయత్రీ జపము చేసి పరమ సిద్ధులైనారు. పరమాత్మ శక్తియే గాయత్రి. సమీపించినవారు. సిద్ధులౌతారు. ఆత్మకల్యాణానికి మనోశుద్ధి అవసరము. మనఃశుద్ధి కొరకు గాయత్రీ మంత్రము అద్భుతంగా పనిచేస్తుంది. ఈశ్వర ప్రాప్తి కొరకు గాయత్రీ జపము ప్రథమ సోపానమని గ్రహించవలె.

**దక్షిణ భారతానికి చెందిన ప్రసిద్ధ ఆత్మజ్ఞాని టి. సుబ్బారావు ఈవిధంగా పలికారు :**

"సవితా నారాయణుని దైవీప్రకృతియే గాయత్రీ అనిచెబుతారు. ఆదిశక్తియైనందువలన గాయత్రి అంటారు. గీతలో గాయత్రీ వర్ణ చెప్పబడినది. గాయత్రీ ఉపాసనయోగానికి అన్నిటికంటె ప్రథమ అంగము.

**శ్రీ స్వామి కరపాత్రజీ కథనం ప్రకారము :**

గాయత్రికి అధికారి యైన వ్యక్తి నిత్యమూ నియమిత రూపములో జపించవలె. ద్విజులకు గాయత్రీ జపము అత్యంత ఆవశ్యకమై యున్నది.

**గీతాదర్శన వ్యాఖ్యాత శ్రీ విద్యానంద ఈవిధంగా నుడివారు :**

గాయత్రీ బుద్ధిని పవిత్రం చేస్తుంది. పవిత్రమైన బుద్ధికన్నా అతీతమైనది జీవితంలో ఏదిలేదు. అందువలన గాయత్రీ మహత్తర శక్తి గలిగిన జనయిత్రి.

**సర్ రాధాకృష్ణన్ ఇలా ఉటంకించారు :**

మనము సార్వభౌమిక గాయత్రీ ప్రార్థనపై ఆలోచించినయెడల ఈ మంత్రము ఎంత మహత్తరంగా లాభిస్తుందో తెలుస్తుంది. మనలో తిరిగి జన్మించుటకు ఉత్పత్తి ప్రవాహమైన మూలస్థానమును ప్రార్థించుటయే గాయత్రీమంత్రము.

**ప్రసిద్ధ ఆర్య సమాజీ మహాత్మా సర్వానందజీ ఇలా అన్నారు :**

గాయత్రీ మంత్రముద్వారా పరమేశ్వరుని పూజించుట సదా ఆర్యుల సంప్రదాయము. ఋషి దయానందులవారు గూడా ఈ పద్ధతినే అనుకరించుటద్వారా, సంధ్యావార్చపద్ధతిని, వేదముల స్వాధ్యాయనమునకు ప్రయత్నించుట ఉపదేశించారు. అటులొనరించినందున అంతఃకరణశుద్ధి, బుద్ధి నిర్మలమూనై,మనుష్య జీవితము తన కొరకు, ఇతరులకు హితమొన గూర్చుతుంది. ఈ శుభకర్మపై శ్రద్ధ, విశ్వాసము అధికమైన కొలది, ఇతోధికంగా అవిద్య మొదలైన క్లేశములు క్షీణిస్తాయి. జిజ్ఞాసువు గాయత్రీ మంత్రాన్ని ప్రేమపూర్వకంగా ఉచ్చరించినయెడల, వారికి సంసారజలధిని తరించడానికి నావయై, ఆత్మప్రాప్తికి మార్గము దొరుకుతుంది.

ఆర్యసమాజానికి జన్మదాత అయిన స్వామీ దయానందులవారు గాయత్రి నుపాసించే శ్రద్ధాళువు. భాగవత సప్తాహముకన్నా గాయత్రీ పునశ్చరణ అధికంగా శ్రేష్టమైనదని స్వామీజీ గ్వాలియరు రాజా సాహెబుగారికి చెప్పారు. జయపూరులోని సచ్చిదానంద్, మీరాలాల్, రావల్, ఫోజ్జల సింగు మొదలైనవారికి గాయత్రీ జపవిధిని నేర్పారు. ముల్తానులో ఉపదేశ సమయంలోగాయత్రీ మంత్రాన్ని ఉచ్చరించి, ఈ మంత్రము అన్నింటికంటె శ్రేష్టమన్నారు. నాలుగు వేదములకి మంత్రమే మూల గురు మంత్రము. ఆదికాలంలో ఋషులందరూ ఈమంత్రాన్ని జపించేవారు.

స్వామీజీ అనేక స్థానములలో గాయత్రీ అనుష్ఠానములను ఏర్పాటు చేశారు అందులో 40 మంది బ్రాహ్మణులు పాల్గొన్నారు. ఈ జపము 15 దివసములు కొనసాగినది.

**థియొసాఫికల్ సొసైటీలోని ఒక ప్రముఖ సభ్యుడు ఆర్. శ్రీ వివాస్ కథనం ప్రకారం :**

హిందూ ధార్మిక ఆలోచనా విధానంలో గాయత్రీని సర్వశ్రేష్ఠ శక్తియైన మంత్రంగా పరిగణిస్తారు. ఆ మంత్రార్థము దీర్ఘమైనది, గూఢమైనది. ఈ మంత్రానికి అనేక అర్థములున్నవి. భిన్న భిన్న చిత్త ప్రవృత్తులుగల వ్యక్తులపై ఈ మంత్రప్రభావము భిన్నంగా వుంటుంది. ఈ మంత్రంతో దృశ్యా దృశ్యము లనూ, ఉచ్చ, నీచ, మానవులనూ, దేవతలనూ, అన్నింటినీ ఏదో ఒక రహస్యమయతంతుద్వారా సమీకరించగల శక్తి పొందవచ్చు. గాయత్రీ మంత్రపు అర్థాన్ని, రహస్యాన్ని, మనస్సు హృదయాల్ని ఏకాగ్రం చేసి, శుద్ధమైన ఉచ్చరణ గావించుతాడు. అపుడు దానికి సంబంధించిన దృశ్యము సూర్యునిలో అంతర్నిహితంగానున్న మహత్తర చైతన్యశక్తిచే, గోచరించుతుంది. అలాంటి వ్యక్తి ఎక్కడ మంత్రోచ్చారణ చేసినా, అతనిపైనా, చుట్టుప్రక్కలనున్న వాతావరణంలో విరాట్ " ఆధ్యాత్మిక ప్రభావము" సృష్టింపబడుతుంది. ఈప్రభావము మహత్తరమైన ఆధ్యాత్మిక ఆశీర్వాదము. ఈకారణముల వలన మన పూర్వులు గాయత్రీ మంత్రపు అనుపమ శక్తి కొరకు గాయత్రీని స్తుతించారు.

ఈ విధంగా వర్తమాన శతాబ్దపు అనేక గణుతికెక్కిన బుద్ధివాద మహాపురుషుల అభిప్రాయములు మావద్ద సంగ్రహించబడినవి. వీటిని కూలంకషంగా చర్చించినయెడల, గాయత్రీ ఉపాసన ఏదో ఒక మూఢ విశ్వాసము, అంధ పరంపర గాదని, దీని వెనుక ఆత్మోన్నతిని కలిగించే దృఢమైన తత్వముల బలమున్నదని, నిష్కర్షగా చెప్పవచ్చు. ఈ మహాశక్తి నుపాసించుటకెవరు ప్రయత్నించినప్పటికీ మేలు చేకూరుతుంది. గాయత్రీ సాధన నిష్ఫలము కాదు.

## గాయత్రీ సాధనచే సత్వగుణము సిద్ధిస్తుంది

పూర్వయుగాలలో ఋషులు, మహర్షులు, గాయత్రీ ఆధారంగా యోగసాధన చేస్తూ తపశ్చర్య కొనసాగించే వారని, మన ప్రాచీన ఇతిహాసాలద్వారా. పురాణములవలన తెలుస్తుంది. వశిష్ఠ, యాజ్ఞవల్క్యుడు, అత్రి, విశ్వామిత్రుడు, వ్యాసుడు, శుకదేవుడు, దధీచి, వాల్మీకి, చ్యవనుడు, శంఖఋషి, లోమశుడు, మైత్రేయుడు,జాబాలి, ఉద్దాలకుడు, వైశంపాయనుడు, దూరాసుడు, పరశురాముడు, పులస్త్యుడు, దత్తాత్రేయుడు, అగస్త్యుడు

సనత్కుమారుడున్నాడు, శౌనకుడు, మొదలైన ఋషులందరి జీవన వృత్తాంతములవలన, వారి మహోత్కృష్టతకు, మూలము గాయత్రీయేయని స్పష్టమగుచున్నది.

కొంతకాలంక్రితం అనేకులు, గాయత్రీని ఆశ్రయించి, తమ ఆత్మబలాన్ని తద్వారా బ్రహ్మతేజాన్ని ప్రకాశింపజేసి, మహాత్ములయ్యారు. వారి వారి ఇష్టదేవతలు, ఆదర్శములు, సిద్ధాంతములు బేధించినప్పటికీ, వేదమాత గాయత్రీ యందు మాత్రం అనన్య శ్రద్ధ కలిగి వున్నారు. వారు ప్రారంభంలో ఈ మహాశక్తి స్తన్యపానమే చేశారు. కావుననే, వారంతా ప్రతిభాశాలురైనారు. శంకరాచార్యులు, సమర్థ గురురామదాసు, నర్సీమెహతా, దాదు దయాల్, సంత్ జ్ఞానేశ్వర్, స్వామీ రామానంద్, గోరఖ్‌నాథ్, మచ్ఛేంద్రనాథ్, హరిదాసు, తులసీదాసు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, రామకృష్ణ పరమహంస, స్వామీ వివేకానంద, రామతీర్థ, యోగి అరవిందులు, రమణ మహర్షి, గౌరాంగ మహాప్రభు, స్వామి దయానంద, మహాత్మ ఏకరసానంద మొదలైన మహాత్ముల వికాసము గాయత్రీ మహాశక్తియొక్క రక్షాకవచములోనే జరిగినది. ఆయుర్వేదానికి సుప్రసిద్ధ గ్రంధము "మాధవ నిదానము". దానిని రచించినవారు శ్రీమాధవాచార్య. వారు ప్రారంభంలో 13 సంలు బృందావనములో ఉండి గాయత్రీ అనుష్ఠానమొనరించారు. దానివలన వారికి లేశమైనా ప్రయోజనము చేకూరలేదు. నిరాశతో కాశీ వెళ్ళారు. అచట నొక అవధూత సలహాపై భైరవ తాంత్రికోపాసన చేశారు. కొన్ని రోజులకు భైరవుడు ప్రసన్నమైనాడు. మాధవాచార్యులు కూర్చున్న పీఠమునకు వెనుకనుండి 'వరము కోరుకో' అన్నాడు. మాధవాచార్యులు ఇలా అన్నారు - "తాము ఎదురుగా వచ్చి దర్శనమీయండి". ఈమాట విన్నంతనే మాధవాచార్యకు జవాబు చెప్పాడు. -"నేను గాయత్రీఉపాసకుని సమ్ముఖమునకు రాజాలను".ఈమాట విన్నంతనే మాధవాచార్యులకు ఆశ్చర్యమేసినది. ఆయన ఇలా అన్నారు-"గాయత్రీ ఉపాసకుని సమ్ముఖమునకు రాలేనపుడు, నాకెలా వరమీయగలవు? దయచేసి నాకింతవరకు గాయత్రీ ఉపాసన చేసినప్పటికీ ఫలించని కారణమేమో చెప్పి అనుగ్రహించండి". భైరవుడిలా అన్నాడు- నీవు పూర్వజన్మలలో చేసిన పాపము నాశనమవడానికి, ఇంతవరకు చేసిన గాయత్రీ జపము పనికివచ్చినది. ఇపుడు నీ ఆత్మ నిష్పాపమైనది. ఇకముందు చేసే జపము సిద్ధిస్తుంది". ఇది విని మాధవాచార్య మరల బృందావనమునకెళ్ళి, పునః గాయత్రీ ఉపాసన ప్రారంభించారు. చివరకు మాత దర్శనము లభించినది. ఆయన పూర్ణసిద్ధుడైనారు.

శ్రీమహాత్మా దేవగిరి వారి గురువులు హిమాలయములో నొక గుహలో గాయత్రీ జపమాచరిస్తారు. వారి వయస్సు 400 (నాలుగు వందలు) సంలల కన్నా హెచ్చు. వారు

తమ ఆసనమునుండి లేచి, స్నాన, భోజన, పాన, శయనాదులాచరింపరు. మలమూత్ర విసర్జన లేదు. వారికి అవసరము గూడ లేదు.

నగరాయివద్ద 'రామటేకరీ', ఘనారణ్యంలో ఒక 'హరిహర' నామధేయుడైన మహాత్ములు, గాయత్రీ జపం చేసి సిద్ధుడైనారు. ఈ మహాత్ముని కుటీరము చేరుటకు 7 (ఏడు) కోసుల దట్టమైన అరణ్యమున్నది. అందులో వందలకొద్ది సింహములు, వ్యాఘ్రములున్నాయి. ఎవ్వరైనా మహాత్ముని దర్శనార్థము వెళితే కనీసం రెండో, నాలుగో వ్యాఘ్రములు తప్ప కుండా మార్గములో అడ్డు నిలుస్తాయి. "హరిహర బాబా దర్శనానికి వెళుతున్నాను" అన్న వెంటనే ఆ భయంకర హింసా మృగములు దారి తొలగి వెళ్తాయి.

లక్ష్మణ్‌ఘడ్‌లో 'విశ్వనాథ గోస్వామి' అనే ప్రసిద్ధ గాయత్రీ ఉపాసకులున్నారు. వారి జీవితంలో అధికాంశము గాయత్రీ ఉపాసనకు వినియోగింపబడుతుంది. వారి ఆశీర్వచనమువలన సర్వము గోల్పోయిన ఒక కుటుంబము పేదరికము నుండి విముక్తి పొంది, సమృద్ధివంతమైన సంపన్న కుటుంబముగా రూపొందినది. ఈ కుటుంబ సభ్యులిప్పటికీ వారి సమాధివద్ద తమ బిడ్డల 'శిరోముండన' కర్మ చేయిస్తారు.

జయపూరు రాజ్యంలో 'జౌన్' అనే గ్రామంలో **పండిత హరరాయ నాముడైన నైష్ఠికుడు గాయత్రీ జప మొనరించేవారు. వారికి తమ మృత్యు సమాచారము ముందుగనే బోధపడినది.** వారు తమ పరిజనులందరినీ సమావేశపరచి, ధార్మికోపదేశ మిచ్చారు. మాట్లాడుతూ, బోధిస్తూ, గాయత్రీ మంత్రోచ్చారణ చేస్తూ ప్రాణత్యాగము గావించారు.

"జునాగడ్" కు చెందిన ఒక విద్వాన్ పండిత మణిశంకరభట్టు ప్రథమంగా యజమానికొరకు గాయత్రీ అనుష్ఠానము, దక్షిణ గ్రహించి చేసేవారు. అనేకమంది తత్ఫలితంగా లాభించుట గ్రహించి, తన మిగిలిన జీవితమంతా గాయత్రీ ఉపాసనలో గడిపారు. ఇతరులకై అనుష్ఠాన్ని ఆపివేశారు. ఆయన శేషజీవితము బహుశాంతంగా గడిచినది.

జయపూరు ప్రాంతంలో పురాతనమైన "దేవల్" గ్రామంలో విష్ణుదాసు జన్మించారు. వారు ఆజీవన బ్రహ్మచారులు. వారు "పుష్కరం" లో కుటీరమేర్పరచుకొని గాయత్రీ జపముతో ఘోర తపస్సొనరించారు. ఫలస్వరూపంగా వారికి అనేక సిద్ధులు లభించాయి. పెద్దపెద్ద రాజులు ఆ కుటీరపు ధూళిని తమ మస్తకములపై నుంచుకొన్నారు. జయపూరు జోధపూరు రాజులు అనేక పర్యాయము కుటీరానికొచ్చారు. ఉదయపూరు మహారాజు

అత్యంతాదరంతో వారిని తమ రాజధానికి తోడ్కొనివెళ్ళి, వారి గాయత్రీ పురశ్చరణకు అనువైన వసతి కల్పించి, పూర్ణాహుతికి అన్ని ఏర్పాట్లు చేశారు. వారిని గురించి అనేక మత్కార కథలు ప్రసిద్ధమైనాయి.

"ఖతౌలీ" కి 8 మైళ్ళ దూరంలో "ధౌకలేశ్వర్" లో "మగనానంద" పేరుగల గాయత్రీ సిద్ధ మహా పురుషుడుండేవాడు. ఆయన ఆశీర్వాద మహిమవలన "ఖతౌలీ"లో నివసించే వ్యక్తికి తనవద్దనుండి బలాత్కారముగా తీసుకొనబడిన "జాగీరును" పొలిటికల్ ఏజెంటు తిరిగి వాపసు గావించాడు.

'రత్నగఢ్'లో పండిత 'భూమర్‌మల్' నామధేయుడు, విద్వాంసుడైన బ్రాహ్మణుడు. వారు అనన్య గాయత్రీ ఉపాసకులు. వారు 1966 సం॥లో కాశీవచ్చి, అంత్యము వరకూ అచటనే ఉన్నారు. వారికి తమ మృత్యువు గురించి ముందుగనే తెలిసినందువలన, విశాలమైన ధార్మిక సామాగ్రిని పొంది, సాధన గావిస్తూ, ఆషాఢశుద్ధ పంచమీ తిథినాడు శరీరాన్ని త్యజించారు. వారి ఆశీర్వాదము పొందిన చాలా సామాన్య వ్యక్తి గూడా నేడు లక్షలకధిపతయ్యాడు.

"అలిఘర్" రాజ్యంలో అంతర్గతంగా నున్న ఒక కుగ్రామంలో సామాన్య కుటుంబములో జన్మించిన వ్యక్తికి, సజ్జనుడు తండ్రి. ఏదో కారణమువలన ఆవ్యక్తికి వైరాగ్యమలవడినది. వారు "మథుర" చేరి, చిన్న దిబ్బపై ఉంటూ సాధన చేసేవారు. ఒక కోటి గాయత్రీ జపం చేశారు. కోటి గాయత్రీ చేసిన వెంటనే గాయత్రీ సాక్షాత్కారమైనది. వారు సిద్ధిని పొందారు. ఆ చిన్న దిబ్బ "గాయత్రీ టీలే" (టీలే అనగా చిన్న దిబ్బ) గా ప్రసిద్ధి చెందినది. అచట నొక చిన్న మందిరమున్నది. ఆ దేవాలయంలో సౌందర్యవంతమైన గాయత్రీ ప్రతిమ ప్రతిష్ఠింపబడినది. వారి పేరు 'బూటే సిద్ధ (మూలగా సిద్ధుడు). ఎల్లప్పుడూ మౌనంగా వుంటారు. వారి ఆశీర్వాదంవలన అనేకులకు శుభం కలిగినది. ధౌలీపూరు రాజు వారి యెడల శ్రద్ధగానుండేవారు.

ఆర్యసమాజ సంస్థాపకుడైన శ్రీస్వామీ దయానందులవారి గురువైన ప్రజ్ఞా చక్షుస్వామి విరజానంద సరస్వతి గంగా తీరమునందుండి మూడు సంవత్సరములు తీవ్ర తపశ్చర్యతో జపము చేశారు. ఈ అంధ సన్యాసి తన తపోశక్తిచే అగాధ విద్యనూ, అలౌకిక బ్రహ్మతేజస్సును పొందారు.

మాంధాతా ఓంకారేశ్వర్ మందిరము వెనుకనున్న గుహలో ఒక మహాత్ముడు గాయత్రీ జపము చేసేవారు. మృత్యు సమయంలో వారి కుటుంబ సభ్యులు దగ్గరున్నారు. కుటుంబములోని ఒక బాలుడు ఆ మహాత్మునిట్లు ప్రార్థించాడు. "నేను

చాలా మందబుద్ధిని. నాకు విద్య అలవడటంలేదు. నా దోషములు దూరమయ్యేటట్లు నన్ను దీవించండి" – ఆ బాలుని తన వద్దకు పిలిచాడామహాత్ముడు. కమండలపు నీటిని కొంచెము అతని నాలుకపై నుంచారు. ఆశీర్వదించారు. ఫలితంగా ఆబాలుడు పూర్ణ విద్వాంసుడయినాడు. అసాధారణ ప్రతిభాశాలియై, ఇండోరులో ఓంకార జోషి పేరుతో ప్రఖ్యాతి గాంచాడు. ఇండోరు రాజు తన ప్రభాత వ్యాహ్యాళికి ఓంకార్ జోషి ఇంటికివచ్చి తోడు తీసుకుని వెళ్ళేవారు. అనగా ఆ రాజు అంత ప్రభావితుడయినాడన్న మాట.

చందోలు క్షేత్రంలో నివశించుచున్న గుప్త యోగీశ్వరుడు శ్రీ ఉద్దండజోషి సిద్ధపురుషుడు. గాయత్రీ ఉపాసనా ఫలితంగా వారి కుండలినీశక్తి జాగృతమైనది. వారు పరమ సిద్ధులయినారు. వారి కృపచే అనేకుల ప్రాణములు రక్షింపబడినవి. అనేకులకు ధనము ప్రాప్తించినది. అనేకమంది ఆపదలనుండి విముక్తి పొందారు. వారి భవిష్య వాణి సదా సత్యమయ్యేది. ఒక వ్యక్తి వారిని అపహాస్యము చేయాలనే దుస్సాహసాని కొడిగట్టాడు. అంగవైకల్యము పొందాడు. కుంచించుకునిపోయాడు.

బడౌదీలో మంజూసార్ నివాసి శ్రీ ముకుటరామ్ మహారాజ్ గాయత్రీ ఉపాసనలో పరమసిద్ధి ప్రాప్తి పొందారు. బహుశః వారు నిత్యము 8 గం॥లు జపము చేసేవారు. అందువలన అనేక సిద్ధులు ప్రాప్తించాయి. దూరదేశముల వార్తలు కన్నులతో చూసినట్లు ఖచ్చితముగా చెప్పేవారు. ఆ వార్తల సత్యతను పరీక్షించినపుడు పూర్తిగా నిజమయ్యేవి. వారు గుజరాత్ భాషలో ఒకటి రెండు తరగతులు మాత్రమే చదివారు. అయినప్పటికి ప్రపంచంలోని అన్ని భాషలలో చక్కగా మాట్లాడేవారు, అర్థం చేసుకొనేవారు. విదేశీయులు వారివద్దకు వచ్చి వారి వారి భాషలలో గంటలకొద్దీ సంభాషణ కొనసాగించే వారు. యోగము, జ్యోతిష్యము, వైద్యము, తంత్రశాస్త్రము, ధర్మశాస్త్రములలో వారికి పూర్తి ప్రవేశమున్నది. పెద్ద పెద్ద పండితులు వారి సందేహములు తీర్చుకొనుటకు వచ్చే వారు. వారు చూపిన మహత్కార్యములనేకం చూసి ప్రజలు వారిపై అచంచల శ్రద్ధతో నుండేవారు.

బర్సోడాలో నాక ఋషిరాజు 7 సం॥ల నిరాహారదీక్షతో గాయత్రీ పురశ్చరణ గావించారు. వారి వాక్కు సిద్ధి పొందినది. వారేది పలికితే అదే జరిగేది.

కళ్యాణ్‌కు చెందిన ఒక సాధువు వద్ద హరేరామ్ నామముగల బ్రహ్మచారి ప్రస్తావన వచ్చినది. ఈ బ్రహ్మచారి గంగానది మధ్యలో నిలబడివున్న ఒక కర్రపై కూర్చొని

ఉండేవారు. గంగారాధన గావించేవారు. వారి బ్రహ్మతేజము అవర్ణనీయము వారి శరీరమంతా తేజోభరితమై విరాజిల్లుతుండేది. వారు తమ సిద్ధులచే అనేకమంది దుఃఖములను దూరంచేశారు.

దేవ ప్రయాగలోని విష్ణుదత్తుడనే వానప్రస్థి చాంద్రాయణ వ్రతంతో బాటు, 1,25,000 గాయత్రీ జపం చేశారు. అనుష్టానం గావించారు. ప్రతిఫలంగా వారి ఆత్మబలం వృద్ధి పొందినది. వారికి అనేక సిద్ధులు సంప్రాప్తించాయి. ప్రజలకు తమ తమ కార్యములు నెరవేరుతాయనే విశ్వాసము గలిగిన వెంటనే, దూరప్రదేశములనుండి గూడా వచ్చేవారు. వానప్రస్థి ఈక్రీడలో చిక్కుకుపోయారు. రోజు రోజుకు వారి శక్తి భండారము క్షీణించసాగినది. తరువాత వారికి పశ్చాత్తాపముగలిగి, మృత్యుకాలము వరకు ఏకాంత సాధన కావించారు.

రుద్రప్రయాగ స్వామీ నిర్మలానంద సన్యాసికి గాయత్రీ సాధన వలన భగవతీదేవి దివ్యదర్శనము కలిగినది. ఈశ్వర సాక్షాత్కారము ప్రాప్తించినది. దీనివలన వారికి అపరిమితమైన తృప్తి కలిగినది.

బిఠూర్ వద్ద ఖాండేరావు పేరుగల వయోవృద్ధ తపస్వి ఒక వట వృక్షము క్రింద గాయత్రీ సాధన గావించేవారు. ఒకసారి వారు 'విరాట్ గాయత్రీ' యజ్ఞమాచరించి బ్రహ్మ భోజనము ఏర్పాటుచేశారు. దినమంతా వేలకొలది భోజన పంక్తులు లేస్తున్నాయి. రాత్రి 9 గంIలకు భోజనమంతా అయిపోయినది. ఇంకా కొన్ని వేల మంది భోజనము కావలె. ఖాండేరావు గారికి తెలియపర్చారు. వారు 'గంగానది నుండి నాలుగు పీపాల జలము తీసుకొనివచ్చి దానిలో పూరీలు తడపండి' అని ఆజ్ఞాపించారు. అలాగే చేశారు. పూరీ నెయ్యితో తడిపిన రుచి పొందినది. బ్రహ్మ భోజనము పూర్తి అయినది. మరుసటిరోజు నాలుగు పీపాలు నెయ్యి తెచ్చి గంగలో కలిపారు.

కాశీలో భారతమాతా మందిరము బాబు శివప్రసాద్‌గుప్తా ద్వారా ప్రారంభించినపుడు, దాని శిలారోహణము బాబు భగవాన్ దాస్ ద్వారా గావింపబడినది. ఆసమయంలో 200 రోజులు ఒక మహా యజ్ఞము చేయబడినది. విద్వాంసులద్వారా 20 లక్షల గాయత్రీ జపము చేయించబడినది. యజ్ఞ పూర్ణాహుతి రోజున దగ్గరలోనున్న ఎండిపోయిన చెట్లు పచ్చని ఆకులను తొడిగినవి. ఒక చెట్టుకు తరుణంగాని సమయంలో ఫలాలు వచ్చినవి. ఆసమయంలో అచట పండిత మదనమోహన మాలవ్యా. రాజా మోతీచంద్ర, హైకోర్టు జడ్జి కన్హైయ్‌లాల్, ఇంకా ఇతర గణనీయమైన వ్యక్తులుండి,

జరిగిన సంఘటనను తమ కండ్లతో దర్శించారు. గాయత్రీ మహిమను స్వయంగా అనుభవించారు.

గద్వాల్‌లోని గోవిందానందనే మహాత్ముడు, అత్యంత విషపూరిత సర్పదంష్ట్రల ప్రాణములను రక్షించారు. తాము గాయత్రీ జపము వలననే సర్పదంష్ట్రలను రక్షించ గలుగుతున్నానని నుడివేవారు. ఇదే విధంగా సమస్తీపూరులో నొక సంపన్నవ్యక్తి 'శోభన సాహు' గాయత్రీ మంత్రమువలన అత్యంత విషపూరిత వృశ్చిక (తేలు) దంష్ట్రలను, పిచ్చికుక్క కాటుకు గురియైనవారిని రక్షించేవారు.

**అనేకమంది సాత్త్విక సాధకులు కేవలం గాయత్రీ మంత్రముచే అభిమంత్రిత జలము ద్వారా భయంకర రోగములను కుదిర్చారు.**

స్వర్గీయ పండిత మోతీలాల్ నెహ్రూ జీవనము అప్పటి వాతావరణంకారణంగా విభిన్నమైన క్షేత్రములలో వ్యతీతమైనది. కాని అవసానదశలో గాయత్రీ జ్ఞాపకమునకు వచ్చినది. గాయత్రీ జపంచేస్తూ జీవన లీలను సమాప్తం చేశారు. దానివలన, గాయత్రీ సంస్కారము శీఘ్రముగా సమాప్తముగాదని, రాబోయే తరమునకు, వంశానికి తన ప్రభావమును ప్రసరిస్తుందని, విశదమవుతుంది. పండిట్‌జీ పూర్వులు గాయత్రీ ఉపాసకులు. దాని ప్రభావమువలన అవసానదశలో మృత్యుసమయంలో, మోతీలాల్ నెహ్రూ గారికి గాయత్రీ మంత్ర ధ్యానభావన కలిగినది.

అహ్మదాబాదుకు చెందిన శ్రీ డాహ్యాభాయి రామచంద్ర మోహతా, గాయత్రీ శ్రద్ధాళువు, ఉపాసకుడు, గాయత్రీ ప్రచారకుడు. వారి వయస్సు 90 సం॥లు. శరీర, మానసికసత్వగుణాధిక్యతవలన వారిలో అన్ని గుణములు పరిలక్ష్యముగా నున్నవి. ఇట్టి సర్వగుణ సమృద్ధి మహాత్ములే పొందగలరు.

'దీనవా' లో నుండే స్వామి మనోహర దాసజీ అధిక గాయత్రీ జపం చేశారు. వారిలా అన్నారు. "ఈ మహా సాధన నాకెంతో అధికలాభాన్ని సమకూర్చినది. దానిని ప్రకటించుటకు నాకిష్టములేదు. ఎలాగైతే లోభి తన వద్దనున్న ధనాన్ని ప్రకటించుటకు సంకోచిస్తాడో అలాగే!"

'హటా'లోని శ్రీ రమేశచంద్ర దుబే గాయత్రీ సాధన చేసినందువలన అనేక సార్లు గొప్ప అనుభవాలు కలిగాయి. అందువలన వారి నిష్ఠ ఇతోధికంగా అభివృద్ధి చెందినది.

'పాటన్'లోని శ్రీ జటాశంకర్ నందీ వయస్సు 77 సం॥ల కన్నా అధికము. వారు గత 50 సం॥ల నుండి గాయత్రీ ఉపాసన చేస్తున్నారు. కువిచారములు, కుసంస్కారముల నుండి ముక్తి, అధిక దైవీతత్వమనే ప్రయోజనము లభించాయి. వీటినే వారు తాము పొందిన ప్రధాన ప్రయోజనమని భావించారు.

బృందావనంలోని కాఠియా బాబా, ఉడియా బాబా, ప్రజ్ఞాచక్షు, స్వామి గంగేశ్వరానందజీ గాయత్రీ ఉపాసనచేయనారంభించి, తమ సాధనలలో పురోగమించడానికి సమర్థులైనారు. వైష్ణవ సాంప్రదాయానికి చెందిన ఆచార్యులందరూ గాయత్రీ ఉపాసనపై విశేష శ్రద్ధ పాటించేవారు.

నచాచ్‌గంజ్ పండిత బలభద్రజీ బ్రహ్మ చారి, సహరన్‌పూర్ జిల్లా శ్రీదేవదర్శన్ జీ, బులంద్‌శహార్ ప్రాంతపు పరివ్రాజక మహాత్మ యోగనందజీ, బ్రహ్మనిష్ఠ శ్రీ స్వామి బ్రహ్మర్షిదాస్‌జీ ఉదాసన, బీహార్ ప్రాంతపు మహాత్మా అనాసక్తజీ, యజ్ఞాచార్య పం.జగన్నాథ శాస్త్రి, రాజ్‌గడ్ మహాత్మా, హరిఓం, తత్ సత్, మొదలయిన సాధువులు, సన్యాసులు, గాయత్రీ ఉపాసనలో పూర్ణ మనోయోగంతో సంలగ్నమైనారు. వారి గృహస్థ్యము గూడా తపోజీవనముగా నుండి మహాసాధనా ప్రవృత్తిగా నున్నది. ఈ మార్గములో పయనిస్తూ వారు మహత్వపూర్ణ ఆధ్యాత్మిక సఫలతను పొందారు.

మేము స్వయంగా జీవితారంభం నుండి గాయత్రీ ఉపాసన చేశాము. అదే మాకు జీవనాధారమైనది. దోషములు, విచారములు, కషాయ కల్మషాలు, కువిచారములు, కుసంస్కారములను తొలగించుటలో కించిత్ సఫలత ప్రాప్తించినట్లయితే ఇది ఆమెదే. బ్రాహ్మణత్వపు బ్రహ్మభావనలకు, ధర్మపరాయణతకు, సేవ, సంయములకు, స్వాధ్యాయము, తపశ్చర్యకు ఉన్న కించిత్ ప్రవృత్తికి, ఆ మాత కృపయే కారణము. అనేకసార్లు విపత్తునుండి రక్షించినది. అంధకారములో మార్గము చూపినది.

స్వానుభవములోని సంఘటనలు విస్తారమైనవి. దానివలన మాత యందు శ్రద్ధ, దినదినాభివృద్ధి చెందినది. వాటిని వర్ణించుటకు ఈ పంక్తులలో స్థానము లేదు. మా ప్రయత్నంతో, ప్రోత్సాహంతో గాయత్రీ ఉపాసన చేసిన సజ్జనులు, ఆ వేదమాత కరుణ వలన వారిలో ఆత్మశుద్ధి, పాపకర్మలయందు విముఖత, సన్మార్గాసక్తి, సత్వగుణ ప్రధానవృత్తి, సంయమనము, పవిత్రత, అస్తికత, జాగరూకత, అటులనే ధర్మపరాయణత లాంటి ప్రవృత్తులు పెంపొందినాయి, లభించాయి. ఇతర ఐహిక ప్రయోజనము సంభవించినా, లేకున్నా, ఆత్మికలాభము ప్రతివారికి నిశ్చిత రూపంలో తప్పక చేకూరుతుంది.

వివేకంతో విచారించినయెడల ఆత్మికలాభముకొరకు, ధనసంపత్తులు, అల్పమైన ఫలితములను త్యాగం చేయడం ఎక్కువ మహత్వపూరక ప్రయోజనము.

అందువలన మేము మా పాఠకులకు ప్రార్థించేదేమనగా, గాయత్రీని ఉపాసన చేయండి. దానివలన పొందే చమత్కారములను చూడండి. ఎవ్వరైతే వేదమాత గాయత్రీ శరణుగోరుతారో, వారికి అంతఃకరణమునందు సత్వగుణము, వివేకము, సద్విచారము, సత్కర్మాచరణ కలిగి, వారి అసాధారణ ప్రవృత్తి జాగృతమవుతుంది. ఇది ఆత్మ జాగరణ, లౌకిక పారలౌకిక, సాంస్కారిక, ఆత్మిక సఫలతలన్నీ యిచ్చే దాత!

## గాయత్రీ సాధన వలన శ్రీ, సమృద్ధి మరియు సఫలత

గాయత్రీ త్రిగుణాత్మకము. గాయత్రీ ఉపాసన వలన ఎచ్చట సత్వ గుణాభివృద్ధి పెంపొందుతున్నదో, అచట కళ్యాణ కారకము, ఉపయోగ్యమైన రజోగుణము కూడా అభివృద్ధి పొందుతుంది.

రజో గుణపు ఆత్మబలము పెంపొందినందువలన గుప్తశక్తులు జాగృత మవుతాయి. ఈ శక్తులు సాంసారిక జీవనపు సంఘర్షణలలో అనుకూలమైన ప్రతిక్రియను ఉత్పన్నం చేస్తాయి. ఉత్సాహం, సాహసం, స్ఫూర్తి, నిరాలస్యత, ఆశ, దూరదర్శితము, తీవ్రబుద్ధి, అవసరాలను గుర్తించుట, మధురమైన వాక్కు, ఆకర్షణీయమైన వ్యక్తిత్వము, కలివిడి స్వభావము లాంటి నవ్యరూపకల్పన జరుగుతుంది. ఆ వ్యక్తిలో ఎలాంటి పరివర్తన వస్తుందనగా మామూలు సాధారణ వ్యక్తిగూడా ధనధాన్య సమృద్ధితో తులతూగుతాడు.

గాయత్రీ ఉపాసకులలో మానవుని దుఃఖపూరితునిచేసే పొరపాట్లు జరగనందు వలన, విశేషతలు ఉత్పన్నమైనందున, మనుష్యుడు క్రమంగా సమృద్ధి, సంపన్నత, అభ్యుదయంవైపు పురోగమిస్తాడు. గాయత్రీ తన సాధకుల 'జోలెల'లో సువర్ణ నాణెముల(కాసులు)ధనపాత్రను వేయదు. కాని సాధకులలో విశేషతలను, విశిష్టతలను ఉత్పన్నంచేసి, ఆకారణమున వారిని-అభావగ్రస్థులను(లోటుకల వారిగను), దీనులను, హీనులను జేయదన్నదని మాత్రము వాస్తవము. ఉదాహరణకు మావద్ద అనేక సాక్ష్యములున్నవి. అందులోనుండి కొన్ని క్రిందపీయబడినవి.

హరదోయ జిల్లా బంధవాడా నుండి ఘూరేలాల్‌జీ ఇలా వ్రాస్తున్నారు. దినసరి రాబడి క్రమంగా అభివృద్ధి చెందుతున్నందున ధనధాన్యములతో పరిపూర్ణంగా నున్నాము.

చేబట్టిన ప్రతి కార్యము విజయవంతమవుతుంది. వివిధ సంకటములు తమంత తాము దూరమవుతున్నాయి. ఇదంతా గాయత్రీ మంత్ర జపమువలననే"

ఝాన్సీలోని 'పండిత లక్ష్మీకాంత ఝా' వ్యాకరణ సాహిత్యాచార్య ఇలా వ్రాశారు- "శైశవమునుండి నాకు గాయత్రీపై శ్రద్ధ ఏర్పడినది. అప్పటినుండి రోజు సహస్ర గాయత్రీ చేయుచున్నాను. ఈ మంత్ర ప్రతాపము వలననే నేను సాహిత్యాచార్య, వ్యాకరణాచార్య, సాహిత్యరత్న, వేదశాస్త్రి మొదలయిన పరీక్షలయందు ఉత్తీర్ణుడనై ఝాన్సీలోని సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు నయ్యాను. నేను ఒక 16 సం॥ల మరణాసన్న, ధనికుని కుమారుని ప్రాణము గాయత్రీ జపము వలన రక్షించగలిగాను. అందువలన, ఆ మంత్రమందు నా శ్రద్ధ అధికమైనది.

బృందావనములోని పం॥ తులసీరామశర్మ ఇట్లు వ్రాశారు - "దాదాపు పది సంవత్సరములయినది. శ్రీ ఉడియా బాబా ప్రేరణ వలన, హీథీరస్‌కు చెందిన 'లాలా గణేశీలాల్ గంగా తీరమున 'కర్ణవాస్' వద్ద 24 లక్షల గాయత్రీ అనుష్ఠానము చేయించాడు. అప్పటినుండి లాలా గణేశీలాల్‌జీ ఆర్థిక పరిస్థితి దినదినాభివృద్ధి చెంది, అతని కీర్తి ప్రతిష్టలు, సంపద, నాలుగురెట్లు అధికమయినది.

'ప్రతాపఘడ్'కు చెందిన పం॥ నారాయణ శర్మ వ్రాశారు - "నా దగ్గర సంబంధీకుడొకడు కాశీలోనొక మహాత్ముని ధనప్రాప్తికొరకు ఉపాయమడిగాడు. ఆ మహాత్ముడిలా ఉపదేశించారు. ప్రాతఃకాలము నాలుగు గంటలకు మేల్కొని, శౌచాదులు నిర్వర్తించి, స్నానసంధ్యలు తదుపర, నిల్చుని నిత్యమూ సహస్ర గాయత్రీ చేయుము." ఆయన అలా చేసి తన ఆర్థిక సంకటమునుండి విముక్తుడయ్యాడు.

'ప్రయాగ్' జిల్లా 'ఛితౌనీ' గ్రామ నివాసి పం॥ దేవనారాయణజీ దేవభాష (సంస్కృతం) యందు అసాధారణ విద్వాంసులు. అనన్య గాయత్రీ ఉపాసకులు. 30 సం॥ల వరకు విద్యాభ్యాసము గావించి తదుపరి "గృహస్థాశ్రమము" స్వీకరించారు. సుశీల పతిభక్తి కలిగిన భార్య. వివాహానంతరం అనేక సంవత్సరముల వరకు సంతానములేనందున ఆమె దుఃఖించగా, వారు ఆమె మనోరథమును గుర్తించి 125 వేల గాయత్రీ అనుష్ఠానము చేశారు. కొన్ని రోజులకు వారికి ప్రతిభాశాలి, మేధావియైన పుత్రుడు జన్మించాడు. ప్రస్తుతము సర్వోత్కృష్టమైన ఉపాధిని దేవభాషయందు పొందుటకు అర్హతను సంపాదిస్తున్నాడు.

ప్రయాగవద్ద "జమునిపూర్" గ్రామంలో రామనిధిశాస్త్రి పేరుగల బ్రాహ్మణుడుండే వాడు. అతడత్యంత నిర్ధనుడు కాని గాయత్రీ సాధనలో గాఢతత్పరత గలవాడు. ఒకసారి

తొమ్మిదిరోజులు ఉపవసించి, నవాహ్న (తొమ్మిది పగళ్ళు) గాయత్రీ పురశ్చరణ చేశాడు. పురశ్చరణ అంతిమ దినమున భగవతీ గాయత్రీ మహత్తరమైనదివ్య తేజస్సుతో దర్శనమొసగినది. "మీ గృహంలో ఫలానా స్థానంలో స్వర్ణముద్రికాభరితమైన పాత్ర ఉంచబడినది. దానిని వెలికి తీసి నీ దారిద్ర్యాన్ని పోగొట్టుకో" అని నుడివినది. ఆ పాత్రను వెలికితీసి నిర్ధనుడల్లా ధనపతి అయ్యాడు.

ఇండోరుకు చెందిన పండిత రక్షపాల్‌జీ ఇలా చెప్పాడు - ఒక వ్యక్తి తన భార్యతో సదా కలహించేవాడు. కొన్ని రోజులు గాయత్రీ మంత్రంచే అభిమంత్రింపబడిన జలము త్రాగినందున, అతని స్వభావము మారి, వారిద్దరిమధ్య అన్యోన్యత క్రమంగా వృద్ధి పొందినది.

బడౌలిలోని వకీలు రామచంద్ర కాళీశంకర్ పాఠక్ ఆరంభంలో 10, రూ. వేతనంతో నౌకరీ చేసేవాడు. అతడు గాయత్రీ పురశ్చరణ చేశాడు. అతడు గాయత్రీ పురశ్చరణ గావించినందున, క్రమంగా విద్యాభిరుచి గలిగి, క్రమంగా ప్రఖ్యాత వకీలయ్యాడు. అతని మాసపు రాబడి 500 రూ. వరకు పెరిగినది.

'మహువా' (కాఠియవాడ్) లోని రణఛోడ్‌లాల్ భాయి కథనం ప్రకారం - ఒక వ్యక్తి కుమారుడు మెట్రిక్ పరీక్షలో రెండుసార్లు ఫెయిలయ్యాడు. చివరకు దుఃఖమగ్నుడై, గాయత్రీ జపము చేయించాడు. ఆ సంవత్సరం మంచి తరగతిలో ఉత్తీర్ణుడయినాడు.

గుజరాత్‌లోని 'మధుసూధన్ స్వామి' పేరు సన్యాస స్వీకారానికి పూర్వం మాయాశంకర్ దయాశంకర్ పాండ్య. వారు సిద్ధపూరులో నుండేవారు. ప్రారంభంలో వారి నెలసరి జీతం రూ. 25/-. వారు ప్రతిరోజు సహస్ర గాయత్రి చేస్తూ, క్రమంగా నాలుగువేల గాయత్రీ వరకు చేసేవారు. ఫలస్వరూపంగా వారి సంపదలో అభివృద్ధి వచ్చినది. వారు బడౌదీ రాజ్యంలో రైల్వే అసిస్టెంట్ ట్రాఫిక్ సూపరింటెండెంటు వరకుచేరి 300 రూ వేతనము వరకు చేరారు. తరువాత వారు సన్యాసం స్వీకరించారు.

'మాండూక్య ఉపనిషత్తుపై కారికలను వ్రాసిన విద్వాన్ గౌడపాదులవారి జన్మ,వారి తండ్రి ఉపవాసంతో సప్త దినములు గాయత్రీ జపము చేసిన ఫలస్వరూపంగా గలిగినది.

ప్రసిద్ధ సాహిత్యకారుడు సం! ద్వారకాప్రసాద్ చతుర్వేద ప్రథమంలో అలహాబాద్‌లోని సివిల్ సర్జనువద్ద హెడ్‌క్లర్కు. వారు వారన్ హేస్టింగ్స్ జీవన చరిత్ర వ్రాసినందున రాజద్రోహిగా పరిగణించబడి నౌఖరీ కోల్పోయినారు. వారిది పెద్ద కుటుంబము. జీవితాసాధనము వేరే లేదు. ఈ దుఃఖ సమయము నందు గాయత్రీ ఉపాసన చేశారు.

దీని ఫలితంగా పుస్తక లేఖనమనే స్వతంత్ర ఉపాధి ఏర్పడినది. అప్పటినుండి సాహిత్య సేవచేస్తూ సంపన్ను లయ్యారు. వారు ప్రతి వర్షము గాయత్రీ అనుష్ఠానమొనర్చుటనే నియమమేర్పరచుకొని, నిత్యమూ గాయత్రీ జపము చేసేవారు.

స్వర్గీయ మలకృష్ణభట్టు హిందీలో ప్రఖ్యాత సాహిత్యకారులు. వారు నిత్యము 500 గాయత్రీ జపము చేసేవారు. గాయత్రీ జపము చేసేవారికి దేనికీ కొఱత వుండదనేవారు. వారెల్లప్పుడు విద్య, ధనము, సన్నిహితులతో సమృద్ధిగా నుండేవారు.

ప్రయాగ విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ క్షేత్ర ఛంద్ర చటోపాధ్యాయ మేనల్లుడు వారి వద్ద వుంటూ విద్య నభ్యసించేవాడు. ఇంటరు పరీక్షలో లాజిక్ పరీక్షరోజు చాలా విచారంతో నున్నాడు. ఆ విషయంలో అతనికి అంత ప్రవేశం లేదు. ప్రొఫెసరు ప్రోత్సహించి అతనిని పరీక్షకు పంపి, తాను ఆసనమేసుకుని గాయత్రీ జపించడం ప్రారంభించాడు. తన మేనల్లుడు తిరిగి వచ్చేవరకు వెంట వెంటనే గాయత్రీని జపించారు. ఆ బాలుడు తిరిగివచ్చి, "పరీక్షలు బాగా వ్రాశాననీ, వ్రాసేటప్పుడు తన కలమునెవరో పట్టుకుని వ్రాసినట్లున్నదని" చెప్పాడు. మంచి మార్కులతో పరీక్షలో విజయం పొందాడు.

అలహాబాద్‌కు చెందిన పం॥ ప్రతాపనారాయణ చతుర్వేది ఉద్యోగం పోయినది. ఎంత ప్రయత్నించినా వేరొక ఉద్యోగములో ఖాళీ దొరకలేదు. తన తండ్రి ఆదేశానుసారము 1 లక్ష 25 వేల గాయత్రీ జపము చేశాడు. జపము పూర్తికాగానే 'పాయనీర్ ప్రెస్'లో ప్రత్యేక నౌఖరీ 2 1/2 రెట్లు వేతనంతో దొరికినది. అచట అనేకసార్లు ప్రయత్నించి నప్పటికీ ఫలితం లేకపోయినది.

'కలకత్తాకు చెందిన గౌ॥ మోడకమల్ కేజడీవాల్ ఆరంభంలో జోధ్పూర్ రాజ్యంలో నొక గ్రామంలో 12 రూ. జీతంతోనున్న అధ్యాపకుడు. ఒక పుస్తకంతో ఆకర్షింపబడి, గాయత్రీ జపం వేయడం నిత్య నియమంగా చేపట్టాడు. జపము చేస్తూ చేస్తూ తాను కలకత్తా వెళ్ళవలెననే స్ఫురణ కలిగినది. అచటనే తన ఆర్థికోన్నతి కలదనే భావన కలిగినది. నిదానంగా కలకత్తా వెళ్ళాడు. అచట వ్యాపారక్షేత్రంలో నౌఖరీ చేస్తూ గాయత్రిని సాధనం చేసేవాడు. పగడాల వ్యాపారంలో అతనికి అధిక లాభం చేకూరి, కొద్దికాలంలో లక్షాధికారైనాడు.

'బుల్ఢానా'లోని శ్రీ ప్రదీప్ ప్రసాద్ వర్మ హీనమైన ఆర్థిక స్థితిలో ఉండేవాడు. 50 రూ నెలజీతంతో తన 8 మంది కుటుంబ సభ్యులు పోషింపబడాలి. వివాహ

ఢిల్లీలో 'నయీసడక్' (కొత్తరోడ్డు) మీద శ్రీ బద్రారామ్‌భట్ పేరుగల దుకాణాదారుడున్నాడు. ఆయనకు 45 సం||ల వరకు సంతానము లేదు. గాయత్రీ ఉపాసన వలన ఆయనకు జీవిత సంధ్యాసమయంలో పుత్రోదయం కలిగినది. ఆ కుమారుడు సుందరుడై చలాకీగా వున్నాడు.

గురుకుల బృందావనములోని కార్యకర్తలు సుదామామిశ్రకు 14 సం||ల నుండి పురుష సంతానము లేదు గాయత్రీ పునశ్చరణ గావించినందున ఒక పుత్రుడు జన్మించాడు. వంశము నిలచినది. దర్వాజా తెరచి వుంచే బాధ తప్పి పోయినది.

'సర్‌సయా' లోని జీవనలాల్ 3 సం||ల చలాకీ, తెలివిగల కుమారుడు స్వర్గస్థుడయినాడు. అతడు పుత్ర వియోగంతో కృంగిపోయాడు. అతడు గాయత్రీ విశేష ఉపాసన గావించాడు. రెండవ నెలలో అతని భార్యకు స్వప్నంలో అమె కుమారుని ఎత్తుకున్నది. అంతలోనే ఆ బాలుని హృదయం పైకి తీసికొనదలచినది. కాని ఆ బాలుడు అమె గర్భంలో దూరిపోయాడు. ఈ స్వప్నము తరువాత 9 నెలలకు అమెకు పుత్రుడు జన్మించాడు. ఆ బాలుడన్ని విధముల చనిపోయిన కుమారుని బోలి వున్నాడు. ఆ కుమారుని గని వారు శోకము వీడి శాంతిని పొందారు.

వైద్యనాథ్ ఛాయరాజీ ఛాయభులారే విద్వాంసులద్వారా అనేక పర్యాయములు గాయత్రీ అనుష్ఠానంలో అద్భుత ఫలితాలనిచ్చాయి. అరుగురు పుత్రికల తదుపరి అతనికి పుత్రుడు జన్మించాడు. 17 సంవత్సరాలనుండి వున్న మూలవ్యాధి (మొలలు) నయమైనది. అతని వ్యాపారంలో ఇదివరకటికన్నా అధికలాభాలు పొందినాడు.

డోరిబజార్ సం|| పూజామిశ్రా ఈవిధంగా వచించాడు - "మా తండ్రి పం | దేవప్రసాద్‌జీ యొక గాయత్రీ ఉపాసకుడయిన మహాత్ముని శిష్యుడు. మా తండ్రి ఆర్థిక పరిస్థితి హీనమైనది. మా తండ్రి దుఃఖాన్ని చూసి మహాత్ముడు గాయత్రీ ఉపాసన బోధించాడు. ఫలితంగా పాలంలో ఎక్కువ లాభాలు రావడం ప్రారంభమయినాయి. చిన్న కమతంలో ఎక్కువ లాభం మా తండ్రి ఆర్థిక పరిస్థితి బాగా పుంజుకొన్నది. మిగిలిన 20 వేలు బ్యాంకులో వేశాము".

గుజరాత్‌లోని 'ఈడర్' రాజ్యం నివాసి పం | గౌరీశంకర్ దేవాశంకర్ యాజ్ఞిక్ 15 సం|| వయస్సు నుండి గాయత్రీ ఉపాసన ప్రారంభించాడు. చిన్న వయస్సులో 24 లక్షలు చొ||న మూడుసార్లు పునశ్చరణ గావించాడు. దీని ఫలితంగా, జ్ఞానము, అన్య శుభ సంస్కారములు ఎక్కువగా అభివృద్ధి చెందినాయి. అందువలన వారెచ్చటకు వెళ్ళినా ఆదరము, సన్మానము ప్రాప్తించాయి. వీరి పూర్వులు పూనాలో నొక పాఠశాలను స్థాపించారు. అందులో విద్యార్థులకు ఉన్నత స్థాయికి చెందిన ధార్మిక శిక్షణ

నొసంగేవారు. గౌరి శంకర్‌జీ ఈ పాఠశాలను స్థాపించారు. అందులో విద్యార్థులకు ఉన్నత స్థాయికి చెందిన ధార్మిక శిక్షణ నొసంగేవారు. గౌరి శంకర్‌జీ ఈ పాఠశాలను తన ఇంటిముందే ఏర్పరచారు. విద్యార్థులకు గాయత్రీ ఉపాసన నేర్పడం ఎవరయినా అసహాయ విద్యార్థి తన భోజనమునకు స్వయంగా భరించలేనియెడల, అవిద్యార్థి ప్రతిదినం సహస్ర గాయత్రీ జపించితే, భోజనము ప్రాప్తించే నియమాన్ని వారు ఏర్పరచినారు. దీని పరిణామంగా పూనాలో వీరిని అచటి బ్రాహ్మణులు "పురానా గురుగృహము"ని ప్రసిద్ధ నామమొసంగినారు.

జబల్ పూరులోని "రాధేశ్యామ్" గృహంలోని వ్యక్తులను రోగములు పీడిస్తూ వుండేవి. అతని రాబడిలో ఎక్కువ భాగం వైద్యానికి, డాక్టర్లకే వినియోగించవలసి వచ్చేది. ఆతడు గాయత్రీ జపము ప్రారంభించినప్పటినుండి ఆ గృహము రోగవిముక్తి పొందినది.

## గాయత్రీ సాధన వలన విపత్తుల నివారణ

విపరీత పరిస్థితుల ప్రవాహం చాలా ప్రబలంగా వుంటుంది. ఆ ప్రవాహ వలయంలో చిక్కిన వ్యక్తి విపత్కరపరంపరవైపు పురోగమిస్తాడు. వ్యాధి, ధనహీనత, కోర్టు వ్యవహారము, శత్రుత్వము, బికారీతనము, గృహ కలహములు, వివాదములు, పన్నులు మొదలయిన శృంఖలములు రగుల్కొంటాయి. వాటితో మానవుడు హైరానా పడతాడు. సామెత ఉండనే ఉన్నది. "కష్టాలు ఒంటరిగా రావు. తన పిల్లాజెల్లా సహితంగా వచ్చి చేరుతాయి. ఒక కష్టము వచ్చిన వెంటనే దానితోపాటు ఇంకా అనేకమైన విపత్కర పరిస్థితులు అదే సమయంలో వాటిల్లుతాయి. నాల్గు దిశలు క్రమ్ముకొన్నందున మనుష్యుడు తాను చక్రవ్యూహంలో చిక్కుకున్న అనుభవాన్ని పొందుతాడు. అట్టి ఆపత్సమయంలో, నిరాశ, చింత, భయము, నిరుత్సాహము, అస్థిరత (గాబరా), కింకర్తవ్య విమూఢత (దిక్కు తోచని స్థితి) లతో నుండి కాళ్ళు చేతులు కదిలించలేక శోకతప్తులై, అధికసమయం వరకు అత్యధికంగా కష్టములను అనుభవిస్తాడు.

ఆపదలు, విపరీత పరిస్థితుల సతత ధారాప్రవాహమునుండి రక్షణ పొందుటకు, ధైర్య, సాహస, వివేక, ప్రయత్నముల ఆవశ్యకత ఉన్నది. ఈ నాలుగు కోణముల నావ నధిరోహించి సంకట ప్రవాహమును తరించుట సుగమము. గాయత్రీ సాధన ఆపత్సమయములలో ఈ నాలుగు తత్వములను మనుష్యుని అంతః కరణములో

విశేషంగా ప్రోత్సాహించుతుంది. దీని వలన సవ్యమైన మార్గము నన్వేషించుటలో కృతకృత్యుడై ఆపదల నధిగమించుతాడు.

ఆపదలలో చిక్కిన అనేకమంది వ్యక్తులు గాయత్రీ యొక్క కృపవలన ఏ ప్రకారంగా దాటినారో కొన్ని ఉదాహరణలు మా దృష్టికొచ్చినవి ఈ విధంగా ఉన్నాయి.

ఘాట్‌కోసర్ బొంబాయిలోని శ్రీ ఆర్.బి. వేద్ గాయత్రీ దేవి కృపవలన మతకల్లోలములలో ముస్లిం బస్తీలోనుండి నిర్భయంగా సంచరించేవాడు. అయన పుత్రిక కొకసారి భూతమావేశించినది. ఇది కూడా ఈ దేవి అనుగ్రహమున శాంతించినది. ఒక ప్రముఖమైన కోర్టు కేసులో తాను హాజరు కానప్పటికి అనుకూలమైన తీర్పు వచ్చినది.

ఇండోరు, కాంగడాకు చెందిన చౌ సేమర్‌సింహ, జలము, వాయువు నిర్మలంగాలేని చోట వ్యాధిగ్రస్థుడైనాడు. అచట వైద్యుడు లభ్యంకాడు. గాయత్రీ ప్రార్థనతో ఆ భయంకర వ్యాధినుండి విముక్తుడయినాడు.

బొంబాయిలోని రామశరణ్ శర్మ గాయత్రీ అనుష్ఠానము ప్రారంభించినప్పటి నుండి, వ్యాధి పీడితులయిన ఆయన తల్లిదండ్రులు వ్యాధి తగ్గి, ఆరోగ్యవంతు లయినారు.

'సీకర్' కు చెందిన "భగవాన్ సోమాని" ఉన్మంతో భయంకర రోగపీడితుడైనాడు. తని బావమరది "శివరతన్ జీ మూరు" గాయత్రీ చేయవలసి నదిగా సలహానిచ్చినాడు. లనవగా గాయత్రీ వలన తాను కుటుంబ కలహము నుండి, తన భార్య అస్వస్థతనుండి, విముక్తుడయినాడు. సోమాన్ వ్యాధి భయంకరమైనది. విల్‌మోరియా లాంటి ప్రముఖ సర్జన్లుకూడా మూడు ఎముకలు తీసినపుడే వ్యాధి నెమ్మదిస్తుందనీ, లేని యెడల పక్షము రోజులలో వ్యాధి చేజారిపోతుందన్నారు. అట్టి భయంకర పరిస్థితులలో "సోమాని" గాయత్రీ చరణమునాశ్రయించి స్వస్థత పొందినాడు. ఇపుడాతడు "రోహిపూర్"లో తన పనులను స్వయంగా నిర్వహించుకొంటున్నాడు.

శ్రీ గోవర్ధ పీఠాధిపతి శంకరాచార్య వారి "మంత్రశక్తి యోగ" పుస్తకంలో 168వ పేజీలో ఇటుల వ్రాశారు. రావు సాహెబు మమలతదార్ పహాడ్‌పూర్ కొల్లాపురు వ్యక్తి గాయత్రీ మంత్రంతో సర్పదంష్ట్రల విషవిముక్తి చేయుచున్నారు.

"రోహైడా" నివాసి 'శ్రీనేనూరామ్' 20 సం॥లనుండి వ్యాధితో నున్నారు. పెద్ద వైద్యముల వలన ప్రయోజనము లేకపోయినది. వ్యాధి నిరోధింపబడలేదు. గాయత్రీ ఉపాసన వలన వారికి పూర్తి స్వస్థత చేకూరినది.

ఈ విధంగా అగణిత ఉదాహరణలు దొరకగలవు. వీటిలో గాయత్రీ ఉపాసనద్వారా రాజసిక వైభవంతో సాధకులు లబ్ధి పొందారు.

"ఇటా ఆధురా" కు చెందిన డాక్టరు రామనారాయణ్‌జీ (ఛట్ నగర్) యొక్క మరణించిన పత్ని, అతని స్వప్నంలో కనపడి, గాయత్రీ జపముచేసే విధానాన్ని నేర్పినది. అప్పటినుండి యాతడు గాయత్రీ సాధన చేసేవాడు. అతని వృత్తిలో అపారమైన యశము గడించాడు. మొండి వ్యాధులను తిరుగులేకుండా కుదిర్చే వాడు.

'కన్‌కువా' అమీర్‌పురులోని లక్ష్మినారాయణ శ్రీవాత్సవ, బి.ఏ., ఎల్.ఎల్.బి వారి ధర్మపత్ని ప్రసవకాలములో అత్యంత కష్టపడేది. గాయత్రీ ఉపాసనద్వారా ఆమె ప్రసవ వేదన చాలా తక్కువగా ఉండేది. ఒకసారి వారి కుమారుడు "ఆటలమ్మ" పోసి చాలా బాధపడ్డాడు. వకీలుగారి గాయత్రీ ప్రార్ధనతో ఆ బాలకునకు గాఢ నిద్రపట్టి క్రమేణా స్వస్థుడయినాడు.

జపర్‌పూర్‌లోని డా. రామకరణసింహజీ వైద్య గారి ధర్మపత్ని రెండు సంవత్సరముల నుండి అతిసార వ్యాధితోనుండెను. అనేక చికిత్స లాచరించి నప్పటికి ప్రయోజనము శూన్యమైనది. ఒక లక్షా ఇరవై ఐదువేల జపానుష్టానము చేసిన ఫలితంగా ఆమె సంపూర్ణంగా స్వస్థురాలయినది. తరువాత ఒక పుత్రికకు జన్మనిచ్చినది.

కసరాబాద్, నిమాడ్‌కు చెందిన శంకర్‌లాల్ వ్యాస్ కుమారుడు వ్యాధిగ్రస్థుడైనాడు. వ్యాధి తీవ్రతను గాంచి వైద్యులు నిరాశ చెందారు. పదివేల గాయత్రీ చేసినందువలన స్వస్థత చేకూరినది. ఒకసారి వ్యాస్‌జీ రాత్రి సమయమందు త్రోవమరచి పర్వతము లతోకూడిన దట్టమైన అరణ్యంలో ప్రవేశించారు. ఆప్రదేశం భయంకరక్రూరమృగములకు నిలయము. ఆ సంకట సమయంలో వారు గాయత్రిని ధ్యానించారు. ప్రాణము రక్షింపబడినది.

విహియా, శహబాద్‌కు చెందిన "శ్రీ గురుచరణ ఆర్య" ఒకానొక అభియోగంలో కారాగారమునకు వెళ్ళెను. విడుదల కొరకు గాయత్రీ జపమాచరించాడు. అకస్మాత్తుగా విడుదలైనాడు. అతని నిర్దోషత్వం బయల్పడినది.

'ముంద్రావజా'కు చెందిన శ్రీ ప్రకాశ నారాయణ మిశ్రా పదవ తరగతిలో కుటుంబ పరిస్థితుల వలన విద్యపై ధ్యానముంచలేదు. పరీక్షలు 25 రోజులున్నవి. ఒకవైపు చదవడం, గాయత్రీ జపించడం ప్రారంభించాడు. ఉత్తీర్ణుడయ్యేందుకు ఆశలేదు. కాని విజయము పొందాడు. మిశ్రా తండ్రి శత్రువుల చక్రవ్యూహములో చిక్కుకుని జైలుకెళ్ళాడు. గాయత్రీ అనుష్ఠానము వలన రక్షింపబడ్డాడు.

కాశీలోని పం॥ ధరతీదత్తశాస్త్రి కథనం ప్రకారం వారి తాతగారు పం॥ కన్హైయిలాల్ గాయత్రీ ఉపాసకులు. చిన్నతనంలో శాస్త్రిగారు వారి తాతగారితో పాటు, రాత్రి పాలు తేవడానికి వెళ్ళారు. అచట భయంకర ప్రేతాత్మను చూశారు. అది గేదెగాను సూకరంగాను మారుతూ వారిని ఆక్రమించడానికి ప్రయత్నించినది. అది ముఖంతోను, శిరస్సులోను, భయంకరపు అగ్నిని విడుస్తూ, మానవ, జంతు స్వరూపాలతో గంటా, గంటన్నరవరకు భయోత్పాదన కలిగించినది. నేను భయపడటం గమనించి తాత గారు నాన్నా ! మనం గాయత్రీ ఉపాసకులం. ఈ ప్రేతము మనలకేహాని కలిగించదు. చివరకు వారు క్షేమంగా ఇంటికి చేరినారు. ఆ ప్రేతము యొక్క క్రోధము నిరుపయోగ మైనది.

"సనాఢయ్-జీవన్" ఇటావా సంపాదకుడు పం॥ ప్రభుదయాళ్‌శర్మ కథనం ప్రకారం - వారి కోడలు, మనుమరాలు ప్రేతాత్మ పీడితులయినారు. పాదములు, హస్తములు, శిరస్సు బాధచే పీడింపబడినది. స్పృహ లేక పోవడం కూడా కద్దు. రోగవిముక్తి కొరకు అన్ని ప్రయత్నములు నిష్ఫలం కాగా, గాయత్రీ నాశ్రయించి బాధల నుండి విముక్తి పొందారు. ఇదేవిధంగా శర్మాజీ సోదరుని కుమారుడు మృత్యు ముఖంలో నుండగా, ఆబాలుని ఒడిలో నుంచుకొని గాయత్రీ చేయగా బాలుని ఆరోగ్యము కుదిరినది.

శర్మాజీ పెదనాన్నగారు దానాపూర్ (పాట్నా) వెళ్లారు. వారు అచట స్నానం తరువాత గాయత్రీ జపమాచరించుచుండగా మధ్యలో అకస్మాత్తుగా వారి చెవిలో పెద్ద శబ్దమైనది - "శీఘ్రమే లేచి పారిపో ఈ గృహము ఇప్పుడే కూలిపోవ నున్నది" అని. వారు కిటికీలోనుండి బయటకు దూకి పారిపోవడానికి ప్రయత్నించారు. కష్టంతో కిటికీ నుండి 5 లేక 6 అడుగులు వెళ్ళారో లేదో ఆ గృహము శిథిలమై పడినది. వారు సురక్షితంగా ఉన్నారు.

"శేరు పురా"కు చెందిన అమోలక్ చంద్ర గుప్తా శైశవంలో తండ్రిని కోల్పోయాడు. కిశోరావస్థలో తల్లి మరణించినందున, దుస్సాంగత్యము వలన అనేక దురలవాట్లకు లోనయినాడు. స్నేహిత బృందము రోజంతా వుండేవారు. పేక, చదరంగము, గానాబజానా, వేశ్యా నృత్యము, సిగరెట్, త్రాగుడు, పందెములు, వ్యభిచారము, నాట్యము, తమాషా, షికారు, ఆట, భోజనం, పార్టీలు మొదలైనవి జరిగేవి. ఈ కుచక్రంలో తగుల్కొన్నందున 5 సం॥లలో నగదు, ఆభరణాలు, ఇల్లు, 20 వేల ఆస్తులు స్వాహా అయినవి. అన్నీ హరించిన తరువాత ఆతడు జూదవ్యాపారం, వ్యభిచార దళారీగా, చోరత్వం, జేబు కత్తిరింపు, దోపిడి, దగావెయ్యడం మొదలయిన క్రొత్త క్రొత్త పద్ధతుల

ననుసరిస్తూ ఒక చిన్న జట్టుతో తాను కాలం గడుపుతుండేవాడు. ఈ సమయంలో అతని మనస్సు ఎక్కువ అశాంతికి లోనయ్యేది. ఒక రోజాతనికొక మహాత్ముడు గాయత్రీ మంత్రముపదేశించినాడు. అతని శ్రద్ధవృద్ధి పొందినది. క్రమ క్రమంగా ఉత్తమ విచారములు వృద్ధి చెందాయి. పశ్చాత్తాప, ప్రాయశ్చిత్త భావన అతనిలో ఆవిర్భవించినది. అతడు అనేక చాంద్రయణ వ్రతములు, తీర్థ, అనుష్ఠానములు ప్రాయశ్చిత్తము గావించుకొన్నాడు. ఇపుడాతడొక దుకాణము పెట్టుకొని కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. తన దురలవాట్లనుండి విముక్తుడైనాడు.

'రాణీపురా' లోని డా. అంగజీత్ రాథోర్ దోపిడి కేసులో చిక్కుకున్నాడు. జైలులో ఆయన గాయత్రీ జపము చేసేవాడు. కేసులో అతనిని నిర్దోషియని వదలినారు.

"అంబాలా" లోని మోతీలాల్ మహేశ్వరి కుమారుడు కుసాంగత్యమువలన భయంకర దురాలవాట్లకులోనై తన కుటుంబ కళంకానికి కారకుడయినాడు. మహేశ్వరి దుఃఖితుడై గాయత్రీ శరణుజొచ్చాడు. ఆ తపశ్చర్య ప్రభావంగా అతని కుమారుని మనస్సు మారి అశాంతిపూరక కుటుంబములో శాంతి నెలకొల్పబడినది.

"టోంకు"కు చెందినశివనారాయణ శ్రీవాత్సవ గారి తండ్రిగారి మరణా నంతరము వారి జమీందారికి సాలుకు రూ. 2000 ఆదాయముతో ఆ కుటుంబములో 16గురు వ్యక్తులు బ్రతుకవలసి వచ్చినది. పరిశ్రమ చేసేవారులేరు. కాని ఖర్చు మాత్రం పెరుగుతూ ఉన్నది. మొత్తము జమీందారీ ద్వారానే భరించవలసి వచ్చేది. క్రమంగా ఆగృహము, గృహమంతా కలహ వ్యాయామశాలగా మారినది. కొట్లాటలు, కోర్టుల ఆశ్రయము ప్రవేశించినది. శ్రీవాత్సవ కిదంతా దుఃఖకారణమయినది. ఏలనన, అతడే అతని తండ్రి తరువాత ఉత్తరాధికారీ, గృహపతీ. దుఃఖితుడై ఒక మహాత్ముని ఆదేశానుసారంగా గాయత్రీ జపమారంభించాడు. పరిస్థితులు మారినవి. ఆలోచనలలో సంస్కారము కలిగినది. సంపాదించగలిగినవారు, ఉద్యోగమో, వ్యాపారమో చేయుట మొదలిడినారు. కలహము శాంతించినది, వణకుచున్న గృహము విచ్ఛిన్నత నుండి రక్షింపబడినది.

'అమరావతీ'లోని సోహన్‌లాల్ మెహరోత్రా భార్య భూత బాధతో నుండెడిది. చాలా కష్టమైనది. వేల రూపాయలు ఖర్చయినవి. ఆమె రోజు రోజుకు కృశించినది. ఒకరోజు మెహరోత్రాజీ స్వప్నంలో వారి తండ్రి ఇలా చెప్పారు – "కుమారా గాయత్రీ జపం చేయి. అన్ని విపత్తులు తొలగుతాయి." మరుసటి రోజు నుండి అలాగే చేశాడు. ఫలితంగా ఉపద్రవము శాంతిచినది. ఆమె వ్యాధి కుదిరినది. ఆమె చెల్లెలు ఆడబిడ్డ కూడా ఇదే ఉపాయంతో భూత బాధనుండి విముక్తి చెందినది.

# గాయత్రీ జీవిత కాయకల్ప చికిత్స

గాయత్రీ మంత్రము ఆత్మిక కాయకల్పమవుతుంది. ఈ మహామంత్ర ఉపాసన ఆరంభించినంతనే సాధకుని అంతర్యంలో ప్రత్యేక భావము ప్రజ్వర్లితుంది. "నా ఆంతరంగిక క్షేత్రంలో నవ్యస్పందనై, తుచ్ఛత పరివర్తనం చెందడం ప్రారంభించినది" అని తలపోస్తాడు. సత్వగుణాభివృద్ధి జరగడంవలన, దుర్గుణములు, దుఃఖభావములు, దుర్భావములు తగ్గుట ఆరంభమౌతుంది. సంయమనము, నమ్రత, పవిత్రత, ఉత్సాహము, స్ఫూర్తి, శ్రమశీలత, మధురత, నిజాయతీ, సత్యనిష్ఠ, ఉదారత, ప్రేమ, సంతోషము, శాంతి, సేవాభావము, ఆత్మీయత మొదలైన సద్గుణముల పరిమాణము దినదినానికి వేగంగా అభివృద్ధి చెందుతుంది. ఫలస్వరూపంగా ప్రజలాతని స్వభావాచరణముల వలన సంతుష్టి పొందుతారు. దానికి ప్రతిగా ఆతనియందు ప్రశంసాపూర్వక, కృతజ్ఞత, శ్రద్ధ, అభిమానము నెలకొని వుంటాయి. ఆతని అవసర సమయములందు సహాయపడతారు. అదనంగా సద్గుణములు స్వయంగా మధురమైనవి, ఏ హృదయంలో సద్గుణములు నివసిస్తాయో, అచట ఆత్మసంతోషమువలన పరమ శాంతిదాయక శీల నిర్ఝరిణి సదా ప్రవహిస్తూ వుంటుంది.

గాయత్రీ సాధనచే, సాధకుని మనోక్షేత్రమందు అసాధారణ పరివర్తన జరుగుతుంది. వివేకము, తత్వజ్ఞానము, ఋతంభరా(అమృతమయమైన) బుద్ధి అభివృద్ధి చెందినందున అనేక అజ్ఞానజనిత దుఃఖముల నివారణ జరుగుతుంది. ప్రారబ్ధవశమున, అనివార్య కర్మఫలకారణ కష్టసాధ్య పరిస్థితులు ప్రతివ్యక్తి జీవితంలో సంభవించుతాయి. హాని, శోకము, వియోగము, ఆపదలు, వ్యాధులు, దాస్యత, విరోధము, అఘాతములు (దెబ్బలు) మొదలైన విభిన్న పరిస్థితులలో సాధారణ మనుష్యులు మృత్యుతుల్య కష్టమనుభవిస్తారు. కాని అదేపరిస్థితిలో గాయత్రీ సాధకుడు తన వివేకంతోను, జ్ఞాన, వైరాగ్య, సాహస, ఆశ, ధైర్య, సంతోష, సంయమ, ఈశ్వర విశ్వాసాధారంపై తన కష్టములను నవ్వుతూ, సులభంగా దాటుతాడు. దౌర్భాగ్య పరిస్థితులలోగాని, సాధారణ పరిస్థితులలోగాని, తన దైన ఆనంద మార్గాన్న న్వేషించుకొంటాడు. పరిపూర్ణ ప్రసన్నతా జీవనం గడుపుతాడు.

ప్రపంచంలోనున్న అధిక ప్రయోజనకారి 'ఆత్మబలము' ఇది గాయత్రీ సాధనకును ప్రాప్తించుతుంది. దీనితోపాటు అనేక ప్రాపంచిక సుఖాలుకూడా అనుభవించుతాడు. వ్యాధి బలహీనత, వృధాగా కాలము గడుపుట, కపటము, గృహ

కలహములు, మనోమాలిన్యము, కోర్టుకేసులు, శత్రువుల దాడి, దాంపత్యసుఖమందు కొరత, మస్తక బలహీనత, అస్థిరచిత్తము, సంతాన దుఃఖము, కుమార్తె వివాహములు లాంటి కష్టములు వెడ్డ భవిష్యత్తును గూర్చి శంక, పరీక్షయందు అపజయము కలుగునను భయము, చెడు అలవాట్లు కలిగిన అగణిత వ్యక్తులు, ఆరాధించి తమ దుఃఖములను నివారించుకున్నారు.

కారణమేమనగా ప్రతి కష్టమునకు వెనుక మూలకారణము నిశ్చయంగా కొంచెంలో కొంచెమైనా తమ పొరపాట్లు, అయోగ్యతలు, దోషములు ఉంటాయి. సద్గుణాభి వృద్ధితో పాటు, మన ఆహారవిహారములలోను, దిన చర్యలోను, దృష్టికోణములోను, స్వభావంలోను పరివర్తన తప్పక జరుగుతుంది. ఈ పరివర్తనము ఆపదల నివారణార్థము, సుఖశాంతులు పొందుటకొరకు రాజమార్గమౌతుంది. అనేక పర్యాయములు మన ఇష్టానిష్టములు, తృష్ణలు, లాలసలు, కామనలు, మన యోగ్యతలకు, పరిస్థితులకు అనుకూలంగా వుండవు. మస్తిష్కము శుద్ధియైనంతనే, బుద్ధిమంతుడైన వ్యక్తి మృగతృష్ణలను త్యజించి, భ్రమచే జాజ్వల్యమానమగు అకారణ దుఃఖమునుండి విముక్తుడౌతాడు. అవశ్యం సంభవించేది, తొలగించుటకు వీలులేని ప్రారబ్ధాన్ననుభవించవలసి వచ్చినపుడు, సాధారణ వ్యక్తి అసహ్యంగా దుఃఖించి, శోకిస్తాడు. కాని గాయత్రీ సాధనకున్న ఆత్మబలంచే సంభవించిన సాహసంతో ప్రారబ్ధాన్ని నవ్వుతూ భరిస్తాడు.

ఏదైనా విశేష ఆపదను నివారించుకొనుటకు ప్రత్యేక ఆవశ్యకత కలిగినపుడు గాయత్రీ సాధన జేయవచ్చు. బహుధా( అనేకమార్లు) దీని పరిణామము ఆశ్చర్యజనకముగా నుంటుంది. నలుదిక్కులా, నిరాశ, అసఫలతా, అనుమానము, భయములనే, అంధ కారము వ్యాపించివున్నపుడు, అచట వేదమాత కృపవలన నొక దైవీప్రకాశ ముత్పన్నమై నిరాశ, ఆశారూపమును పొంది గొప్ప కష్టసాధ్య కార్యము స్వల్పమై, సుగమమగుట సాదృశ్యంగా జరిగినది. ఇటులనే అనేక పర్యాయము మా కండ్లతో జూచినందువలన గాయత్రీ యందు అచంచల విశ్వాసము గలిగినది. గాయత్రీ సాధన ఎప్పుడూ, ఎవ్వరికీ నిష్ఫలం కాదు.

గాయత్రీ సాధన ఆత్మబలం పెంపొందుటకు అమోఘమైన ఆధ్యాత్మిక వ్యాయామము. ఇతరులను కుస్తీలో చిత్తుచేయుటకు, కుస్తీ పందెములు గెలిచి బహుమతులను పొందుటకు పహిల్వానులు వ్యాయామము నభ్యసిస్తారు. అభ్యసించిన వస్తాదెప్పుడైనా కుస్తీలో అపజయము పొందినంతమాత్రాన అతని ప్రయత్నము నిష్ఫలమని తలవరాదు. ఈ నెపంతోనే అతని శరీరము అనేక ఫలితములను పొందుతుంది. నిరోగిత (రోగం లేకుండుట) సౌందర్యం, దీర్ఘజీవనము, కఠోర పరిశ్రమకు తగిన ఓర్పు,

దాంపత్యసుఖము, సుసంతతి, శత్రువులంటె నిర్భయత్వము మొదలైనవి కుస్తీగెలవడంకన్నా తక్కువ వేమి కావు. గాయత్రీ సాధన వలన అనేక రెట్లు లాభం చేకూరుట ఏదో విధంగా ననేది నిశ్చయము.

ఆత్మ స్వయంగా అనేక వృద్ధిసిద్ధులకు కేంద్రము. పరమాత్మలో ఏయే శక్తులున్నాయో, ఆశక్తులన్నీ ఆయనకు అమర యువరాజైన ఆత్మలో నున్నవి. సమస్తంవృద్ధి సిద్ధులకు కేంద్రము ఆత్మలోనున్నది. ఏలననగా నివురు (బూడిద)చే కప్పబడిన అగ్ని మందముగా మారుతుంది. అట్లే అంతరిక మలినములవలన ఆత్మతేజము కుంఠితమౌతుంది. గాయత్రీ సాధన వలన మాలిన్యపు తెర తొలగుతుంది. అగ్నిపైనున్న బూడిద తొలగిన వెంటనే అగ్ని తన ప్రజ్వలిత రూపంతో దర్శనమిస్తుంది. అదేవిధంగా సాధకుని ఆత్మగూడా తన వృద్ధి సిద్ధి సమన్విత బ్రహ్మతేజముతో వ్యక్తమౌతుంది. దీర్ఘకాలం కష్టసాధ్యమైన తపస్సొనరించి యోగులే లబ్ధి పొందుతారో, అదే గాయత్రీ సాధకులకు స్వల్ప ప్రయాసతో ప్రాప్తిస్తుంది.

ఈ గాయత్రీ ఉపాసనా ప్రభావము యీ సమయమందు గూడా, అనేక సమయాలలో సాదృశ్యంగానున్నది. గత 50లలో వందలకొద్ది వ్యక్తులు గాయత్రీ ఉపాసనా ఫలితాన్ని పొందినారు. వారు తమ జీవితములను, ఉత్తమమై, సార్వజనిక దృష్టితో కళ్యాణకరము, పరోపకారముగా మలచుకొన్నారు. దీనివలన ఇతర వేలమంది ప్రజలకు ప్రేరణ ప్రాప్తించినది. గాయత్రీ సాధన వలన ఆత్మోత్కర్షగుణాభివృద్ధి ఎంతపొందగలరనగా, దానివలన జీవిత కళ్యాణము, సంస్కారము తప్ప మరేవిధమైన అరిష్టములు కలుగవు.

ప్రాచీన కాలంలో మహర్షులు ఘోర తపస్సొనరించి, యోగసాధనలచే అణిమ, మహిమ మొదలైన సిద్ధులను పొందినారు. వారియొక్క దివ్యశక్తులయొక్క వర్ణనలతో పురాణేతిహాసములు నిండివున్నాయి. ఆ తపస్సు, యోగసాధన, గాయత్రీ ఆధారంతోనే గావించారు. ఇపుడుగూడా అనేకమంది మహాత్ములవద్ద దైవీశక్తుల, సిద్ధుల భండారమున్నది. వారందరూ "గాయత్రీకన్నా యోగమార్గములలో, సుగమ్యమైన ఫలితాన్ని ప్రసాదించే మార్గము వేరొకటిలేదు" అని వక్కాణించారు. సిద్ధ పురుషులేగాక, అదనంగా సూర్యవంశపు చంద్రవంశపు చక్రవర్తులందరూ గాయత్రీ ఉపాసకులే. బ్రాహ్మణులు గాయత్రీ బ్రహ్మశక్తిచే జగద్గురువులైనారు. క్షత్రియులు గాయత్రీయొక్క భర్గతేజస్సును ధరించి చక్రవర్తులై శాసించగలిగారు. ఈ సనాతన సత్యము నేడు గూడా అటులనే నున్నది. గాయత్రీ మాత చేలాంచలమును శ్రద్ధాపూర్వకముగా గ్రహించిన మానవుడు నిరాశను పొందడు.

# స్త్రీలకు గాయత్రీసాధన

ప్రాచీనకాలంలో గార్గీ, మైత్రేయి, మదాలస, అనసూయా, అరుంధతి, దేవయాని, అహల్య, కుంతి, శతరూప, బృంద, మండోదరీ, తారా, ద్రౌపది, దమయంతీ, గౌతమి, అపాలా, సులభా, శావతీ, ఉశిజా, సావిత్రీ, లోపాముద్రా, ప్రతిశేయ, వైశాలీ, బైందులా, సునీత, శకుంతలా, పింగళా, జరుత్కార, రోహిణీ, భద్రా, విదులా, గాంధారీ, అంజనీ, సీతా, దేవహూతి, పార్వతి, అదితి,శచీ, సత్యవతీ, సుకన్య, శైవ్య, మొదలైన సతులందరూ వేదజ్ఞులు, మరియు గాయత్రీ ఉపాసకులు. వారు గాయత్రీ శక్తి నుపాసించడంద్వారా తమ ఆత్మలను సమున్నతం గావించుగొనుటయేగాక, యోగసిద్ధులను పొందారు. వారు పునీతులై. గృహస్థులై, సధవులై, సావిత్రీ (గాయత్రీ)ని ఆరాధించుటలో సఫల మనోరథులైనారు. ఈ మహా స్త్రీల విస్తృత వృత్తాంతాన్ని, వారి సాధనలను,సిద్ధులను వర్ణించుటకే చిన్న పుస్తకములో సంభవము గాదు. భారతీయ ఇతిహాస, పురాణములను పఠించిన వారికి పైనుదహరించిన దేవతాస్త్రీమూర్తుల విద్వత్తు, సాహసము, శక్తి, శౌర్యము, దూరదృష్టి, నీతి, ధర్మము, సాధన, ఆత్మోన్నతి, మొదలైన పరాక్రమాలు, తమ పద్ధతిలో, అమూల్యమైన, జాజ్జ్వల్యమాన తారకలు. వారు వివిధ సమయములలో గావించిన చమత్కారములను గమనించిన మనము ఆశ్చర్య చకితులౌతాము.

ప్రాచీన కాలంలో 'సావిత్రీ' ఒక వత్సరకాలము గాయత్రీ జపమాచరించి తాను సాధించిన శక్తితో మరణించిన తన పతి సత్యవంతుని ప్రాణములను యమధర్మరాజు నుండి తీసుకురాగలిగినది. దమయంతి తన తపః ప్రభావంచే కుచేష్టకు పాల్పడిన వ్యాధుని భస్మీపటలగావించినది. గాంధారి తన కళ్ళకు గంతలు కట్టుకొని, ఘోర తపమాచరించి పొందిన శక్తితో. తన దృష్టి ప్రసారితమైనంతమాత్రాన, దుర్యోధనుని శరీరమును వజ్రతుల్యము గావించినది. ఏ జంఘముపై(తొడ) లజ్జావశమున వస్త్రమును ధరించాడో, అచట పచ్చిగా వున్నందున, దానిపై గదా ప్రహారము గావించి భీముడతనిని సంహరించాడు.

అనసూయ తపస్సు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను శిశువులనుగా మార్చినది. సతీ 'శాండిలీ" తన తపోబలంచే సూర్యరథ గమనాన్ని నిలిపివేసినది. "సుకన్య" తపఃశక్తిచే, జీర్ణ, శీర్ణ శరీరుడైన చ్యవనుని తరుణుని గావించినది. స్త్రీలయొక్క అపూర్వ తపోఇతిహాసం పురుషులకంటె తక్కువేమి గాదు. స్త్రీ, పురుషులిద్దరికీ ప్రముఖ తపోమార్గము 'గాయత్రీ' యేనని స్పష్టమైనది.

వర్తమాన కాలంలో కూడా, అనేకమంది స్త్రీలు గాయత్రీ సాధన చేసినవారు మాకు చిరపరిచితులు. గాయత్రీ ద్వారా వారు అధిక ఆత్మికశక్తిని, సాంసారిక శాంతిని పొందినట్లు తెలియపరిచినారు.

ఒక సుప్రసిద్ధ ఇంజనీరు ధర్మపత్ని శ్రీమతి ప్రేమ ప్యారి దేవికి, అనేక ప్రకారములుగా కుటుంబ కఠిన సమస్యలు ఎదురైనాయి. అనేక కష్ట సమయాలలో ఆమె గాయత్రీని ఆశ్రయించి, విషమ పరిస్థితులనుండి విముక్తి పొందినది.

ఢిల్లీలో, అత్యంత ఉన్నత కుటుంబానికి చెంది, సుశిక్షితురాలైన శ్రీమతి చంద్రకళాదేవి, బి.ఎ. 'గాయత్రీ' దేవి అనన్య సాధిక. ఈ సాధన ద్వారా ఆమె రోగగ్రస్థులకు స్వస్థత చేకూర్చడంలో ఫలితమును పొందినది. నొప్పితో బాధపడేవారు ఈమె హస్త స్పర్శతో బాధానిర్మూలనము పొందేవారు. ఈమె గాయత్రీ తప మాచరించుటలో తన్మయత్వము పొందేది. నిద్రలో కూడా తనంతట తాను జపించుతుంది.

'నగీనా'కు చెందిన ప్రతిష్ఠావంతుడైన శిక్షా శాస్త్రిగారు ధర్మపత్ని శ్రీమతి మేధావతీదేవి బాల్యంనుండి గాయత్రీ జప సాధన చేయుటకు తన తండ్రి నుండి ప్రోత్సాహము పొందినది. ఇప్పటివరకు గాయత్రీని ప్రేమతో జపిస్తూంది. అనేక చింతాజనక సమయాలలో గాయత్రీ కృపచే ఆమె మనోకామనలు సిద్ధించాయి.

'శిలోంగ్'లో నొక సతీ, సాధ్వియైన మహిళ, శ్రీమతి గుణవతీదేవి పతిదేవుని మృతి 20 సం॥ల వయస్సులో జరిగినది. ఒడిలో 2 సం॥ల కుమారుడున్నాడు. ఆమెకు, ఆమె మామగారికి, మృత్యువు బలీయమైన ఆఘాతమై తగిలినది. శోక సంతప్తమానసులై వారిద్దరు అస్థిపంజరములుగా తయారయినారు. ఒకరోజొక జ్ఞాని ఆమె మామగారికి గాయత్రీ ఉపదేశించారు. శోక నివారణార్థమా జపమాచరించ ప్రారంభించాడు. కొన్ని దినముల తదుపరి గుణవతీదేవి స్వప్నంలో నొక తపస్విని దర్శనమిచ్చి ఇలా అన్నది. "ఏవిధమైన చింత పడవద్దు. నేను నిన్ను రక్షిస్తాను. నాపేరు గాయత్రీ. అవసరమొచ్చినపుడు నన్ను స్మరించు". స్వప్నము కరిగిన వెంటనే, మరుసటి దినము నుండి ఆమె గాయత్రీ జపసాధన ప్రారంభించినది. గడచిన 13 సం॥లలో ఆమెకు ఆపదలు సంభవించినవి, అన్నియు విడిపోయినవి ఇపుడామె కుమారునికి 16 సం॥ల. బి.ఏ, చదువుచున్నాడు. అతనికి నెలకు 40రూ. స్కాలర్‌షిప్ లభ్యమౌతోంది. అతడు నెలకు 75 రూ ట్యూషన్ బోధించుచున్నాడు. కుటుంబము సవ్యముగా సాగుతున్నది. ఆ బాలునికి గాయత్రీపై అనన్య శ్రద్ధ ఉన్నది.

హైదరాబాద్ (సింధ్) లోని శ్రీమతి విమలాదేవి అత్తగారు మహా కర్కశ స్వభావురాలు. పతిదేవుడు త్రాగుబోతు. వేశ్యాగమనాది దురలవాట్లన్నీ వున్నాయి. విమలాదేవీ, అత్తగారివలన, భర్తగారివలన తిట్లు, దుర్భాషలు తాడ, పీడనములు అనుభవించవలసి వచ్చినది. దానివలన ఆమె దుఃఖితయై, అప్పుడప్పుడూ ఆత్మహత్య నొనరించుకొనవలెనని గూడా ఆలోచించేది. విమలాదేవి మేనత్త ఆమె విపత్తి నివారణార్థముగా గాయత్రీ మాత ఉపాసనా విధానాన్ని నేర్పినది. ఆమె చేయడం ప్రారంభించింది. ఫలితం ఆశాతీతంగా జరిగినది. కొన్ని రోజులలోనే అత్త, భర్తలయొక్క స్వభావములో ఆశ్చర్యజనకమైన మార్పొచ్చినది. ఒకరోజామె భర్తకు భయంకర స్వప్నము వచ్చినది. కొంతమంది దేవదూతలాతని కుకర్మలకు ప్రాయశ్చిత్తముగా అనేక బాధలాతనికి కలిగించారు. అవి మృత్యుతుల్యమైన బాధలు. స్వప్నము విడి మేల్కొనినంతనే, అతని భ్రమపూర్వక మృత్యుతుల్య శిక్ష కొన్ని నెలలవరకు వున్నది. ఆ రోజునుండి భర్త స్వభావము చక్కబడినది. ఇపుడా పరివారము పరిపూర్ణమై, సంతుష్టిగా నున్నది. తన కుటుంబమును చక్కదిద్దినది. గాయత్రీయేనని విమలయొక్క దృఢ నమ్మకము. ఆమె జపమాచరింపప భుజింపదు. అనేక వత్సరములనుండీ ఆమె నియమమిది.

'వారీసాల్' (బెంగాల్)లో నొక పెద్ద ఆఫీసరు ధర్మపత్ని శ్రీమతి హేమలతా చటర్జీకి 33 సం॥ల వరకు సంతానము కలుగలేదు. ఆమె భర్త, ఇతర కుటుంబ సభ్యులకిది బాధాకరంగా నుండెను. అప్పుడప్పుడు ఆమె భర్తకు ద్వితీయ వివాహ చర్చగూడా రావడం కద్దు. హేమలత కిది మానసిక వ్యధగా నైనది. ఆమెకు మూర్ఛరోగమొచ్చినది. ఒక సాధకుడు ఆమెకు గాయత్రీ సాధనా విధిని బోధించాడు. ఆమె శ్రద్ధాపూర్వకంగా ఉపాసించడం ప్రారంభించినది. ఈశ్వర కృపచే సంవత్సరం తరువాత కన్యక జనించినది. ఆమెకు గాయత్రీ యని పేరు. తరువాత రెండు, రెండు సంవత్సరాల వ్యవధిలో ఇద్దరు పుత్రులు జన్మించారు. ఆముగ్గురు ఆరోగ్యంగా నున్నారు. ఈ కుటుంబమునకు గాయత్రీ యందు ప్రగాఢ విశ్వాసము, అభిమానమున్నది.

'జైసల్మేర్'లోని శ్రీమతి గోగన్‌బాయ్‌కి 16 సం॥ల వయస్సు నుండి హిస్టీరియా వ్యాధి వచ్చేది. ఎనిమిది సంవత్సరముల నుండి ఆమె చాలా బాధపడుతూంది. ఆమెకు ఉపవాసంతో కూడిన గాయత్రీ ఉపాసన బోధింపబడినది. ఆమె అన్నమును త్యజించి, పాలు, పండ్లతో జీవిస్తూ, భక్తిపూర్వకంగా గాయత్రీ ఆరాధన గావించినది. నాలుగు మాసములలో 8 సం॥ల వ్యాధి (మృగీవ్యాధి) నివారింపబడినది.

'గుజరన్‌వాలా'కు చెందిన సుందరీబాయికి ప్రథమంగా "కంఠమాల" వ్యాధి వున్నది. అది కొంచెము నెమ్మదించిన వెంటనే, ఆమెకు "ప్రదర" రోగము (శరీరమంతా పగులుట) భయంకరముగా వచ్చినది. ప్రతి గంటా ఎర్రటి ద్రవము బయటకు వస్తుంది. అనేక సంవత్సరాలు ఈ వ్యాధితో పడివున్నది. అందువలన ఆమె శరీరం అస్థిపంజరంగా తయారయినది. చర్మానికి, ఎముకల మధ్య మాంసము నామమాత్రంగా గూడా లేదు. కళ్ళు గుంటలుపడి లోనికి పోయాయి. గృహంలోని వారంతా ఆమె మృత్యువు కొరకు ప్రతీక్షించుచున్నారు. ఆస్థితిలో పొరుగున బ్రాహ్మణి గాయత్రీ తరణ తారిణీ యని పలికినది. ఆ దేవిని శరణుగోరమనినది. సుందరీబాయి మనస్సులోమాట నాటుకొనినది.ఆమె మంచముపైనుండియే జపం ప్రారంభించినది. ఈశ్వర కృపవలన నెమ్మది నెమ్మదిగా స్వస్థత చేకూరడం జరిగినది. పూర్తిగా కోలుకొనినది. రెండు సంవత్సరముల తరువాత ఆమెకు పుత్రుడు జన్మించాడు. అతడు ఆరోగ్యంగాను, చురుకుగా నున్నాడు.

గోదావరి జిల్లాలో వసంతీదేవి భూతోన్మాదంతో బాధపడుతూంది. భూతప్రేతాలు ఆమె శిరస్సుపై నున్నవి. 12 సం॥ల వయస్సులోనే ఆమె వృద్ధురాలిగా మారినది. తన కుమార్తె పీడ వదలడానికి ఆమె తండ్రి చాలా ధనం ఖర్చు చేశాడు. అతని వ్యాకులత పెరిగినది. ప్రయోజనం కనిపించలేదు. చివరకు గాయత్రీ పురశ్చరణ గావింపచేశాడు. కుమార్తె వ్యాధి కుదిరినది.

"భార్హా"కి చెందిన డాక్టరు రాజారామశర్మ గారి కుమార్తె సావిత్రీ దేవి గాయత్రీ దేవి యందు శ్రద్ధగలిగిన ఉపాసకురాలు. ఆమె గ్రామ ప్రాంతంలో నుండి ఆయుర్వేదాన్ని బాగా అధ్యయనం చేసినది. పరీక్ష దినములలో రోగగ్రస్థురాలైనప్పటికీ, "ఆయుర్వేదాచార్య" పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలయినది.

'కాన్పూరు' లోని అయోధ్యా ప్రసాద్ ధర్మపత్ని శాంతిదేవి, మిడిల్ క్లాసు మాత్రమే ప్యాస్ అయినది. 12 సంవత్సరములు చదువు మానివేసి కుటుంబ జంఝాటంలో పడివున్నది. ఒక సంవత్సరం అకస్మాత్తుగా "మెట్రిక్" ఫారం పూర్తి చేసినది. గాయత్రీ ఉపాసనాబలంతో, కొద్ది ప్రయత్నంతో ఉత్తీర్ణురాలయినది.

'వాలపూర్' సావిత్రీదేవి దుబే పేరుగల నొక మహిళ భర్త మృతి 18 సంవత్సరములయినపుడు జరిగినది. ఆమె అధిక రోగగ్రస్థురాలయినది. ఎండిపోయి పుల్లలా అయినది. ఒకరోజామెకు భర్త స్వప్నములో "నీవు గాయత్రీ ఉపాసన చేయి. నాఆత్మకు దానివలన సద్గతి కలుగుతుంది. నీ వైధవ్యము పరశాంతి ప్రదంగా వుంటుంది" అని చెప్పాడు. ఆమె పతి ఆజ్ఞానుసారముటులనే గావించినది. ఆమె కుటుంబములో

ఉంటూనే ఉచ్ఛస్థితి మహాత్మ్యలస్థితిని పొందినది. ఆమె జిహ్వ నుండి వెలువడే ప్రతి మాట తథ్యమయ్యేది.

"కటక్ జిల్లా రామపూర్ గ్రామంలో నొక కమ్మరి కన్య సోనాబాయికి నిత్యమూ స్వప్నంలో, జాగ్రదావస్థలో అప్పుడప్పుడు గాయత్రీదేవి దర్శనమయ్యేది. ఆమె భవిష్యద్వాణి ఎల్లప్పుడూ సత్యమయ్యేది.

"మురీద్‌పూర్‌కు చెందిన సంతోషకుమారి శైశవంలో బహుమందబుద్ధి. ఆమెను చదివించడానికామె తండ్రి యెంతో ప్రయత్నించేవాడు. ఫలితం లేకపోయినది. ఆమె భాగ్యదోషమని భావించి అందరూ వూరుకున్నారు. వివాహమయినది. వివాహానంతరం నాలుగు సంవత్సరములకు ఆమెకు వైధవ్యము ప్రాప్తించినది. వైధవ్యము గడపుటకు ఆమె గాయత్రీని ఆరాధించటం ఆరంభించినది. ఒక రాత్రి ఆమెకు గాయత్రీదేవి దర్శనమిచ్చినది. "నేను నీబుద్ధిని తీక్షణమొనరించినాను. విద్యనభ్యసించు. నీ జీవనం సఫలమౌతుంది" అని నుడివినది. మరుసటి దినము ఆమెకు విద్యయందు ఉత్సాహము గలిగినది. బుద్ధి తీవ్రముగా సునిశితమయినది. కొలది సంవత్సరములలోనే మెట్రిక్ పాసయినది. ఆమె స్త్రీ విద్యా ప్రచారమందు తత్పరతను పెంపొందించుకొని, దానిలో లగ్నమయినది.

'రంగపూర్ బెంగాల్‌కు చెందిన శ్రీమతి సరళా చౌధరీ పెక్కు సంతానము మృత్యువాతబడిరి. ఒక కుమారుడు గూడా జీవించనందువలన ఆమె కడు దుఃఖితయైనది. ఆమెకు గాయత్రీ సాధన నేర్పబడినది. ఆమె మంత్రాన్ని తనదిగా జేసుకొని ముగ్గురు కుమారుల మాతగా సుఖము పొందినది.

'టిహరీ'లో ఒక అధ్యాపిక గులాబ్‌దేవికి, ప్రసవకాలమందు మృత్యుతుల్య కష్టము సంప్రాప్తించేది. ఒకసారి గాయత్రీ ప్రశంస విని, దానిని తానుగా సాధన జేసినది. అప్పటినుండి ఆమెకు నాలుగు కాన్పులు సుఖవంతంగా జరిగినాయి.

ముల్తాన్ సుందరీబాయి స్వయంగా బలహీనురాలు. ఆమె కుమారులు గూడ బలహీనులే. అందులో ఎవరో ఒకరు వ్యాధిగ్రస్థులయ్యేవారు. తన బలహీనత, తన పిల్లల అనారోగ్యంవలన నామె విపరీతంగా బాధపడేది. ఈ కష్టాన్ని గాయత్రీ దేవి పోగొట్టినది. ఆమె సపరివారంగా స్వస్థత పొందినది.

'ఉదయపూర్‌కు చెందిన మార్వాడీ మహిళ జ్ఞానవతీ రూపము, రంగులో అధిక సుందరి కానందున ఆమె భర్త ప్రసన్నుడుగాలేడు. పతి ప్రవర్తన, వ్యవహారం ఎపుడూ రసహీనంగా, కర్కశంగా ఉపేక్షణాపూర్వకంగా ఉండేది. గృహంలో నున్నప్పటికి

పరిచయం లేని పరదేశీలుగా ఇద్దరిలో వేర్పాటు భావముండేది. జ్ఞానవతి పినతల్లి గాయత్రీ పూజ, రవి వార వ్రతం చేయవలసిన విధిని తెల్పినది. ఆమె తపశ్చర్య నిరర్ధకముగాలేదు. సాధికకు పతి ప్రేమ ప్రాప్తించినది. ఆమె దాంపత్య జీవనము సుఖమయమయినది.

"భల్‌వాడా" ప్రాంతంలో నొక సరమణీ నామము గలిగిన స్త్రీ బహు క్రూర తాంత్రికురాలు. అచట ప్రజలామెను ఢాకిని యని తలచెదరు. ఒక వయోవృద్ధ సన్యాసి ఆమెకు గాయత్రీ దీక్ష నిచ్చాడు. అప్పటినుండి ఆమె అన్నీ త్యజించి, భగవద్భక్తిలో మనస్సు లగ్నం చేసి, సాధు జీవనమును నెరపుతూ వున్నది.

'బహూరామ్‌పుర్ సమీపంలో నొక కుమారీ కన్య గుహను ఏర్పరచుకొని పది సంవత్సరములనుండి తపస్సు చేయుచున్నది. 40 సంవత్సరముల వయస్సులోగూడా ఆమె ముఖంలోని తేజస్సు కళ్ళకు మిరుమిట్లు గొల్పుతుంది. ఆమె దర్శనార్ధం దూర దూరములనుండి ప్రజలు వచ్చేవారు. ఈ దేవి యొక్క ఇష్టదైవము గాయత్రీ. ఆమె ఎల్లప్పుడూ గాయత్రీ జపం చేస్తూ వుండేది.

మీరాబాయి, సహజోబాయి, రంతివతీ, లీలావతి, దయాబాయి, అహల్యాబాయి, సక్కుబాయి, ముక్తాబాయి ప్రభుతి మొదలయినవారు ఈశ్వరభక్తితో వైరాగినులయ్యారు. వారి జీవనము విరక్తి భావంతోను, పరమార్థకతతోను నిండి వుండేది. ఇందులో ఎక్కువ మంది గాయత్రీ ఉపాసన గావించి తమ భక్తి భావాన్ని వైరాగ్యాన్ని పెంపొందించుకున్నారు.

ఈ విధంగా అనేకమంది నారీమణుల శ్రేష్ఠ సాధన వలన వారికి ఆధ్యాత్మికోన్నతి కలిగినది. మరియు సాంసారిక సుఖ సమృద్ధి, విపత్ పరంపరల నధిగమించుటలో ప్రసన్నతాపూర్వక అనుభవమును పొందినారు.

వైధవ్యాన్ని పొందిన సోదరీమణులకు గాయత్రీ సాధన సర్వ శ్రేష్ఠమైన తపశ్చర్య దీనివలన వారి మనోభావనలు శాంతి పొందుతాయి. ఇంద్రియ సంయమనము కలుగుతుంది. వియోగ శోకము నిర్మూలింపబడుతుంది. బుద్ధియందు సాత్వికత నెలకొంటుంది. మనస్సు,చిత్తము ఈశ్వరాయత్తమౌతుంది. నమ్రత, సేవ, శీలము, సదాచారము, నిరాలస్యత, సాధుజీవనం, ధర్మరుచి, స్వాధ్యాయప్రియత, ఆస్తికతలాంటి పరమార్ధ పరాయణతా తత్వము పెంపొందుతాయి.

గాయత్రీ సాధనా తపశ్చర్య నాశ్రయించి అనేక "బాల విధవలు" తమ తమ జీవితాలను సతీసాధ్వీల మాదిరిగా సుఖంగా గడిపారు. వీరి చిన్న వయస్సును గాంచి అనేక శంకలు కలుగుతాయి. ఆ సోదరీమణులు గాయత్రీ తన్మయతను అనుభవించినపుడు, వారి వైధవ్య దుఃఖమును విస్మరించుతారు. తాము తపస్విని యనియు, సాధ్వీ

యవియు, బ్రహ్మవాదిననియు, ఉజ్జ్వల చరిత్ర ననియు, పవిత్ర ఆత్మననే భావనానుభవాన్ని పొందుతారు. బ్రహ్మచర్యము వారి జీవన సహచరుడు (భర్త)గా వుంటుంది.

స్త్రీ, పురుషులు, నర, నారీమణులిద్దరూ, వేదమాత గాయత్రీ యొక్క పుత్రికా పుత్రులు. ఇద్దరూ గాయత్రీ నేత్రజ్యోతులు. ఆమె ఎవరినీ భేదభావంతో గమనించదు. తల్లికి పుత్రుని కంటే పుత్రికపై వాత్సల్యముమెండు. వేదమాత గాయత్రీ సాధన పురుషులకంటే స్త్రీలకు అధిక సులభము. అధిక శీఘ్ర ఫలదాయిని.

## స్త్రీలకు గాయత్రీ ఉపాసనకు అధికారము

భారతదేశంలో సదా స్త్రీలకు సముచితమైన గౌరవమున్నది. స్త్రీలు పురుషుల కంటె అధిక పవిత్రులనే భావించబడుతుంది.స్త్రీలను బహుధా (అనేకసార్లు) 'దేవీ' సంబోధనతో సంబోధిస్తారు. నామము చివర, పుట్టినప్పటినుండి దేవీ యని జోడిస్తారు. శాంతిదేవి, గంగాదేవి, దయాదేవి మొదలైన దేవీ శబ్దములతో కన్యల నామకరణము చేస్తారు. పురుషులు కొన్ని పరీక్షలు ఉత్తీర్ణులైన తరువాత వారి పేరు చివర బి.ఏ., శాస్త్రి, సాహిత్య రత్న ఇత్యాది వ్రాయునట్లుగా, స్త్రీలు తమ జన్మదత్తమైన, ఈశ్వర ప్రసాదమైన దేవీగుణములు, దేవీ విచారములు దివ్య విశేషతల కారణంగా అలంకృతులౌతారు.

దేవతలు, మహర్షులతోపాటు వారి అర్ధాంగినుల పేర్లు గూడా కలుపుతారు. సితారామ్, రాధేశ్యామ్, గౌరీశంకర్, లక్ష్మినారాయణ, ఉమామహేశ్వర, మాయాబ్రహ్మ, సావిత్రీ సత్యవంతుడు మొదలయిన నామములలో, నారీ ప్రథమంగాను, నరుడు ద్వితీయ స్థానంలో నుంటారు. పాతివ్రత్యములోను, దయ, కరుణ, సేవ, సహానుభూతి స్నేహము, వాత్సల్యము, ఉదారత, భక్తి భావనాది గుణములలో పురుషునికంటే స్త్రీ చాలా మిన్నగా వుంటుందని మేధావులందరూ అంగీకరించారు.

కావున ధార్మిక, ఆధ్యాత్మిక, ఈశ్వర ప్రాప్తికి సంబంధించిన యన్ని కార్యములలో స్త్రీలకు సర్వత్రా స్వాగతముంటుంది. అచట వారికి విశిష్ట స్థానమిచ్చి ప్రతిష్ఠాకరమైన గౌరవమివ్వబడినది. వేదములను పరిశీలించగా, వేదమంత్రద్రష్ట లేవిధంగా ఋషి పుంగవులో, అటులనే అనేక "ఋషిక" లు గూడా మంత్రద్రష్టలని స్పష్టమౌతుంది. ఈశ్వరీయజ్ఞానము వేదమహాత్ములకు విదితమైనది. వారు ఆమంత్రములను ప్రకటించారు. ఈవిధంగా ఎవరిద్వారా వేదము వెలువడినదో ఆమంత్రద్రష్టలను ఋషులన్నారు. ఋషులు కేవలం పురుషులే కాదు. స్త్రీలు గూడా నున్నారు. పరమేశ్వరుడు స్త్రీల అంతఃకరణములలో గూడా అదేవిధంగా వేదజ్ఞానమును ప్రకాశింపచేశాడు. ప్రభు

(భగవంతుడు) దృష్టిలో ఇద్దరూ సమాన సంతానమే. మహాదయాళువు, న్యాయమూర్తి, నిష్పక్ష ప్రభువు తన సంతానములో నరుడని నారీయని అనుచితంగా భేదభావమెటుల యేర్పరచగలడు?

ఋగ్వేదపు 10/85 సంపూర్ణ మంత్రముల "ఋషిక" సూర్యా సావిత్రీయై యున్నది. 'ఋషి' అనే పదమున కర్థము నిరుక్తములో (ఒక వేదాంగములో) ఈవిధంగా చెప్పబడినది - ఋషి ధర్మనాన్ స్తోమాన్ దదర్శతి। ఋషయో మంత్రద్రష్టారః" అర్థమేమనగా మంత్రద్రష్ట. ఆ మంత్ర రహస్యములను తెలుసుకొని ప్రచారము చేయువ్యక్తి ఋషి యగును.

ఋగ్వేదంలోని 'ఋషిక'ల యొక్క సూచీ బృహద్దేవతా 24వ అభ్యాసంలో ఈవిధంగా నున్నది-

ఘోషా గోధా విశ్వవారా, అపాలోపనిషన్నిత్।
బ్రహ్మజాయా జహూర్నామ అగస్త్యస్య స్వసాదితి। 54

ఇంద్రాణీ చేన్ద్రమాతాచ సరమా రోమశోర్వశీ।
లోపాముద్రా చనద్యశ్చ యమేనారీచశాశ్వతీ। 55

శ్రీర్లక్ష్మీః సార్పరాజ్ఞా వాక్‌శ్రద్ధా మేధాచ దక్షిణా।
రాత్రి సూర్యాచ సావిత్రీ బ్రహ్మవాదిన్యఈః రితః। 56

అర్థమేమనగా - ఘోషా, గోధా, విశ్వవారా, ఆపాలా, ఉపనిషత్తులు, జహు, అదితి, ఇంద్రాణీ సరమా, రోమశా, ఊర్వశి, లోపాముద్ర, యమీ, శాశ్వతీ, సూర్యా, సావిత్రీ మొదలైన వారందరు బ్రహ్మవాదినులు.

ఋగ్వేదంలో 10-134, 10-36,10-40, 10-61, 10-65, 10-107, 10-109, 10-154, 10-159, 5-29, 8-91 మొదలైన సూక్తములందు మంత్రద్రష్టలీ ఋషికలు.

పురుషుల మాదిరే స్త్రీలు గూడా యజ్ఞములు చేస్తారు, చేయిస్తారనడాని కీవిధంగా అనేక ప్రమాణాలున్నాయి. వారు యజ్ఞవిద్య, బ్రహ్మ విద్యలలో పారంగతులు. అనేకమంది నారీమణులు ఇందులో తమ తండ్రికీ, భర్తకు మార్గదర్శనము గావించారు.

తైత్తరేయ బ్రాహ్మణంలో "సోమ" ద్వారా "సీతా సావిత్రీ" ఋషికలకు మూడు వేదములు ప్రసాదించే వర్ణన విస్తారపూర్వకంగా వస్తుంది.

తంత్రయో వేదా అన్వసృజ్యంత అథహ సీతాం సావిత్రీ
సోమరాజన చక్రమే-యస్యాఉహత్రీన్ వేదాన్‌ప్రదదౌ।

ఏవిధముగా సోమ సీతా సావిత్రులకు మూడు వేదములొసగినాడో యీ మంత్రంలో చెప్పబడినది.

'మను' పుత్రిక "ఇడాను" వర్ణిస్తూ తైత్తిరీయంలో 21.14లో ఆమెను "యజ్ఞాన్ కాశిని" యని వచించారు. యజ్ఞాన్ కాశిని పదమునకర్థము "సాయణాచార్యులవారు" యజ్ఞతత్వాన్ని ప్రకాశింపజేయుటకు (ప్రకటించుటకు) సమర్థురాలని చేశారు. ఇడా తన తండ్రికి యజ్ఞ సంబంధమైన సలహా యిస్తూ ఈక్రింది విధముగా చెప్పినది.

సాఽబ్రవీదిడామనుమ్ । తథాబాఽ ఏం తవాగ్నిమాధాత్యామి ।
యథాప్రజిథాపశుభిర్మిథునై ర్జనిష్యసే । ప్రత్యస్మింలోకే స్థాస్యసి ।
అమిసువర్గలోకమ్ జేష్యసీతి । – తైత్తరీయ బ్రా 1/4

"ఇడా" మనువుతో చెప్పెను – నీ అగ్నిని నేనెటుల అవధానము జేసెద ననగా, దానితో మీకు పశువులు, భోగములు, ప్రతిష్ఠ, స్వర్గము ప్రాప్తించును.

ప్రాచీనకాలంలో స్త్రీలు గృహస్థాశ్రమములను నడిపేవారు. మరియు బ్రహ్మ పరాయణులు గూడా. ఈరెండూ తమ తమ కార్యక్షేత్రములలో నిర్వహించేవారు. గృహస్థాశ్రమములను నడిపేవారిని "సద్యోవధు" వులుగా చెప్పబడినారు. వేదాధ్యయనము, బ్రహ్మోపాసన మొదలైన పారమార్థిక కార్యములయందు ప్రవృత్తిగల స్త్రీలను బ్రహ్మ వాదినులుగా పేర్కొన్నారు. బ్రహ్మవాదిని, సద్యోవధువుల కార్యక్రమములు వేరుగానుండేవి. కాని వాటి మౌలిక ధర్మాధికారములలోనే మాత్రము అంతరము లేదు. గమనించండి :

ద్వివిధాస్త్రియో బ్రహ్మవాదిన్య సద్యోవధ్వశ్చ । తత్రబ్రహ్మవాదినీ
నాముప్యానామ్ । అగ్నింధన్ స్వగృహే భిక్షాచర్యాచ । సద్యోవధూనా
తూ పస్థతే వివాహేకాలే విదుపనయన కృత్వావివాహకార్యః ।
– హరీత ధర్మసూత్రము 12/20/24

బ్రహ్మవాదిని, మరియు సద్యోవధూ, యిద్దరూ స్త్రీలే. వీరిలో బ్రహ్మవాదిని యజ్ఞోపవీతము ధరించి, అగ్నిహోత్రము వేదాధ్యయనముతోపాటు స్వగృహంలో భిక్ష చేయును. సద్యోవధువులకు అప్పుడప్పుడు యజ్ఞోపవీతము అవసరమై యున్నది. ఆమె వివాహకాలమందున్నపుడు చేయింపబడుతుంది.

శతపథ బ్రాహ్మణములో యాజ్ఞవల్క్య ధర్మపత్ని మైత్రేయి బ్రహ్మవాదినిగా చెప్పబడినది.

తయోర్హమైత్రేయా బ్రహ్మవాదినీ భభూవః ।

అర్థము-మైత్రేయి బ్రహ్మవాదినియై యుండెను. బృహదారణ్యకోపనిషత్తును భాష్యమొనరించుచూ బ్రహ్మవాదినికర్థము. శ్రీ శంకరాచార్యులవారు "బ్రహ్మవాదనశీల" యని వ్రాశారు. బ్రహ్మకు అర్థము వేదము. బ్రహ్మవాదినికి అర్థము వేదప్రవచనము చేయు స్త్రీ.

ఒకవేళ బ్రహ్మకు అర్థము ఈశ్వరునిగా భావించినప్పటికీ వేదజ్ఞానము లేకుండ బ్రహ్మప్రాప్తి గలుగదు. అందువలన వేదము చదివిన వ్యక్తియే బ్రహ్మను తెలుసుకొనగలడు. గమనింపుడు.

నా వేదవిన్మనుతేతం వృహతమ్ । — తైత్తరీయ

ఏత వేదానువచనేన బ్రాహ్మణా వివిదషన్తి యజ్ఞేన దానేన తపసాఽ నాశకేన ।

— బృహదారణ్యక 4-4-22

ఏవిధంగా పురుషులు బ్రహ్మచారులుగానుండి, తపము, స్వాధ్యాయము, యోగముద్వారా బ్రహ్మప్రాప్తి నొందెదరో, అదేవిధంగా అనేక మంది స్త్రీలు బ్రహ్మచారిణులుగా నుండి ఆత్మ నిర్మాణముతోపాటు పరమార్థాన్ని సంప్రాప్తించు కొన్నారు.

పూర్వకాలంలో అనేక సుప్రసిద్ధ బ్రహ్మచారిణులున్నారు. వారి ప్రతిభ, విద్వత్తు, నలుదిక్కుల కీర్తి వ్యాపించినది. మహాభారతంలో నిటువంటి బ్రహ్మచారిణులనేకమంది వర్ణనీయబడినది.

భారద్వాజస్య దుహితా రూపేణాప్రతిమా భువి ।
శృతావతీ నామ విభోకుమారీ బ్రహ్మచారిణీ ।

— మహాభారతం శల్యపర్వం. 4-12

భారద్వాజునకు శృతావతీయను కుమార్తె కలదు. ఆమె బ్రహ్మచారిణి. కుమారియను శబ్దంతోపాటు బ్రహ్మచారిణీ యను శబ్దమును జోడించుటకు అర్థము, ఆమె అవివాహిత యనియూ, వేదాధ్యయనం జేయునదని.

అత్రైవ బ్రాహ్మణీ సిద్ధా కౌమారబ్రహ్మచారిణీ ।
యోగయుక్తా దివంమాతా, తపః, సిద్ధాః తపస్వినీ ।

— మహాభారతం శల్యపర్వం – 54/6

యోగ సిద్ధిని పొంది కుమారీగా నున్నపుడే వేదాధ్యయనం గావించే తపస్విని, 'సిద్ధా' యను పేరుగల బ్రాహ్మణికి ముక్తి ప్రాప్తించినది.

భభూవ శ్రీమతీరాజన్ శాండిల్యస్య మహాత్మనః ।
సుతా ధృతవ్రతా సాధ్వీ నియతాబ్రహ్మచారిణీ ।

సాధు తప్త్వా తపోఘోరే దుశ్చరం స్త్రీజనేన హ ।
గతాస్వర్గం మహాభాగా దేవబ్రాహ్మణో పూజితా ।

– మహాభారతం–శల్యపర్వం 54/8

మహాత్మా శాండిల్యుని పుత్రి శ్రీమతియై యుండెను. ఆమె వ్రతధారిణి. వేదాధ్యయనమందు నిరంతర ప్రవృత్తి గలిగినది. అత్యంత కఠిన తపస్సొనరించి ఆమె దేవబ్రాహ్మణ పూజితయైనది. స్వర్గప్రాప్తి పొందినది.

అత్రసిద్ధా శివానామ బ్రాహ్మణీ వేదపారగా ।
అధీత్య సకలాన్‌వేదాన్ లేభేసద్ దేహమక్షయమ్ ।

– మహాభారతం–ఉద్యోగపర్వం–180/18

'శివా' యను పేరుగల బ్రాహ్మణి వేదపారంగతురాలు. ఆమె అన్ని వేదముల నభ్యసించి మోక్షపదమును పొందినది.

మహాభారతంలోని శాంతిపర్వమందు 310 అధ్యాయములో "సులభా" పేరుగల బ్రహ్మవాదిని. సన్యాసిని యొక్క వర్ణన కలదు. ఆమె జనకమహారాజుతో శాస్త్రార్థము గావించినది. ఈ అధ్యాయంలో 82వ శ్లోకములో "సులభా" తన పరిచయము గావించుకొంటూ ఇటుల వచించినది.

ప్రవధానోనామ రాజర్షిర్వ్యక్తం తే శ్రోతమాగతః ।
కులే తస్య సముత్పన్నా సులభాం నామ విద్ధిమామ్ ।
సాహం తస్మిన్ కులేజాతాభర్తర్యసతి మద్విధే ।
వినీతా మోక్షధర్మేషు ధరామ్యేకా మునివ్రతమ్ ।

– మహాభారతం శాంతిపర్వం – 20

నేను సుప్రసిద్ధ క్షత్రియ కులములో నుద్భవించిన 'సులభా'ను. నాకు తగిన భర్త దొరకనందున నేను గురువులనుండి శాస్త్రాధ్యయనమును అభ్యసించాను. సన్యాసమును స్వీకరించాను.

పాండవపత్ని ద్రౌపది విద్వత్తును వర్ణిస్తూ, శ్రీ ఆచార్య ఆనందతీర్థుల వారు (మధ్వాచార్యులు) "మహాభారత నిర్ణయము"లో నిటుల ఉల్లేఖించారు.

వేదాశ్చాప్యుత్తమ స్త్రీభిః కృష్ణాద్యాభి రిహాఖిలః ।

అర్థము–ఉత్తమ స్త్రీలు కృష్ణ (ద్రౌపది) వలె వేదముల నభ్యసించవలె.

తే భ్యాదధాహ కన్యేద్వేవపునాంధారిణీ స్వధా ।
ఉభేతే బ్రహ్మవాదిన్యౌ, జ్ఞాన, విజ్ఞాన, పారగే । – భాగవతం–4/6/64

"స్వధా"కు, ఇరువురు పుత్రికలు కలిగినారు. వారి నామములు 'వవునా' మరియు "ధారిణీ". వారిద్దరూ జ్ఞాన, విజ్ఞాన, పారంగతులు. అటులనే బ్రహ్మవాదినులు గూడా.

విష్ణుపురాణంలో 1/10 మరియు 18/19; ఈవిధంగానే మార్కండేయ పురాణం అ. 52లో గూడా బ్రహ్మవాదినులు, (వేద, బ్రహ్మలనుపదేశించే) మహిళల వర్ణన యున్నది.

సతతం మూర్తిమంతశ్చ వేదశ్చత్వార ఏవచ।
సన్తి యశ్యాశ్చ జిహ్వాగ్రేయాచ వేదవతీస్మృతా।

**– బ్రహ్మ. వై. ప్రకృతఖండము 14/95**

వారికి చతుర్వేదములు కంఠాగ్రములోనున్నవి. అందువలననే వారిని 'వేదవతీ' యనియెదరు.

ఈ ప్రకారముగా నైష్ఠిక బ్రహ్మచారిణులు, బ్రహ్మవాదినులు, నారీమణులలో అగణితంగా యుండిరి. ఇందుకు భిన్నముగా, అదనంగా, గృహస్థాశ్రమములో ప్రవేశించు కన్యలు, దీర్ఘకాలము బ్రహ్మచారిణులుగా నుండి, వేదశాస్త్ర పరిజ్ఞానము ప్రాప్తించిన తదుపరి వివాహము గావించుకొనేవారు. అపుడే వారి సంతానము ప్రపంచంలో ఉజ్జ్వల నక్షత్రముల మాదిరి యశస్సు, పురుషార్థములు, (ధర్మ, అర్థ, కామ మోక్షములు) కీర్తిని సంతరించుకొనేవారు. కన్యలు బ్రహ్మచారిణులుగా నున్న తదుపరియే వివాహమాడవలెనని ధర్మగ్రంథముల స్పష్టమైన ఆదేశము.

బ్రహ్మచర్యేణ కన్యాయువాన్ విన్దతేపతిమ్। **– అథర్వణవేదం–11/6/12**

అర్థము : కన్య బ్రహ్మచర్యానుష్ఠానము గావించుతూ దాని ద్వారా అర్హమైన పతిని పొందును.

బ్రహ్మచర్యం కేవలం అవివాహితులుగా నుండేటందుకు మాత్రమే చెప్పలేదు. సంయమపూర్వకంగా వేదప్రాప్తిని పొందుటలో ఎవడు నిమగ్నుడౌతాడో, ఆతడే బ్రహ్మచారి. గమనించండి–

స్వీకరోతి యదావేదం, చరేద్ వేదవ్రతానివ।
బ్రహ్మచారీ భవేత్తా వత్ ఉర్ధ్వస్నాతీ గృహీభవేత్। **– దక్షస్మృతి**

వేదమును అర్థసహితంగా చదివినపుడు మరియు వేదము కొరకు వ్రతమొనరించినపుడు, బ్రహ్మచారి యని చెప్పబడును. దాని తదుపరి విద్వాంసుడై గృహస్థాశ్రమము నందు ప్రవేశించునని అర్థము.

అధర్వణ వేదమందు 21/7/17 ను వ్యాఖ్యానించుతూ సాయణాచార్యుల వారు ఈవిధంగా వ్రాశారు.

బ్రహ్మ చర్యేణ బ్రహ్మవేదః తదధ్యయనార్థమాచర్యమ్ ।

అర్థము-బ్రహ్మ. వేద, అర్థము ఆవేదమును అధ్యయనము చేయుటకొరకెవరు ప్రయత్నించుదురో వారు బ్రహ్మచారులు. ఈసూక్తంలోని ప్రథమ మంత్రానికి తన వ్యాఖ్యలో సాయణాచార్యులవారిలా వ్రాశారు.

బ్రహ్మణి వేద్యోక్తైర్వేతవ్యే వాచరితుం శీలస్య తథోక్తః ।

ఎవరు వేదాధ్యయనమందు విశేషంగా సంలగ్నమానసులౌతారో, వారే బ్రహ్మచారి యని యర్థము.

మహర్షి గార్గాయణాచార్యులవారు ప్రణవవాదములో నిట్టుల నుడివినారు.

బ్రహ్మచారిణాం చ బ్రహ్మచారిణిభిః సహవివాహ ప్రశస్యోభవతి ।

అర్థమేమనగా-బ్రహ్మచారుల వివాహము బ్రహ్మచారిణులతో జరుగుట ఉచితము. ఏలనన జ్ఞానము మరియు విద్య మొదలైన వాటి దృష్టికోణము నుండి సమానులయినందున వారు సుఖులు, సంతుష్టులుగ నుండెదరు. మహాభారతంలో గూడ యీ భావము బలపరచబడినది.

యయోరేవ సమంవిత్తం యయోరేవ సమంశృతమ్ ।

తయోర్మైత్రీ వివాహశ్చ నతుపుష్ట విపుష్టయోః । – మహాభారతం 1/131/10

ఎవరి ధనము, జ్ఞానము సమానంగా నుంటుందో, వారితో మిత్రత్వము వివాహము ఉచితము. న్యూనాధికము (ఎక్కువ, తక్కువ) లుండవు.

ఋగ్వేదం 1/1/5ను భాష్యముజేస్తూ మహర్షి దయానందులవారిలా వ్రాశారు -

యాః కన్యా యావచ్చతుర్వింశతివర్షమాయుస్తావద్ బ్రహ్మచర్యేణ జితేంద్రియ తథా సాంగోపాంగ వేదవిద్యా అధీయతే తా మనుష్యజాతి భషికా భవంతి ।

అర్థమేమనగా – ఏ కన్య అయినా 24 సం॥ వయస్సు వరకు బ్రహ్మచారిణిగా నుండి వేదవిద్యను సాంగోపాంగంగా అభ్యసించినయెడల, ఆ కన్య మనుష్యజాతిని శోభింప జేస్తుంది.

ఋగ్వేదం – 5/6/2/11 భాష్యంలో మహర్షి ఇట్లు వ్రాశారు –

బ్రహ్మచారిణీ ప్రసిద్ధింకీర్తిం సత్పురుష సుశీలం శుభగుణరూప సమన్వితం ప్రీతిమంతం పతిగ్రహీతు మిచ్ఛేత్ తదైవ బ్రహ్మచర్యాపిస్య సదృశీమేవ బ్రహ్మచారిణీ స్త్రియం గ్రహణీయత్ ।

అర్థము - బ్రహ్మచారిణియమైన స్త్రీ కీర్తివంతుడు, సౌశీల్యుడు, సత్పురుషుడు, గుణవంతుడు, రూపవంతుడు, ప్రేమస్వభావుడైన పతిని వాంఛించుగాక. అటులనే బ్రహ్మచారి తనకు సమానురాలయిన (వేదమును, ఈశ్వరుని తెలిసికొనిన) స్త్రీ నే భార్యగా గ్రహించుగాక.

విద్యార్ధ్యయనము గావించుటకొరకు ఎపుడు స్త్రీలకు పురుషులవలె అవకాశమిచ్చెదరో, అపుడు ఈదేశంలో స్త్రీలు గార్గీ, మైత్రేయీల వలె విదుషీమణులవుతారు. యాజ్ఞవల్క్యునివంటి ఋషినే ఒకసారి గార్గీ శాస్త్రార్థములో విచలితుని జేసినది. ఆ ఋషి అలసిపోయి. నిస్పృహయుడై ఆమెను బెదిరించుతూ ఇలా అన్నారు -

**"అధికంగా ప్రశ్నించకు. లేనియెడల నీకు అమంగళము (అకల్యాణము) జరుగుతుంది".**

ఈవిధంగానే ఆచార్య శంకరులు భారతీదేవితో శాస్త్రార్థము జరుపవలసి వచ్చినది. ఆ భారతీదేవి నామము గల వనిత శంకరాచార్యుల వారితో జరిపిన అద్భుత శాస్త్రార్థము మహాత్ములయిన విద్వాంసులను గూడా ఆశ్చర్య జనితులను గావించినది. ఆమె ప్రశ్నలకు సమాధానమిచ్చుటకు శంకరులవారు నిరుత్తరులై ఒక మాసము గడువు కోరవలసి వచ్చెను. శంకర దిగ్విజయంలో భారతీదేవిని గురించి ఇలా వ్రాయబడినది.

సర్వాణి శాస్త్రాణి షడంగవేదాన్
కావ్యాదికాన్ వేత్తి పరంచ సర్వమ్ ।

తన్నాస్తి నోవేత్తి యదత్రబాలా
తస్మాద్ భూచ్చిత్ర పదజనానామ్ । — శంకర దిగ్విజయము 3/16

భారతీదేవి సర్వశాస్త్రములనూ, వాటి అంగముల సహితంగా సర్వ వేదములనూ తెలిసిన స్త్రీ, ఆమెను మించిన శ్రేష్ఠులెవ్వరూ లేరు.

ఈరోజున స్త్రీలను శాస్త్రాధ్యయనము చేయకుండా నిరోధించుచున్నారు. ఆరోజులలో ప్రస్తుతమున్న ప్రతిబంధమున్న యెడల యాజ్ఞవల్క్యుని, శంకరులవారిని పోటీ చేయగల స్త్రీలెలా ఉండగలిగారు? ప్రాచీనకాలంలో అధ్యయనం చెయ్యడం నరనారులిద్దరకు సమానావకాశములుండేవి.

స్త్రీలు యజ్ఞబ్రహ్మలుగా నున్నారనుటకు ఉపాధ్యాయులుగాను, ఆచార్యులుగా నుండేవారనుటకు ప్రమాణాలున్నాయి. ఋగ్వేదంలో స్త్రీలను సంబోధిస్తూ, నీవు ఉత్తమ ఆచరణ ద్వారా బ్రహ్మపదమును పొందగలవు. అని చెప్పబడినది.

అధఃపశ్యశ్వ భోపారం సన్తరాం పాదకౌ హర।
మాతే కశ్లకౌ ద్రుశన్ స్త్రీహి బ్రహ్మ విభూంవిథ। – ఋగ్వేదం 8/33/19

అర్థము – ఓ నారీ! నీవు నృత్యము తిలకించి వెళ్ళుము. వ్యర్థముగా వివిధ ప్రదేశములలోనున్న వస్తువులను జూచుచుండవద్దు. నీ పాదములను సభ్యత ననుసరించి సావధానంగా నుంచుకొనుము. అఙ్గాంగములు బహిర్గతము గాకుండా వస్త్రధారణ జేయుము. ఉచితమైన ఆచరణ యీవిధంగా జేసిన నీవు నిశ్చయంగా బ్రహ్మ పదవిని పొందుటకు యోగ్యురాలగుదువు.

మనకిపుడు బ్రహ్మపదవి ఎంత ఉన్నతమైనదో తెలియవలె. దానని పొందుటకే అర్హతకలిగి యుండవలె.

బ్రహ్మ వా ఋత్విజా మ్భిషక్తమః। – శతపథ 1/7/4/19

అర్థము – బ్రహ్మ ఋత్విజుల, సంశయములను పోగొట్టును. లోపములను సరిదిద్దును. అందువలన పురోహితులందరికన్నా మిన్న.

యశ్చాద్యో బ్రహ్మనిష్ఠః తస్మాత్ తంబ్రహ్మ చ కుర్వీత్।
– గోపథ ఉత్తరార్థము 1/3

అర్థము – ఎవరు అందరికన్నా అధిక బ్రహ్మనిష్ఠుడో (పరమేశ్వరుని మరియు వేదముల తెలిసికొన్నాడో) ఆయననే బ్రహ్మగా నియమించవలె.

అధకేన బ్రహ్మత్వం క్రియతే ఇతిత్రయ్యా విద్యయేతి। – ఐతరేయ 5/33

జ్ఞాన, కర్మ, ఉపాసనా, త్రివిద్యలనెరిగి వేదములను పరిపూర్ణముగా తెలిసికొనిన మనుష్యుడే బ్రహ్మ కాగలడు.

అధకేన బ్రహ్మత్వం క్రియతే ఇత్యనయా
త్రయ్యా విద్యయేతి హ బ్రూయాత। – శతపత 11/5/57

వేదముల పరిపూర్ణ జ్ఞానము (త్రివిధ విద్యలు) వలననే మనుష్యుడు బ్రహ్మపదవీ యోగ్యతను బడయగలడు.

వ్యాకరణ శాస్త్రమునందు కతిపయ స్థలములందుల్లేఖింపబడినందున, వేదాధ్యయనము, అధ్యాపనము స్త్రీకార్య క్షేత్రములుగానున్నవని తెలియుచున్నది. గమనించండి

"ఉడంచ" 3/3/21 యొక్క మహాభాష్యము వ్రాయబడినది –

" ఉపే త్యా ధీయతేఆస్యా ఉపాధ్యాయీ ఉపాధ్యాయ"

అర్థమేమన - ఎవరివద్ద చేరి కన్యలు వేదభాగముగాని, వేదాంగములనుగాని అధ్యయనము చేయుదురో, వారు ఉపాధ్యాయిని, ఉపాధ్యాయీ యని చెప్ప బడెదరు.

"మనువు" గూడా ఉపాధ్యాయ లక్షణములనే యని వచించారు.

ఏకదేశంతు వేదస్య వేదాంగాన్యపి వా పునః

యోఽధ్యాప యతిశ్వృత్యర్థం ఉపాధ్యాయః స ఉచ్యతే ।  2/94 9

వేదముయొక్క ఒక భాగముగాని లేక వేదాంగములను చదివినయెడల అతడు లేక ఆమె "ఉపాధ్యాయ" యన బడెదరు. మరియూ

ఆచార్యాదణత్వం ।  - అష్టధ్యాయి 4/3/2/49

ఈ సూత్రముపై సిద్ధాంతకౌముదిలో నిటుల జెప్పబడినది -

ఆచార్యస్త్రీ ఆచార్యాణీ పుంయోగ ఇత్యేవ ఆచార్యస్యయం వ్యాఖ్యాయీ

అర్థము - స్త్రీ వేదములకు ప్రవచనము జేయుచున్నందున ఆచార్య అనబడుచున్నది.

ఆచార్య లక్షణములను మనువు ఇలా వచించారు -

ఉపనీయతు యః శిష్య వేదమధ్యాపయేద్ ద్విజః ।
సంకల్పం సరహస్యంచ తమాచార్య ప్రచక్షతే ।

శిష్యునకు యజ్ఞోపవీత సంస్కారము గావించి కల్పసహిత, రహస్యసహిత వేదమువెవరు నేర్పెదరో వారిని ఆచార్యుడనెదరు.

స్వర్గీయ మహా మహోపాధ్యాయ పండిత శివదత్త శర్మగారు "సిద్ధాంతకౌముది"కి సంపాదకీయంవ్రాస్తూ దీనిని గూర్చి మహత్వపూర్ణ టిప్పణి (విశ్లేషణ పూర్వక అర్థసహిత వ్యాఖ్య) వ్రాశారు.

ఇతి వ వనేనాపి స్త్రీణాం వేదాధ్యయనాధికారో ధ్వనితః ।

అర్థమేమనగా - దీనివలన స్త్రీలకు వేదాధ్యయనము గావించుట కధికారమున్నదని విదితమౌతుంది.

పైన చెప్పబడిన ప్రమాణములను పరిశీలించిన పాఠకుడు స్త్రీలకు గాయత్రీ ఉపాసన చేయుట కధికార మున్నదా? ఉచితమా కాదా? అని ఆలోచించుగాక.

# స్త్రీలకు వేదాధి కారము లేదా?

గాయత్రీ మంత్రోపాసన గావించుటకు స్త్రీలకధికారమున్నదా? లేదా? ఇది స్వతంత్రమైన ప్రశ్నయేగాదు ఇందుకు ప్రత్యేకంగా స్త్రీలు గాయత్రి జపించవలెననిగాని జపించగూడదనిగాని విధి, నిషేధములెచ్చటను లేవు. స్త్రీలకు వేదాధికారము లేదని చెప్పడంవలన ఈ ప్రశ్న ఉద్భవిస్తుంది. ఏలనన గాయత్రి గూడా వేదమంత్రమే. అందువలన ఇతర మంత్రములవలె దీనిని ఉచ్ఛరించుటకు గూడా అధికారము లేకుండవలె.

స్త్రీలకు వేదాధికారము లేదను నిబంధన వేదములలో లేదు. వేదములలోని ప్రత్యేక మంత్రములు స్త్రీలద్వారా ఉచ్ఛరింపబడతాయి. ఆ మంత్రములో స్త్రీలింగ క్రియలున్నవి ఆ మంత్రములు స్త్రీలే ప్రయోగించవలె అనునది స్పష్టమగుచున్నది. గమనించండి.

ఉదసౌ సూర్యోఅగాద్ ఉదయం మామకో భగః అహ.
తద్విద బలా పతిమభ్యసాక్షి విషా సహి ।
అహం కేతురహ మూర్ధాహముగ్రా వివాచనీ
మమేదను కృతుంపతిః సేహాజ్యాయా ఉపాచరేత్ ।
మమపుత్ర శత్రుహణోధే ఒమేదుహితా విరాట్ ।
ఉతాహ మస్మిజం జయాపత్యా మేశ్లోక ఉత్తమః ।

**– ఋగ్వేదము 10/129/2/3**

అర్థము – సూర్యోదయంతోపాటు నా సౌభాగ్యముగూడా పెంపొందుగాక. నేను పతిదేవుని పొందెదను గాక. నేను వేదమువలన తేజస్విననై, ప్రతిభాశాలినైన శక్తినగుదునుగాక. నా పతిదేవుడు నా ఇచ్ఛానుసారము జ్ఞాన, కర్మలలో అనుకూల కార్యములొనరించుగాక. నా పుత్రుడు అంతరబహిర్ శత్రువులను నశింపజేయుగాక. నా పుత్రిక తన సద్గుణముల చే ప్రకాశించుగాక. నేను ఆచరించు కర్మలవలన నా పతిదేవుని ఉజ్జ్వల యశస్సు అభివృద్ధి పొందుగాక.

త్ర్యంబకం యజామహే సుగన్ధిం పతివేదనమ్
ఉర్వారుకమివ బంధనాదితో ముక్షీయ మాముత । **– యజుర్వేదము 3/60**

అర్థము – మేము కన్యలము. ఉత్తమ భర్తను ప్రసాదించు పరమాత్మను యజ్ఞము చేయుచున్నాము. ఈ యజ్ఞము మమ్ములను పితృవంశము నుండి విముక్తిజేయుగాక. పతి వంశమునుండి వినియోగ మెప్పుడూ కలుగకుండుగాక.

ఆశాసాస్తం సౌమనసం ప్రజాం సౌభాగ్యరథిమ్,

అగ్ని రనువ్రతా భూత్వాసన్నాహ్యే సుకృతాయకమ్ ।

వధువు ఇలా అంటుంది - నేను యజ్ఞాది శుభ అనుష్ఠానములకై శుభ్రమైన వస్త్రములను ధరించెదను. సదా సౌభాగ్యముకొరకు ఆనంద, ధన, సంతానములకై వాంఛించుతూ ప్రసన్నురాలిగా నుండెదను.

వేదో౽ సవిత్తరసి వేదసేత్వా వేదోమెవిన్ద విదేయ ।

ధృతవన్తం కులాయినం రాయస్పోషం సహస్రిణమ్ ।

వేదోవాజం దదాతుమే వేదోవీరం దదాతుమే । **– కాఠక సంహిత 5/4/13**

తమరు వేదములే. అన్ని శ్రేష్ఠగుణములు, ఐశ్వర్యమును ప్రసాదించువాడవు. జ్ఞాన లాభముల కొరకు తమకు ఎక్కువ ప్రాప్తించునటుల జేయగలను. వేదము నన్ను, తేజస్వి వంశములో శ్రేష్ఠముగా నుండి, ఐశ్వర్యము వృద్ధి పొందింపగల జ్ఞానము నిచ్చుగాక. వేదము నాకు వీరశ్రేష్ఠ సంతానము నొసగుగాక.

వివాహ సమయములో వర వధువులిద్దరూ కలిసి ఉచ్చరించు మంత్రము -

సమజ్ఞన్తు విశ్వదేవాః సమాపో హృదయానినౌ

సం మాతారిశ్వాసంధాతా సముద్రోష్టా దధాతునౌ ।

**– ఋగ్వేదము 10/85/47**

అర్థాత్ - మనమిద్దరము హృదయ జలము మాదిరి పరస్పరము ప్రేమపూర్వకంగా కలిసి వుంటామని, విద్వాంసులందరు ఇచట తెలియగలరు. విశ్వ నియంత పరమాత్మ విదుషీమణులైన, దేవీసమూహము, మనిద్దరి ప్రేమ స్థిరముగా నుండుటకు సహాయ పడుదురుగాక.

స్త్రీల ముఖముల నుండి వేదమంత్రము లుచ్చరించుట కసంఖ్యాక ఉదాహరణ ప్రమాణములు గలవు. శతపథ బ్రాహ్మణము 14/14/16లో పత్నీ ద్వారా యజుర్వేదపు 33/17వ మంత్రము "తన్టమస్తస్యా మయేమ". ఈ మంత్రమును పతిద్వారా ఉచ్చారణ జేయించుటకొకవిధానమున్నది.

శతపథంలో 1/9/2/2/1, అటులనే 1/9/2/22/23 లో స్త్రీలద్వారా యజుర్వేదపు 13/13/15, 17, 19.మంత్రముల నుచ్చరించవలెనని ఆదేశమున్నది.

తైత్తిరీయ సంహితలోని 1/1/10 'సుప్రజసస్త్వే వయం' మొదలైన మంత్రము స్త్రీలతో జెప్పించ వలెనని ఆదేశమున్నది.

కాఠక గృహసూత్రములు 3/2/30 మరియు 29/3 లో స్త్రీలకొరకు వేదోధ్యయన మంత్రోచ్ఛారణ, వైదిక కర్మకాండ జేయుటకు ప్రతిపాదింపబడినది. లౌగాక్షి గృహ సూత్రములలో 15వ ఖండికలో గూడా ఇదే ప్రమాణమున్నది.

పారస్కర్‌గృహసూత్రము 1/5/1/2 ననుసరించి వివాహ సమయంలో లాజాహోమ మంత్రములను స్వయంగా కన్య చదువుతంది. గవాక్ష దర్శనమపుడు కూడా ఆమె యజుర్వేద మంత్రములు 39/24, "తత్‌చక్షుర్దేవహిత" అని స్వయంగా ఉచ్ఛరించుతుంది. వివాహ సమయంలో "సమజ్జనము" చేయునపుడు వధూవరులిద్దరూ స్వయంగా" "అర్థియినౌ సమజ్జయతి" అను ఋగ్వేద 10/85 వ మంత్రము చదివెదరు.

తాండయ బ్రాహ్మణము 5/6/8, యుద్ధములో స్త్రీలు వీణలపై సామవేద మంత్రమును గానము చేయవలెనని ఆదేశింపబడినది. అటులనే 5/9/15 లో స్త్రీలు కలశములనెత్తుకుని నివేద మంత్రములను పఠించుతూ ప్రదక్షిణజేయు విధానమున్నది.

ఐతరేయం 5/5/29 లో కుమారి గంధర్వగృహితా ఉపఖ్యానమున్నది. అందులో కన్యకు యజ్ఞమొనరించుటకు, వేదాధికారమును స్పష్టముగానీయబడినది.

కాత్యాయన శ్రౌతసూత్రములు1/17, 4/7/22, 10/13, 9/93, 16/4/13, అటులనే 27/7/28, 29, 7/1,20/6/12, 12 లలో స్పష్టంగా వేదమంత్రములను స్త్రీలు పఠించవలెనని చెప్పబడినది.

లాట్యాయన శ్రౌతసూత్రములలో పత్ని ద్వారా సస్వర సామవేదమును గానము చేయించే విధానమున్నది.

సాంఖ్యాయన శ్రౌత సూత్రములు 1/12/13, ఆశ్వలాయనశ్రౌత సూత్రములు 1/11/1 లో ఈ విధంగా వేదమంత్రములకాదేశమున్నది. మంత్ర బ్రాహ్మణంలో 1/2/3 లో వేదమంత్రములను కన్యద్వారా ఉచ్ఛరింపజేయ వలెనని ఆజ్ఞ యున్నది.

వధువు వేదపారాయణము జేయవలెనని, క్రిందనీయబడిన కొన్ని మంత్రములు స్పష్టమైన ఆదేశము నిచ్చుచున్నవి.

బ్రహ్మపరం యుజ్యతాంబ్రహ్మపూర్వ బ్రహ్మాన్తతో, మధ్యతో
బ్రహ్మసర్వతః అనావ్యాధాందేవ పురాంప్రపద్య శివాస్యోనా పతిలోకేవిరాజ ।

**— అథర్వణవేదము 14/1/64**

హే వధూ! నీ ముందు, వెనుక, మధ్య, చివరలలో సర్వత్ర వేదవిషయ జ్ఞానముండుగాక. వేద జ్ఞానమును బడసి, తదనుసారంగా నీ జీవితమును గడుపుదువు గాక మంగళమయివై, సుఖదాయినివై, స్వస్థురాలివై పతి గృహమందు విరాజిల్లి నీ సద్గుణములతో ప్రకాశించెదవు.

కులాయిని ఘృతవతీ పురంధ్రిః స్యోమేసీదసదనే ।
పృధివ్యాః । అభిత్వారుద్రా వసవో గృణన్తు ఇమా ।
బ్రహ్మపిపిహో సౌభగాయ అశ్వినాధ్వయం సాదయతా మిహిత్వా

– యజుర్వేదము 13/2

హే స్త్రీ ! నీవు శ్రేష్టమైన ఘృతాదులతో, పౌష్టిక పదార్థములను తగిన రీతిలో ఉపయోగించుదానివై, తేజస్వినివై, బుద్ధిమతివై, సత్కర్మానుష్ఠాన మొనరించుతూ సుఖవంతురాలౌదువుగాక, నీవు సద్గుణవతివై, విదుషీమణివై వాటివలన రుద్ర, వసువులు గూడ నిన్ను ప్రశంసించెదరుగాక, సౌభాగ్యము కొరకే వేదమంత్రామృతమును పదే పదే సువిధముగా గ్రోలుము. విద్వాంసులు నీకు బోధించి, ఉన్నతమైన ప్రతిష్ఠను పొందుదురు గాక.

యజ్ఞము లేక వేదమంత్రములు లేవని విదితమౌతుంది. యజ్ఞంలో పతి పత్నులిద్దరు కలిసి యుండుట అవశ్యకము. సీతా సాధ్వి లేనందున రామచంద్రులవారు స్వర్ణ సీతనుంచి యజ్ఞము గావించారు. బ్రహ్మ గూడా సావిత్రి లేనపుడు ద్వితీయ భార్యను గ్రహించవలసి వచ్చినది. ఏలనన యజ్ఞ పరిసమాప్తి కొరకు పత్ని అవసరము. స్త్రీ యజ్ఞము చేస్తున్నందున, ఆమెకు వేదాధికారము లేదనెటుల జెప్పబడినది ? .......... గమనించండి –

యజ్ఞో వా ఏష యోఽపత్నీకః । – తైత్తరీయ సంహిత 2/2/2/6

అంటే పత్ని లేకుండా యజ్ఞము లేదు.

అథో అర్థో వా ఏష ఆత్మనః యత్ పత్నీ । – తైత్తరీయ సంహిత 3/3/5/5

అర్థము – పత్ని పతి యొక్క అర్థాంగి అందువలన ఆమె లేకుండా యజ్ఞము సంపూర్ణముగాదు.

యాం దాంపత్తి సమనసా సునుత ఆ వధావతః ।
దేవాసో నిత్యయా శిరా । – ఋగ్వేదము 8/3/15

హే విద్వాంసులారా! దంపతులు ఏకమనస్కులై యజ్ఞమాచరించుతారు. మరియు ఈశ్వరోపాసన గావించుతారు !

వీత్వాతతస్రో మిధునా అవస్యవః యద్
గవ్యన్తా ద్వాజనాసమూహాసి । – ఋగ్వేదము 2/19/6

హే పరమాత్మా! నీ నిమిత్తమై యజమాని పత్నీ సమేతంగా యజ్ఞముజేయు చున్నాడు. వారికి స్వర్గ ప్రాప్తిని ప్రసాదించుచున్నావు. అందువలన వారు కలసి యజ్ఞము జేయుచున్నారు.

అగ్నిహోత్రస్య శుశ్రూణా సంధ్యోపాసన మేవచ

కార్యంపత్న్యా ప్రతిదినం బలికర్మ చనై త్యికమ్ । — స్మృతి రత్న

పత్ని ప్రతిదినము అగ్నిహోత్రము, సంధ్యోపాసన, బలివైశ్య మొదలైన నిత్యకర్మ లొనరించుగాక.

ఒకవేళ పురుషుడు లేనపుడుగూడా ఒంటరిగా స్త్రీ యజ్ఞమాచరించుటకు అధికారి. వీక్షింపుడు –

హోమేకర్తారః స్వస్యా సంభవో పత్న్యాదయః । — గదాధరాచార్య

హోమమాచరించుటకు ప్రథమంగా యజమానునకు స్థానమున్నది. అతడు లేని సమయంలో దారా (భార్య) పుత్రాదులు చేయుదురు గాక.

పత్నీ కుమారః పుత్రీవాశిష్యోవాఽపి యథాక్రమమ్ ।

పూర్వ పూర్వస్యచాభావే విద్యధ్యాదుత్తరోత్తరః । — ప్రయోగరత్నస్మృతి

యజమానః ప్రధానస్యాత్ పత్నీంపుత్రస్య కన్యయా ।

ఋత్విక్ శిష్యో గురుర్భ్రాతా భాగినేయః సుతాపతిః । — స్మృత్యర్థ సారము

పై నుదహరించబడిన రెండు శ్లోకములలో భావార్థమేమనగా – హవన (యజ్ఞ) సమయంలో యజమాని ఏ కారణము చేతనైనా హాజరు కాలేనపుడు అతని పత్నీ, పుత్రుడు, కుమార్తె, శిష్యుడు, గురువు, సోదరుడు వరుసక్రమంలో ఎవరైనా ఒకరు ఆ హవనమునా చరించవచ్చు.

ఆహురప్యుత్తమ స్త్రీణామ్ అధికారం తు వైదికే ।

యథోర్వశీ యమీచైవశచ్యాద్యాశ్చ తథాపరం । — వ్యోమ సంహిత

ఊర్వశీ, యమీ, శచీ మొదలైన ఋషికలకు ప్రాప్తించిన వేదాధ్యయనము, వైదిక కర్మకాండనాచరించుటయనే అర్హతలు, శ్రేష్ఠ స్త్రీలకు గూడా నున్నవి.

అగ్నిహోత్రస్య శుశ్రూణా సంధ్యోపాసనమేవచ । — స్మృతిరత్న

ఈ శ్లోకంలో స్త్రీలకు యజ్ఞోపవీతము, సంధ్యోపాసనకు ప్రత్యక్ష విధానమున్నది.

యాస్త్రీ భర్తా వియుక్తాపి స్వాచారే సంయుతాశుభ ।

సా చ మన్త్రాన్ ప్ర గృహ్ణాతు స భర్త్రీ తదనుజ్ఞయా ।

— భవిష్యత్ పురాణం, ఉత్తర పర్వము 4/23/62/63

ఉత్తమ ఆచరణ గలిగిన విధవస్త్రీ వేదమంత్రములను గ్రహించుగాక. సధవయైన స్త్రీ పతి అనుమతితో వేదమంత్రములను గ్రహించుగాక.

యథాధికారః శ్రౌతేషు యోషితాం కర్మ శుశ్రుతః।
ఏవమేవాను మన్యస్వబ్రహ్మాణి బ్రహ్మవాదితామ్ । **– యమస్మృతి**

స్త్రీలకు వేదకార్యాధికారమేవిధంగా కలదో, అదేవిధంగా బ్రహ్మవిద్య నభ్యసించుటకు గూడా నధికారము గలదు.

కాత్యాయనీచ మైత్రేయి గార్గీ వాచక్నవీ తథా ।
ఏవమాహ్య విదుర్బ్రహ్మ తస్మాత్ స్త్రీ బ్రహ్మవిద్ భవేత్ ।

**– అన్యవామీయ భాష్యము**

కాత్యాయనీ, మైత్రీయీ, వాచక్నవీ, గార్గి మొదలయిన వారెలా బ్రహ్మను (వేదమును, ఈశ్వరుని) తెలుసుకున్నారో, అటులనే అందరు స్త్రీలు బ్రహ్మజ్ఞానమును పొందవలె.

వాల్మీకి రామాయణంలో, కౌసల్య, కైకేయి, సీత, తార మొదలైన నారీమణుల ద్వారా వేదమంత్రములను ఉచ్ఛరింపజేయుట, అగ్నిహోత్రము, సంధ్యోపాసన మొదలైన వర్ణనలు వస్తాయి.

సంధ్యాకాలే మనః శ్యామాధ్రువమేష్యతి జానకీ ।
నదీచేమాం శుభజలాం సంధ్యార్థేవరవర్ణినీ ।

**– వాల్మీకి రామాయణము 5/15/47**

సంధ్యాసమయమునకు సీత ఈ ఉత్తమ జలపూరిత నదీతటమునకు సంధ్యార్థమై తప్పక వస్తుంది.

వైదేహీ శోకసంతప్తా హుతాశనముపా గతా । **–సుందరకాండ (వాల్మీకి) 53/23**

అర్థము : అపుడు శోక సంతప్తయైన సీత హవన మొనరించినది.

తదాసుమన్త్రం మంత్రజ్ఞ కైకేయీ ప్రత్యువాచహ ।

వేదమన్త్రములు దెలిసిన కైకేయి సుమన్తునితో పలికినది.

సాక్షౌభవసనా హృష్టా, నిత్య వ్రతపరాయణా
అగ్నిహోత్రిర్జుస్త్రీ తదామన్త్ర విత్కృత మంగళా ।

**– వాల్మీకి రామాయణము 4/20/22**

వేదమంత్రములను తెలిసినది. వ్రతపరాయణి, ప్రసన్నముఖి, సవేషి యైన కౌసల్య మంగళపూర్వక అగ్నిహోత్రమును వేల్చుచుండెను.

తతః స్వస్త్యయనం కృత్వామంత్రవిద్ విజయైషిణీ ।

**– వాల్మీకి రామాయణం 4/19/22**

అపుడు మంత్రములనభ్యసించిన తార తన పతి విజయముకొరకు స్వస్తివచన మంత్రములను పఠించి, అంతఃపురమును ప్రవేశించినది.

గాయత్రీ మంత్రాధికారము సంబంధించినంతవరకు ఋషులు ఇంకా స్పష్టశబ్దములలో ఉల్లేఖించినారు. క్రింది రెండు స్మృతి ప్రమాణములను పరిశీలించండి. ఇందులో స్త్రీలు గాయత్రీ ఉపాసన చేయు విధానమున్నది.

పురాకల్పేతు నారీణాం మౌంజీబంధనమిష్యతే ।
అధ్యాపనంచవేదానాం సావిత్రీ వాచనం తథా ॥ – యమస్మృతి

ప్రాచీనకాలంలో స్త్రీలకు మౌంజీబంధనము. వేదముల నభ్యసించుట. గాయత్రీ ఉపదేశము ఇష్టములు.

మనసా భర్తురభిచారేత్రిరాత్రం యావకం. క్షీరోదనం వా
భుఞ్జనాఅథశయీత ఊర్ధ్వంత్రిరాత్రాదప్సునిమగ్నాయాః సావిత్ర్యాష్ట
శతేన శిరోభిజుహుయాత్ పూతాభవతీతి విజ్ఞాయతే ।

– వశిష్ట స్మృతి 12/17

పతిని గూర్చిన దుర్భావమేదైనా స్త్రీకి కలిగినయెడల, ఆ పాపమునకు ప్రాయశ్చిత్తము జేసుకొనుటకు 108 (అష్టోత్తరము) గాయత్రీ జపమాచరించిన పవిత్రత పొందును.

ఇంత తెలిపిన తదుపరి గూడ స్త్రీలకు గాయత్రీ జపించుట కధికారము లేదన్న నది దురాగ్రహముతో కూడిన కుసంస్కారమనవచ్చును.

## స్త్రీలపై ఈ ఆంక్షలు, లాంఛనము లెందుకు?

గాయత్రీ ఉపాసనకు అర్థము ఈశ్వరుని మాతృదేవిగా భావించి, ఆమె ఒడియందు స్థానము పొందుట. సంసారములో ఎన్ని సంబంధములున్నప్పటికీ, వాటన్నింటిలో మాతృసంబంధము అధిక ప్రేమపూర్ణము. అధిక ఘనిష్ఠమైనది. ప్రభువును మనమెట్టి దృష్టితో నవలోకించెదమో, మన భావన కనుగుణ్యముగా మనకు ప్రత్యుత్తరము లభిస్తుంది. ఈశ్వరుని ఒడిలో జీవుడు మాతృభావనతో ప్రవేశించినపుడు, నిశ్చయముగా నచట వాత్సల్యపూరిత సమాధానము లభిస్తుంది.

స్నేహము, వాత్సల్యము, కరుణ, దయ, మమత, ఉదారత, కోమలత మొదలైన తత్వములు స్త్రీలలో పురుషులకంటె అధిక మోతాదులో ఉంటాయి. బ్రహ్మకత్వము, వామాంగ, బ్రహ్మతత్వము, అధిక కోమలత్వము, ఆకర్షకమై శీఘ్రముగా ద్రవీభూతము

గాంచునది. అందువలననే అనాది కాలమందు ఋషులు ఈశ్వరుని మాతృభావనతో ఉపాసన గావించేవారు. భారతీయ ధర్మావలంభులకు ప్రత్యేకంగా వారు సులభసాధ్యము, సరళము, శీఘ్రఫలకారియైన సాధనా ప్రణాళికను తమ స్వంతము గావించుకొనవలెనని ఆదేశించారు. గాయత్రీ ఉపాసన ప్రత్యేకంగా భారతీయ ధార్మిక నిత్యకర్మగా నున్నది. సంధ్యావందనమేపద్ధతిలోనైనా చేయి, అందులో గాయత్రీ తప్పక నుండుట ఆవశ్యకము. విశేషమైన లౌకిక, పారలౌకిక ప్రయోజనార్థము గాయత్రీ ఉపాసన విశిష్ఠ రూపములో జేయబడుతుంది. కాని నిత్య కర్మను సాధించుటకు దైవిక కర్తవ్యము గూడా నంతియే. అటుల చేయనియెడల ధార్మిక కర్తవ్యములనుపేక్షించిన దోషము సంక్రమించుతుంది.

కుమారి మరియు కుమారుడు మాతృమూర్తికి ప్రాణప్రదమైన ఇద్దరు సంతానము. ఈశ్వరునకు నర నారీ లిద్దరు ముద్దుబిడ్డలు. నిష్పాక్షిక, న్యాయశీల మాతాపితలెవరైనా తమ సంతానమందలి బాలబాలికలయందు భేదభావాన్ని గలిగి యుండరు. ఈశ్వరుడు ధార్మిక కర్తవ్యమాచరించుటకూ, ఆత్మకల్యాణము కొరకూ ఉన్న సాధనములను స్త్రీ, పురుషులిద్దరికీ అవకాశాన్ని, సౌలభ్యాన్ని, సౌకర్యాన్ని కలిగించాడు. ఈ సమానత్వము, న్యాయ నిష్పాక్షిక దృష్టిలో ఉచితము మరియు ప్రమాణసిద్ధము, ఈ విష్యపట వాస్తవానికి విఘ్నములు కలిగించుట అసంగత మౌతుంది.

మనుష్యుని ఆలోచన, తెలివి చాలా విచిత్రమైనది. అందులో నప్పుడపుడు సర్వదా అనుచితము, అనవ సరమైన భావములు వచ్చి చేరుతాయి. ప్రాచీన కాలంలో స్త్రీలకు సముచిత స్థానమీయబడినది, గౌరవమున్నది. కాని ఆ స్త్రీనే హేయమైనదని, పతితయని, త్యాజ్యగా, పాతకిగా అనధికారిగా, ఘృణితగా నొకప్పుడు జాతి సాముహికంగా నిర్ణయించినది. ఆ ఆలోచనా విధానము స్త్రీల, మానవోచిత అంధికారములపై దురాక్రమణ సలిపినది. పురుష శ్రేష్ఠత్వము, సౌకర్యాన్ని పోషించుటకొరకు అనేక ప్రతిబంధకములను కలిగించి, శక్తిహీనను, సాహసహీనను, విద్యా విహీనను జేసి, ఆమెను లజ్జపడునట్లు గావించినది. తత్ఫలితంగా సమాజమునకు ఉపయోగికారి కాకుండా, పైపెచ్చు తన రక్షణ (ఆత్మరక్షణ) కొరకు ఇతరుల దయాదాక్షిణ్యములపై బ్రతుకవలసి వచ్చినది.

ఈ రోజున భారతనారి, పశు పక్షుల మాదిరి పెంపకపు స్థితిని జేరినది. దీనికి కారణము ఆలోచనవిధానములోని వక్రత, మధ్యకాలంలో సామంతరాజుల అహంకారముతో పాటు ఉత్పన్నమైనది. ప్రాచీనకాలంలో భారతీయనారి అన్ని రంగములలో పురుషులతోపాటు సమకక్ష్యలో నుండేది. రథచక్రములు రెండు సరిగా నున్నపుడే సమాజశకటము ఉత్తమంగా నడిచేది. కాని ఇపుడొక చక్రము క్షతమై విక్షతమైనందున

డవ చక్రమునకు తొట్రుపాటు గలిగినది. అయోగ్యనారి సమాజభారము, నరుడు మోయవలసి వచ్చినది. ఈ ఆవశ్యకత మన దేశమును, జాతిని పతనోన్ముఖము గావించినది. ఈ పతనము ఊహాతీతము.

మధ్యకాలపు అంధకారపు యుగము యొక్క దుష్పరిణామములను నివారించుటకు, వివేకశీలురు, దూరదర్శజ్ఞులైన మహాపురుషులనేక ప్రయత్నములొనరించారు. ఇది సంతోషదాయకము. విజ్ఞులైన పురుషులు అనుభవ పూర్వకంగా తెలుసుకొన్నదేమనగా మధ్యకాలంపు తుచ్ఛమైన లోహశృంఖలాలు స్త్రీలకు తీయనట్లయితే దేశమునకు ప్రాచీన గౌరవము లభింపదు. పూర్వకాలంలో నున్న స్త్రీల స్థితిని పునరుద్ధరించినట్లయితే మనయొక్క అర్ధాంగము వికసించుతుంది. అపుడే మన సర్వాంగీణ వికాసము కలుగుతుంది. ఈ శుభ ప్రయత్నంలో మధ్యకాలంలో నేర్పడిన కుసంస్కారాచారములను అంధానుకరణ జేయుట ధర్మమని మూర్ఖించువారల ఆలోచనా విధానము ఇపుడు గూడా విఘ్నమొనరించి నిరోధించుటలో విజయవంతమౌతుంది.

ఈశ్వరభక్తి, గాయత్రీ ఉపాసనలను గురించినంతవరకు స్త్రీలకు అధికారము లేదని వక్కాణింపబడుతుంది. దీనికొరకు అనేక శ్లోకములను ఉదహరింపబడు తున్నవి. దీనివలన మంత్రములను చదువరాదు. వినరాదు. ఏలనన గాయత్రీ వేదమంత్రము. కావున స్త్రీలీ మంత్రమును స్వంతము చేసుకోరాదు. ఈ ప్రమాణములలో మాకు విరోధము లేదు. ఎందువలననగా, మన భారత వర్షములో నాకానాక సమయమందున స్త్రీలను నికృష్టులుగా పరిగణించడం జరిగినది. యూరోపు దేశంలోకూడా అదేకాలంలో స్త్రీలకు, గడ్డి, మొదలైన జడపదార్థములకు వలె ఆత్మ లేదని తలంచారు. ఇచట గూడా అదే ఆలోచన స్థూలంగానో, సూక్ష్మంగానో ప్రబలి మాన్యతను పొందినది. ఇటుల జెప్పబడినది –

నిరింద్రియాహ్య మంత్రశ్చ, స్త్రియోఽనృతమితి స్థితిః ।

అర్థము : స్త్రీలకు ఇంద్రియములుండవు. వారు మంత్ర రహితలు. అసత్య స్వరూపిణులు, ఘృణితలు.

స్త్రీలను డోలులా (వాయిద్యం), మూర్ఖురాలిలా, పశువుగా, శూద్ర సమానురాలిగా దండయోగ్యమని చాటిచెప్పే ఆలోచన విధానమీవిధంగా చెబుతుంది.

పౌంశ్చల్యాచ్చల చిత్తచ్చనై స్నేహ్యాచ్చ స్వభావతః ।
రక్షితా యత్ర తోపీహ భర్తృష్వేతా వికుర్వతే ।

అర్థము – స్త్రీలు స్వభావతః వ్యభిచారిణులు, చంచలచిత్తలు, ప్రేమశూన్యులై వుంటారు. వారిని అప్రమత్తతతో కనిపెట్టి ఉండవలె.

విశ్వాసపాత్రం న కిమస్తి నారీ।
ద్వారం కిమేకం నరకస్య నారీ।
విద్వాన్మహా విజ్ఞత మోఽ స్త్రికోవా।
నార్యాపిశాచ్యా నచ వంచితో యః।

ప్రశ్న - విశ్వసించుటకు యోగ్యము కానిదెవరు ? జవాబు - నారీ !

ప్రశ్న - నరకమునకైకైక మార్గమేది ? జవాబు - నారీ.

ప్రశ్న - బుద్ధిమంతుడెవరు ? జవాబు - నారీ రూపి పిశాచినిచే ఆకర్షింపబడి వ్యామోహితుడు కానివాడు.

స్త్రీలకు సంబంధించినంత వరకు పైనుదహరింపబడిన భావములు వ్యాప్తిలో నున్నపుడు, స్త్రీలను వేద శాస్త్రములనుండి, ధర్మకర్తవ్యముల నుండి, జ్ఞానోపార్జన నుండి వంచింపబడి, అనేక ప్రతిబంధములను గల్పించారన్నపుడు ఆశ్చర్యపడ నవసరము లేదు. ఇట్టి ప్రతిబంధ సూచకములుగా అనేక శ్లోకములు లభించుచున్నవి.

స్త్రీ శూద్ర ద్విజబంధూనాం త్రయోన శ్రుతి గోచరా। – (భాగవతము)

అర్థము - స్త్రీలు, శూద్రులు, నీచబ్రాహ్మణులు వేదములు వినుటకు అధికారము లేదు.

అమంత్రికా తు కార్యేయ స్త్రీణా మా వృదశేషతః।
సంస్కారార్థ శరీరస్య యధాకాలే యధాక్రమమ్। – మను 1/99

అర్థము - స్త్రీలకు జాతకర్మాది సంస్కారములు, వేదమంత్రములు లేకుండ చేయవలె.

నన్వే వం సతిస్త్రీ శూద్రసహితాః సర్వవేదాదికారిణః। – సాయణుడు

స్త్రీలకు, శూద్రులకు వేదాధికారము లేదు.

"వేదేఽనధికారాత్"। – శంకరాచార్య

అనగా - స్త్రీలకు వేదాధికారము లేదు.

అధ్యయిన రహితయా స్త్రియా తదనుష్ఠానమశక్య
త్వాత్ తస్మాత్ పుంస ఏవోపస్థా నాదికమ్। – మధ్వాచార్య

స్త్రీలు అధ్యయన రహితులైనందున వారు మంత్రోచ్చారణ చేయలేరు. అందువలన కేవల[illegible] పురుషులు మంత్ర[illegible]లను [illegible]

'స్త్రీ శూద్రౌ నాధీయథామ్'

స్త్రీలు శూద్రులు వేదము చదవకుందురు గాక.

నవైకన్యా న యువతీ।

కన్యగాని లేక స్త్రీ గాని చదవకూడదు.

ఈ విధముగా స్త్రీలను ధర్మ, జ్ఞాన, ఈశ్వరోపాసన, ఆత్మకల్యాణ ప్రయత్నముల నుండి మరల్పుట కేర్పరచబడిన ప్రతిబంధకములను అనేక మంది సాత్వికులు 'సనాతన ధర్మమని' తలపోస్తారు. సమర్థిస్తారు. ప్రాచీన సాహిత్యంలో ఈవిధమైన ప్రతిబంధకములు లేవని వారు గ్రహించవలె. మీదు మిక్కిలి అందులో సర్వత్ర నారీ గొప్పతనాన్ని శ్లాఘించారు. వారికిగూడా పురుషులకున్న ధార్మిక అధికారములు ప్రాప్తించినాయి. ఈ ప్రతిబంధకములు కొంతకాలము వరకు కొంతమంది వ్యక్తులకు ప్రత్యేక వ్యామోహజనిత ప్రమాణములైనాయి. అట్టి వ్యక్తులు ధర్మ గ్రంథములలో అచట నచట అనర్గళ శ్లోకములను జొన్పి తమ పిచ్చి భ్రమలను ఋషిప్రణీత సిద్ధములు గావించుటకు ప్రయత్నించారు.

భగవాన్ 'మనువు' నారీజాతియొక్క మహోన్నతిని ముక్తకంఠముతో స్వీకరిస్తూ ఇట్లు వ్రాశారు –

ప్రజనార్థ మహాభాగాః పూజార్హ గృహదీప్తయః।
స్త్రియః శ్రియశ్చగేహేషు న విశేషోఽ స్తికశ్చన। – మను. 9/19

అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషారతిరుత్తమా।
దారధీ నస్తథా స్వర్గః పితౄణామాత్మ నశ్చహ। – మను. 9/28

యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్రదేవతాః।
యత్రైతాస్తున పూజ్యన్తే సర్వాతత్రా ఫలాఃక్రియాః। – మను. 13/59

అనగా – స్త్రీలు పూజార్హులు. గౌరవనీయులు. గృహదీపికలు. కల్యాణకారిణులు. ధర్మకార్యముల యందు సహాయికలు. స్త్రీల ఆధీనములో స్వర్గమున్నది. ఎచట స్త్రీలు పూజింపబడెదరో అచట దేవతలు నివసిస్తారు. ఎచట వారు తిరస్కరింపబడెదరో అచట సర్వకార్యములు నిష్ఫలములౌతాయి.

స్త్రీ జాతిని గురించి 'మను' భావన ఈవిధమైన ఉచ్చశ్రేణిలో నున్నది. అదే గ్రంథములో నచట నచట స్త్రీలనుపూర్తిగా దూషించుట, వారి ధార్మిక సౌకర్య నిషేధమున్నది. "మనువు" లాంటిమహాపురుషులు పరస్పర విరుద్ధములు వ్రాయరు. నిశ్చయంగా తరువాత వ్యక్తులాగ్రంథములో వాటిని జోడించారు. దీనికి ప్రమాణమున్నది. పరికించండి.

మాన్యాకాపి మనుస్మృతి స్తదుచితా వ్యాఖాపి మేధాతిధేః।
సాలుప్తై వివిధేశాత్వ్రధచిదపి ప్రాప్యం న తత్పుస్తకమ్ ।
క్షోణింద్రో మదనసహారణ సుతోదేశా న్తరాదాహ్నతై
జీర్ణద్వార మచీకరత్ తత్ ఇతస్త త్పుస్తకైలేఖితైః ।
- మేధాతిధిరనిఃశ మనుభాష్య సహిత మనుస్మృతేరుపోద్ఘాతః।

**- (మనుస్మృతికి ఉపోద్ఘాతము)**

అర్థము - పూర్వకాలములో ప్రామాణిక మనుస్మృతి ఉన్నది. దానికి "మేధాతిధి" సరియైన భాష్యము గావించారు. దౌర్భాగ్యవశమున నాపుస్తకములుప్తమైనది. 'రాజామదన్ అక్కడ ఇక్కడనున్న పుస్తకముల నుండి జీర్ణోద్ధారణ గావించినాడు.

కేవలము మనుస్మృతికే ఈ గడబిడ పరిమితముగాలేదు. పైగా అన్యగ్రంథములలో గూడా నిట్టి జోడింపులు జరిగినాయి. తమ భావములు శాస్త్రవిరుద్ధములైనప్పటికీ గూడా శాస్త్రవచనసిద్ధి పొందే ప్రయత్నములు గావింపబడినవి.

దైత్యాః సర్వేవిప్రకులేషు భూత్వా, కలౌయుగేభారతేషట్ సహస్రయామ్ ।
నిష్కాస్య కాంశ్చిన్నవ నిర్మితానాం నివేశనం తత్ర కుర్వంతినిత్యమ్ ।

**- గరుడపురాణబ్రహ్మ 1/56**

రాక్షసులు కలియుగములో బ్రాహ్మణ కులంలో జన్మించి, మహాభారతంలోని (6) ఆరువేల శ్లోకాలనుండి అనేక శ్లోకములు తీసివేయుదురు. ఆ స్థానంలో నవీన కృత్రిమ శ్లోకములను జొన్పి ప్రక్షేపము గావించెదరు. ఈ విషయమునే మాధవాచార్యులవారీవిధంగా వచించారు.

క్వచిద్ గ్రంథాన్ ప్రక్షిపన్తి క్వచిద న్తరితానపి ।
కుర్యుః క్వచిచ్చ త్రత్యాసం ప్రమాదాత్ క్వచిదన్యథా ।
అనుత్పన్నాః అపిగ్రంథావ్యాకులా ఇతిసర్వశః ।

స్వార్థపరులు గ్రంథములలో నచట నచట మాటలను ప్రక్షిప్త(పొందుపరచటం) పరచారు. కొన్నిచోట్ల గ్రంథముల నుండి తీసివేశారు. కొన్ని సమయములలో ప్రయత్నపూర్వకంగా, మరికొన్నిసార్లు ప్రమాదవశాత్తు మార్పులు జరిగాయి. ఈవిధంగా ప్రాచీన గ్రంథములు అస్తవ్యస్తమైనాయి.

ఆవిధంగా లేనటువంటి వాటిని జోడించేరోజులలోకూడా, విద్వాంసులైన మేధావులు దీనిని వ్యతిరేకించారు మహర్షి "హారీత" ఈవిధమైన స్త్రీ ద్వేషాన్ని ప్రేరేపించే అసంబద్ధమైన ఉచ్చాటనలను ఘోరంగా వ్యతిరేకిస్తూ ఈవిధంగా ఉటంకించారు.

న శూద్రసమాః స్త్రియః నహి శూద్రయోనౌ బ్రాహ్మణ, క్షత్రియ
వైశ్యాజాయన్తే తస్మాచ్ఛందసాస్త్రియః సంస్కార్యాః । – హారీత

స్త్రీలు శూద్రసమానులు కాజాలరు. శూద్రయోనుల నుండి, ఆహా ! బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్యుల ఉత్పత్తి ఎట్లు జరుగుతుంది? స్త్రీలను వేదములద్వారానే సంస్కరించవలె.

నర నారీలిద్దరు రథము యొక్క రెండు చక్రములు. ఒకే శరీరములోనున్న రెండు భుజములు, రెండు చేతులు. ఒకే ముఖములోని రెండు కళ్ళు. ఇందులో ఒకటి లుప్తమైనపుడు రెండవది అసంపూర్ణము. రెండు అర్ధాంగములు కలసి ఒక పూర్ణాంగ మేర్పడుతుంది. మానవ ప్రాణులలోని అవిచ్ఛిన్న ద్విభాగములలో ఈవిధమైన అసమానత రెండు రకములు. ఉచ్ఛ నీచములను సృష్టించుట భారతీయ పరంపరకు వ్యతిరేకము భారతీయ ధర్మంలో నరనారులను అవిచ్ఛిన్నాంగములుగా భావిస్తారు.

యథైవాత్మా తథాపుత్రః దుహితాసమా ।

సంతానము ఆత్మసమానము. పుత్రునివలె పుత్రిక కూడా ఇద్దరూ సమానులే.

ఏతావానేవ పురుషోయజ్జాయాత్మా ప్రతీతిహ ।
విప్రాః ప్రాహుస్తథా చైతద్యో భర్తా సాదస్మృతాంగనా । – మను. 10/45

పురుషుడు ఒంటరిగాకాడు. ఏలనన పత్ని, సంతానము కలసి స్వయంపురుషు డౌతాడు.

'అథో అర్ధో వా ఏష ఆత్మనః యత్ పత్నీ'

అర్థము – పత్నీ పురుషునకు అర్ధాంగము

ఈ పరిస్థితులలో పరమేశ్వరుని వాణి యగు వేద జ్ఞానమును స్త్రీలు పొందుటకు వీలులేకుండుట ఉచితము గాదు. ఇతర మంత్రముల వలె గాయత్రీ మంత్రమునకు గూడా వారికి పూర్తి అధికారమున్నది. ఈశ్వరుని మనము నారీ రూపములో, గాయత్రీ రూపంలో ఉపాసనజేస్తాము. మరల నారీజాతిని ఘృణితగా పతితగా అస్పృశ్యురాలిగా అనధికారిణిగా పరిగణించుట ఎంతవరకు ఉచితము ? దీనిని గురించి మనము స్వయంగా ఆలోచించుకొనవలె.

స్త్రీలకు వేదాధికారము లేకుండ జేసినందున, స్వభావసిద్ధంగా వారిలో హీనభావన ఉద్భవిస్తుంది. ఇది తదుపరి దీర్ఘకాలంలో దుష్పరిణామాలను కలుగజేస్తుంది. తత్ఫలితం మన సమాజముపై, దేశ వికాసముపై నుంటుంది. అంతవరకెందుకు వర్తమాన కాలంలో అధికాంశం పురుషులకు గూడా వేదపరిచయము లేదు. మీదు మిక్కిలి వేదమును గురించి అసంబద్ధమైనవి, వంకరటింకర భావాలు వెలిబుచ్చుతారు. దేనిని గురించైనా

సిద్ధాంత రూపంలో అనధికార ప్రతిపాదనలను జేస్తారు. దాని పరిణామము హానికరం నుంటుంది. కావున వితండవాదములను పాటింపక స్త్రీలను గురించి జేసే వివాదములను గూడా నిరాకరించవలె.

వేదజ్ఞానములు స్త్రీ పురుషులిద్దరికీ గూడా పరమేశ్వరుడు తన సంతానమునకిచ్చే సందేశమును వినుటకు ప్రతిబంధనములను గల్పించుట ఈశ్వర ద్రోహము. వేద భగవానుడు స్వయంగా ఇటుల వచించాడు -

సమానోమంత్రః సమితిసమానీ సమానంమనః సహచిత్తమేషామ్ ।
సమానమస్త్ర మభిమంత్రయేవః సమానేనవోహవిషా జుహోమి ।

— ఋగ్వేదం 10/16

అర్థము : ఓ సమస్త నారీ నరులారా ! మీకొరకీమంత్రములు సమాన రూపంలో నీయబడినవి. మీ పరస్పర ఆలోచనలు గూడా అట్లే సమానముగా నుండుగాక. మీ సభలిద్దరికీ సమానమే. అందు ఇరువురకు సమానాధికారమున్నది. మీ మనస్సులు, చిత్తములు సమానంగా కలసివున్నవి. నేను మీ ఇద్దరికీ సమానంగా మంత్రోపదేశము జేయుచున్నాను. సమాన రూపంలో గ్రహణయోగ్య.పదార్థము నొసంగుచున్నాను.

## పండిత మదనమోహన మాలవ్యా నిర్ణయము

స్త్రీలకు వేదమంత్రముల అధికారమున్నదా? లేదా? ఈ ప్రశ్నపై కాశీలోని పండిత ప్రకాండుల మధ్య వివాదమేర్పడినది. కాశీలోని హిందూ విశ్వ విద్యాలయమందలి వేద విభాగమునందు కళ్యాణి అను పేరుగల విద్యార్థిని ప్రవేశమునకు దరఖాస్తు పెట్టుకొన్నది. అప్పుడచట ప్రచారములోనున్న సాంప్రదాయము ప్రకారము విశ్వవిద్యాలయం ఆమె దరఖాస్తును తిరస్కరించి ఆమెకు ప్రవేశార్హత లేదని నిర్ణయించినది. అధికారుల కథనం ప్రకారము స్త్రీలకు వేదమంత్రముల నభ్యసించుటకు అర్హత లేదు కనుక.

ఈ విషయం ప్రస్తావిస్తూ అనేక పత్రికలలో చాలా దినములవరకు వివాదము చెలరేగినది. వేదాధికారాన్ని సమర్థిస్తూ "సర్వదేశిక" యను పత్రిక అనేక లేఖలను ప్రచురించినది. తద్విరోధంగా 'సిద్ధాంత' యను పత్రికలో అనేక లేఖలు వెలువడినవి. ఆర్యసమాజము తరపున ఒక డెప్యుటేషన్ విశ్వవిద్యాలయాధికారులను కలిసినది. దేశమంతటా ఈ సమస్యపై చర్చ జరిగినది.

చివరకు విశ్వవిద్యాలయపు మహామనీషి మదనమోహన మాలవ్యా అధ్యక్షతన ఈ ప్రశ్నను పరిశీలించుటకు ఒక కమిటీ నియమింపబడినది. ఆ కమిటీలో అనేకమంది ప్రసిద్ధిజెందిన ధార్మిక విద్వాంసులున్నారు. ఆ కమిటి ఈ విషయాన్ని గురించి

వివేకంతో "స్త్రీలకు పురుషులవలె వేదాధికారమున్నది" యని నిష్కర్షగా నుడివినది. ఈ నిర్ణయ ఘోషణ 1946, ఆగష్టు 11వ తేదీన, సనాతన ధర్మాన్ని ప్రాణప్రదంగా భావించే శ్రీ మదనమోహన మాలవ్యా గావించారు. తదనుసారంగా కళ్యాణీదేవి హిందూ విశ్వవిద్యాలయంలో వేదవిభాగంలో జేర్చుకొనబడినది. మరియు శాస్త్రీయ ఆధారంపై విశ్వవిద్యాలయంలో స్త్రీలు వేదాధ్యయనము గావించుట కెటువంటి ప్రతిబంధకము లేర్పరచరాదు. స్త్రీలు గూడా పురుషులవలెనే వేదాధ్యయనము జేయగలరు" అని నిర్ణయింపబడినది.

మహామనస్వి మాలవ్యాజీ, వారి సహాధ్యాయులు, తదితర విద్వాంసులు సనాతన విరోధులని సందేహించ గూడదు. సనాతన ధర్మంలో వారి ఉనికి ప్రసిద్ధమైనది. అట్టి మహావ్యక్తులచే ఈ ప్రశ్నకు సమాధానము లభించి నప్పటికీ, సామూహిక యుద్ధమొనర్చుటకు కొందరు సిద్ధపడి, స్త్రీలకు గాయత్రీ అధికారము లేదంటున్నారు. వారి బుద్ధిని మన మేమనవలె? తెలియడంలేదు!

పండిత మదనమోహన మాలవ్యా సనాతనధర్మానికి ప్రాణము వారి శాస్త్రజ్ఞత, విద్వత్తు, దూరదర్శకత్వము, ధార్మిక దృఢత్వమును గురించి ఎట్టి సందేహము లేదు. మహాపండితులు, ఇతర అనేక ప్రామాణిక విద్వాంసులు పరామర్శించి నిర్ణయంపై వెలిబుచ్చువారి మూర్ఖధర్మాన్ని తొలగించుటకా బ్రహ్మకైనను కష్టమే.

విచారకరమైన విషయమేమనగా, అటువంటి వ్యక్తులు కాలపు పోకడను గుర్తించరు. హిందూ సమాజపు పతనావస్థపై ధ్యానముంచరు. కేవలము పది లేక ఇరువది కల్పిత శ్లోకములను, (అవి గూడా జోడించబడినవని) ఆధారంగా దేశమునకు, సమాజమునకు హితవుగాని విధంగా ప్రవర్తిస్తున్నారు. ప్రాచీనకాలంలో అనేకమంది విదుషీ నామములు ఇపుడు గూడా ప్రసిద్ధముగానున్నవి. వేదములలో శతాధిక స్త్రీ ఋషులచే ఉల్లేఖింపబడిన మంత్రము రచయిత్రుల రూపంలో మనకు గోచరిస్తారు. ఈ సంగతిని గుర్తించక, మధ్య కాలంలో ఋషుల పేరుతో స్వార్థపరులద్వారా పుస్తకములో ప్రక్షేపించబడిన వాటి ఆధారంగా, సమాజోద్ధరణా పవిత్ర కార్యాన్ని వ్యర్థంగా కలుషితం జేస్తున్నారు. అట్టి వ్యక్తులను పేక్షించి, మాలవ్యాజీ సమ్మతి ప్రకారం అనుసరించుట సమాజ సేవకుల కర్తవ్యము.

## స్త్రీలు అనధికారిణులు కారు

జరిగిన పుటలలో, శాస్త్రములాధారంగా ప్రమాణములు చూపబడినవి. పాఠకులొక సారి వాటిని గురించి ఆలోచించవలె. వేదశాస్త్రములలో ప్రతిబంధనములు లేవని, ధార్మిక

కార్యములకొరకు, సత్‌జ్ఞానమును పార్జించుటకు, వేదశాస్త్రములను వినుటకు, మననము జేయుటకు ఆటంకములుండగూడదని, ప్రతి ఆలోచనాపరుడు సహజంగా అంగీకరిస్తాడు. హిందూ ధర్మము. విశ్వధర్మము. అందులో ఈ విధమైన ఆలోచనలకు తావులేదు. స్త్రీలను ధర్మము, ఈశ్వరుడు వేదవిద్యాభ్యాసము మొదలైన ఉత్తమ మార్గములనుండి మళ్ళించి వారిని అవనత అవస్థలోనుంచి, వివశులును చేయవలెనా! ప్రాణికోటిపై అనంతదయ, కరుణ గలిగి ఋషులు, మునులు అట్టి కఠినులు కాజాలరు వారు వేదములవలన ఈశ్వరీయ జ్ఞానమును స్త్రీలు పొందకుండవంచితులను గావించి, ఆత్మ కల్యాణ మార్గమును మూసివేయుదురా! హిందూధర్మము అత్యధిక ఉదారమైనది. విశేషంగా స్త్రీలయెడల హిందూ ధర్మంలో మిక్కిలి ఆదరణ, శ్రద్ధ, ఉచ్చస్థానమున్నది ఇట్టి దశలో, గాయత్రీ ఉపాసనలాంటి ఉత్తమ కార్యమునకై స్త్రీలు అయోగ్యులనుట ఎటుల సంభవము?

ఎక్కడో ఐదు, పది శ్లోకములు స్త్రీలను వేదశాస్త్రాధ్యయనము నుండి నిషేధించినవి. పండితులు వీటిపై ధ్యానముంచవలె. ప్రారంభములో చాలాకాలంవరకు స్త్రీలు వేదము అభ్యసించ గూడదని నిషేధము సమాజము గావించినది. కాని శాస్త్రవిజ్ఞానము విస్తరించి అన్వేషణ అధికంగా కావలసి వచ్చినది. క్రమక్రమంగా, ఈ ప్రతిబంధన శ్లోకములు మధ్యకాలములో సామంతరాజుల ఆచారములకు ప్రాతినిధ్యమని తెలిసినది. ఆసమయంలోనే ఇటువంటి శ్లోకములు గ్రంథములలో కలుపబడినవి. సత్యసనాతన వేదోక్త భారతీయధర్మపు వాస్తవికాలోచన స్త్రీలపై ఏవిధమైన ప్రతిబంధనము లేర్పరచలేదు. అందులో స్త్రీలకుగూడా ఈశ్వరోపాసన వేదశాస్త్రములనాశ్రయించుట నుండి ఆత్మలాభమును పొందుటకు పరిపూర్ణమైన అవకాశమీయబడినది.

ప్రఖ్యాతిజెందిన గణనీయులైన విద్వాంసుల అభిప్రాయముగూడా నిదియే. సాధన, యోగముయొక్క ప్రాచీన పరంపరను తెలుసుకొనిన మహాత్ములు, స్త్రీలు ఎల్లప్పుడూ గాయత్రీ ఉపాసన జేయుటకు అధికారిణులని వ్రాక్రుచ్చారు. స్వర్గీయ మాలవ్యాజీ సనాతన ధర్మమునకు ప్రాణము. ప్రప్రథమంలో వారు స్త్రీలు వేదములను పఠించుటను నిషేధించారు. కాని విశేషరూపంలో పండిత మండలి సహకారంతో దీనిగురించి పరిశోధించి స్వయంగా నిష్కర్షగా శాస్త్రములు స్త్రీలకు ప్రతిబంధములుగావనే నిర్ణయమునకు వచ్చారు. విరోధంగా వాదించువారిని కించిత్‌గూడా లెక్కచేయలేదు. హిందూ విశ్వ విద్యాలయంలో స్త్రీలకు ప్రవేశార్హత గలిగించారు.

ఇపుడుగూడా అనేకమంది మహానుభావులు స్త్రీలకు గాయత్రీ అధికారం లేదని అంటున్నారు. అటువంటి వారి కళ్లు తెటిపించుటకు అసంఖ్య ప్రమాణాలలో కొన్ని

ప్రమాణాలను మాత్రమే ఈ పుస్తకంలో పొందుపరచాను. అజ్ఞానంవలన కొన్నిటిని మనము నిరోధించుట సంభవము మొండి పట్టుదలతో వివాదానికి అంతుండదు. తన మాటలను నెగ్గించుకోవాలనే మూర్ఖపు పట్టుదల వ్యక్తులకు శోభనివ్వదు. **వివేకవంతుల సిద్ధాంతము సత్యమేదో అది మనది యని. అవివేకులు మనము వచించినదే సత్యము అని సిద్ధాంతీకరించుటకు వితండ వాదమును పీడరు.**

మేధతో ఆలోచించు వ్యక్తులు తమంతట తాము ఏకాంతము నేర్పరచుకొని కూర్చొని ఈ ప్రశ్నలను వేసికొనవలె.

(1) స్త్రీలు గాయత్రీ ఉపాసనకుగాని, వేదమంత్రములభ్యసించుటకుగాని అనర్హులైతే, ప్రాచీనకాలంలోని స్త్రీలు వేదమంత్రద్రష్టలు, ఋషికలు ఎల్లాగైనారు?

(2) స్త్రీలు వేదాధికారులు కానట్లయితే యజ్ఞములు మొదలైన ధార్మిక కృత్యములలో, షోడశ సంస్కారములలో వారినెందుకు భాగస్వాములుగా సమ్మిళిత మొనరించినారు?

(3) వివాహాది సమయములలో స్త్రీల ముఖమునుండి వేద మంత్రోచ్చారణ ఎందుకు చేయిస్తారు?

(4) వేదమంత్రములు లేకుండ నిత్యసంధ్య, వాప.ములను స్త్రీలెట్లు నిర్వర్తిస్తారు?

(5) స్త్రీలు అనధికారిణులైతే, అనసూయ, అహల్య, అరుంధతీ, మైత్రేయి, మదాలస మొదలైన అగణిత స్త్రీలు వేదశాస్త్ర పారంగతులెట్లులైనారు?

(6) జ్ఞానము, ధర్మము, ఉపాసన మొదలైన అధికారములనుండి, తెలివిగలవారిని వంచించుట అన్యాయము, పక్షపాతము కాదా?

(7) స్త్రీలను ఆధ్యాత్మిక దృష్టినుండి మరల్చిన వారికి జన్మించే సంతానము ధార్మికులగుదురా?

(8) స్త్రీ పురుషుని అర్ధాంగి యైనపుడు, సగము అంగము అధికారము గలిగి, సగము అనధికారి ఎట్లు అగును?

పై ప్రశ్నలపై ఆలోచించినయెడల నిష్పాక్షికమైన ప్రతి వ్యక్తికిగూడా, స్త్రీలపై ధార్మిక ఆంక్షలు విధించుట న్యాయసంగతము గాదని, అంతరాత్మ జవాబిస్తుంది. వారికిగూడ పురుషులకువలె గాయత్రీ మొదలైన మంత్రములకు అధికారము కావలె. మేము గూడ ఈ నిర్ణయమునకొచ్చినాము. మాకు వందలకొద్ది స్త్రీ మాతలతో పరిచయమున్నది. వారు శ్రద్ధతో వేదమాత గాయత్రీ నుపాసించారు. వారుగూడా పురుషులవలె సంతోషజనకమైన ఫలితములను పొందారు. అనేకసార్లు పురుషులకన్నా

అధికంగాను, శీఘ్రంగాను ఫలితాలొచ్చాయి. కన్యలకు ఉత్తమ గృహములనుండి వరులు లభించారు. విధవలు సంయమనముతో ధనోపార్జనగావించి ఆశాజనక ప్రయోజనములను అనుభవించారు.

**ఆత్మ స్త్రీ గాదు. పురుషుడు గాదు. ఆత్మ విశుద్ధ బ్రహ్మజ్యోతి యొక్క ప్రకాశించు** రవ్వ. ఆత్మిక ప్రకాశాన్ని పొందుటకు పురుషులకు గురువెంత అవసరమో, స్త్రీలకు గూడానంతే. తాత్పర్యమేమనగా సాధనాక్షేత్రంలో స్త్రీ పురుషులకు భేధం లేదు. సాధక్ ఆత్మ అవుతుంది. స్త్రీ పురుషులనక, ఆత్మయని తెలియవలె. సాధనా క్షేత్రమందు ఆత్మలన్నియు సమానమే. లింగభేదాన్ననుసరించి అయోగ్యతను ఆరోపించి దెంపదెబ్బ వేయగూడదు.

పురుషునికంటె స్త్రీలలో ధార్మిక తత్వము ఎక్కువ మోతాదులో ఉంటుంది. పురుషులపై చెడు వాతావరణ ప్రభావము, వ్యావహారపు ఛాయ అధికముగా నుంటుంది. అందులో అధికంగా చెడు ఉంటుంది. ఆర్థిక సంఘర్షణలకు లోబడి, చోరత్వము, నిజాయితీలోపము మొదలైన అవసరములను ఎదుర్కొనవలె. కాని స్త్రీల కార్యక్షేత్రము బహు సరళము, సుగమము, సాత్వికము. గృహములందే కార్యములు జరిగినప్పటికీ, అందు సేవజేయుట అనునది అధికంగా వుంటుంది. వారు ఆత్మనిగ్రహము గలిగివుంటారు. కష్టములను సహించెదరు. కాని బిడ్డలపై, భర్తపై అత్తమామలయందు, బావలు, మరుదులయందు, తమ (స్త్రీల) వ్యవహారము సౌమ్యంగాను, సహృదయతతోను సేవాపూర్ణంగాను, ఉదారంగాను, శిష్ట సహిష్ణుతతో నుంటుంది. వారి దినచర్య సత్వగుణ ప్రధానంగా వుంటుంది. ఆ కారణము వలన వారి అంతఃకరణము పురుషులకంటె పవిత్రంగా వుంటుంది. చౌర్యము, హత్య, మోసగించుట, ధూర్తత్వము, స్వార్థపరత్వము, నిష్ఠూరము, వ్యసనము, అహంకారము. సంయమనము లేకుండుట, అసత్యము పురుషులే ప్రధానంగా అలవాటుగావించుకొంటారు. ఈ పాపములు స్త్రీలలో బహు తక్కువగా ఉంటాయి. కాని ప్రస్తుతము ఫ్యాషనులయందు మోజు, నిలకడలేనితనము. కర్కశత్వము, పనిచేసి మనస్సును ఆకర్షించడం మొదలైన చిన్నచిన్న చెడులు స్త్రీలలో అభివృద్ధి చెందుతున్నాయి. కాని పురుషులతో పోలిస్తే స్త్రీలు నిస్సందేహంగా శతాధిక సద్గుణులు. వారి దుర్గుణములు చాల తక్కువ పరిమితి గలవి.

అట్టి స్థితియందు పురుషులకంటే స్త్రీలలో ధార్మిక ప్రవృత్తి ఉండడం స్వాభావికము. వారి మనోభూమిలో ధార్మిక బీజాంకురము శీఘ్రంగా నాటుకుంటుంది. పుష్పిస్తుంది. ఫలిస్తుంది. అవకాశం ఉన్న కారణంచే గృహంలో పూజ. ఆరాధన నియమపూర్వకంగా జేయగలుగుతుంది. తన బిడ్డలపై ధార్మిక సంస్కార ప్రభావము శ్రేష్టంగా ప్రసరింప

జేయగలదు. ఈ సద్విషయాలన్నింటిని గమనిస్తే, మహిళలు ధార్మిక సాధనకొరకు ఉత్సాహంగా పనిచేయవలసిన ఆవశ్యకత ఉన్నది. దీనికి వ్యతిరేకంగా వారిని, నీచులుగాను అనధికారిణులుగాను పరిగణించడం ఏవిధంగా ఉచితమో అర్థంగావడంలేదు.

స్త్రీలు వేదశాస్త్రములను స్వంతంజేసుకొనుటకు గాయత్రీ సాధన చేయుటకు అసంఖ్య ప్రమాణములు గ్రంథములనిండా వున్నవి. గమనించకుండా కళ్ళు మూసికొని, నాలుగైదు శ్లోకాలను పట్టుకొని కూర్చొని వాటి ఆధారంపై స్త్రీలను అనధికారిణులుగా నిర్ణయించుట బుద్ధిమంతుల లక్షణముగాదు. ధర్మమువైపు ఎవరికీ అలాంటి ప్రవృత్తిలేదు కాని ప్రత్యేకంగా స్త్రీలకు ఉత్సాహము, సౌకర్యము ఉన్నపుడు వారిని అనధకారిణులుగా ఘోషించుట, జ్ఞానము, ఉపాసనా మార్గములను మూసివేయుట వివేకము గాదు.

మేము చాలా ఎక్కువగా శోధించాము ఆలోచించాము: మననము, అన్వేషణ గావించినందున, స్త్రీలు పురుషుల వలె గాయత్ర్యోపాసనకు అర్హులని విశ్వాసము కలిగినది. వారుగూడా గాయత్రీ మాత ఒడిలో నుండుటకు, ప్రవేశించుటకు ఆ మాతృదేవి చేలాంచలమును పట్టుకొనుటకు, ఆమె స్తన్యపానమొనరించుటకు సంపూర్ణమైన అధికారులు. వారన్ని సంకోచములను విడచి ప్రసన్నతాపూర్వకంగా గాయత్ర్యోపాసన జేయవలె. దీనివలన వారి భవబంధములు వీడిపోతాయి. జన్మ మరణములను ఉరిత్రాటినుండి విముక్తులౌతారు. జీవన్ముక్తులై స్వర్గీయ శాంతిని పొందుటకు అధికారులౌతారు. దీనితోబాటు తమ పుణ్య శక్తి వలన తమ కుటుంబ సభ్యులకు ఆరోగ్యము, సౌభాగ్యము వైభవము, సుఖ శాంతులు దినదినాభివృద్ధి జెందుటకు తోడ్పడుతారు. నిజమైన అర్థంలో, గాయత్రీని స్వంతము జేసుకొనే స్త్రీలు దేవీ స్వరూపిణులౌతారు. వారి దివ్య గుణములు ప్రకాశించుతాయి. తదనుసారంగా, వారికి సర్వతా ఆదరణ ప్రాప్తిస్తుంది అదియే వారికి ఈశ్వరప్రదత్తమైన జన్మ జాత అధికారమై యున్నది.

## గాయత్రీ శాప విమోచనము మరియు ఉత్కీలన రహస్యము

గాయత్రీ మంత్రపు మహిమను కీర్తిస్తూ శాస్త్రములు, మహర్షులు అలసిపోలేదు. ఆ మంత్రపు ప్రశంస, మహిమకు సంబంధించి ఎంత చెప్పబడినదో, బహుశా అంతగా దేనికి చెప్పబడలేదు. ప్రాచీనకాలంలో గొప్ప గొప్ప తపస్సు జేసిన వారు ప్రధానంగా గాయత్రీ తపశ్చర్యచేతనే అభీష్టసిద్ధిని పొందారు. శపించుటకుగాని, వరము లిచ్చుటకుగాని వివిధ విధులచే గాయత్రీని ప్రయోగించేవారు.

ప్రాచీన కాలంలో గాయత్రీ గురుమంత్రము. నేడు గాయత్రీ మంత్రము ప్రసిద్ధము. మనుష్యులలో అధికాంశమునకా మంత్రము తెలియును. అనేకమంది ఏదోవిధంగా ఆ మంత్రాన్ని జపించుతున్నారు లేక ఏదైన అవసరం వచ్చినపుడు స్మరిస్తున్నారు. అయినప్పటికి దానివలన విశేషమైన ఫలము కలుగుటలేదు. దీని ఆధారంగా "గాయత్రీ మంత్రాన్ని ప్రశంసించుటలోను, మహిమను వర్ణించుటలోనూ, ఏదైనా అత్యుక్తి (అతిశయోక్తి) ఉన్నదా?" అనే శంక కలగడం కద్దు. ఆరంభంలో ఉత్సాహంగా ప్రారంభించి, కొద్దిరోజులలోనే వదలివేస్తారు అనేకమంది వారిలా అనుకొంటారు- "ఇన్ని రోజులనుండి గాయత్రీ ఉపాసన చేస్తున్నాము. కాని ప్రయోజనము శూన్యము అందువలన దీనికొరకువ్యర్థంగా వృధా చేయవలె?"

కారణమేమనగా, ప్రత్యేక కార్యాన్ని ఉపలక్షించినపుడు నియమిత పద్ధతిలో పూర్తిగావించవలె. ఇష్టమైన పనికొరకు, ఇష్టమైన పద్ధతిలో, ఇష్టమైనవిధంగా ఆరంభించిన యెడల అభీష్టసిద్ధి కలుగదు. యంత్రములతో చాలా కష్టమైన పనులు చేయవచ్చు. కాని వాటిని ఉచితరీతలో నడిపించినపుడే అది సాధ్యము. యంత్రములను నడుపుట తెలియని జ్ఞానిచే అవి పనిచేసినయడల, లేక గ్రుడ్డివారు వాటిని నడుపుటకు ప్రయత్నిస్తే, ప్రయోజనము లేకపోగా, కార్ఖానాకుగాని, నడిపే వ్యక్తికిగాని సంకటములు ఉత్పన్నమవుతాయి. మోటారు కారు చాలా వేగంగా ప్రయాణించే వాహనము. దాంతో వందల కొద్ది మైళ్ళు రోజుకు ప్రయాణించవచ్చు సుఖంగా. కాని డ్రైవింగ్ సరిగా తెలియని అజ్ఞాని నడిపితే, క్లచ్, బ్రేకులు సరియైన సమయంలో వాడటం తెలియనందున, యాత్ర జరగకుండుటేగాక, ప్రయాణీకులకు అరిష్టములు గలుగవచ్చు. యాత్ర నిష్ఫలం కావచ్చు. ఆ పరిస్థితులలో మోటారును తిట్టుట, దాని శక్తిపై అవిశ్వాసము వెల్లడించుట ఉచితముగాదు. అజ్ఞానులైన సాధకులు చేసే ఉపాసన నిష్ఫలమైనట్లయితే ఆశ్చర్య పడనవసరము లేదు.

ఏదైనా వస్తువు ఎంత గొప్పదౌతుందో, విశిష్టమౌతుందో, దానిని పొందుట అంతే కఠినమవుతుంది. ముత్యపు చిప్పలు సులభంగా దొరుకుతాయి. వాటిని ఎవరైనా ఏరుకొనవచ్చు. కాని ముత్యం కలసివున్నట్లయితే, సముద్రంలో దిగవలె. అపాయకరమైన ఆ పనిని ఇతరులనుండి నేర్చుకొనవలె. అజ్ఞానియైన మనుష్యుడెవరైనా బావిలోనున్న వస్తువులను పైకి తెచ్చే బాలుర ఆటవలె ఊహించి, సముద్రంలో దూకి మునిగినట్లయితే తన అజ్ఞానం వలన ఫలితం లేనట్లయితే ఆశ్చర్యపడగూడదు.

**నియమము, పద్ధతిలేకుండా గాయత్రీ సాధన చేసినందువలన పోని మాత్రము కలుగదు. ఇతర మంత్రముల కన్నా ఈ మంత్రములో విశేషమిదియే గాయత్రీ సాధనా**

పరిశ్రమ గూడా నిష్ఫలముగాదు. కొంతలో కొంతైనా ప్రయోజనము చేకూరుతుంది. కాని నియమవిధి ప్రకారమాచరించినందున వచ్చే ఫలితము మాత్రము రాదు. గాయత్రీ తాంత్రిక ఉపాసనలో విధి(ఆచరణపద్ధతి ననుసరింపని యెడల హానిగూడా జరుగుతుంది కానీ సాధారణ సాధనలో ఏమి అపాయము లేదు. కాని పరిశ్రమకు పూర్తి ఫలితము లేకపోవడంగూడా ఒకవిధంగా నష్టమే. అందువలన బుద్ధిమంతులైన మనుష్యులు తొందరకు, అహంకారమునకు, ధర్మవిరుద్ధమైన కోరికకు బానిసలు గారు. సాధనా మార్గములో, ఏనుగు నదిని దాటునపుడు 'థాహ్ థోహ్' అంటూ నెమ్మదిగా పురోగమింమనట్లు ఆలోచనలతో జ్ఞానంతో ముందుకు వెళతారు.

కొన్ని ఔషధములు నియమిత పరిమాణంలో తీసుకుని, శాస్త్ర పద్ధతిలో తయారుచేసి రసాయనముగావించి, నియమిత మోతాదులో, ప్రత్యేకమైన అనుపానంతో (మందుతో తీసుకొనవలసిన ఇతర రసములు మొదలయినవి) రోగి సేవించినట్లయితే ఆశ్చర్యకరమైన ఫలితాలుంటాయి. కాని ఔషధములను ఇష్టమైన మోతాదులో ఇష్టమైన అనుపానముతో సేవించితే నిశ్చయంగా ఫలితం వెడుగా వుంటుంది. ఆ ఔషదం విధిపూర్వకంగా ప్రయోగింపబడినపుడు అమృతోపమైన లాభము జరుగుతుంది. అవిధిపూర్వకంగా స్వీకరించినపుడు నిరర్ధకమౌతుంది. అపుడా ఔషదానికి దోష మారోపించడం న్యాయమని చెప్పలేము. గాయత్రీ సాధనను నియమము లేకుండా చేసినయెడల నియమంలో చేసినంత ప్రయోజనము కనుపించదు.

పాత్రుడు, కుపాత్రుడు(అర్హత, అర్హతలేని) గాయత్రీ శక్తిని యదేచ్ఛగా ప్రయోగింప లేరు. ఎందువలననగా మంత్రము కలియుగమునకు పూర్వమే బంధింపబడినది. ఆబంధమును విడదీయగలిగిన వ్యక్తియే లాభించ గలడు. తుపాకీ లైసెన్సు ప్రభుత్వము యోగ్యునికే ఇస్తుంది. పరమాణు బాంబు రహస్యం కొంతమంది వ్యక్తులకే పరిమిత మౌతుంది. ఏలనన ఎవరైనా దానిని దురుపయోగం చేయవచ్చు. అమూల్యమైన వస్తువులను ఇనుప పెట్టెలలో నుంచి, తాళములను వేసి బంధిస్తారు, అనధికారులు దానిన తెరువకుండా. ఈ కారణం వలననే గాయత్రీ మంత్రము బంధింపబడినది, దానిని ఎవ్వరూ దురుపయోగం గావించకుండా.

పురాణములలో వశిష్ఠులవారు, విశ్వామిత్రులవారు "గాయత్రీసాధన నిష్ఫల మగుగాక!" యని శపించారని ఉల్లేఖింపబడినది. ఇంత మహత్తర శక్తి నిష్ఫలమైనందున, హాహాకారములు చెలరేగాయి. అపుడు దేవతలందరు శాపవిమోచనము ననుగ్రహించమని ప్రార్థించారు అంతంలో శాపవిమోచన మార్గమేర్పడినది. ఎవరైతే శాపవిమోచన విధిని పూర్తిచేసి గాయత్రీ సాధన చేయుదురో వారి ప్రయత్నం ఫలిస్తుంది మిగతా వారి శ్రమ

నిరర్థకమవుతుంది. ఈ పౌరాణిక ఉపాఖ్యానములో నొక గహనమైన రహస్యమిమిడి యున్నది. దీనిని గ్రహించలేనివారు కేవలము "శాపవిముక్తోభవ" మంత్రములను పునరుచ్చరించి సాధన శాపవిముక్తి పొందినదని భావిస్తారు.

'వశిష్ట' పదమునకర్థము- "విశేష రూపము వలన శ్రేష్టమైనది" అని. గాయత్రీ (ఎవరైతే విశేష శ్రమ చేయుదురో, ఎవరైతే ఒకటింబావు కోటి (నూట ఇరవై ఐదు లక్షలు) జపము చేయుదురో, వారికి వశిష్ట పదవీయబడుతుంది. రఘువంశపు కులగురువు ఎల్లప్పుడు వశిష్టపదవి గ్రహించిన వ్యక్తియై వుండేవారు. రఘు, అజ, దిలీప, రామ, లవకుశుల వారి పూర్వుల, గురువు ఒక్కడే గాడు. వేర్వేరు. కాని ఉపాసనాధారంగా అందరూ వశిష్ట పదవిని పొందినారు. ఈవిధమైన వశిష్ట పదవిని పొందిన వారి నుండి గాయత్రీ ఉపదేశము పొందవలెనని, అది వశిష్ట శాపవిముక్తి పొందుట యని తాత్పర్యము. వారిని తన మార్గముచూపుటకు ఎన్నుకొనవలె. కారణమేమనగా, అనుభవము గల వ్యక్తియే మార్గమందుగల సాధక బాధకములను తెలిసినవాడు. వాటి నివారణో పాయముల నెరింగినవాడు. ఈత నేర్చుకొనదలచిన వ్యక్తి, ఈతలో నిపుణుడైన వ్యక్తిని దగ్గరుంచుకుంటాడు. ఈతలో ప్రమాదము సంభవించి ఈత నేర్చుకొనే వ్యక్తి మునిగిపోతూ వుంటే, నిపుణుడైన దగ్గరనున్న ఈతగాడు చేయూతనిచ్చి రక్షించి, సురక్షితంగాదాటించగలడు. ఈతలో మరచిపోయిన పద్ధతిని గుర్తుచేయగలడు కూడా. ఒకవేళ ఈతగాడు గాని, శిక్షకుడు గాని లేనపుడు ఈత నేర్చుకొనేందుకు బాలురు నీటిలో తిరుగుతూఉండే, వయసుమళ్ళిన వృద్ధులు గమనించి బాలురకు తెలియగలందులకు- "నాయనలారా! చెరువులలో దిగవద్దు. ఇందులో ఈతగాని శాపమున్నది. శాపవిముక్తి గానిదే ఈత నేర్చిన నిష్ఫలమవుతుంది". ఈ శబ్దములలో అహంకారమున్నమాట నిజమే. శాబ్దిక అత్యుక్తి యనిగూడా అనవచ్చు. కాని వాస్తవంగా అంతా సత్యమే. గురుని పర్యవేక్షణ లేకుండా ఈత నేర్వడం దుస్సాహసమే అవుతుంది.

ఒకటింబావు కోటి (125 లక్షలు) గాయత్రీ సాధన చేసిన ఉపాసక వశిష్టుని సంరక్షకత్వము పొందుటయే వశిష్ట శాప విమోచనము పొందుట. ఇందువలన సాధకుడు నిర్భయంగా, నదురు బెదురు లేకుండా తనమార్గంలో వేగంగా పయనించగలడు. అందువలన నూతన సాధకునకు అనేక కష్టములు దూరమవుతాయి. కోరిన లక్ష్యమునకు త్వరగా చేరగలడు.

గాయత్రీ మంత్రమునకు కేవలము వశిష్ట శాపమెకటేగాదు. ద్వితీయ శాపముగూడా నున్నది. అది విశ్వామిత్రునినుండి. ఈ రత్నకోశమునకు రెండవ తాళముగూడా నున్నది. ఏలనన అధికారమున్నవారే దానిని తెరచుటకు వీలవుతుంది. తొందరపాటుగల

వ్యక్తి, శ్రద్ధ లేనివాడు, సోమరిపోతు, పప్పులుడకవు. విశ్వామిత్ర అను పదమునకర్థము- ప్రపంచమునకు మేలు చేయువాడని పరమార్థమును కాంక్షించు వ్యక్తి. ఉదారుడు. సాధుపురుషుడు కర్తవ్య నిష్ఠాపరుడు. గాయత్రీ శిక్షకుడు (గురువు) కేవలము వశిష్ట గుణములు గలిగియున్న వ్యక్తి యైనంతమాత్రమున సరిపోదు. అధికంగా విశ్వామిత్రుడు గూడా యై వుండవలె. కఠోర సాధన తపశ్చర్యలచే దుర్మార్గ స్వభావము గలిగిన వ్యక్తులుగూడా సిద్ధిని పొందగలరు. రావణుడు వేదపారంగతుడు. ఆయన కఠోరమైన తపస్సు చేశాడు. మహా ఆశ్చర్యజనకమైన సిద్ధులు పొందాడు ఈ విధంగా రావణుని వశిష్టునిగా మన్నించవచ్చు. కాని విశ్వామిత్రుడు మాత్రము గానేరడు. ఏలనన ప్రపంచమునకు మేలుచేయుట, ధర్మాచార్య గుణము, పరమార్థ లక్షణములు పూజ్యము. (లేవు) స్వార్థము, లాలసత్వము సంకీర్ణ మనో ప్రవృత్తి గలిగిన వారెంత సిద్ధపురుషులైనా గాయత్రీ ఉపదేశమివ్వడానికి అర్హులు గారు. ఇదియే ద్వితీయ శాప విమోచనము, వశిష్ట, విశ్వామిత్ర గుణములు గలిగిన మార్గదర్శకుడు గురువు లభించినపుడు ఈ రెండు శాపములు వదలినట్లే అపుడా గాయత్రీ సాధకునికి లభించే ఫలము శాస్త్రములలో వర్ణింపబడిన ప్రకారముంటుంది.

ఈ కార్యము కష్టసాధ్యము ఏలనన వశిష్ట విశ్వామిత్ర గుణములచే సంపన్నుడైన వ్యక్తి గురువుగా లభించుట దుష్కరము. ఒకవేళ లభించినప్పటికీ అతడు ప్రతివాని బాధ్యత తనపైనుంచుకొనుటకు అంగీకరించడు. ఎందువలననగా, అతని శక్తి సామర్థ్యములు పరిమితమై వుంటాయి కావున ఏ కొద్దిమందికో అతడు సేవ చేయ గలుగుతాడు. అతడు ఇదివరకే తన పరిమితి మేరకు బాధ్యత తీసుకొని వున్నట్లయితే, అదనంగా సేవచేయటానికి కష్టము. పాఠశాలలో ఒక ఉపాధ్యాయుడు 30 మంది విద్యార్థుల వరకు బోధించగలడు. కాని ఆ సంఖ్య 60 అయినపుడు ఆ ఉపాధ్యాయుడు బోధించగలడా? బాలురు చదువుకొనగలరా? కావున పైన చెప్పబడిన సుయోగ్యుడైన గురువు లభించడు. లోభులు, స్వార్థపరులు. మోసకారులైన గురువులకు తక్కువలేదు. రెండు రూపాయలు గురుదక్షిణ సమర్పింపగానే, ఎవరికైనాసరే కంఠమాల వేసే వారు కోకొల్లలు. అట్టివారిని గురువుగా నియమించుట మోసము, హాస్యపూరితము.

గాయత్రీ దీక్ష గురుముఖంగా స్వీకరించవలె అపుడే ఫలదాయకమవుతుంది. తుపాకీ మందు నేలమీద గాని, మరెచ్చటనైగాని పరచి, అగ్గిపుల్లతో మండించితే అది మామూలుగా మండిపోతుంది. కాని దానినే తుపాకీలో దట్టించి విధిపూర్వకంగా ప్రయోగించితే భయంకర శబ్దంతో ఒక ప్రాణఘాతకమైనశక్తి ఉద్భవిస్తుంది. కాగితములపై ముద్రింపబడిన గాయత్రీ మంత్రోప[illegible] [illegible]కొనుట గూడా నేలపై బరచిన తుపాకీ

మందును నిప్పుతో వెలిగించుట, గురు ముఖతః నేర్చుకొనిన గాయత్రీ తుపాకిలో దట్టించి ప్రయోగించిన తుపాకీ మందు.

గాయత్రీ మంత్రాన్ని విధి పూర్వకంగా సాధన చేయడం మాత్రమే తన పరిశ్రమ సఫలీకృతమవడానికి సరియైన మార్గము. ఈ మార్గానికి ప్రధమ ఆధారము వశిష్ట విశ్వామిత్ర గుణములను గలిగిన మార్గదర్శకుని వెదకడం. అతడు తన శిష్యుని శాపవిమోచనము గావించగలగాలి. అటువంటి సుయోగ్య సంరక్షకుడు ప్రధమంగా సాధకుని మనోభూమిని, అభిరుచిని సామర్ధ్యాన్ని గమనిస్తాడు. తరువాత సాధకుని సాధనాకార్యక్రమాన్ని ఎంపిక జేస్తాడు. విద్యార్థి తనంతట తానుగా తానేక్రమములో పాఠములనభ్యశించవలెనో నిశ్చయించుగొనగలడా?

ఇది అధ్యాపకుడు నిర్ణయించవలసిన విషయం. విద్యార్థి ఏ తరగతికి చెందినవాడో తెలుసుకొని నిర్ణయించవలెగదా? ఏవిధంగా భిన్న భిన్న ప్రకృతులుగల ఒకే రోగమున్న రోగులకుకూడా, ఔషధం వేర్వేరు మాత్రలలో ఇవ్వబడుతుందో, అటులనే సాధకుల అంతరంగిక స్థితినిబట్టి మార్పు వుంటుంది. నిర్ణయం సాధకుడు స్వయంగా తీసుకొనలేడు. సుయోగ్యుడు, అనుభవశాలి, సూక్ష్మదర్శకుడైన మార్గదర్శకుడు మాత్రమే ఈకార్యాన్ని చేయగలడు.

ఆధ్యాత్మిక మార్గంలో పురోగమించడానికి శ్రద్ధ, విశ్వాసములు రెండు ప్రధాన శరణ్యములు. ఈ రెంటి యొక్క అభ్యాసం ప్రారంభంలో గురువుమ సాధనంగా చేసికొని నిర్వర్తించవలె. ఈశ్వరోపాసన చేసేటప్పుడు ప్రారంభదశలో నొక మూర్తిగాని చిత్రపటాన్నిగాని, జ్యోతిని గాని ఏవిధంగా ఏర్పరచుకొంటామో, అటులనే శ్రద్ధ, విశ్వాసములు ఉన్నతి, గురువు అనే పేరుగల వ్యక్తిపై దృఢంగా వుంచడంవలన లభిస్తాయి. ప్రేమ, స్త్రీపైగాని సోదరునిపైగాని, స్నేహితుడు మొదలైన వారిపై నుంటుంది. కాని శ్రద్ధాయుక్తమైన గురువు వల్లనే లభ్యమౌతుంది. మాతా పితలు గనుక వశిష్ట, విశ్వామిత్ర గుణములు గలవారైన వారు అందరికంటె ఉత్తమమైన గురువులు కాగలరు.

గురువు పరమ హితము గోరువాడు. శిష్యుని మనోభూమితోను పరిచయము గలవాడు. శిష్యుని బలహీనతలు తెలిసినవాడు. అందువలన శిష్యుని దోషములను తెలిసికొని , నెమ్మది నెమ్మదిగా వాటిని తొలగించే ఉపాయాన్ని ఉపయోగిస్తాడు. కాని శిష్యుని దోషములవలన అతనిని ఏవగించుకొనడు పరిత్యజించడు. శిష్యుని అవమానితునిగా, తిరస్కృతునిగా, దుష్టునిగా చేయడు. పోగా శిష్యుని దోషములను బాల్య చాపల్యముగా భావించి, క్రమేణా నిదానంగా అతని అభిరుచిని వేరొకదారిని మళ్ళించుటకు ప్రయత్నిస్తాడు. దానివలన అతనిలోని లోపాలు, బలహీనతలు తమంతట తామే అంతరిస్తాయి. కన్నతల్లి

తన వంటకములను ఆరగించి, ఆ ఆహారాన్ని తన స్తన్యము ద్వారా బిడ్డకు శక్తిని ఏవిధంగా కలిగించుతుందో, అదేవిధంగా యోగ్యుడైన గురువు తన సాధనద్వారా ఏకత్రితమైన ఆత్మ శక్తిని మెల్లమెల్లగా శిష్యుని అంతఃకరణములోనికి ప్రవేశపెడతాడు. గురువుయొక్క ఆత్మతేజాన్ని గ్రోలి శిష్యుని ఆత్మబలము వృద్ధి పొందుతుంది. ఈ మార్పిడిని పరిభాషలో "శక్తిపాతము" అని అంటారు. ఈ విధంగా గురువుని పొందడంలోగల పూర్వజన్మ సంచిత శుభ సంస్కార ఫలితములను, లేక పరమేశ్వరుని మహత్తర కృపా చిహ్నములను గుర్తించవలె.

మేము ప్రత్యేక సమయంలో ఒక వ్యక్తిని గురువుగా ఏర్పచుకొన్నాము! ఇపుడు వేరొక వ్యక్తిని మార్గదర్శకుడైన గురువుగా ఎన్నుకోవడానికి అధికారము లేదని అనేకులు భావిస్తారు. ఈవిధమైన ఆలోచనాసరళి ఎలా వుంటుందంటే, ఒక విద్యార్థి ఇలా అనడం "అక్షరాభ్యాసం చేసేటపుడు ఏ ఉపాధ్యాయుని గురువుగానెంచుకున్నానో జీవితాంతము వారిని తప్ప ఇతరులనుండి బోధనను స్వీకరించను. మరియు ఎవరిని గురువుగా అంగీకరించను".

ఒకే గురువు నుండి ప్రపంచమందలి అన్ని విషయములు పొందు అవకాశము లేదు. ఒకవేళ ఆ గురువు మరణించితే వేరొక ప్రదేశానికి వెళ్ళి పోయినట్లయితే, వారినుండి విద్యనభ్యసించవలెననే అభిలాష ఉచితమని యేస్థాయిలోను చెప్పగలమా? ఒక్కొక్కసారి శిష్యుడు ప్రథమ గురువు కంటే ఎక్కువ జ్ఞానవంతుడైనట్లయితే, అతని జిజ్ఞాస ఎక్కువ విస్తృతమైన యెడల, ఆదశలో అతని జిజ్ఞాసలకు సమాధానమూ ప్రాథమిక గురువు నుండే పొందవలెనని ఆశించినయెడల నది సంభవమా?

ప్రాచీన ఇతిహాసముపై దృష్టిసారించిన యెడలనీ కలహ కారణమునకు సమాధానం లభిస్తుంది. మహర్షి దత్తాత్రేయులవారు 24 మంది గురువుల నాశ్రయించారు. రామలక్ష్మణులిద్దరూ తమ కులగురువు వశిష్టుని నుండి శిక్ష (విద్య) స్వీకరించుటయేగాక వారు విశ్వామిత్రుని వద్దనుండి గూడా అధికంగా విద్యను పొందారు. వారిద్దరు గూడా రామలక్ష్మణులకు గురువులే. శ్రీకృష్ణ పరమాత్మ సాందీపని వారివద్దగూడా విద్య నభ్యసించారు. మరల మహర్షి దూర్వాసులవారు గూడా వారిగురువు . అర్జునుని గురువు ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు గూడా. ఇంద్రుని గురువు బృహస్పతి మరియు నారదులవారుగూడా. ఈ విధంగా అనేక ఉదాహరణలు మనకు లభ్యమౌతాయి. దీనివలన అవశ్యకతను బట్టి ఒకే గురువు శిష్యులకు రోక జేయవచ్చు. అటులనే ఒకే

శిష్యుడు అనేక మంది గురువులను సేవించి జ్ఞాన ప్రాప్తిని పొందవచ్చు. దీనికెట్టి పరిమితిలేదు. అందువలన ఒకరి తరువాత వేరొకరినుండి జ్ఞానమును పొందుట కెట్టి ప్రతిబంధకములు లేవు. అటులనే ఒకే వ్యక్తికి అనేకమంది పురోహితులుండవచ్చు. గ్రామ పురోహితుడు, కుల పురోహితుడు, రాష్ట్ర పురోహితుడు, దీక్ష పురోహితుడు మొదలైనవారు. గాయత్రీ సాధనకు మార్గదర్శకునిగా నెన్నుకోబడిన వ్యక్తి సాధన పురోహితుడు లేక బ్రహ్మపురోహితుడు. ఈ పురోహితులందరూ తమక్షేత్రములలో అవసరాన్నిబట్టి కార్యములలో సంప్రదించుటకు, పూజించుటకు యోగ్యులు. ఒకరికొకరికి వ్యత్యాసము లేదు. వారు కార్యమును పూర్తిగావించెడు వారే.

ఇరువది నాలుగక్షరముల గాయత్రీ మంత్రము సుప్రసిద్ధము. విద్యావంతులందరికీ మంత్రము విదితమే. కాని ఉపాసన గావించాలంటే, సాధనాజన్య లాభములను పొందవలెనంటే, గురుముఖంగా గాయత్రీదీక్ష తీసుకొనవలె. వశిష్ట విశ్వామిత్రుల శాపవిమోచనము గావించుకొని, కీలిత(బంధింపబడిన) గాయత్రీని ఉత్కీలన(బంధవిముక్తి) గావించి సాధనజేయవలె. గురుముఖంగా, గాయత్రీని స్వీకరించుటొక సంస్కారము. అందులో ఆ రోజు గురు శిష్యులిద్దరూ ఉపసించవలె. శిష్యుడు, గురువును చందన అక్షత, ధూపదీప, నైవేద్య అన్నవస్త్ర, పాత్ర దక్షిణలతో పూజించవలె. గురువు శిష్యునకు మంత్రము నీయవలె. మార్గదర్శకునిగా నుండే భారమును తనపై వేసికొనవలె. ఈ గ్రంధి బంధనము తదుపరి, తనకుపయుక్తమైన సాధనను నిశ్చయము జేయించుకొని శిష్యుడు శ్రద్ధా పూర్వకంగా పురోగమించుతాడు. భగవతీ గాయత్రీ కృపాపాత్రుడై అభీష్టసిద్ధిని పొందుతాడు.

గాయత్రీదీక్ష తీసుకొన్నప్పటినుండి, పూర్ణసిద్ధి లభ్యమయ్యేంతవరకు శిష్యుడు, తన సాధనా గురువును సమీపమునందుకొనవలె. ఎల్లప్పుడూ గురువును ప్రత్యక్షంగా దగ్గరనుంచుకోవడం కుదరదు. గురువు యొక్క చిత్రపటమును గాజుపలకయందు బిగించి పూజా మందిరమునందుంచవలెను. గాయత్రీ, సంధ్యా వందనము జపము అనుష్ఠానము లేక ఇతర సాధనలు ఆరంభించటానికి ముందు ఆ పటమునకు పూజ, ధూప, అక్షత, నైవేద్య పుష్ప చందనము (గంధము) మొదలైన వాటితో చేయవలె.

గురువు యొక్క చిత్రపటము దొరకనపుడు, అచటనొక కొబ్బరికాయను గురువుకు ప్రతి రూపముగా స్థాపించవలె. భిల్లుడైన ఏకలవ్యుని కథ ప్రసిద్ధము. ఆయన ద్రోణాచార్యుని మట్టిబొమ్మను స్థాపించి, వారిని గురువుగా భావించి, ఆ మూర్తిని

సంభావించి సంభాషించి బాణవిద్యను నేర్చుకొన్నాడు ఆయనటులే గొప్ప ధనుర్ధారిగా రూపొందాడు. ఏకలవ్యుని బాణవిద్యా కౌశలమునుగాంచి పాండవులుగూడా ఆశ్చర్యచకితులైనారు. అంతటి సఫలతను విలువిద్యలో అతడు సాధించాడు. చిత్రమునుగాని లేక కొబ్బరికాయగాని గురుమూర్తిగా భావించు కొని, పూజగావించి, గాయత్రీసాధన ఆరంభించవలె. అపుడాతడు శాపముక్తుడై ఉత్కీలన పొందుతాడు.

## గాయత్రీ సాకార ప్రతిమ - యజ్ఞోపవీతము

యజ్ఞోపవీతాన్ని "బ్రహ్మసూత్రము" అనిగూడా చెప్పబడుతుంది. దారమునుగూడా సూత్రమని అంటారు. కాని ఆసంక్షిప్త శబ్దానికర్థము చాలా విస్తృతమైనది. వ్యాకరణ, దార్శనిక, (వేదాంతశాస్త్రము), ధర్మకాండ మొదలైన అనేకశాస్త్రములందు గ్రంధకర్తలు తమ మనోభావములను చాలా సంక్షిప్తంగా సంస్కృత వాక్యములలో పొందుపరచారు. ఆ సూత్రములపై సుదీర్ఘవిషయములు, టిప్పణులు (అర్థసహిత వ్యాఖ్యలు), విమర్శతోగూడిన భావార్థములు జేయబడినాయి. వీనివలన సూత్రములలోని గూఢంగానున్న అర్థము విపులీకరింప బడుతుంది. బ్రహ్మసూత్రములో అక్షరములేనప్పటికీ సంకేతము ద్వార చాలా చెప్పబడినది మూర్తులు, చిహ్నములు, చిత్రములు, అవశేషములు, మొదలైనవాటి ఆధారంగా, విస్తృతమైన మహత్వ పూర్ణమైన విజ్ఞానము ప్రాప్తిసుంది. ఇందులో అక్షరములు లేనప్పటికీ అవి చాలా విషయములను ప్రకటిస్తాయి. ఒకరు వేరొకరికీ సైగతో తమ మనోభావములను ప్రకటించుకొనవచ్చు. కాని ఆ సైగలో, శబ్దముగాని, లిపి గాని ప్రయోగింపబడదు. యజ్ఞోపవీతము బ్రహ్మసూత్రమైనప్పటికీ, మాటగాని, అక్షర లిపిగాని లేదు. కాని అందులోనొక విపుల వ్యాఖ్యానము యొక్క అభిభావన నిండివున్నది.

గాయత్రీ మంత్రమును గురుమంత్రమని వచింపబడుతుంది. యజ్ఞోపవీత ధారణ సమయమున వేదాధ్యయనారంభం జేసేటపుడు, గాయత్రీ మంత్రముతో జేయబడుతుంది. ప్రత్యేకంగా ద్విజులకు యజ్ఞోపవీతము ధరించుటెంత అవసరమో, గాయత్రీమంత్రాన్ని తెలుసుకొనుట గూడా అంతే అవసరము, అనివార్యము. ఈ గాయత్రీ యజ్ఞోపవీతములు (కలయిక) జత లక్ష్మీనారాయణ, సీతారాములు, రాధేశ్యామ్ ప్రకృతి- బ్రహ్మ, గౌరీశంకర్ నరనారీల, జంటలలాంటిది. రెంటి సమ్మిశ్రముతోనేయొక పూర్ణప్రమాణ మేర్పడుతుంది. స్త్రీ పురుషుల సమ్మేళనమును గార్హస్థ్యమని ఎటుల వ్యాఖ్యానిస్తామో, గాయత్రీ-ఉపవీతముల కలయిక అటులనే ద్విజత్వము. ఉపవీతము

సూత్రమైతే, గాయత్రీ దాని వ్యాఖ్యానము. రెండిటి ఆత్మలు వొకదానితో వొకటి పెనవేసికొని వున్నాయి.

యజ్ఞోపవీతములో మూడు దారములున్నాయి. గాయత్రీలో మూడు చరణము లున్నాయి 'తత్సవితుర్వరేణ్యం'ప్రథమ చరణము 'భర్గోదేవస్య ధీమహి' ద్వితీయ చరణము. 'ధియో యోనః ప్రచోదయాత్' తృతీయ చరణము. మూడు తంత్రులకు తాత్పర్యమేమి. దీనిలోనే అనుమానము తొలగింపబడినది. ఈ విషయమును తెలిసి కొనవలయును.

ఉపవీతము (జంధ్యము) లో మూడు ముడులు ప్రథమంగా నుంటాయి మరి యొక బ్రహ్మగంగ్రధి (ముడి) వుంటుంది. గాయత్రీలో మూడు వ్యాహృతులు (భూర్భువఃస్వః) మరియు వొక ప్రణవము (ఓం) వుంటుంది. గాయత్రీ ప్రారంభంలో నున్న ఓం కారము, మరియు భూః ర్భువః, స్వః, లకే తాత్పర్యమున్నదో, అదే యజ్ఞోపవీతమునకున్న మూడు గ్రంధుల (ముడులు) యొక్క సంకేతము. దీనిని గ్రహించిన వ్యక్తికి యీ నాలుగు ముడులే యే సందేశములిస్తాయో తెలుసు కొనగలడు.

ఈ మహా విజ్ఞానమును సరళ మొనరించుటకు దీనిని నాలుగు భాగములుగా విభజించవచ్చు.

1. ప్రణవము అటులనే ఆమూడు వ్యాహృతులు అనగా యజ్ఞోపవీతము యొక్క నాలుగు తంత్రులు.
2. గాయత్రీ యొక్క ప్రథమ చరణము. అనగా యజ్ఞోపవీతపు ప్రథమ పేట (దారము)
3. రెండవ చరణము. అనగా రెండవ పేట (దారము)
4. మూడవ చరణము అనగా మూడవ పేట.

(యజ్ఞోపవీతమునకు మూడుపేట (దారము) లుంటాయి వీనిని గురించి విచారించుదము :

**1. ప్రణవమునకు సంకేతమిది :** పరమాత్మ సర్వత్రా, సమస్తప్రాణులలో నున్నాడు. అందువలన లోకసేవకై నిష్కామ భావనతో కర్మచేయవలెను. తన మనస్సును స్థిరంగానూ, శాంతముగా నుంచుకొనవలె.

**2. 'భూః' కు తత్వజ్ఞానమిది :** శరీరము ఎముకలతో తయారుకాబడిన పని ముట్టు మాత్రమే. కావున దానిపై అత్యధిక ఆసక్తి లేకుండా, ఆత్మ బలము పెంపొందుటకు శ్రేష్ఠమార్గమైన సత్కర్మల నాశ్రయించవలె.

**3. 'భువః' కు తాత్పర్యము :** పాపకార్యములందు విముఖుడైన వ్యక్తి దైవత్వాన్ని పొందగలడు పవిత్రాదర్శములను, సాధనలను తనవిగా జేసికొన్న వ్యక్తి బుద్ధిమంతుడు.

**4. 'స్వః' కు ప్రతిధ్వని :** వివేకముతో, నిర్మలమైన బుద్ధితో సత్యపదార్థమును తెలిసికొనుటకు, సంయమనము, త్యాగరీతులను ఆచరించుటకు స్వయంగా ఆచరించి ఇతరులను ప్రేరేపించవలె.

ఈ చతుర్ముఖ నీతిని యజ్ఞోపవీతధారి పాటించవలె. దీని సారాంశమేమనగా, ఉచితమార్గంలో పయనించి నీ శక్తిని పెంపొందించుకో అంతఃకరణమును ఉదారబుద్ధిలో వశముగావించుకొని నీ శక్తులలో అధిక భాగమును ప్రజా హితముకొరకు వినియోగించు ఈ కళ్యాణకరమైన నీతిని అవలభించినందున మనుజాడు వ్యష్టి రూపంగాను, సమస్త ప్రపంచంలో సమిష్టి రూపంలో సుఖశాంతులను పొందగలడు. యజ్ఞోపవీతము గాయత్రీ యొక్క ప్రతిమా స్వరూపము వ్యక్తిగత, సామాజిక సుఖశాంతులు స్థిరంగా వుండాలంటే, ఈ సందేశముతప్ప మనుష్యజాతికి వేరొకటిలేదు.

దేవలోకములో నొక కల్పవృక్షమున్నది. దానినీడలో విశ్రమించి నపుడు కోరిన కోరికలెల్లా వెంటనే తీరుతాయి. కావలసిన వస్తువులెల్లా లభిస్తాయి. ఆ కల్పవృక్ష మెవరివద్దనుంటుందో వారి సుఖము, తృప్తిని అంచనా వేయలేము.

ఈ భూమిమీద గూడా నొక కల్పవృక్షమున్నది. దేవలోకపు కల్పవృక్షమువలె సమస్త వాంఛలు అందులో నిగూఢంగానున్నాయి. దానిపేరు-'గాయత్రీ'. గాయత్రీ మంత్రమును స్థూలదృష్టితో జూచిన యెడల నది 24 అక్షరములు మరియు తొమ్మిది శబ్ద శృంఖలము మాత్రమె, కాని గంభీరంగా సూక్ష్మదృష్టితో పరిశీలించి నట్లయితే, దానిలోని ప్రతి శబ్దానికి, ప్రతి అక్షరమునకున్న తత్వములు, కల్పవృక్షము వద్దనున్న అన్ని వాంఛలవలె, అన్నీ నిబిడీ కృతమై యున్నవి.

తరువాత పేజీలలో గాయత్రీ కల్పవృక్ష చిత్రమీయబడినది. దానిలోని 'ఓం' ఈశ్వరుడు. అది భారతీయ ధర్మమునకు మూలమని చెప్పబడినది. దీని నుండి ముందుకుసాగితే,మూడు భాగములున్నవి. అవి 'భూః' 'భువః' 'స్వః' । 'భూః' అను దానికర్థము ఆత్మజ్ఞానము. 'భువః' అను పదమున కర్థము కర్మయోగము. 'స్వః'

అనుదానిక తాత్పర్యము స్థిరత్వము, సమాధి ఈ మూడు శాఖలలోనుండి ప్రత్యేకంగా మూడుశాఖలు వెలువడినాయి. వానిలో ప్రత్యేకంగా తమతమ అర్థమున్నది. 'తత్' జీవనవిజ్ఞానము. 'సవితుః' అనగా శక్తి సంచయము. 'వరేణ్యం' - శ్రేష్ఠత్వము 'భర్గో'- నిర్మలత్వం 'దేవస్య' అనగా దివ్యదృష్టి 'ధీమహి' సద్గుణములు 'ధియో' - వివేకము., యోనః' - సంయమము ప్రచోదయాత్- సేవ, మన మనోభూమిలో 'గాయత్రీ' వీటిని నాటుతుంది. ఫలితంగా ఏ క్షేత్రములో అంకురిస్తుందో అది కల్పవృక్షము కన్నా యే విధంగానూ తక్కువగాదు.

కల్పవృక్షపు ఆకులు రత్న స్థగితమై నవని ఉల్లేఖింపబడినది. అవి రత్నములవలె సుశోభితమై బహు మూల్యవంతమైనవి. గాయత్రీ కల్పవృక్షము యొక్కపైన పేర్కొనబడిన తొమ్మిది పత్రములు నిస్సందేహంగా నవరత్నములకు సమానంగా విలువగలిగి మహత్వ పూర్ణమైనవి. ఒకొక్క పత్రము ఒక్కొక్క గుణము, రత్నము కన్నా తక్కువగాదు. నగలలో 'నవరత్న హారము' ప్రసిద్ధమైనది. తొమ్మిదిలక్షల రూపాయలు వెచ్చించి తయారు జేయబడిన హారమును ధరించిన వారు తాము గొప్ప భాగ్యశాలురని తలపోస్తారు. ఏకంగా తాత్విక దృష్టితో గంభీరంగా దూరదృష్టితో పరికించితే యజ్ఞోపవీతము గూడా నవరత్న జనిత నవలక్ష హారమునకేమీ తీసిపోదు.

'గాయిత్రీ' గీత ప్రకారం యజ్ఞోపవీతపు తొమ్మిది దారములు గుణములను ధారణం జేయవలెనని ఆదేశిస్తుంది. నవరత్నములకన్న తొమ్మిది గుణములు అధికశక్తిగల వని సందేశమిస్తుంది.

**1.** జీవన విజ్ఞానము తెలిసినపుడు మనుష్య, జన్మ మరణముల రహస్యము బోధపడుతుంది. అతనికి మృత్యువంటే భయముండదు. ఎల్లపుడూ నిర్భయంగా వుంటాడు. అతనికి సాంసారిక వస్తువులపై లోభమోహములుండవు. తత్ఫలితం సంసార సాగరములో మునిగి హాని వృద్ధులకొరకై దుఃఖమనుభవిస్తూ, మరియు సుఖ సంతోషముల మదంతో పొంగిపోకుండా రక్షింపబడతాడు.

**2.** శక్తి సంచయమును తనదిగా జేసుకొనే వ్యక్తి రోజురోజుకు స్వస్థతపొంది, విద్వాంసుడై, బుద్ధి మంతుడై, సహయోగ సంపన్నుడై, కీర్తి ప్రతిష్ఠలను పొందుతాడు. నిర్బలులపై ప్రకృతి, అటులనే బలవంతులపై దౌర్భాగ్యము, ఆక్రమణ చేస్తాయి. వీటినుండి రక్షింపబడుటయేగాక శక్తి సంపన్నుడైనందున జీవితములోని నానా విధములైన ఆనందములనుభవిస్తాడు. తన శక్తి ద్వారా దుర్బలులకు సహాయంచేసిన పుణ్యములో

భాగస్వామి అవుతాడు. శక్తి చాలినంత లేనపుడు మాత్రమే అవినీతి అచ్చట ప్రజ్వరిల్లుతుంది. శక్తి సమీకరణ స్వాభిమానము యొక్క పరిణామము- అవినీతి అంతరించుట సర్వులకూ కల్యాణ కారకము.

3. శ్రేష్ఠత్వమునకు, అస్తిత్వము పరిస్థితులలో లేదు. ఆలోచనలలో నున్నది. సాధనా సంపన్నుడై పురోగమించిన వ్యక్తియై యున్నప్పటికీ లక్ష్యము, సిద్ధాంతము ఆదర్శము, అంతఃకరణ దృష్టిలో పతితుడైతే, అతనిని నికృష్టుడని నుడువవచ్చు. అట్టి నికృష్టుడు తన ఆత్మ దృష్టిలో, పరమాత్మ దృష్టిలో, వివేకవంతులైన వ్యక్తుల గంభీరదృష్టిలో, నీచశ్రేణికి జెందినవాడుగాపరిగణింపబడతాడు. తన నీచత్వమునకు శిక్షగా, ఆత్మ దండన ఈశ్వరీయదండన పొంది, బుద్ధిభ్రమించి నందున మానసిక అశాంతిలో మునుగుతాడు. దీనికి వ్యతిరేకంగా, బీదవాడైనప్పటికీ, అతని ఆదర్శము, సిద్ధాంతము, ఉద్దేశ్యము, అంతఃకరణము ఉన్నతంగా ఉదారంగా, నున్నట్లయితే, అతనిని శ్రేష్ఠుడని చెప్పవచ్చు. ఈ శ్రేష్ఠత్వము ఆతనికి అంతులేని ఆనందాన్నిస్తుంది. సాంసారిక సంపద యెంత యెక్కువ వున్నప్పటికీ ఆ ఆనందాన్ని పొందుట దుర్లభము.

4. నిర్మలత్వమునకు అర్థము సౌందర్యము. సౌందర్యమును కేవలము మనుష్యులే గాదు, పశుపక్ష్యాదులు, క్రిమికీటకాలు, గూడా గాఢంగా వాంచించుతాయి. కురూపత్వమునకు కారణము మురికియన్నది నిర్వివాదము. మలినత్వమున్నచోట అసహ్య రూపముంటుంది. అచట నుండి దూరంగా నుండుట కందరూ ఇష్టపడతారు. శరీరంలో లోపల మలము నిండియున్నట్లయిన, వ్యక్తి బలహీనుడై రోగ గ్రస్థుడౌతాడు. అందువలన, వస్త్రములు, భోజనము చర్మము. వెంట్రుకలు మొదలైన ప్రయోజనీయ పదార్థములు మలినమైనచో అతడు అస్వస్థుడై, నికృష్టుడై, నిందనీయుడై, ఏవగించుకో బడతాడు. మనస్సులో, బుద్ధిలో అంతఃకరణమందు,మలినమున్న చెపుటకేమున్నది. మానవుని స్వరూపము పశువుకన్నా, పిశాచికన్నా చెడుకావడానికి ఆస్కారమున్నది. ఈ వికృత శక్తుల నుండి విముక్తి పొందడానికి ఏకైక మార్గము "సర్వతోముఖ నిర్మలత". అంతఃకరణ నిర్మలత బాహ్య నైర్మల్యమున్నవారి సంపాదన, ఆలోచన విధానము దేహము వాక్కు, పోషణ, కుటీరము, అవసరమైన సామాగ్రి నిర్మలంగా స్వచ్ఛంగా, శుద్ధంగా, సర్వసుందరంగా, ప్రసన్నంగా, ప్రఫుల్లంగా, మృదువుగా నుండి సంతుష్టి గోచరిస్తుంది.

5. దివ్యదృష్టితో చూడడమనగా అర్థం - ప్రాపంచిక దివ్యతత్వములలో తాను సంబంధము కల్పించు కొనుట. ప్రతి వస్తువు తన స్వజాతీయ పదార్థమును తన వైపు

ఆకర్షించుకొంటుంది. ఆ పదార్థము వైపుగూడా ఆకర్షింపబడుతుంది. ఒక వ్యక్తి దృక్పథము ప్రపంచంలోని మంచి విషయములను గమనించి తెలిసికొని, తమవిగా జేసుకొనేందుకైనపుడు, అతడు అన్ని దిశలయందు మంచి వ్యక్తులనే జూస్తాడు. ప్రజోపయోగము కొరకు పెద్దమనిషిగా, సేవాభావంతో, సహకారము, సత్కార్యములపై మనస్సు లగ్నం జేసినపుడు, ప్రజలలోని చెడుకంటె మంచివున్నదని గోచరిస్తుంది. ప్రపంచం మనకు అపకారంకన్నా ఉపకారమే అధికంగా జేస్తుందని భావము కలుగుతుంది. కండ్లకు ధరించిన కండ్లజోడు రంగే ప్రతివస్తువుపై ప్రసరించి, అన్నీ అరంగే అనే భావము కలుగుతుంది. ఎవరి దృష్టి దోషభూయిష్టమో వారికి అందరూ, అంతా చెడుగావుంటుంది. ఎవరుదివ్యమైన దృష్టితో పరిశీలించెదరో వారు పరమేశ్వరుని యొక్క యీ పరమపునీత ఉద్యానం సర్వతోముఖ ఆనందమే - ఆనందము వర్షించడం దర్శిస్తారు.

**6. సద్గుణములు :** తనలో మంచి అలవాట్లను కలిగివుండడం, ఉత్తమమైన అర్హతలు, ఉదాత్తమైన ఆధిక్యతలు కలిగి వుండటానికి సద్గుణములని అంటారు. వినయము, నమ్రత, శిష్టాచారము, మధుర భాషణము, ఉదారంగా ప్రవర్తించడం సేవా సహాయభావములు, నిజాయితీ, పరిశ్రమ, శీలత్వము, సమయ, క్రమశిక్షణ మితముగా వ్యయముజేయుట, కర్తవ్య పరాయణత్వము, ప్రసన్న ముఖముద్ర, ధైర్యము, సాహసము, పరాక్రమము, పురుషార్థములు, ధర్మము, కామము, మోక్షము ఆశ ఉత్సాహము మొదలైన వన్నీ సద్గుణములు, సంగీతము, సాహిత్యము, కళ, శిల్పము, వ్యాపారము, వక్తృత్వము, వ్యవసాయము ఉద్యోగము (శ్రమించుట) శిక్షణ మొదలైన యోగ్యతలు కలిగ వుండడం గూడా సద్గుణములే. ఈ సద్గుణములు గలిగిన వ్యక్తి ఆనందమయ జీవితాన్ని గడుపుతాడు. అతని కల్పనలన్నీ సహజంగా జరుగుతాయి.

**7. వివేకము :** ప్రత్యేకమైన ఆత్మిక ప్రకాశము. వివేకమువలన సత్యాసత్యముల, ఉచితానుచితములు, అవశ్య అనావశ్యకములు, హాని లాభములు, పరీక్షింపబడతాయి. ప్రపంచంలో అసంఖ్యాకమైన పరస్పర విరుద్ధయోగ్యతలు, అలవాట్లు ఆలోచనా విధానములు ప్రచారంలో నున్నాయి. ఇందులో ప్రతివాని వెనుక కొంత ఆధారము కొన్ని ఉదాహరణలున్నాయ్. అటులనే కొన్ని గ్రంథములు మహాపురుషుల నామములు గూడా తప్పక జోడింపబడి వుంటాయి. అటువంటి సమయాల్లో విరోధమైన విషయములలో గ్రహింప దగిన దేది? విసర్జింప దగినదేది? యని నిర్ణయించుట బహు కఠినము, కష్టము. అదీగాక దేశకాల పరిస్థితులు, ఉపయోగము, ప్రజాహితము మొదలైనవి గుర్తించి సద్బుద్ధినే నిర్ణయము గావింపబడవలె. అదియే సర్వులకు

గ్రాహ్యము. ప్రమాణము. సరియైన నిర్ణయమెవరు చేయగల్గుదురో వారు సులభంగా సుఖశాంతులు లక్ష్యమును చేరుకుంటారు. ప్రపంచంలో అధికాంశము కలహ, క్లేశ, పాప, దుఃఖములకు కారణం దుర్బుద్ధి, భ్రమ అజ్ఞానములై వున్నవి. వివేక వంతుడీ చిక్కులన్నీ సునాయాసంగా అధిగమించగలడు.

8. **సంయమనము :** జీవన శక్తిని, ఆలోచనాపరిధిని, భోగేచ్ఛను. క్రమనుసరిగా నియమించుటయే సంయమనము. వీటిని నిరోధించగూడదు, నష్టపరచకుండా నిరుపయోగముగాకుండా, అనుచిత మార్గములో వ్యయము గాకుండా వుంచటాన్ని సంయమనమునకు తాత్పర్యము. మానవ శరీరం ఆశ్చర్యజనక శక్తులకు కేంద్రస్థానము. ఆ శక్తులను వృధాగాకుండా సవ్యమైన ఉపయోగ దిశలో మళ్లించిన యెడల ఆశ్చర్యకరమైన ఫలితాలొస్తాయి. జీవితానికొక ప్రత్యేక మార్గంలో అభివృద్ధి కలుగుతుంది.

9. సేవ : సహాయం , సహకారం, ప్రేరణ, అభివృద్ధివైపు ముందుకు సాగుట మొదలైనవన్నీ అన్నిటికన్నా మించిన సేవలు. మన శరీరం మన మస్తిష్కములకు అన్నిటి కన్నా ఎక్కువ సేవా పాత్రమై ఉన్నది. ఏలనన అవి మనకు చాలా సమీపాన వున్నవిగూడా. దాన మివ్వడం సమయదానం జేయడం, ప్రతి ఫలమాశించక తన శారీరక, మానసికశక్తుల నెవరికైనా ఉపయోగించడాన్ని 'సేవ' అంటారు. ఈ త్యాగంవల్ల ఇతరులలో ఏక్రియాశక్తిగాని, ఆత్మనిగ్రహం, స్ఫూర్తి, ప్రేరణ, జాగృతి కలిగాయా లేదా అనే కోరికలేదు. కొన్ని రకాలైన సేవలు ఇతరులలో, సోమరితనం, పరావలంబనత్వము, ధనకాంక్షను కల్గించుట వలన నవి హానికరమైన సేవలు. కావున మన సేవలు ఇతరులలో ఉత్సాహాన్ని, ఆత్మ విశ్వాసాన్ని, క్రియాశీలతనూ, ప్రేరేపించి ఉత్తేజితుల నొనరించుటకు దోహదకారులుగా వలె. సేవకుఫలం - ఉన్నతి ! సేవద్వారా తనకు, ఇతరులకు సమున్నతి కలుగుట, ప్రపంచము అధిక సుందరము ఆనందమయ మగుట మహా పుణ్యకార్యము. ఈ విధమైన సేవాభావముగల పుణ్యాత్ముడు, ఆత్మదృష్టిలో సదాసుఖుడై సంతుష్టుడైవుంటాడు.

ఈ తొమ్మిది గుణములు నిస్సందేహంగా తొమ్మిది రత్నాలు మరకత, మాణిక్య,వజ్ర వైఢూర్య, ముత్య, గోమేధిక, పుష్యరాగ, నీల, ప్రవాళములను నవరత్నాలంటారు. ఈ నవరత్నా లెవరివద్దవుంటాయో వారు సర్వసుఖులై వుంటారని నానుడి. కాని భారతీయ ఆధ్యాత్మిక శాస్త్ర ప్రవచనము - 'ఎవరివద్ద యజ్ఞోపవీతము, మరియు గాయత్రీ మిశ్రిత నవరత్నాలుంటాయో అతడు సిరిసంపదలు, భూమి, ఆస్తులు లేనప్పటికీ, వర్తమాన కాలపు కుబేరుడు. ఈ నవరత్న మండిత కల్పవృక్ష మెవరి వద్దనున్నదో, ఆ వివేకయుక్త

యజ్ఞోపవీతధారి సదాసుర లోకసంపదననుభవిస్తాడు. అతనికి భూలోకమే స్వర్గలోకము. ఆ కల్పవృక్షము నాలుగు ఫలములను ప్రసాదించుతుంది. ధర్మ, అర్ధ, కామమోక్షములను నాల్గు సంపదలతో మనలను పరిపూర్ణులను జేస్తుంది.

## గాయత్రీ సాధకులకు యజ్ఞోపవీతము అవసరము, ముఖ్యము :

అనేకమంది యజ్ఞోపవీతమును ధరించుట తమకు సాధ్యముగాదని, నిర్వహించ లేమని తలపోస్తారు. సంయమములను పాటించలేమని భావిస్తారు. ఇది "నా మనస్సులో ఈశ్వరభక్తి లేదు. కావున పూజచేయను" అని అన్నట్లుగా వున్నది. పూజ చేయటం భక్తి కలుగుటకు, భక్తి వున్నట్లయితే పూజచేయటం అనవసరం. ఇది యజ్ఞోపవీతపు విషయంలో గూడా వర్తిస్తుంది. ధార్మిక నియమములను పాటించడం తమంతట తామే కలిగినట్లయిన యజ్ఞోపవీతము ధరించే ఆవశ్యకత ఎందుకు? నియమములు సమయానుకూలంగా నిర్వహించలేనివారు,యజ్ఞోపవీతము వున్నందున ఆ నియమములను పాటిస్తారు నియమములు నిర్వహించలేనివారికి జంధ్యము తప్పకఅవసరము. దానిని ధరించవలె. వ్యాధిగ్రస్థునకే ఔషధము అవసరము. వ్యాధి లేనపుడు ఔషధపు ఆవశ్యకత లేదు.

నియమములనెందుకు అలవాటు గావించుకొనవలె? దీనిని గురించి ప్రజలకు చిత్రమైన ఆలోచనలున్నాయి. భోజన సమయములందు నియమములకు మాత్రమే జంధ్యమవసరమని పలువురు భావిస్తారు. స్నానము చేయకుండా ప్రయాణము చేసిన ఆహారము (ప్రయాణములో తీసుకెళ్ళినది) రాత్రి మిగిలిన ఆహారము తమవారు గాక, ఇతరుల చే వండబడిన ఆహారమును భుజించకుండుటకూడా యజ్ఞోపవీత నియమమని గూడా పెక్కుమంది అభిప్రాయము. ఇది చాలా అసమంజసము. భ్రమతోగూడిన ఆలోచన. యజ్ఞోపవీత ఉద్దేశ్యము మానవ జీవితమునకు సర్వాంగపూర్ణ ఉన్నతిని కలుగజేయుట. ఈ విశిష్టతలలో సంపూర్ణ ఆరోగ్యముగూడ ఒకటై వున్నది. దానికోసం ఇతర నియమములను పాటించడంతోపాటు భోజనానికి సంబంధించిన నియమములను సావధానంగా అవలంభించుటగూడా ఉచితము. ఈ దృష్టితో జంధ్యము ధరించిన వ్యక్తి భోజనసంబంధమైన నియమములను పాటించుట మంచిది. కాని కొందరు ద్విజులు తమ జీవనంలో సర్వాంగీకారమైన ఉన్నత నియమములను పాటించుటలేదు. కాని భుజంపై జంధ్యాన్ని ధరించి మాత్రం వుంటారు. ఒకవేళ భోజనానికి సంబంధించిన విషయాలలో లోట్లు జరిగినంతమాత్రాన, జంధ్యాన్ని ధరించుటకా

పొరపాట్ల కారణమువలన అధికారము కోల్పోయామని తలంపరాదు. అసత్యమాడి నందువలన దురాచారదృష్టి గలిగినందున, నిజాయతీ లేనందున, సోమరియై నందున, వ్యసన గ్రస్తుడైనప్పటికీ, జంధ్యాన్ని విసర్జించ నవసరము లేనపుడు, కేవలము భోజన నియమములలో, అప్పుడప్పుడు కొంచెము నియమోల్లంఘన జరుగుతుంది గావున యీ ఆలోచన సరియైనదని భావించలేము.

మలమూత్రములు విసర్జించునపుడు జంధ్యము చెవులపై నుంచుకొనుట మరచినపుడు భయం కలుగుతుంది. ఈ భయంవలన అనేకులు జంధ్యము ధరించరు లేక ధరించుట మానివేస్తారు ఈ అలవాటు కఠోర నియమంగా పాటించవలెననేది నిజం. కాని, ప్రథమంలో అలవాటుపడేంతవరకు, ఈ తొమ్మిది శిఖలకు కొంత సౌకర్యము కలుగవలె. అందువలన ఒక్కొక్కరోజు మూడుసార్లు జంధ్యములను మార్చవలసిన అవసరము కలుగుతుంది. అందువలన జంధ్యాన్ని కంఠానికి చుట్టుకొనవలె. అందువలన అది పైకి వస్తుంది. చెవులకు చుట్టుకొన్నందువలన మలమూత్రముల అశుద్ధ స్పర్శ దానికి కాదు కంఠానికి చుట్టుకొన్నందున (ఒక ముడి) జంధ్యము నడుమునుండి పైకి వెళుతుంది. అందువలన ఒకవేళ చెవులకు చుట్టుకోవడం మరచినప్పటికి అశుద్ధ సంగత్యము కలుగదు. కొన్ని రోజులు అలవాటయ్యేటప్పటికి కంఠానికి చుట్టుకోవలసిన అగత్యముగూడ ఉండదు.

చిన్న వయస్సుగల బాలురకోసం, మతిమరుపుగల వ్యక్తులకోసం, మూడు పోగుల యజ్ఞోపవీతమును వ్యవస్థీకరించవచ్చు. అందుకనే మూడు మూడు పోగుల పేటలు. కావున ఆచార్యులు ఉపవీతమును (జంధ్యమును) 'కంఠీ' శబ్దముతో సంబోధిస్తారు. బాలురకు ఉపనయనము జరిగేటప్పుడు, వారికి దీక్షతోపాటు 'కంఠీ'ధరింపచేస్తారు. ఈరోజునగూడా "గురువు" నామాన్ని ధరించే పండితులు మెడకు కంఠీ ధరించి చెవిలో మంత్రము చెప్పి, గురుదీక్ష నిస్తారు.

మనోపరిపక్వము చెందని వ్యక్తి యజ్ఞోపవీతమును నిత్యమూ శుభ్రపరచడం గురించి పూర్తిగా ధ్యానముంచడం బహుశా మరచుట కద్దు. కావున శరీరానికున్న మలినం జంధ్యానికంటుకుంటుంది. ఫలితంగా దుర్వాసన, మలినం, రోగక్రిములు అందులో చేరుతాయి. ఆస్థితిలో 'కంఠీ' కంఠమును, శరీరాన్ని తక్కువ స్పృశించేటట్లు ఉపాయములు వెదకవలసి వస్తుంది. దీని నిమిత్తం తులసి పూసలు, రుద్రాక్షలు లేక ఇతర వస్తువుల గింజలు 'కంఠీ' దారానికి చుట్టబడతాయి. ఫలితంగా రెండూ శరీరాన్ని స్పృశించుతాయి

స్వేదము అంటకుండా, శుద్ధి ప్రమాదము నుండి రక్షణ దొరుకుతుంది. అందువలననే పూసలున్న కంఠమాల ధరించవలె. ఏలనన ఉపవీతము గాయత్రీ యొక్క మూర్తివంతమైన ప్రతీక. దానిని ధరించకుండ 'భగవతి' యొక్క సాధనమునకు ధార్మికాధికారము కలుగదు. నేడు క్రొత్త ఫాషనులలో ఆభరణములను ధరించడం తగ్గినది. కాని కంఠానికి మాత్రము కంఠమాలలు ఏరూపములోనైనా ధరించడం స్త్రీ పురుషుల కలవాటున్నది. పేద స్త్రీలు కంచు కంటెలు ధరిస్తారు. ఈ భూష ణములను హారము, నెక్లెస్, మాల, కంటె మొదలైన పేర్లతో వ్యవహరిస్తారు. కాని వాస్తవంగా ఇవి "కంఠీలు" మాత్రమే స్త్రీలవద్ద ఇతర ఆభూషణములున్నా లేకున్నా, పేదస్త్రీలుకూడా ఏదోరూపంలో కంఠమాలను ధరించడం మాత్రం నిశ్చయము. దీనివలన భారతదేశపు స్త్రీలు తమ సహజ ధార్మిక ప్రేమను ఏదో ఒక రూపంలో జీవించి ఉండే విధంగా ఉపవీతమును ఏదో ఒకరూపంలో ధరిస్తారు.

ఉపవీత ధారణకు అధికారులుగానివారు, ఏవిధమైన దీక్షను గ్రహించనివారుగూడా, "మూడుపోగులు" లేక "తొమ్మిది పోగులు" ఉపవీతములను నాలుగు ముడులు వేసి ధరిస్తారు. ఈవిధంగా చిహ్నపూజ జరుగుతుంది. పూర్తి యజ్ఞోపవీతంలోని పొడవుగానున్న ముడిని (మూడు సూత్రాలు గలదానిని) కంఠానికి తగిలించుకోవడం గూడ అక్కడక్కడ రివాజుగా నున్నది.

## గాయత్రీ సాధన ఉద్దేశ్యము

నవీన భావనలచే ప్రాచీన బావనలు మార్పుజెందుతాయి. ఎవరైనా వ్యక్తి ఏదైనా విషయాన్ని పొరపాటుగా గ్రహించినపుడు, తర్క, ప్రమాణ, ఉదాహరణముల ఆధారంపై సరియైన విషయాన్ని తెలియజేసి ఒప్పించవచ్చు. అయితే, ఆవ్యక్తి అత్యంత దురాచారుడు, మూఢుడు. ఉత్తేజితుడు, మదాంధుడు కాకుండా ఉంటే, బహుశా సరియైన విషయాన్ని గ్రహించడంలో కష్టముండదు. నిజమైనదానిని తెలుసుకొన్న పుడు, దురాచారము, దుస్సాంప్రదాయము మారుతుంది. స్వార్థముకోసం, మానరక్షణార్థం, ఎవరైనా తన పూర్వపు సాంప్రదాయముల తరపున వకాల్తా పుచ్చుకొన్న అది వేరే విషయము. అయినప్పటికీ అలవాట్లు, సాంప్రదాయములు, విశ్వాసములను గురించిన అతని అభిప్రాయము తప్పక మారుతుంది. జ్ఞానము ద్వారా అజ్ఞానమును తొలగించుటంత విశేషమైన కష్టముగాదు.

కాని, స్వభావము, అభిరుచి, ఇచ్ఛ, భావనల, ప్రకృతుల విషయంలో మాత్రం పైన చెప్పబడినది చెల్లదు. ఇవి సాధారణ పద్ధతులలో మారవు. ఏ స్థానంలో అవి ప్రేరేపింపబడినవో ఆస్థానంనుండి సులభంగా తొలగిపోవు. ఏలనన మనుష్యుడు 84 లక్షల క్రిమి, కీటక, పక్షి, జీవజంతువులు క్షుద్రయోనులతో భ్రమణముజేసి (తిరిగి) నరదేహాన్ని పొందుతాడు. అందువలన స్వభావతః అతని గడచిన జన్మ జన్మాంతరపు పాశానికి, నీచ సంస్కారములు చాలా దృఢంగా తన జడ మనోభూమిలో నిక్షిప్తమై వుంటాయి మస్తిష్కంలో నానావిధములైన ఆలోచనలువస్తూ, పోతూ వుంటాయి. వాటిలో పరివర్తన కలుగుతుంటుంది. కాని ఆ పరివర్తన ప్రభావము అతని మనోభూమిపై విశేష ప్రభావాన్ని కలిగించదు. సదుపదేశమును ఆలకించి సద్గ్రంథ పఠనమాచరించి, గహనంగా గంభీరంగా స్వయంగా ఆత్మచింతన జేయు మనుష్యుడు, మంచిచెడ్డల యొక్క అంతరమును(తేడాను)స్పష్టంగా గ్రహించగలడు. తన తప్పులను, దోషములను బలహీనతలను గురించిన జ్ఞానం నిర్దుష్టంగా ఆతనికుంటుంది. వాటిని గురించి మానసికంగా తలపోస్తాడు. తనలోని చెడు తొలగిపోవాలని వాంచిస్తాడు. అనేకసార్లు తన్నుతాను నిందించు కొంటాడు. ఐనప్పటికి తన చిరసంచిత కుప్రవృత్తులనుండి, దురలవాట్లనుండి తాను విడిగా భిన్నంగా, ప్రత్యేకంగా వుండలేడు.

త్రాగుడు, దొంగతనము, దుర్మార్గము, దురాచారముల ప్రకృతిని గూర్చి మనుష్యునకు బాగుగా తెలుసు. తాను అపమార్గమున ప్రయాణించుతున్నానని, ఎన్నుకున్నానని తెలుసు. ఈ అలవాట్లనుండి బహుశా విముక్తి లభిస్తుందని వారి మనోభావన. కాని అది వారి నిస్సహాయ నిర్బల కల్పన మాత్రమే. వారి మనోరథము నిష్ఫలమౌతుంది. దురలవాట్లు వదలవు. అవసరమొచ్చినపుడు ప్రలోభానికి లోనైనపుడు, మనోభూమిలో అణగివున్న కుప్రవృత్తులు, చీకటిలో తుపాను మాదిరి విజృంభిస్తాయి. ఆ వ్యక్తి అలవాట్ల వలన బలహీనుడై, దుష్కార్యములను మరల ఆచరిస్తాడు.

వికార సంస్కారములతులదూస్తే, సంస్కారపు శక్తి అత్యధికము, ప్రబలము, భావనయొక పసిశిశువు, సంస్కారపు పరిపుష్ట ప్రౌఢ. వీరిద్దరి సంగ్రామంలో పరిణామము బహుశా ప్రౌఢ యొక్క విజయము, శిశువు ఓడిపోవడం సహజంగా గమనించవచ్చు. అయినప్పటికి మనస్వియైన వ్యక్తి శ్రీకృష్ణునిచే పూతనవధను, శ్రీరామునిచే తాటకి వధను ఉదాహరణంగా తీసుకొని తన ఆలోచనలబలంతో కుసంస్కారములపై విజయంసాధిస్తాడు కాని అధికసంఖ్యాకులు కుసంస్కారము ఛాయలోను-వలలోను చిక్కి, పక్షులమాదిరి గిలగిల లాడటం గమనించవచ్చు. అనేకమంది ధర్మోపదేశకులు;

జ్ఞానులైన విద్వాంసులు, నాయకులు, సమదర్శులైన మహాపురుషులని తెలియబడే వ్యక్తుల చరిత్రలకు మార్గమైనపుడు, వారి ప్రౌఢ బుద్ధి తమ నిజ కుసంస్కారముపై విజయము సాధించలేక పోయినది అని చెప్పవలసి వస్తుంది. పలుసార్లు మంచి మంచి నిజాయితీపరులు గూడా ఏదైనా ప్రలోభానికి లోబడి అవసరంకోసం దానిలోచిక్కుకు పోతారు. తరువాత పశ్చాత్తాపము పడవలసి వస్తుంది. చిరసంచిత పాశవికప్రవృత్తుల యొక్క భూకంపము వచ్చినపుడు, సదాశయ ఆధారం పైనచిరప్రయత్నమువలన ఏర్పడిన సుచరిత్ర యొక్క గోడలు బీటలువారుతాయి.

ఉపయుక్త పంక్తులయొక్క అర్థము మేధాశక్తి, ఆలోచన నిరర్థకమనీ, దానివలన కుసంస్కారములపై విజయానికి సహాయము లభించదని కాదు. ఈ వాక్యములలో, సాధారణ మనోబలము సదాశయముల మనోభూమిని ఆక్రమించుటలో, అధిక సమయము, మందగమనములో, నెమ్మది నెమ్మదిగా పురోగమిస్తుందని, అనేకపర్యాయముల వారు నిరాశ, అసఫలతను రుచి చూడవలసి వస్తుందని చెప్పబడినది. అయినప్పటికీ సద్విచార క్రమమున్నట్టయితే. కాలాంతరంలో కుసంస్కారములపై విజయము ప్రాప్తించుట తప్పదు. ఆధ్యాత్మ విద్యాచార్యులు చాలా ఆవశ్యకమైన కార్యాన్ని సాధించడానికి కాల విలంబనమును అంగీకరించరు. అందువలన వారు దీనికి సంబంధించినంతవరకు అత్యధిక గంభీరంగా, సూక్ష్మదృష్టిలో, మనోయోగ పూర్వకంగా ఆలోచించి, మానవ అంతఃకరణములో నుండే పాశవిక సంస్కారములను స్వచ్ఛమైనప్పటికీ విశ్లేషణ గావించారు. తత్పరిణామంగా, మనోక్షేత్రములో యే స్థాయిలో ఆలోచనల ప్రకంపనలు క్రియాశీలమౌతాయో, అంతకన్న అధిక బలీయమైన స్థాయిలో సంస్కారములు చైతన్య రహితమౌతాయని నిర్ణయానికొచ్చారు.

బావి (కూపము) త్రవ్వేటపుడు భూమిలోని భిన్నజాతుల మట్టిపొరలెట్లు బయల్పడుతాయో, అట్లే మనో భూమియొక్క వివిన్న పొరలెన్ని వున్నాయో వాటిపని, గుణము, క్షేత్రము భిన్నభిన్నంగా వుంటుంది. మనోభూమి లోని పైపొరలు 1. మనస్సు, 2. బుద్ధి. మనస్సులో కోర్కెలు, వాసనలు ఇష్టాలు, ఉద్భవిస్తాయి. బుద్ధి యొక్క పని ఆలోచించడం, మార్గమును వెదకడం, నిర్ణయాలు తీసికోవడం ఈ రెండుపొరలు మనుష్యునికి అందుబాటులో నున్న సంపార్కములు. ఈ రెంటిని కలిపి స్థూల మనోక్షేత్రమని అంటారు. పరిస్థితులలో మార్పువలన, విచక్షణ జ్ఞానము కలిగినపుడు స్థూల మనోక్షేత్రంలో తారుమార్లు మార్పులు జరుగుతాయి.

ఈ స్థూల క్షేత్రంగాక, లోతైనపారను సూక్ష్మమహో క్షేత్రమంటారు. దీనిలోని ప్రముఖ భాగములు 1. చిత్తము, 2. అహంకారము. చిత్తములో సంస్కారము. అలవాటు. అభిరుచి స్వభావముల కలయిక వుంటుంది. అహంకారమును "తనకు సంబంధించిన ప్రకర్ష (గొప్పతనము) గా చెబుతారు. తాను, ధనికుడనసీ, దరిద్రుడనసీ, బ్రాహ్మణుడనసీ, శూద్రుడనసీ, పాపినసీ,పుణ్యాత్ముడనసీ, అభాగ్యుడనసీ, సౌభాగ్యుడనసీ, స్త్రీనసీ, పురుషుడనసీ, మూర్ఖుడనసీ, బుద్ధిమంతుడనసీ, తుచ్ఛుడనసీ, మహానుభావుడనసీ, జీవుడనసీ, బ్రహ్మనసీ, బద్ధుడనసీ, ముక్తుడనసీ, మొదలైన విధములుగా తలపోస్తాడు అట్టివారిని అహంకారులుగా పరిగణించుతారు. ఆత్మయొక్క అహం (తాను) సంబంధపు తలపోతయొక్క పేరు అహంకారము. ఈ మనస్సు, బుద్ధి, చిత్త, అహంకారములకు అనేక భేద అభేదములున్నాయి. వాటి గుణకర్మలు వేర్వేరుగానున్నాయి. వాటి వర్ణన ఈ పంక్తులలో నీయలేము. వాటి సంక్షిప్త పరిచయము మాత్రమే ఇచట అవసరము. కుసంస్కారములు నివారణ విషయంలో కొన్ని సంగతులు ఎక్కువగా తెలుసుకొన్నందున పాఠకులకు సౌకర్యంగా వుంటుంది.

మనస్సు బుద్ధులజంట ఎలాంటిదో చిత్తము అహంకారములు జంటగూడా అలాంటిదే. మనస్సులో నానా ప్రకారముల ఇష్టములు, కామనలుంటాయి. బుద్ధి వాటి నిర్ణయముజేస్తుంది. ఏయే కోరికలు బహిర్గతము గావించుటకు యోగ్యమైనవి. వేఏవి అణచి వుండవలె వీటినిగురించి బుద్ధికితెలుసు,సభ్యత, లోకాచారము సామాజిక నియమము, ధర్మము, కర్తవ్యము అసంభవము మొదలైనవాటి పరిగణించి అనుపయోగమైన ఇష్టాలను, లోలోపలనే అణచి వుంచుతుంది. కార్యరూపము నొందడానికి యోగ్యమైన వాటికొరకు తన ప్రయాత్నాన్ని జేస్తుంది. ఈ విధంగా మనస్సు, బుద్ధి రెండూకలిసి మస్తిష్కంలో తమ పడుగు పేకలను యేర్పరచుకొంటాయి.

అంతఃకరణ క్షేత్రంలో చిత్తము, అహంకారముల జంట తమపనిని తాము జేస్తూవుంటాయి జీవాత్మ తాను యేశ్రేణికి, యే స్థాయిలో అనుభవము కలిగివుంటుందో, చిత్తములో అదేశ్రేణిలో, అదేస్థాయిలో పూర్వ సంస్కారముల క్రియారూపము పొంది బలంగా వుంటాయి. తనను త్రాగుబోతుగా, పాపిగా, అస్పృశ్యునిగా,సమాజంలోని నిమ్న వర్గమువానిగా తలపోస్తే. ఆవ్యక్తికియాఅహంకారము అతని చిత్తంలోని తనజాతి సంస్కారములు జడమహోభూమిలో స్థిరంగా వుండడానికి సిద్ధంగావుంటాయి. గుణ కర్మ, స్వభావములే శ్రేణిలో మనుష్యులలో వుంటాయో, అవన్నీ వారిచిత్తములలో

సంస్కార రూపములలో జడంగా సమ్మిళితమై బైఠాయించుతాయి. అతని అహంకారము తన అపరాధములను త్రాగుడును పరిత్యజించి, లోకసేవకుడై, మహాత్ముడై,సచ్చరిత్రుడై ఉన్నతుడవడానికి తాను స్థిర మనస్కుడైనపుడు అతి శీఘ్రంగా అతని పూర్వపుటలవాట్లు ఆకాంక్షలుకోరికలు, అభిలాషలు పరివర్తన జెందుతాయి. తన్నుతానెలా మలచుకోవలెనని విశ్వసిస్తాడో యటులనే తయారవుతాడు.

త్రాగుట చెడుకార్యమని తెలుసుకొన్నంతనే అతనికి త్రాగుట కష్టము. ఏలనన మంచేదో చెడేదో ప్రతివ్యక్తికి తెలుసు. వారికాయాలోచన ప్రథమంలోనే అనేకమార్లు వస్తుంది. తన అహంకారము ప్రతిష్టించుకొని నాగరికుడుగా మారినపుడా బంధము (లత, లేక తీగె) తెగుతుంది. తన గౌరవానికి, వ్యవహారానికి త్రాగుడు పనికిరాదని అపుడు అనుభవం కలుగుతుంది. అంతఃకరణపు ప్రథమపిలుపుకే, ప్రథము హుంకారమునకే, చీత్కారమునకే చిత్తములో సామూహికంగా నున్న కుసంస్కారములు పెల్లగింపబడి క్రిందికొకవైపు పడిపోతాయి.ఆ స్థానంలో నవీన, ఉపయుక్తమైన, అవశ్యకమైన, తగిన సంస్కారములుకొద్ది సమయంలో చొనగూడుతాయి.మనోబుద్ధులకుకష్ట సాధ్యమైన పనియని భావించబడినది. అహంకార పరివర్తన జరిగిన క్షణంలో సర్దుకుంటుంది. అహంకారము వరకు నేరుగా జేరడానికి సాధనతప్ప యే యితరమార్గము లేదు. మనస్సు బుద్ధులను శాంతపరచి, సమ్మోహనము గావించి వాటిని అతీంద్రియావస్థలో వదలిపెట్టి అహంకారము వరకు ప్రవేశమును పొందుటయే సాధనయొక్క ఉద్దేశ్యము. గాయత్రీ సాధన పద్ధతిగూడ యీ మాదిరేవుంటుంది. దానియొక్క ప్రభావము సరిగా అహంకారముపై పడుతుంది. "నేను బ్రహ్మశక్తికి ఆధారమై యున్నాను. ఈశ్వరీయ స్ఫురణ గాయత్రీ నా రోమరోమములలో నిండి యున్నది, నేను దానిని అధికాధికంగా నా లోపల ధారణజేసుకుని బ్రహ్మభూతమగు చున్నాను" ఈ భావన మానవీయ అహంకారమును పాశవిక స్థాయినుండి చాలా ఉన్నత స్థాయికి పెంచుతుంది. దానిని (అహంకారమును) దేవతా భావావస్థలో నుంచుతుంది. భగవద్గీతలో యీ విధంగా చెప్పబడియున్నది– "యేయ చ్ఛ్రద్ధః సేవసః" ఎంతవరకెవరెటువంటి శ్రద్ధను కలిగివున్నారో గౌరవమును కలిగి వున్నారో–వస్తుతః అటులనే జరుగుతుంది. గాయత్రీసాధన, తన సాధనలలో దైవీ ఆత్మ విశ్వాసము, ఈశ్వరీయ అహంకారము ప్రసాదిస్తుంది. కొలది సమయంలో అతడు వస్తుతః అటులనేఔతాడు. అతని ఆత్మ యేస్థాయీ మర్యాదను కలిగివుంటాడో, అదే స్థాయిలో చిత్త ప్రవృత్తులుంటాయి ఆ అలవాట్లే వాంఛలే, రుచులే (అభిరుచులు)

ప్రవృత్తులే, క్రియలే అతనిలో గోచరించుతాయి. దివ్య భావములు నిండి యున్న వ్యక్తికి, నిశ్చయంగా అతని వాంఛలు, అలవాట్లు క్రియలు అలాగే వుంటాయి, ఈ సాధన ప్రక్రియ మానవ అంతఃకరణమును కాయ కల్పము గావించుతుంది. ఉప దేశములను వినినప్పటికి పుస్తకపఠన గావించినప్పటిచి ఆత్మోద్ధరణ నిష్ఫలమని తేలినపుడు, సాధన ద్వార మాత్రమే సునాయాసంగా ఆత్మోద్ధరణ జరుగుతుంది. ఇదే సాధన రహస్యము.

ఊర్ధ్వ మనోక్షేత్రము (సూపర్ మెంటల్) మాత్రమే ఈశ్వరీయ దివ్యశక్తుల అవతరణకు సరియైన స్థానము. విమానాశ్రయమున్నచోటనే విమానము ఎగురగల్గుతుంది. ఈశ్వరీయ దివ్యశక్తి యీ ఊర్ధ్వ మనో క్షేత్రంలో ఉద్భవిస్తుంది. ఈ ఊర్ధ్వ మనోక్షేత్రం నిర్మలంగా లేనపుడు, అతిసూక్ష్మ దివ్యశక్తులు తనలో నుద్భవించవు. సాధన, సాధక మనోక్షేత్రాన్ని ఉపయుక్త విమానాశ్రయంగా తయారుజేస్తుంది. అచట దివ్యశక్తులు మేల్కొన కలుగుతాయి ఆత్మ కల్యాణము. ఆత్మోద్ధరణ, కొరకనేక విధములైన సాధనల నాశ్రయించవలె. దేశ, కాల, పాత్ర భేదకారణములను గూడా, సాధనా మార్గమును నిర్ణయించుటలో యెక్కువ పరిగణనతో నుంచుకొని, మార్పులను గావించు కొవలసి వస్తుంది. 'స్వాధ్యాయము'లో చిత్తాన్నిలగ్నంజేయడం వలన సన్మార్గము వైపు రుచి కల్గుతుంది. 'సత్సంగము' వలన స్వభావము సంస్కారము శుద్ధి పొందుతాయి. 'కీర్తనము' వలన ఏకాగ్రత, తన్మయత వృద్ధి పొందుతాయి 'దానపుణ్యము' వలన త్యాగము అపరిగ్రహ (ఇతరులనుండి తీసుకొన కుండుట భావన దృఢమౌతుంది 'పూజ' 'ఉపాసన'ల వలన ఆస్తిక్య భావన. (పరలోక మున్నదనే భావన) ఈశ్వరునిపై విశ్వాసము కలుగుతుంది. ఈ విధంగా భిన్న భిన్న ఉద్దేశ్యములను, పరిస్థితులను దృష్టిలో నుంచు కొని ఋషులు అనేక ప్రకారములుగా సాధనలను ఉపదేశించారు. కాని వీటిలో సర్వోపరి స్థానము "తపస్సు" గా ఋషులు అనేక ప్రకారములుగా సాధనలను ఉప దేశించారు. కాని వీటిలో సర్వోపరిస్థానము "తపస్సు" సాధనయే. తపోగ్ని వలన ఆత్మ యొక్క మల విక్షేపము, పాపతాపము అతిశీఘ్రంగా భస్మమౌతాయి ఆత్మలో నొక అపూర్వ శక్తి ఆవిర్భవిస్తుంది. గాయత్రీ సాధన సర్వశ్రేష్ఠ తపశ్చర్య దీని ఫల స్వరూపంగా సాధకునకు దైవీశక్తి ప్రాప్తిస్తుంది. దానివలన నిజమైన ఆత్మా నందము ప్రాప్తించి ఉన్నతోన్నత భౌతిక, ఆధ్యాత్మిక లక్ష్యమును అతడు పొంద గలుగుతాడు.

ఇది అపరా ప్రకృతిని పరాప్రకృతిగా రూపాంతరము చేయుటకు, తగినమనుష్యుని పాశవిక వ్యక్తి స్థానంలో, ఈశ్వరీయ శక్తిని ప్రతిష్ఠించుటయే. ఆధ్యాత్మవిజ్ఞానపు పని. తుచ్ఛులను మహాత్ములుగా, అల్పమును అనల్పముగా, పరిమితిని అపరిమితముగా, అణువును ఆకాశముగా, బద్ధులను ముక్తులుగా, పశువులను దేవతలుగా నొనరించుటయే సాధన ఉద్దేశ్యము. ఈ పరివర్తనతో పాటు మనుష్యునకు సామర్థ్యంగూడా కలుగుతుంది ఇది సతీశక్తికి సన్నిహితమైనది. దీనిని వృద్ధి సిద్ధులనే పేర్లతో పిలుస్తారు. సాధన ఆధ్యాత్మిక కాయకల్పమున కొక వైజ్ఞానిక ప్రణాళిక. నిశ్చయంగా అన్య సాధనా విధులలో గాయత్రీసాధన స్థానము సర్వశ్రేష్ఠ మై యున్నది.

## నిష్కామ సాధనయొక్క తత్వజ్ఞానము

గాయత్రీ ఉపాసన కావలసినపుడునిష్కామ భావనతోగానీ, సకామ భావనతోగానీ జేసినయెడల ఫలితము తప్పక ప్రాప్తిస్తుంది. భోజనము సకామముతో భుజించినా నిష్కామంతో ఆరగించినా దానివలన ఆకలి ఉపశమిస్తుంది. రక్తంగా మారడం తప్పక జరుగుతుంది . భగవద్గీత మొదలైన గ్రంథాలలో 'నిష్కామకర్మ' పై అధిక ప్రాముఖ్యత చెప్పబడినది. కారణమేమనగా వుచిత రీతిలో నిష్కామకర్మ గావించినప్పటికీ, ఆశించిన ఫలితము సమకూరుతుందనీ నిశ్చయంగా జరుగుతుందనిలేదు. అనేకసార్లు పరిపూర్ణమైన కామభావంతోను తత్పరత తోను జేసినప్పటికీ, దేనిని కోరి అంతా చేశామో ఆ పని పూర్తిగాదు. ఆశించిన ఫలితాన్నిపొందలేనట్టైన, ఆ సమయంలో సాధకుడు శీఘ్రంగా నిరాశజెంది శ్రద్ధను కోల్పోగూడదు. శ్రేష్ఠమైన సాధనామార్గమును ఉదాసీన భావముతో గమనించరాదు. అందువలననే శాస్త్రకారులు 'నిష్కామ కర్మ'ను 'నిష్కామసాధన' అధికశ్రేష్ఠంగా భావించారు. దానినే ఎక్కువనొక్కి వక్కాణించారు.

దీని అర్థము, సాధనాశ్రమ నిష్ఫల మౌతుందనిగాదు లేక ప్రణాళిక సందిగ్ధమని గ ుు సాధనా ప్రామాణికత విశ్వాసములను అణుమాత్రం సందేహించ నవసరం లేదు. ఈ దిశలో గావించిన ప్రయత్నమొక క్షణమైనా నిరర్థకముగాదు, ఇంతవరకీ దిశలో ్ యనించి అడుగువేసిన వారందరికీ తమశ్రమకు పరిపూర్ణప్రతి ఫలము నిశ్చయంగా ·భించినది. కాని అన్నివేళలా అభీష్ట మనోరథం పరిపూర్ణమైనదా, లేదా యనునదే ునిశ్చయంగా లేదు.

కారణము, ప్రారబ్ధ కర్మములు పరిపక్వము చెంది,ప్రారబ్ధంగా మారినపుడు ఆ కర్మ రేఖలను ఖండించుట కష్టమౌతుంది. అనేక మార్లీ రేఖలు సాధారణంగా వుంటాయి. ప్రయత్నమువలన వాటిలో మార్పులు జరుగుతాయి. అనేకసార్లు ప్రారబ్ధానుభవము ప్రబలంగా నున్నందున దానిని తొలగించుట సంభవముగాదని నిశ్చయము. అలాంటి కఠిన ప్రారబ్ధముల బంధనములతో, అధికాధికమైన బంధనములను వాటి యాతనలను అనుభవించవలసి వస్తుంది.

శ్రీరామ వన గమనము, సీతాపరిత్యాగము, శ్రీకృష్ణ పరమాత్మ వ్యాధుని బాణమునకు గురియై స్వర్గమున కేగుట, హరిశ్చంద్రుడు భార్యను, పుత్రుని అమ్మడం. నల మహారాజు దమయంతిని పరిత్యజించడం, పాండవులు హిమాలయంలో కృంగి పోవడం 'శబ్దబేధ' పృథ్వీరాజు మ్లేచ్ఛులచేతిలో బందీయై మరణించడం మొదలైన ఆ సంఖ్య ఘటనలు ఇతిహాసంలో మనకు గోచరిస్తాయి. అంతటి మహాత్ములకా విపత్తులే కారణంవలన సంభవించాయి? వీటి వలన మనము ఆశ్చర్య చకితులౌతాము. దీనికి వ్యతిరేకంగా తుచ్ఛులు, సాధనాహీనులు, విపన్న పరిస్థితులకు లోనైనవారు పెద్ద పెద్ద ఉన్నత పదవులను పొంది ఐశ్వర్య వంతులైనపుడు వారినిగాంచి ఏదైనా సహాయమూ తుచ్ఛులను శ్రమలేకుండ ఉన్నతులను గావించినదని ఆశ్చర్యము కలుగుతుంది. అటువంటి సంఘటనలకు సమాధానం నశించని ప్రారబ్ధపు మంచి చెడుల ననుభవించడంపై ఆధారపడి వుంటుంది. తెలివిగల వారెప్పటికి తెలివిగా ప్రవర్తించి నప్పటికీ ప్రారబ్ధమును తొలగించుట సంభవముగాదు.

ఇచట వొక సందేహముత్పన్నమౌతుంది. ప్రారబ్ధమే ప్రబలమైతే, ప్రయత్నంవల్ల ప్రయోజనమేమి? యని జీవితంలోని అన్నిపనులు కార్యములు ప్రారబ్ధముపైననే ఆధారపడి వుండవని సందేహించిన వారు తెలుసు కొనవలె. ఏవోకొన్ని ప్రారబ్ధములు మాత్రమే తొలగించడానికి వీలుపడవు. జీవితంలో అధికాంశభాగము, తాత్కాలిక కర్మఫలం ప్రాప్తించడం, క్రియా పరిణామము ఎక్కువగా వెంట వెంటనే జరగడం జరుగుతుంది. కాని అపుడపుడు దీనికి వ్యతిరేకం జరుగుతుంది-మంచిజేస్తే చెడు జరగడం - చెడుచేస్తే మంచి జరగడం. కఠోర పరిశ్రమ జేయువ్యక్తి,మేధావి నష్టము పొందుతాడు, మూర్ఖుడు, సోమరి అనాయసంగా లాభము పొందడం గమనించుతాము. ఇటువంటి వ్యతిరేక పరిస్థితులు అన్ని వేళలారావు. అపుడపుడూ వ్యక్తమౌతాయి. అట్లుగాక సాధారణ ఘటనలు కూడా క్లిష్టంగా ప్రతిదినమూ ఉంటే ప్రపంచపు పూర్తి వ్యవస్థ అస్తవ్యస్తమౌతుంది. కర్తవ్య

మార్గమునష్టమౌతుంది. కర్మను,ఫలితాన్ని బంధించే శక్తి లేనపుడు మానవులు కర్తవ్యనిష్ఠను వదలి తమకు లభించే ప్రయోజనముపై తమ అదృష్టముపై భరోసాతో మౌనంగా ఖాళీగా ఉండి లోకాన్ని ప్రజావ్యవస్థను అస్తవ్యస్తము గావించుతారు. అట్టి తల్లక్రిందు పరిస్థితి సంభవించదు. అప్పుడప్పుడు మాత్రం ప్రయత్నం నిష్ఫలమై విపరీత పరిణామములు సంభవించవచ్చు. ఆ పరిస్థితులలో దృఢమైన ప్రారబ్ధపు ప్రబలతగా తెలిసికోవలె.

అభీష్టఫలము ప్రాప్తించనప్పటికీ గూడా గాయత్రీ సాధనాశ్రమ వృధాగాదు దాని వల్ల వేరేదైనా లాభము చేకూరుతుంది. ఒక నవ యువకుడు మరొక నవయువకుని కుస్తీలో ఎదుర్కొనుటకు వ్యాయామము, పౌష్టిక భోజనము ద్వారా ఆరోగ్యవంతముగా తయారవుతాడు. పూర్తిగా తయారైన తరువాత కుస్తీలో ఆ యువకుడు విజయము సాధించడంలో సఫలీకృతుడు గానట్లయితే, అతని తయారీ నిరర్థకమని భావించరాదు. తయారీతనప్రయోజనాన్ని చూపుతుంది. శరీరపరిశుద్ధత, ముఖంలోనితేజస్సు, అంగముల కదలికా సౌలభ్యం బలకరమైన శ్వాసకోశములు, బలవీర్యాధిక్యత నిరోగిత, దీర్ఘజీవనము, కార్యక్షమత, బలకరమైన సంతానము మొదలైన అనేక లాభములు అతనికి ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాయి.కుస్తీ గెలుచుటలో అతడు వంచితుడు గావచ్చు. కాని బలాన్ని పెంపొందించుకొనుటద్వారా లభించిన అన్యప్రయోజనాలు పొందడంలో మాత్రంఅతడు విఫలుడుగాలేదు. గాయత్రీ సాధన తన కామ్య ప్రయోజనాన్ని పొందడంలో సఫలత పొందక పోయినప్పటికి గూడా, అతనికి అనేక ఇతర మార్గములలో లాభం చేకూరుతుంది.అంతటి ప్రయోజనాలు సాధన లేకుండా ఆశించలేము, పొందలేము.

మనుష్యుడు తనకు హితకరమైనదానినే, అవసరమైనదానినే వాంఛిస్తాడు. కాని పరమేశ్వరుని దృష్టిలో ఆకోరిక అతనికి అనవసరము, హానికరమైతే, ప్రభువాకోరికను నెరవేర్చడు. బాలకుడనేక వస్తువులు కావలెనంటాడు. కాని తల్లికి బిడ్డకేదవసరమో తెలుసు. బిడ్డ అరచిగీపెట్టినా తల్లి సరకుచేయదు. బిడ్డకు ఉపయోగము కానటువంటి వస్తువు లభించదు. ఏలనన ఆ వస్తువువలన బిడ్డకు లాభంలేదు. రోగుల ఆసక్తిగూడా యిటువంటిదే. కుపథ్యమునకు రోగి కావలసిన మార్గము లనుసరిస్తాడు. కాని ఆ రోగులకు సేవచేయువారు వాటిని సాగనివ్వరు. రోగి ఆరోగ్యమునకు అపాయమున్నందు ననే కుపథ్యానికి అవకాశమివ్వరు.రోగులు, బాలురు తమ మార్గములు ఉచితమైనవేనని, ఆవసరమని, అందులో దోషము లేదని భావిస్తారు. అయినప్పటికీ వారి దృష్టికోణము సరిగాదు. గాయత్రీ సాధకులలో పెక్కుమందికి బాలుర స్వభావము, రోగుల వ

వలె ఉంటుంది. తమ దృష్టిలో వారికోరికలు సవ్యము, వుచితమైనవి. కాని భగవంతునికే తెలుసు ఏ వ్యక్తికి ఏది వుపయోగమో. ఆదేవి తన పుత్రుల యోగ్యత, స్థితి, అవసరాలకు అనుకూలంగానే వుంటుంది. అసఫలత గాయత్రీ సాధకులకు సంభవించుట వారు బాలబుద్ధితో యోచించుట వలననే. తల్లి తన బిడ్డలలో ఒకనికి ఆటవస్తువులిచ్చి, మిఠాయి పెట్టి ప్రేమిస్తుంది; లాలిస్తుంది. వేరొక బిడ్డను, అనారోగ్యకారణంగా హాస్పిటలుకు తీసికెళ్ళి ఆపరేషను చేయిస్తుంది. చేదుమందులు త్రాగిస్తుంది. దీనివల్ల తల్లికి పక్షపాత మున్నదని, అన్యాయంగా, నిర్దయగా నున్నదని ఇష్టమొచ్చినట్లు నిందిస్తే; తల్లి హృదయాన్ని తెరచిచూస్తే ఆమె అంతఃకరణములో బిడ్డలిద్దరిపై, సమాన ప్రేమున్నదని తెలుస్తుంది. బాలుడు తనకేది అన్యాయమని, న్యాయ విరోధమని భావిస్తాడో,మాతృ దృష్టిలో అదే అవసరము, సర్వశ్రేష్ఠ ప్రమాణము. మన ఓటమి, మనకు జరిగిన హాని, మనకష్టాలు ఎక్కువగా మన లాభం కొరకే జరుగుతాయి. మనకు జరగవలసిన అపరిమిత బాధలను, మాత చాలా తక్కువ మోతాదులో జరిగేటట్లుజేసి మనలను ఉద్ధరిస్తుంది. ఆమె దృష్టి విశాలమైనది. ఆమె హృదయం ప్రేమమయం. మన హితమే ఆమె కోరేది.దుఃఖము, దరిద్రము, రోగము, హాని, క్లేశము, అవమానము, శోకము, వియోగము మొదలైనవి మనకు కల్పించి, మనపై తన అపారకరుణ ప్రదర్శిస్తుంది. ఈ చేదు ఔషదము వలన మనలో అంతర్గతంగానున్న భయంకర వ్యాధులను పోగొట్టి భవిష్యత్తులో మనలను పూర్ణ ఆరోగ్యవంతులుగా జేస్తుంది. ఒకవేళ అవసరవమొస్తే గాయత్రీ సాధకులు తమధైర్యమును కోల్పోగూడదు. నిరాశపడవద్దు. మాత ఒడిలో బాధ్యతల నొదిలి నిశ్చింతగా వున్నయెడల, ఆమె ప్రమాదంలో మనలను పడనీయదు.

నిష్కామ భావనతో సాధన చేయువారికి కూడా, సకామ సాధకులకు లభించే లాభములు ప్రాప్తిస్తాయి. తక్కువ ఉండదు. తల్లికి, యే పుత్రునకేది అవసరమో బాగా తెలుసు, ఆమె దృష్టిలో యే వస్తువు ఉచితమో దానిని బాలునికిచ్చుటలో లోపము చేయదు.

మనము నిష్కామములో సాధనజేసి, మౌనంగా, మన జీవనసరళిలో అనుక్షణమూ ఆదృశ్యశక్తి ఏవిధంగా సహాయపడుతుందో, గమనించుటమంచిది. శ్రద్ధ, విశ్వాసములతో మాతనెవ్వరాశ్రయిస్తారో, వారు తమ శిరస్సుపై దేవి ఛత్రపు ఛాయ ఉనికిని పత్యక్షంగా అనుభవిస్తారు. తమకు అవసరమైన వాటిని పొందుటలో ఏమాత్రం వంచితులుగారు. ఎవరికైనా, ఎప్పుడైనా గాయత్రీ సాధన నిష్ఫలము కాదని అంగీకరించుట తథ్యము.

## ఈ సాధనలలో అభీష్టసిద్ధి నిశ్చయం

మంత్ర సాధనకొక విశేష విధివ్యవస్థ వున్నది. నిత్య సాధనకు నిర్వర్తించవలసిన కర్మకాండకు అను గుణ్యంగా మంత్రముల అనుష్ఠాన సాధన, పురశ్చరణ చేయాలి. మామూలుగా విధిపూర్వకంగా చేయని యనుష్ఠానం సాధకునకు హానికారకమౌతుంది. లాభం బదులు అరిష్టం సంభవిస్తుంది.

ఎవరో మంత్రం జపించారనీ, దేవతను పూజించారనీ, లేక ఏదో యోగాభ్యాసం చేశారనీ, తాంత్రిక అనుష్ఠానం గావించారని అనేక ఉదాహరణలున్నాయి. సాధనయొక్క నీతి రీతులలో పొరపాటు జరిగినందున, అనుష్ఠాన భంగమైనందున, సాధకునకు భారీ విపత్తు కలుగుతుంది. అనేకమంది పిచ్చివాళ్ళవడంకూడా కద్దు. అనేకులకు వ్యాధులు, మరణము, ధననాశనము మొదలైన అరిష్టాలు సంభవిస్తాయి. ఈవిధమైన ప్రమాణాలు మనకు ఇతిహాస, పురాణాలలో గూడా నున్నాయి. వృత్రాసురుని, ఇంద్రుని కథలీవిధంగా ఉన్నాయి. వేదమంత్రములను ఉచ్చరించడంలో దోషములున్నందున, వారు ఘోర సంకటముల ననుభవింపవలసి వచ్చినది.

ఇతర వేదమంత్రములవలె గాయత్రీ మంత్రాన్ని కూడా శుద్ధ స్వరముతో ఉచ్చరించాలి. విధిపూర్వకంగా సాధన చేయవలెను. విధిపూర్వకంగా చేసిన సాధనలవలన శీఘ్రముగా సిద్ధిలభిస్తుంది. ఉత్తమ పరిణామ మొనగూడుతుంది. అయినప్పటికీ వేదమాత గాయత్రీలో ఒక ప్రత్యేక విశేషమున్నది.లోపమేదైనా జరిగితే హానిమాత్రము కలుగదు. దయాశీలయై ,ఉదారమైన బుద్ధిమంతురాలయిన తల్లి తమ బిడ్డల హితచింతన యేవిధంగా జేస్తుందో, అదే విధంగా గాయత్రీ శక్తి ద్వారా సాధకునకు మంచియే జరుగుతుంది. బాలురు పొరపాట్లు చేస్తారు. ఆమెను గౌరవించడంలో లోటు చేస్తారు. అనేకసార్లు వ్యతిరేకంగా ప్రవరిస్తారు. ఐనప్పటికీ తల్లికి వారియందెటువంటి దుర్భావముండదు, హాని చేయదు. సాధారణ తల్లియే ఇంతటి దయాళువైనపుడు, జగజ్జనని, వేదమాత, సత్వగుణ సంపన్నురాలయిన దివ్య, సురనది, గాయత్రీ నుండి అధికంగా ఆశించవచ్చు. ఆమె తన బిడ్డలకు తనయందుగల శ్రద్ధను గాంచి ప్రభావితురాలై, బాలుర భక్తిభావనలను తిలకించినందున ఆమె హృదయముప్పొంగుతుంది. ఆమె వాత్సల్యము అమృత నిర్ఝరిణియై ప్రవహిస్తుంది. సాధనలో జరిగి అజ్ఞానజనిత హ్రస్వలోపాలు, ఆదివ్యప్రవాహంలో సామాన్యమై అంతరించిపోతాయి.

సత్వగుణ ప్రధాన సాధనకు వ్యతిరేకఫలము జరుగునేమోననే భయానికి భగవద్గీతలో కృష్ణ పరమాత్మ వచించారు.

నేహాభిక్రమ నాశోస్తి ప్రత్యవాయోనవిద్యతే
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ।

అర్థము : సత్కార్య ప్రారంభమునకు కీడు కలుగదు. సాధకుడు పడుతూ, లేస్తూ ముందుకు పురోగమిస్తాడు. అతనికి వ్యతిరేక ఫలితమెన్నడూ జరగదు. సద్భావముతో చేసిన కార్యక్రమములకు ఫలితము లేకుండుటెప్పుడూ జరగదు. శుభ పరిణామములు జరుగకుండా వుండవు. ఏ కొంచెమైన ధర్మకార్యము మహత్తర భయముల నుండి రక్షిస్తుంది.

గాయత్రీ సాధన గూడా సాత్విక సత్కర్మ. దీని నొకసారి ప్రారంభిస్తే మనో ప్రవృత్తులా దిశలో ఆకర్షింపబడుతాయి. మధ్యలో అవాంతరములుకలిగినప్పటికీ మాటి మాటికి, ఎల్లవేళలా సాధకునకు, పునః ఆరంభించుటకు కోరిక కలుగుతూ వుంటుంది. రుచికరమైన పదార్థపు రుచినొకసారి యాస్వాదించిన తదుపరి, దానిని మరలా రుచి చూడవలెననే కోరిక ఉద్భవిస్తుంది. అట్టి అమృతోపమ, స్వాదిష్ట ఆధ్యాత్మికాహారము గాయత్రీ సాధన. దానిని పొందుటకు ఆత్మ పదే పదే మారాము చేస్తుంది. పదేపదే కేకవేసి పిలుస్తుంది. సాధనలో పొరపాటు జరిగి నప్పటికీ వ్యతిరేక ఫలితము గలుగదు. విపత్తులు, సంకటములు, అరిష్టములు జరుగవు. పొరపాటువలన తక్కువ ఫలము సంప్రాప్తించవచ్చుగాని, ఫలము లేకుండా వుండదు. ఈ సాధన స్వల్పరూపంలో ప్రారంభించినప్పటికీ యది ఉత్తమ ఫలం చేకూరుతుంది. ఆ ఫలములవలన భయకారణం తొలగుతుంది. ఆ భయకారణము యే యితర ఉపాయములచే తొలగనప్పటికీ, గాయత్రీ సాధనచే తొలగుతుంది.

ఈ విషయంలో స్పష్టంగా, వివరంగా, అధికంగా తెలియడానికి భాగవతంలో పన్నెండవ స్కంధంలో నారదులవారు శ్రీరామన్నారాయణుని దీనిని గురించే ప్రశ్నించారు. మాత ప్రసన్నురాలై కళ్యాణప్రదాయని యగుటకు, అల్పశక్తి గల మనుజులు సహజంగా ఆచరించడానికి వీలైన ఉపాయమేదైనా తెలియజేయండి ప్రభూ! ఏలనన అన్ని దేవతల సాధనలో ప్రాయశః ఆచార విచారములలోనూ, విధి విధానాలలోనూ, త్యాగతపస్సులలోను కఠిన నియమములు చెప్పబడినాయి. వాటిని సామాన్య శ్రేణికి చెంది, అల్ప విద్యాబుద్ధులు గల వ్యక్తులు నిర్వర్తించలేరు.

పై ప్రశ్నకు సమాధానంగా శ్రీమన్నారాయణుడీ విధంగా ప్రవచించాడు. "హే **నారదా ! మనుష్యుడే యితర అనుష్ఠానము నాచరించినా, ఆచరించకపోయినా, ఒక్క గాయత్రీపై దృఢవిశ్వాసుడైతే, ఆతడు తన జీవితాన్ని ధన్యంగావించుకొంటాడు. హే మహా ముని ! ఎవరయితే సంధ్యాసమయంలో అర్ఘ్యమిచ్చి, ప్రతిదినము మూడువేల గాయత్రీ జపిస్తారో, వారు దేవతలచే గూడా పూజింప యోగ్యులవుతారు.** జపము చేసేముందు న్యాసము చేయవలసి ఉంటుంది. శాస్త్రములలో శాస్త్రకారులు దేవో భూత్వా దేవో భూత్వా దేవం యజేత్-అని వ్రాక్కుచ్చారు. అనగా దేవునివలె తయారై దేవతాయజ్ఞము చేయవలె". కాని ఏదైనా అవాంతరమువలన లేక ప్రమాదము వలన న్యాసము (అంగన్యాసకర న్యాసములు) చేయలేకపోతే, నిష్కపటభావంతో సచ్చిదానంద గాయత్రీ దేవిని ధ్యానించి, కేవలము ఆమె జపము గావించి గూడా సంపూర్ణమైనట్లే.

గాయత్రీ యొక్క అక్షరమేకమాత్రము సిద్ధిపొందిన, ఉత్తమ బ్రాహ్మణుడు, సూర్య, చంద్ర, అగ్నిదేవులతో సమానంగా పూజింపబడతాడు. నియమానుసారంగా గాయత్రీ ఉపాసన జేసే సాధకుడు, అన్ని ప్రకారములయిన సిద్ధులను పొందుతాడు. దీనిలో సందేహమేమాత్రము లేదు.

ఈ కథనం వలన, ఈ యుగంలో గాయత్రీ యొక్క సాత్విక, నిష్కామ సాధనము సర్వశ్రేష్ఠమని విదితమౌతుంది. దానివలననిశ్చయంగా ఆత్మకళ్యాణం జరుగుతుంది.

ఈ విషయాలన్నింటినీ భావనజేసి సాధకుడు నిర్భయ మనస్సుతో సమస్త శంకలను, సంకోచములను వదలి గాయత్రీ సాధన చేయవలె. ఇది సాధారణమైన అస్త్రముగాదు. నియమ భూమిక లేకుండా పనిజరగదు. మానవుడు స్వేచ్ఛగా విహరించే వనచరజీవాన్ని బంధించడానికి చతురతతో గూడిన ఉపాయమును తప్పక అనుసరించవలె. కాని ఆవుదూడ తన తల్లిని పట్టుకొనుటకు మాతృభావనతో 'అమ్మా' యనిన మాత్రమే చాలును. గోమాత నిలబడిపోతుంది. వాత్సల్యంతో దూడను నాకుట మొదలెడుతుంది. తన పయోధారలచే పానము చేయిస్తుంది. 'రండి' మనంగూడా వేదమాతను స్వచ్ఛమైన అంతఃకరణముచే, భక్తి భావనతో ఆహ్వానిద్దాం. ఆమె అంతరాళము నుండి ప్రవహించే అమృత రసాన్ని గ్రోలుదాం.

మనము శాస్త్రీయ సాధనా పద్ధతిలో గాయత్రీ సాధన చేయడానికి శక్తికొద్ది ప్రయత్నము చేయవలె. అకారణంగా లోపము జేయుటవలన ప్రయోజనమేమి? మన మాత అనుచిత వ్యవహారమును గూడా క్షమిస్తుంది. అంటే, దాని తాత్పర్యం ఆమెయందు శ్రద్ధ భక్తి కొంచెంతగ్గినా పరవాలేదనికాదు. ఎంతవరకు వీలవుతుందో పూర్తిగా సావధానంతో సాధన చేయాలి. కాని కించిత్ మాత్రం లోపం జరిగితే హాని కలుగుతుంది, చెడు జరుగుతుంది అనే కుశంక మాత్రం మనస్సులోనుండి పెరికివేయాలి. ఈ భయంవలన గాయత్రీ సాధన మానడం అనవసరం. వేదమాత తన భక్తుల భక్తి భావనకు ప్రాధాన్యత నిస్తుంది. అజ్ఞానవశాన జరిగిన చిన్న చిన్న పొరపాట్లను క్షమిస్తుంది.

## సాధకులకోసం కొన్ని ఆవశ్యక నియమములు

### గాయత్రీ సాధన చేయువారు అవశ్యం తెలుసుకోవలసినవి :

1. శరీరాన్ని శుభ్రపరచుకొని కూర్చొనవలె, సాధారణంగా శరీరం స్నానంతో శుభ్రమౌతుంది. తప్పనిసరి పరిస్థితులలో, ఋతు ప్రతికూలతా సమయంలో చేతులు, కాళ్లు శుభ్రపరచుకొంటే, తడిబట్టతో శరీరాన్ని తుడుచుకుంటే పనిజరిగిపోతుంది.

2. సాధన సమయంలో శరీరంపై కొంచెమైన వస్త్రముంచుకోవలె. చలి అధికంగా వున్నపుడు, పల్చటి వస్త్రంకన్నా, కంబళి మొదలైన వాటిని కప్పుకొని శీతల నిరోధము గావించుకొనుట ఉత్తమము.

3. సాధనకు ఏకాంతము, మంచి గాలి వచ్చే స్థలమెన్నుకొనవలె. అచట వాతావరణం శాంతిమయంగా నుండవలె. పొలము, తోట, జలాశయపు ఒడ్డు, దేవమందిరము సాధనకుపయుక్తమైనవి. కాని అట్టి స్థానములు లభ్యం కానపుడు, ఇంటిలోని స్వచ్ఛమైన. శాంతిమయ భాగాన్నెన్నుకొనవలె.

4. ఉతికిన బట్టను ధరించి సాధన జేయుట ఉచితము.

5. సుఖాసనం వేసుకొని నిటారుగా కూర్చుండవలె. శరీరానికి కష్టసాధ్యమైన ఆసనములో కూర్చొనరాదు. అందువలన శరీరానికి కష్టము కలుగుతుంది. మనస్సు పదే పదే నిలకడను కోల్పోతుంది. చాలా సేపటి వరకు కూర్చోవడానికి వీలుగానుండెడి, సుఖంగానుండే ఆసనమునెన్నుకోవలె.

6. వెన్నెముక నిట్టనిలువుగా నుంచుకొనవలె. నడుము వంచి కూర్చుండే మేరుదండము(వెన్నెముక) వంగుతుంది. దానివలన సుషుమ్న నాడిద్వారా, ప్రాణముయొక్క గమనాగమనమునకు అవరోధము కలిగి, సులువుగా నుండదు. (ఇడపింగళులమధ్య నాడిసుషుమ్న)

7. మెత్తటి ఆసనము నేలపైవేయకుండ కూర్చొనరాదు. అటుల కూర్చొనిన సాధన కాలమందు శరీర విద్యుత్తు భూమిపై ప్రసరిస్తుంది. తృణములతోగాని (గడ్డితోగాని, దర్భలతోగాని), ఆకులతోగాని తయారుగాబడిన ఆసనమై యుండవలె. కుశాసనము, చాప, తయారయినదిగాని శ్రేష్ఠము. వీటి తరువాత కుట్టిన ఆసనము. ఉన్ని, చర్మపు ఆసనములు తాంత్రిక కర్మల యందుపయోగింపబడతాయి.

8. తులసి లేక చందనపు మాలను స్వీకరించాలి. రుద్రాక్ష, ఎర్రచందనము, శంఖముతో చేయబడినవి గాయత్రీ యొక్క తాంత్రిక ప్రయోగములలో నుపయోగిస్తారు.

9. ప్రాతఃకాలము 2 గంటలపుడు, వేకువ సమయాన జపమును ప్రారంభింప వలయును. సూర్యాస్తమయమునకు గంట తరువాయి వరకు జపము చేయవచ్చు. సాయంకాలమొకగంట, ప్రాతఃకాలము రెండుగంటలు, మొత్తం మూడు గంటలు వదలి, రాత్రియొక్క యితరభాగములలో గాయత్రీ యొక్క దక్షిణమార్గ సాధన చేయరాదు. తాంత్రిక సాధనములు అర్ధరాత్రికి దగ్గర దగ్గరగా చేయబడతాయి.

10. సాధనలో నాలుగు విషయాలు విశేషంగా గుర్తుంచుకొనవలె :

(అ) చిత్తమును ఏకాగ్రతతో నుంచుకొనవలయును. మనస్సు ఇక్కడ-అక్కడ (విచ్చలవిడిగా) తిరుగరాదు. మనస్సు నిశ్చలతను తప్పి వేగంగా పరుగెత్తు చున్నపుడు మాతయొక్క సుందర శరీరపు తేజోధ్యానమందు లగ్నము గావించుము.

(ఇ) మాతయందు అచంచల శ్రద్ధ, విశ్వాసముంచవలె. అవిశ్వాసి శంకాశంకితను గలిగిన వారు పూర్తిగా లాభాన్ని పొందలేరు.

(ప) దృఢచిత్తంతో సాధనపై మొండిపట్టుదలగావలె. ఉత్సాహరహితము, మనో వైకల్యము, నీరసము గలుగుట, శీఘ్రముగా ఫలము లభించకుండుట,

అస్వస్థత, ఇతర అనేక సంసారిక విపత్తులు మార్గమున గలుగుట, సాధనకు విఘ్నములెదుర్కొంటూ, తమ మార్గమును దృఢమనస్సుతో పురోగమించవలె.

(ద) **నిరంతర సాధన ఆవశ్యక నియమము. అత్యంతవసరమైన పని జేయవలసినపుడు, విషమ పరిస్థితులలో, యేవిధంగా నైనా తిరుగుతూ, పనిచేస్తూవున్నప్పటికీ, మాతయొక్క ఉపాసనానుసరించవలె. ఒకరోజుగూడ మరువ గూడదు.** సెలవు పెట్టరాదు. ప్రతిరోజు సాధనా సమయాన్ని మార్చగూడదు. ఒకసారి ఉదయం, మరొకసారి మధ్యాహ్నం, వేరొకసారి 3 గంటలకు, అప్పుడపుడు 10 గంటకు, అనియమిత మంచిదికాదు. ఈ నాలుగు నియమములతో సాధన ప్రభావశాలిగా రూపొందుతుంది.

11. కనీసమొక మాల. 108 మంత్రములు ప్రతిరోజు జపించవలె. ఈ సంఖ్య పైన ఎంత వేయగలిగితే అంత ఉత్తమము.

12. అనుభవజ్ఞుడైన సదాచారవంతుడైన వ్యక్తిని గురువుగా నేర్పరచుకొని, సాధన చేయవలె. తనకెలాంటి సాధనగావలెనో గురువు నిర్ణయిస్తాడు. రోగి తన రోగమును స్వయంగా తెలుసుకొనుటకు, మందును నిర్ణయించుటకు సమర్థుడుకాడు. అతడు వైద్యుని సహాయము పొందవలె. అటులనే తన మనోభూమికి అనుకూలమైన సాధనను నిర్ణయించువారు, సాధనలోని కష్టములకు సమాధానము తెల్పువాడు సాధనా గురువగుట అత్యావశ్యకము.

13. ప్రాతఃకాల సాధనకు తూర్పువైపుకు తిరిగి. సాయంత్రం పశ్చిమదిక్కు వైపునకు తిరిగి జపించవలెను. ప్రకాశమువైపు, సూర్యునివైపు అభిముఖముగా నుండవలెను. లేదా గాయత్రీమాత చిత్రపటము ఎటువైపు వున్నా అటుతిరిగి కూర్చోవచ్చును.

14. పూలు పూజకు లభించనపుడు అక్షింతలుగాని, కొబ్బరి ముక్కలలోగాని, కొబ్బరిగుజ్జుతో తయారుచేసిన చిన్న ఆకులనుపయోగించవలె. వాటికి కుంకుమ పువ్వు రంగు, పసుపు, ఎర్రమన్ను గోరింటాకు రంగుల నుపయోగించవచ్చు. అశుద్ధమైన విదేశీవస్తువులతో తయారైన రంగులను పయోగించగూడదు.

15 చాలాసేపు ఒకే ఆసనముపై కూర్చొనుట కష్టము. అందువలన కూర్చొని కాళ్ళు నొప్పులెత్తి అలసిపోతాయి. అపుడు కాళ్ళను మార్చవలసి వస్తుంది. అటుల మార్చుటవలన దోషము లేదు.

16. మల, మూత్ర విసర్జన కొరకుగాని, అనివార్య కారణముచేగాని, సాధన మధ్యలో లేవవలసినపుడు, శుద్ధ జలముతో కాళ్ళు చేతులను శుభ్రపరచుకొని మరల కూర్చుండవలె. విక్షేప కారణమువలన, ఒక మాలను ప్రాయశ్చిత్తముగా జపముచేయవలె.

17. అనివార్య కారణమువలన సాధన ఆగినచో మరునాటి దినమునొకమాలను అధికంగా జపించవలె. దీనిని ప్రాయశ్చిత్తంగా భావించవలె.

18. జన్మవలనగాని, (పురుడు) మృత్యువువలన గాని ఆశౌచము పొందినపుడు శుద్ధివరకు, మాల మొదలైన వాటితో నొసరించే విధి జపమును ఆపవలె. కేవలం మానసిక జపము చేయవచ్చును. 1 1/4 (ఒకటింపావు) లక్ష జపానుష్ఠానము ఆపివేయవలె. సూతకము నివృత్తియైన వెంటనే ఆ సంఖ్యనుండి ప్రారంభించవచ్చును. ఆ విక్షేపకాలము శుద్ధికొరకు చేయు జపము అధికంగా చేయవలయును.

19. దీర్ఘకాలపు ప్రయాణములలో స్వయంగా వ్యాధిపీడితులైన, సేవా కార్యక్రమము లలోసంలగ్నమైనపుడు స్నానాది పవిత్రతలకు అవకాశముండదు. ఆ పరిస్థితు లలో మానసిక జపము, మంచంపైనుండి, మార్గంలో ప్రయాణిస్తూ, ఏవైనా అపవిత్ర పరిస్థితులున్నా చేయవచ్చు.

20. సాధకుని ఆహార విహారములు సాత్వికంగా నుండవలె. ఆహారము సాదాగాను, సుపాచ్యంగాను,తాజాగా, శుభ్రమైన హస్తములచే తయారుచేయబడిన పదార్థమై వుండవలె. అధిక మిర్చి మసాలా, పాచిన భోజనం, మిఠాయి, చద్ది పడినది, చచ్చినది, దుర్గంధభూయిష్టమైనది, మాంసము, నిషాగలిగించునది, అభక్ష్యము, వేడిగానున్నది, దప్పికను పెంపొందించునది, అన్యాయార్జితమైనది, మలినమైన మనుష్యులచే తయారు చేయబడినది, అయిష్టంగా నీయబడిన భోజనము మొదలైన వాటినుండి వీలైనంత వరకు దూరంగానుండుట శ్రేయస్కరము.

21 వ్యవహారమెంత ప్రాకృతికమైనప్పటికీ, ధర్మసంకటమైనను, సాత్వికమూ సరళముగా నుండుట ఉత్తమము. ఫ్యాషన్లకోసం, రాత్రి అధికంగా మేల్కొనుట,

పగలు నిద్రించుట, సినిమా, నృత్యములు అధికంగా చూచుట, పరనింద, లోపాన్వేషణ, కలహము, దురాచారము, ఈర్ష్య, నిష్ఠూరం, అలసత్వము, అపాయకరమైన మదమాత్సర్యముల నుండి దూరంగానుండుటకు వీలైనంత ప్రయత్నము చేయవలె

22. బ్రహ్మచర్యము సదా అనుసరణీయము. గాయత్రీ అనుష్ఠానమునకు 40 రోజులు విశేష ఆవశ్యకత.

23. అనుష్ఠానకాలంలో కొన్ని ప్రత్యేక అధిక నియమములను పాటించవలసి వుంటుంది.

(1) గడ్డంతప్ప శిరస్సున వెంట్రుకలు కత్తిరించగూడదు. గడ్డం స్వయంగా చేసుకొనవలె.

(2) మంచంపై నిద్రించరాదు. బల్లపైగాని, నేలపైగాని పవళించవలె.

(3) ఆరోజులలో వట్టికాళ్ళతో ఎక్కువ దూరం నడువరాదు. చర్మపు చెప్పులు ధరించి వెళ్ళరానిచోట, పాపుకోళ్ళు ధరించి వెళ్ళవలె.

(4) ఈ రోజులలో, ఒకసారి ఆహారము, ఒకసారి ఫలహారం చేయవలయును.

(5) తన శరీరమును, దుస్తులను ఇతరులు స్పృశించుట చాలా తక్కువగా నుండవలె.

24. **ఏ కాంతంలో జపం చేసేటపుడు మాలను శూన్యంలో నుంచి జపించవలె. అనేకమంది దృష్టి మాలపై ప్రసరించే అవకాశమున్నపుడు, వస్త్రములో మాలను కప్పవలె. గోముఖిపై హస్తముంచవలె.** (యోగదండమునే గోముఖి యందురు)

25. సాధనానంతరము, పూజచేయగా మిగిలిన అక్షతలు ధూపదీపములు, నైవేద్యము, పూలు, జలము, దీపపు వత్తి, హవనభస్మము మొదలైనవాటిని విచ్చలవిడిగాపారవేయరాదు మనుజులు తొక్కనిచోట వేయవలె. వాటిని తీర్థములో గాని, నదిలోగాని, జలాశయములో గాని, దేవమందిరమందుగాని, ప్రత్తిచేను వరిచేనులోగాని వేయవలెను. నైవేద్యమును బాలురకు పంచవలె. నీటిని సూర్యునికర్ఘ్య మీయవలె.

26. వేదోక్తరీతిలో యోగమునకు దక్షిణమార్గ క్రియలలోను, తంత్రోక్త వామమార్గ పద్ధతులలోను భేదమున్నది **యోగ మార్గ సరళ విధులే ఈ పుస్తకములో**

లిఖింపబడినవి. వీనిలో విశేష కర్మకాండేదీ అవసరము లేదు. శాపవిమోచనము, కవచము, ప్రతిబంధము, ముద్ర, అంగన్యాసము గావించువారలకు వాటి యావశ్యకత లేదు

27. గాయత్రీ అధికారము బ్రాహ్మణులకు క్షత్రియులకు, వైశ్యులకు యీ ముగ్గురు ద్విజులకు మాత్రమే. వర్ణము (కులము) జన్మవలన సంభవిస్తుంది. మరియు గుణ, కర్మ స్వభావము వలన గూడా సంభవిస్తుంది. అనేక ఉచ్ఛ వర్ణములు కాలములోని మార్పులవలన నీచవర్ణములుగా పరిగణింపబడు తున్నాయి. కొన్ని నీచవర్ణములు ఉన్నతమైనవిగా గణింపబడుతున్నాయి. అధికారానికి సంబంధించినంతవరకు, అనుమానము, గడబిడ జరిగినపుడు, తన స్థితిని గుర్తించుట "అఖండజ్యోతి" కార్యాలయంచే నిర్ణయింపబడుతుంది.

28. వేదమంత్రములు 'సస్వరంగా' ఉచ్ఛరింపబడుట ఉచితము. కాని సర్వులూ యథావిధిగా గాయత్రీ మంత్రాన్ని సస్వరంగా పలుకలేరు. కంఠమునుండి ధ్వని సమీపంలో కూర్చొనిన మనుష్యుడు మాత్రమే మంత్రమును వినేటట్లు జపము చేయవలె. ఈ విధంగా చేయబడిన జపము స్వరబంధనము నుండి ముక్తమౌతుంది.

29. సాధనకు అనేక విధులున్నాయి. అనేకమంది వివిధ రీతులలో సాధన చేస్తారు. తన సాధనా విధిని ఇతరులకు తెలియపరచినపుడు, కొంచెములో కొంచమైన మీన మేషములు బయల్పడుతాయి. భ్రమ కలుగుతుంది. కావున తన సాధనా మార్గము నితరులకు తెలుపరాదు. ఇతరులలో విభేదము గల్గినపుడు తన సాధనా గురువుయొక్క ఆదేశమే సర్వోత్తమమైనదిగా గ్రహించవలె. ఏదైనా దోషము, పాపమునకు ఉత్తరదాయిత్వము సాధనా గురువుపై పడుతుంది. సాధకుడు నిర్దోషి, శ్రద్ధాళువు యైనందున, సరైన సాధనాఫలము లభిస్తుంది. వాల్మీకి "రామ" నామమును తల్లి క్రిందులుగా జపించి సిద్ధిపొందాడు.

30. గాయత్రీ సాధన మాతృచరణ వందనములతో సమానం. ఇది నిష్ఫల మెన్నడుకానేరదు. వ్యతిరేక ఫలితము జరుగదు. పొరపాటువలన అరిష్టము జరుగదు. దీనినెవ్వరు శంకించరాదు. కావున నిర్భయంగా, ప్రసన్న మనస్సులో ఉపాసన చేయవలె. ఇతర మంత్రములు నియమము లేకుండా జపించితే

అరిష్టము గలుగుతాయి కాని 'గాయత్రీ' మంత్రమునకట్టిదేమీలేదు. గాయత్రీ మంత్రము సర్వసులభము, అత్యంతసుగమము, అన్నివిధములా సుసాధ్యము. తాంత్రిక పద్ధతిలో జేయు ఉపాసనను పరిపూర్ణ విధివిధానముతో చేయవలె. పొరపాటు హానికరము.

31. ఒంటరిగా ఇతరులకు తెలియకుండా మిఠాయి తినడం ఇతరుల నూరించడం మంచిదికాదు. అటులనే గాయత్రీ స్వయంగా ఉపాసించడంకూడా. మన అన్యప్రియ జనులకు, కుటుంబీకులను గాయత్రీ మంత్రోపాసనకు ప్రోత్సహించ కుండావుండటం, మంచిదికాదూ, తప్పుగూడా. ఈ పొరపాటు నుండి రక్షింపబడుటకు చేతనైనంత అధికసంఖ్యలో వ్యక్తులను గాయత్రీ వైపు ప్రోత్సహించుటయే.

32. సందేహము కల్గినపుడు 'మథుర' లోని "అఖండజ్యోతికి" రిప్లై జాబు పంపి సమాధానము పొందవచ్చు.

33. మాలను జపించేటపుడు సుమేరు (మాల మొదట్లోనున్న కొలికిపూస) ను ఉల్లంఘించగూడదు. ఒక మాల పూర్తియైన వెంటనే దానిని శిరముపైగాని, నేత్రములపై గాని వుంచి, మరల యధాప్రకారంగా మాలను త్రిప్పవలయును. ప్రతిసారి మాల పూర్తియైన పిదప ఇట్లు చేయవలయును.

తమ పూజా సామాగ్రిని, అన్యులు పదే పదే స్పృశింపకుండా నుండేటటువంటి చోట నుంచవలె.

## సాధన-ఏకాగ్రతతో మరియు స్థిరచిత్తంతో చేయవలయును

సాధనకు ఆరోగ్యకరమైన మరియు శాంతచిత్త మవసరము. చిత్తమును ఏకాగ్రమొనరించి, మనస్సును ఇతర వైపులనుండి మళ్లించి తన్మయత్వంతో, శ్రద్ధాభక్తులతో చేసిన సాధన సఫలమౌతుంది. ఈ లక్షణములు సాధకునిలో లేనపుడు అతని ప్రయత్నము ఫలదాయకముగాదు. ఉద్విగ్నతతోకూడి, అశాంతిగల్గి, దుఃఖముతోనున్న ఉత్తేజితమైన, భయము, కుశంకగ్రస్థమైన మనస్సునకు ఏకాగ్రతకుదరదు. మనస్సు క్షణక్షణము పరిభ్రమిస్తూ వుంటుంది. కాసేపు భయము, తరువాత దుర్దశ్శతను

పొందుతుంది. దానిని దాటుటకుపాయ మాలోచిస్తుంది. అట్టిస్థితిలో సాధన సాగుటయెట్లు? ఏకాగ్రత లేనందున గాయత్రీజపమందు మనస్సు లగ్నంకాదు. ధ్యానంగూడా కుదరదు. చేతిలో మాల తిరుగుతుంది, నోరు మంత్రాన్నుచ్చరించుతూ వుంటుంది. చిత్తము అచటకూ ఇచటకూ పరిగెడుతుంది. ఈ స్థితి సాధనకుపయుక్తంగాదు. మనస్సు ఇతరములనుంచి మళ్లించనంత వరకు, అన్ని విషయములు మరువనంత వరకు, ఏకాగ్రత, తన్మయత్వంతో, భక్తి భావనతో మాతయొక్క పాదములపై నిలువనంత వరకు. అంతః కరణములో యోగభావన రావడమెలా సంభవిస్తుంది? గాయత్రిని తనవైపు ఆకర్షించి, అభీష్ట సిద్ధిని ఆమె సహాయంతో పొందవలె.

రెండవ కష్టము- శ్రద్ధలోపించుట, ఎక్కువమంది మనోభూమి శుష్కము, శ్రద్ధారహితమై వుంటుంది. వారు ఆధ్యాత్మిక సాధనలను సవ్యమైన మనస్సుతో విశ్వసించరు ఇతరుల ప్రశంసలనువిని, పరీక్షించుటకై మనస్సులో కుతూహలం కలిగి, నిజమెంతో తెలుసుకోవాలను కుంటారు. ఈ సత్యాన్ని తెలుసుకోవడానికి కష్టసాధ్యమైన కార్యాన్ని పూర్తిగా గీటురాయిగా చేయగూడదు. ఆ కార్యాన్ని పూర్తిగా నిర్వర్తించడానికి అంత శ్రమ నిచ్చి పరీక్షించ గూడదు

పది, ఇరవై మాలలు మంత్ర జపంచేసిన వెంటనే వారి కష్ట సాధ్యకార్యము సునాయసంగా, తృటిలో (కన్ను మూసి తెరచునంత కాలంలో) జరిగి పోవాలని వారు వాంఛిస్తారు. కొంతమంది సజ్జనులు, "మా ఫలనా పని ప్రథమంగా పూర్తియైన వెంటనే సాధన ఇంతమాత్రమే చేస్తాము" అని మ్రొక్కుకుంటారు. అదెలా వుంటుందంటే "ముందు భూమిలోనుండి నీటిని తీసి మా పొలన్ని తడిపితే తరువాత జల దేవతను ప్రసన్నం చేసుకోవడానికి బావిని త్రవ్వనిస్తాం". అని ఎవరైన అన్నట్లుంటుంది. వారి ఉద్దేశ్యం, బహుశా అదృశ్యశక్తులు మన ఉపాసన లేకపోతే ఆకలితో వుంటాయని. వారు లేకపోతే పని జరగదని, అందువలననే వారు ఉపాసన వాయిదావేసి 'ముందు కూలీ చెయ్యి, తరువాత భోజనం పెడతాం లేక నీ ఆగిపోయిన పనిలో సహాయంచేస్తాం అంటారు. అట్టి స్వభావం హాస్యాస్పదం, వారి అవిశ్వాసాన్ని, ఆక్షేపణను తెలియ పరుస్తుంది.

అవిశ్వాసి, అశ్రద్ధాళువు, అస్థిరచిత్తుడు కూడా గాయత్రీ సాధనను నియమంగా చేస్తున్నపుడు, కొంత కాలం తరువాత యీ త్రిదోషములు' తొలగి, శ్రద్ధ, విశ్వాసము, ఏకాగ్రత ఉత్పన్నమగుటలో సఫలత ప్రాప్తించి, వేగంగా పురోగమిస్తాడు. కావున,

మనోభూమిలో సంశయము, అస్థిరత వున్నప్పటికీ సాధనలో లగ్నమవ్వాలి. ఒకానొకరోజు తృటిలో దూరమౌతాయి, మాత కృప లభిస్తుంది.

శ్రద్ధ, విశ్వాసముల శక్తి చాలా ప్రబలమైనది. వీటిద్వారా మనుష్యుడు అసంభవ కార్యమును గూడా సాధించగలుగుతాడు. భగీరధుడు శ్రద్ధా బలంతోనే హిమాలయ పర్వతంలో మార్గంచేసి గంగను పృథ్విపై అవతరించేట్లు చేశాడు. శ్రద్ధ, విశ్వాసముల వలననే ధృవుడు, నామదేవుడు లాంటి చిన్నబాలురు భగవంతుని సాక్షాత్కరింప జేసుకొన్నారు. వీటి ఆధారంపైనే, తులసీదాసు, సూరదాసు మొదలైన వాసనాగ్రస్థులు, సాధుశిరోమణులైనారు. కావున మనమా మహాశక్తిని ఆశ్రయించిన, మన చిత్త చాంచల్యము, అ స్థిరత్వము క్రమంగా తమంతట తామే దూరంగా తొలగిపోతాయి. మనము నియమపాలన గావించు టొక్కటే ఆవశ్యకత, దీన్ని గుర్తుంచుకొంటే, సంకల్పము చేసినవాటిపై దృఢత్వ మేర్పడుతుంది. దీని ఫలితంగా మన మానసిక దుర్బలత శారీరక అశక్తత, స్వయంగా వదలి, మనసాధన చివరలో తప్పక ఫలిస్తుంది.

శాస్త్రము ఇలాచెపుతుంది. "సందిగ్ధోహితో మంత్రం, వ్యగ్రచిత్తోహతో జపం" సందిగ్ధతవలన మంత్రము వ్యర్థమౌతుంది. వ్యగ్రచిత్తముతో గావించిన జపము నిష్ఫలమౌతుంది. సందిగ్ధత. వ్యగ్రము. అశ్రద్ధ, అస్థిరతవలన విశేష ప్రయోజనా ఫలితం లభించదు. ఈ కష్టములను (ఆటంకములు) మనస్సులో నుంచుకొని అధ్యాత్మ విద్యాచార్యులు, ఇతరులద్వారా సాధన చేయించుట (తమకొరకు) నే ఉపాయాన్ని తెలిపారు. అర్హత గలిగిన వ్యక్తి తన స్థానంలో నుండి ఇతరుల కొరకు సాధనచేయవలె. పూర్తియయ్యేంత వరకు తనకు బదులు ఇతరులు సాధనచేయడంలో దోషములేదు. రైతుధాన్యం పండిస్తాడు. సాలె వస్త్రాన్ని తయారుజేస్తాడు. అవసరమైతే తారుమారుగా వచ్చు. వకీలు, డాక్టరు, అధ్యాపకుడు, గుమస్తాల సమయమును బట్టి మూల్యమిచ్చి యేవిధంగా ఖరీదు చేస్తామో, ఆ కొన్న సమయాన్ని యథేచ్ఛగా వుపయోగిస్తామో మన ప్రయోజనం కొరకు, అటులనే ఎవరైనా బ్రహ్మపరాయణ సత్పురుషుని గాయత్రీ ఉపాసనకు నియుక్తుని గావించవచ్చు. సందేహగ్రస్తుడు, అస్థిరచిత్తుడైనందున మార్గమందున్న కష్టములను దాటడానికి సులభమౌతుంది.

కార్యములు జరగడానికి, శ్రీ సంపన్నులవడానికి ధార్మిక మనోవృత్తి కల్గడానికి, బహుధా (ఎక్కువగా) శాంత, సురక్ష ఉన్నతికొరకు గోపాల సహస్రనామము, విష్ణు సహస్రనామము, మహామృత్యుంజయము, శివమహిమ, గంగాలహరీ, మొదలైనవాటిని

నియమిత రూపములో పఠిస్తారు. వారొక బ్రాహ్మణునకు మాసిక దక్షిణమిచ్చి నియమిత సమయములో వాటిని పఠించేటట్లు ఒప్పందము కుదుర్చుకుంటారు. ఆ బ్రాహ్మణుడెంత సమయాన్ని విని యోగిస్తారో దానికనుగుణంగా మూల్యాన్ని చెల్లిస్తారు. ఈ విధంగా సంవత్సరాల తరబడి జరుగుతుంది. ఏవైనాప్రత్యేక పరిస్థితులలో, విశేష ప్రయోజన మాసించినపుడు, ఇతోధికంగా అనుష్ఠానాన్ని గావిస్తారు. దుర్గ నవరాత్రులపుడు నవదుర్గ లకు దుర్గాస్తోత్రం గావిస్తారు. శివరాత్రికి శివమహిమను గానం చేస్తారు. గంగా దశహరా సమయంలో 'గంగాదశహరీ' పఠిస్తారు. దీపావళి దినమున శ్రీసూక్తమును అనేక పండితులు కూర్చొని అధికంగా తమ సామర్ధ్యానుసారం వల్లిస్తారు. మందిరంలో పూజ కొరకు పూజారి నియమింపబడతారు. మందిరాన్ని నడిపే వ్యక్తి కొరకు పూజ చేస్తారు. మందిరంలో చేసే అనేకమైన శ్రమలకు మందిర సంచాలకుడు మూల్యాన్ని చెల్లించవవసరంలేదు.

ఇదేవిధంగా గాయత్రీ సాధనతో గూడ జరగవచ్చు. తమ శరీర ఆరోగ్యం కొరకు, మనోనిశ్చలతకు, కుటుంబ శ్రేయస్సుకు, తమ కార్యముల సురక్షిత కొరకు, ఉన్నతికోసం, వెయ్యి రెండువేల సంఖ్య గాయత్రీ జపింప జేయుట, శ్రీ సంపన్నులు సులభంగా చేయగలరు. ఈ విధంగా ఏదో లాభం పొందినపుడు గాయత్రీదేవి ప్రసన్నతకోసం శుభాన్ని కాంక్షించినపుడు, విపత్తి నివారణార్థం, ఒకటింపావు ($1^1/_4$) లక్ష జపాన్ని, సత్పాత్రుడైన బ్రాహ్మణుని ద్వారా గావించవచ్చు. ఆ సమయంలో సాధన జేయు బ్రాహ్మణునకు అన్న వస్త్రములు, పాత్రలు, దక్షిణరూపంలో ఉదారతాపూర్వంకంగా ఉచితంగా ఒసంగవలె సంతుష్ట సాధకుని సత్యమైన ఆశీర్వాదము, ప్రయోజనా ఫలితాన్ని ఇతోధికంగా పొందేటట్లు చేస్తుంది. అటువంటి సాధకుడు కూడా సంతృప్తి చెందవలె. అధిక నిత్యావసర వస్తువులు పొందినందున సంతుష్టిజెంది, ఆశీర్వాదభావనను మనస్సులో నుంచుకొంటాడు. అసంతుష్టత్వము వలన దుర్భావనా ప్రేరితుడైనందున ఇద్దరి శ్రమ, సమయము నిష్ఫలమౌతాయి.

ప్రతి సాధకుడు తన సాధనను స్వయంగా ఆచరించుట మంచిది. కానీ బలహీనత, అ స్తవ్యస్తత, అస్వస్థత, అస్థిరచిత్తము, చింతాజనకస్థితి మొదలైన వాటివలన సాధన చేయలేని యెడల, ఇచ్చిపుచ్చుకొనే పద్ధతిలో అధికారము గలిగిన ఇతరులచే ఆ పనిని జరిపించవచ్చు. ఈ పద్ధతిగూడా ప్రభావపూర్ణము, లాభదాయకము. అట్టి సత్పాత్రుడు అధికారి, అనుష్ఠానకర్తను కనుగొనుటలో, అఖండజ్యోతి సంస్థానపు సహాయము తీసుకొనవచ్చును.

# గాయత్రీతో సంధ్యావందనము

కొన్ని పనులు నిత్యమాచరించుట మనుజుని ఆవశ్యకర్తవ్యము. అటువంటి కర్మలను "నిత్యకర్మలు" అంటారు. నిత్యకర్మల పుద్దేశ్యం -

1. ఆవశ్యక తత్వముల సమీకరించుట.
2. అనావశ్యక తత్వములను త్యజించుట.

ప్రాయశః శరీరానికి ప్రతిరోజు యేదో అవసరముంటుంది. చైతన్యముగలిగిన వస్తువు తన చైతన్యాన్ని గమనాన్ని స్థిరంగా వుంచుకోవడానికి యెచ్చటినుండైనా నూతనశక్తిని సంతరించుకొంటుంది. అట్టిశక్తి లభ్యంగానపుడు ఆ వస్తువు నశించి పోతుంది. రైలుకు బొగ్గు-నీరు మోటారుకు పెట్రోలు, కాంతికి బ్యాటరీ ఇంజనుకు తైలము, సినిమాకు విద్యుత్తు అవసరం. మొక్కల జీవితం మంచినీటిపై ఆధారపడి వుంటుంది. పశు పక్ష్యాదులు కీటక భృంగములు, మానవులు మొదలుగాగల అన్ని ప్రాణులకు ఆకలి, దప్పికలుంటాయి. తమ తమ ప్రకృతుల కనుగుణ్యంగా, అన్నము జలము వాయువుని భక్షించి జీవన ధారణ చేస్తాయి. ఆహారము లభించనిచో, శరీరయాత్ర అసంభవము. గతిశీలత కల్గిన వస్తువేదైనప్పటికీ, సజీవమైనా, నిర్జీవమైనా తన గతిశీలతను కొనసాగించడానికి ఆహారము అవశ్యముగా కావలె.

ఈ విధంగా అన్ని గతిశీల పదార్థములు ప్రతిక్షణము మలినము సంతరించు కొంటాయి. ఆ మాలిన్యమును తొలగించుకొనవలసిన అవసరం ఉంటుంది. రైలులో బొగ్గుమసి, యంత్రములలో తైలపుజిడ్డు పుడతాయి శరీరంలో ప్రతిక్షణం మలం తయారవుతుంది. అది గుదము, శిశ్నము, నాసిక, ముఖము, చెవి, నేత్రములయొక్క రంధ్రముల నుండి బయల్పడుతుంది. మలవిమోచనము జరగనపుడు, దేహములో విషము ఏకత్రితమవుతుంది. రెండు మూడు రోజులలోనే జీవము సంకట పరిస్థితులకు లోనై దుర్భరమవుతుంది. గృహమునందు చీపురుపయోగించనపుడు బట్టలు శుభ్రపరచనపుడు, పాత్రలు తోమనపుడు, స్నానం చేయనప్పటి శరీరం, రెండు మూడుదినములు గడువవచ్చు. తరువాత వాసన వికారం అసహ్యము,అసహజ స్వరూపము ఉత్పన్నమవుతాయి.

ఆత్మ అన్నింటికంటే అధిక గతిశీలత, చైతన్యము గలిగినది. దానికిగూడా ఆహారము, మలవిసర్జన కావలె స్వాధ్యాయము, సత్సంగము, ఆత్మచింతన, ఉపాసన,

సాధన మొదలైన సాధనలద్వారా ఆత్మకు ఆహారము లభిస్తుంది. అపుడాయాత్మ శక్తివంతము, చైతన్యము, క్రియాశీలిగా తయారవుతుంది. తమ అంతఃకరణకు యీ ఆహారము నివ్వనివ్యక్తి, సంసారమందెల్లప్పుడు జంఝాటంలో కూరుకుపోయిన వ్యక్తి శారీరకంగా బలవంతుడై నప్పటికి, స్థూలకాయుడైనప్పటికీ, ధనము, సంపద కూడబెట్టినప్పటికీ, ఆత్మమాత్రము చైతన్యరహితమై, పొరపాటుకు లోనవుతుంది. ఈ తప్పిదంవలన నిస్తేజము, నిర్బలము, నిష్క్రియమునై, అర్ధమూర్ఛితావస్థలో నుంటుంది కావున, శాస్త్రజ్ఞులు ఆత్మసాధనను నిత్యకర్మతో మేళవించి, మానవునకది ఆవశ్యకమైన కర్తవ్యముగా నొనరించారు.

ఆత్మ సాధనలో, ఆహారప్రాప్తి మరియు మలవిసర్జనా, రెండూ మహత్వపూర్ణ కార్యములు సమాన రూపంలో జరుగుతాయి. ఆత్మిక భావన, ఆలోచనాస్రవంతిని శక్తివంతంగా, చైతన్యంగా క్రియాశీలంగా రూపొందించే పద్ధతిని సాధనంగా పరిగణిస్తారు. సాంసారిక విషయవాసనలు, సంకటములవలన చిత్తముపై సదా ప్రోగుపడే దుష్ట భావముల వలన సంభవించే వికారములు, మలినములుగూడా యీ సాధనవలన విసర్జింపబడుతాయి. శరీరమునకు రెండుసార్లు స్నానము, రెండుసార్లు శౌచము ఆవశ్యకముగా భావిస్తారు. ఆత్మకు గూడయని ఆవశ్యము. దీనినే 'సంధ్యావందనమని' ప్రవచింపబడినది. శరీరంకన్నా ఆత్మయొక్క మహత్తు అధికమైనందున, త్రికాల సంధ్య శాస్త్రములలో వర్ణింపబడి, నిర్దేశింపబడినది. మూడుసార్లు కుదరనియెడల, ప్రాతః సాయం సమయములందు రెండు సార్లు 'సంధ్యావందనము' నెరవేర్చవలె. సంధ్యావందనమందు రుచిలేనివారైనప్పటికి, కనీసమొక్కసారైనా తమ విద్యుక్త ధర్మంగా భావించి చేయవలె. సంధ్యావందన మొనర్చనందున పాపముల వికారములు క్రమ్మకొంటాయి. స్పృహలేని ఆత్మ నిర్బలమౌతుంది. ఈ మాటలు పాపకర్మములలో దురదృష్టకరమైనవి. కావున పాతకములభారము నుండి రక్షణకై గూడా సంధ్యావందనము మనకు ఆవశ్యకమైన నిత్యకర్మ స్నానముతో గూడా కలిపారు.

సంధ్యావందనమునకు అనేకవిధులు హిందూధర్మంలో ప్రాచుర్యంలో వున్నాయి. అన్నింటికన్నా సరళము, సుగమము, సౌమ్యము, అత్యధిక ప్రభావశాలి ఉపాసన, గాయత్రీ మంత్రము వలన జరిగే "బ్రహ్మసంధ్య". దీనిలో ఒక గాయత్రీ మంత్రమును మాత్రమే స్మరించవలె అనేక మంత్రములను స్మరించి, అనేక విధి విధానముల ననుసరించే ఆవశ్యకత లేదు.

సూర్యోదయము లేక సూర్యాస్తమయ 'సంధ్యలు'గా పరిగణిస్తారు. ఈ సమయము సంధ్యావందన సమయము, సౌకర్యాన్ననుసరించి యీ సమయములకు కొంచెము ముందుగాని, వెనుకగాని సంధ్యా వందన మాచరించవచ్చు. త్రికాల సంధ్య చేయువారికి మూడవ సమయము మధ్యాహ్నకాలము. నిత్యకర్మలను పూర్తి గావించిన తదుపరి శరీరమును శుభ్రపరచుకొని సంధ్యావందనమునకు కూర్చొనవలె. ఆ సమయంలో దేహముపై కొంచెమైనా వస్త్రముండవలె. శుభ్రమైన గాలితోగూడిన ఏకాంత స్థలము దొరకిన మిక్కిలి శ్రేష్టము. లేనియెడల గృహములో శుచి, శుభ్రంగావున్న స్థానము ఎన్నుకొనవలె. కుశాసనము లేక, ముతకగుడ్డ లేక గోనాపట్టా లేక కిత్తనార గుడ్డలేక నాలుగు కాళ్ళ పీటపై వెన్నెముకను నిటారుగా నుంచి కాళ్ళు మెలికవేసికొని కూర్చొనవలె. ప్రాతఃకాల సంధ్యకు తూర్పువైపు ముఖము, సాయంసంధ్యయందు పశ్చిమవైపు ముఖముంచి కూర్చొన వలె. దగ్గరగా నీటితో నిండిన పాత్రనుంచుకోవలె. సంధ్యా వందనమునకు 'ఐదు' పనులున్నవి. అవి క్రింద వర్ణింపబడినవి.

## 1. ఆచమనము

జలముతో నిండిన పాత్ర నుండి కుడి అరచేతిలోనికి జలము తీసికొని మూడుసార్లు ఆచమనము చేయవలె ఎడమచేతితో పాత్రనెత్తి కుడిచేతిని కొంచెము నీళ్ళతో నింపి గాయత్రీ మంత్రాన్ని పఠించవలె, మంత్ర పఠనము పూర్తియైన తరువాత ఆ నీటిని త్రాగవలె. మూడుసార్లు ఆచమనము చేసిన తదుపరి చేతిని శుభ్రపరచుకొనవలె నీటితో, పైన వున్న ఉత్తరీయంతో ముఖాన్ని, చేతులను తుడుచుకొని మీసములపైనున్న నీటిని, తడిని తుడుచుకొనవలె.

ఆచమనము త్రిగుణమయి మాతయొక్క వివిధ శక్తులను తమంతట తాము ధారణ చేయుటకై చేయవలె ప్రథమాచమనముతోపాటు సత్వగుణీ విశ్వవ్యాపి, సూక్ష్మశక్తియైన 'హ్రీం' ధ్యానింపబడుతుంది, భావించబడుతుంది. దానివలన విద్యుత్ సమానమైన నీలకిరణములు తన మంత్రోచ్చారణతోపాటు అన్ని దిశలనుండి జలముతో ప్రవేశిస్తుంది. ఆ జలమునందాశక్తి పడుగుపేకలవలె వుంటుంది. ఆచమన మొనరించువేళ, దానితో సమ్మిళిత సర్వశక్తులు తన శరీరాంతర్గతములో ప్రవేశించినట్లు భావించు కొనవలె. "నాలో సత్వగుణము ప్రవేశించినది" అని భావించవలె. ఈ విధంగా రెండవసారి ఆచమనంతోపాటు రజోగుణీ 'శ్రీం' శక్తి పీతవర్ణ కిరణములను జలమునందు ఆకర్షించి, ఆచమనముతోపాటు శరీరమునందు ప్రవేశించినట్లు భావించవలె. మూడవసారి

ఆచమనము తమోగుణీ "క్లీం" భావన చేసి రక్తవర్ణ శక్తిని తనలో ధారణ గావించుకొన్నట్లు భావజాగృతిని పొందవలె.

బాలుడేవిధంగా మాతృస్తన్యము గ్రోలి, ఆమె గుణములను, శక్తులను తనలో ధారణగావించుకొనునో పరిపుష్టుడౌనో, ఆవిధంగానే సాధకుడు మంత్రబలముచే ఆచమన జలమును గాయత్రీమాత స్తన్యసమానంగా గావించి, త్రాగిన ఆత్మబలము అధికమవుతుంది. ఈ ఆచమనము వలన త్రివిధములైన 'హ్రీం' 'శ్రీం' 'క్లీం' శక్తులవలన యుక్తమైన ఆత్మబలము ప్రాప్తినుంది. తదనుసారంగా అతని ఆత్మిక పవిత్రత, సాంసారిక సమృద్ధి, సుదృఢమైన శక్తి ప్రాప్తమౌతాయి.

## 2. శిఖాబంధనము

ఆచమనము తరువాత "శిఖ" ను జలముతో తడిపి, శిరస్సునుండి క్రిందకు వ్రేలాడునట్లుగా ముడివేయవలె దీనినే "అర్ధముడి" అంటారు వేసేటపుడు గాయత్రీ మంత్రము నుచ్చరించుతూ వుండవలె. శిఖ మస్తిష్కపు కేంద్రస్థానముపై నుంటుంది. రేడియో ప్రసారకేంద్రములలో ఎత్తైన స్తంభములనుంచుతారు. వాటినుండి బ్రాడ్‌కాస్టింగ్ తరంగాలు నలుదిక్కులకు ప్రసారం చేయబడతాయి. అటులనే మన మస్తిష్కపు విద్యుత్ భండారము శిఖాస్థానము అచటినుండి మన ఆలోచనలు, సంకల్పములు, శక్తి పరమాణువుల రూపంలో వెలుపలకువచ్చి పెరిగి ఆకాశములో శీఘ్రగతిని పయనిస్తూ వుంటాయి. ఈ ప్రవాహము అనవసరంగా వృథాగా, నిరుపయోగమౌతుంది. శక్తికోశము బలహీనమౌతుంది. దీనిని నిరోధించుటకు శిఖకు ముడివేయవలె. సదా బంధింపబడి వున్నందున మన మానసిక శక్తులు రక్షింపబడతాయి.

సంధ్యావందన మాచరించునపుడు, విశేషరూపంలో ముడివేయటం, రాత్రి నిద్రపోయేటపుడు ముడివిడిపోయి విస్తృతమయ్యే అవకాశమున్నందున, మరల స్నానమాచరించేటపుడు కేశశుద్ధికొరకు శిఖను విప్పవలసి వుంటుంది. సంధ్య యొనర్చునపుడు అనేక సూక్ష్మతత్వములు ఆకర్షింపబడి మనలో స్థానమొనర్చుకొంటాయి. అవి మస్తిష్క కేంద్రము నుండి వెల్వడి వెలుపలకు దూకుతాయి. సంధ్యావందన ప్రయోజనానికి ఆటంకము. అందువలన శిఖను ముడివేయవలె. ఫుట్‌బాల్ లోపలనున్న రబ్బరుసంచికి గాలికొట్టడానికొక గొట్టముంటుంది. దానికి ముడివేసినందున లోపలనున్న గాలి వెలపలకు రాదు. సైకిలు చక్రానికున్న ట్యూబ్‌నుండి గాలిపోకుండా వాల్వు వుంటుంది. దీని ద్వారా గాలిలోపలకు ప్రవేశిస్తుందిగాని బయటకు రాదు. ముడివేయబడిన

శిఖకుగూడా యీ ప్రయోజనమే గలదు. అది వెలుపలనున్న ఆలోచనలను, శక్తి ఆలోచనలను, శక్తి సమూహములను గ్రహిస్తుంది. కాని అంతర్ తత్వములను వృథాగా వ్యయము గానీయదు.

ఆచమనమునకు పూర్వము శిఖాబంధనము చేయరు. ఏలనన ఆచమనమపుడు ఆకర్షించే త్రివిధ శక్తులు జలమువలన సంప్రాప్తిస్తాయి. ఈ ఆకర్షణ మస్తిష్కపు కేంద్రము ద్వారా జరుగుతుంది. శిఖను విడిగానుంచి నందున ద్వితీయ ప్రయోజనమీవిధంగా సంభవిస్తుంది,

## 3. ప్రాణాయామము

సంధ్యావందన మూడవ భాగము ప్రాణాయామము లేదా ప్రాణాకర్షణ. గాయత్రీ ఉత్పత్తిని వర్ణించి (జరిగిన పేజీలలో) సృష్టి రెండు విధములని వచింపబడినది. అవి (1) జడము అనగా పరమాణుమయము, (2) చైతన్య అనగా ప్రాణమయము.

నిఖిల విశ్వంలో, పరమాణు వియోగ సంయోగములచే వివిధ రీతులలో దృశ్యములు గోచరించునట్లుగా చైతన్య ప్రాణశక్తి చలనము వలన చైతన్య జగత్తులో వివిధ సంఘటనలు సంభవిస్తాయి. వాయువు తన క్షేత్రంలో సర్వత్రా నిండియుంటుంది. అదేవిధంగా వాయువు వలన గూడా అసంఖ్యాకమైన సూక్ష్మ చైతన్య ప్రాణతత్వము సర్వత్రా వ్యాపించియున్నది. ఈ తత్వపు అల్పాధిక్యత వలన మన మానస క్షేత్రము శక్తివంతము కావచ్చు, బలహీనము గావచ్చు.

ఈ ప్రాణతత్వాన్నెంత మనశ్శక్తితో ఆకర్షించెదరో, ధారణ గావించెదరో, వారి ఆంతరిక స్థితి అదే మోతాదులో శక్తి వంతమవుతుంది. ఆత్మతేజము, శూరత్వము దృఢత్వము, పురుషార్థములు, విశాలత్వము, మహానుభావత్వము. సహనశీలత, ధైర్యము, సమానత్వగుణము ప్రాణశక్తిని పరిచయము చేయునట్టివి.

ప్రాణశక్తి తక్కువగానున్నవారు, స్థూలశరీరులైనప్పటికీ, పిరికివారుగా, బానిస భావములు గలవారుగా లజ్జపడువారుగా, పారుబోతులుగా, అస్థిరమతులుగా, అనుదారులుగా, స్వార్థపరులుగా, అపరాధ మనో వృత్తులు గల్గి గాబరాపడువారిగా, అధీరులుగా, తుచ్ఛులుగా, నీచభావములు గలవారుగా, చంచలస్వభావులుగా వుంటారు. ఈ దుర్గుణములు గల వ్యక్తి యేపరిస్థితులలోను మహాత్ముడు గావేరడు. అందువలన సాధకునకు ప్రాణశక్తిని తనలో అధికంగా ధారణ చేయవలసిన అవసరమున్నది. విశ్వమయ ప్రాణతత్వము నుండి ఆకర్షించి అత్యధిక మోతాదులో ప్రాణశక్తిని మనము మనలోపల ప్రక్రియను ప్రాణాయామ మంటారు.

ప్రాణాయామము చేయు సమయంలో వెన్నెముకను సరిగా, నిటారుగా నుంచవలె. కారణము, వెన్నెముకలోనున్న ఇడా పింగళా మరియు సుషుమ్న నాడులద్వారా ప్రాణశక్తి యొక్క గమనాగమనములు జరుగుతాయి.వెన్నెముకవంగినట్లైన వంకరగానున్న యెడల, ప్రాణశక్తి ధార మూలాధారములోనున్న కుండలినీవరకు ఆటంకము లేకుండా, నిర్విరామంగా, ప్రవహించదు. అందువలన ప్రాణాయామము వలన ప్రయోజనము చేకూరదు.

ప్రాణాయామములో నాలుగు భాగములున్నవి :

(1) **పూరకము** (2) **అంతర్-కుంభకము**

(3) **రేచకము** (4) **బాహ్య కుంభకము**

వాయువును (గాలిని) లోపలకు పీల్చుకొనుట పూరకము. పీల్చిన గాలిని లోపల బంధించుట అంతర్ కుంభకము. వాయువును బయటకు వదలుట రేచకము. శ్వాస పీల్చకుండా - వాయువును బయటనే ఆపుటను బాహ్య కుంభకము అనియెదురు. ఈ నాలుగింటిని, గాయత్రీ మంత్రము యొక్క నాలుగు భాగములుగా నియమింపబడినవి.

పూరకముతోబాటు "ఓం భూర్భువః స్వః" అంతర్ కుంభకముతో బాటు "తత్సవితుర్వరేణ్యం, రేచకముతో "భర్గోదేవస్య ధీమహి", బాహ్య కుంభకమునకు ధియోయోనః ప్రచోదయాత్" జపించవలె.

(అ) స్వస్థ చిత్తముతో కూర్చొనవలె. ముఖమును అనగా వాక్కును బంధించవలె. నేత్రములను మూసుకొనవలె. లేక అర్ధనిమీలిత నేత్రములై వుండవలె. ఇపుడు శ్వాసను నెమ్మదిగా నాసికద్వారా లోపలకు పీల్చుట మొదలుపెట్టవలె. "ఓం భూర్భువః స్వః" మంత్ర భావనను మనస్సులో నుచ్చరించుతూ, విశ్వవ్యాపి, దుఃఖనాశకి, సుఖ స్వరూపి, బ్రహ్మయొక్క చైతన్య ప్రాణశక్తిని నాసికద్వారా ఆకర్షిస్తున్నానను కొనవలయును. ఈ భావనతో, ఈ మంత్రముతోను నెమ్మది నెమ్మదిగా, శ్వాస పీల్చండి. సాధ్యమైనంత గాలిని లోపల నింపండి.

(ఆ) అపుడు లోపల గాలిని బంధించి 'తత్సవితుర్వరేణ్యం' భాగమును జపించవలె. జపిస్తూ నాసికద్వారా పీల్చబడిన ప్రాణశక్తి శ్రేష్ఠమని భావించవలె. సూర్య సమతేజస్వియైన తేజస్సు నా అంగ ప్రత్యంగములలో రోమ రోమములలో నిండియున్నది యని భావించవలె. ఇటుల భావిస్తూ, పూరించిన సమయములో సగము కాలము గాలిని లోపల నుంచవలె.

(ఇ) తరువాత నాసికద్వారా వాయువును, నెమ్మది నెమ్మదిగా వెలుపలకు వదలుట మొదలెట్టండి. 'భర్గోదేవస్య ధీమహి' మంత్రభాగమును పఠిస్తూ "యీ దివ్య

ప్రాణశక్తి నా పాపములను నశింపజేసి వీడ్కోలు తీసుకుంటున్నది" గా భావించవలె. వాయువును లోపలకు ఆకర్షించినంత సమయము తీసికొనవలె.

(ఈ) లోపలనున్న గాలి వెలుపలకొచ్చినపుడు, గాలిని లోపల యెంతసేపు నిలిపి వుంచామో, అంతసేపు వెలుపల ఆపవలె. అనగా శ్వాస పీల్చకుండా "ధియో యోనః ప్రచోదయాత్" మంత్రభాగమును జపిస్తూ, భగవతీ, వేదమాత, ఆద్యశక్తి గాయత్రీ సద్బుద్ధి జాగృతము చేయుచున్నదని భావించవలె.

## 4. అఘమర్షణ

అఘమర్షణ యనగ 'పాపమును నాశనము చేయు ప్రక్రియ'. గాయత్రీని పుణ్యభావనచే ప్రవేశింపజేసిన పాప నాశము జరుగుతుంది. ప్రకాశము ప్రవేశించినపుడు అంధకారము పటాపంచలవుతుంది. పుణ్య సంకల్ప ప్రభావము పాపముల సంహరణ గావిస్తుంది. బలము, బుద్ధులతోపాటు, బలహీనత, నిర్వీర్యత అంతమొందుతుంది. బ్రహ్మ సంధ్య యొక్క బ్రహ్మభావన మన పాపముల పరిమార్చును. అనగా మన అఘములను, మర్షణ (నాశనము) చేయును.

అఘమర్షణ కొరకు కుడిచేతిలో జలము తీసికొని దానిని కుడిముక్కు రంధ్రము యొక్క సమీపమునకు తీసుకురావలె. సమీపమనగా ఆరంగుళముల దూరము. ఎడమ చేతిలో ఎడమ ముక్కు రంధ్రమును మూయవలె. కుడిముక్కు రంధ్రము నుండి నెమ్మదినెమ్మదిగా శ్వాసనుపీల్చుకొనుట ఆరంభించవలె. శ్వాస పీల్చునపుడు, గాయత్రీ మాత యొక్క పుణ్యప్రతీక యీ జలము తన దివ్యశక్తులతో పాపములను సంహరించుటకై శ్వాసతోపాటు నా అంతరంగములో ప్రవేశించు చున్నది యని భావించవలె. లోపల ప్రవేశించి పాపములను, వికారములను సంహారము చేయుచున్నట్లుగా భావించవలె.

పూర్తిశ్వాసను పీల్చిన తరువాత ఎడమ ముక్కు రంధ్రమును తెరువవలె. కుడి ముక్కు రంధ్రమును బొటనవ్రేలితో మూసి, శ్వాసను వెలుపలకు వదలుట ప్రారంభించవలె. కుడి ముక్కు దగ్గరనున్న నీటిని ఎడమ ముక్కు రంధ్రము వద్దకు తీసుకురావలె. నశించిన పాపములు మృత్యువాతబడి శవములై సమూహముగా ఎడమ ముక్కు వద్ద నుంచబడిన జలములో ప్రవేశించినట్లుగా భావించవలె. శ్వాస పూర్తియైన తరువాత, ఆ జలమువైపు దృష్టి సారించక అసహ్యభావంతో కుడివైపు పారబోయవలె.

అఘమర్షణక్రియలో జలమును చేతిలోనింపునపుడు, "ఓం భూర్భువః స్వః" కుడివైపు ముక్కు రంధ్రముతో గాలి పీల్చునపుడు 'తత్సవితుర్వ రేణ్యం' వరకు జపించ

వలె. ఎడమ ముక్కు రంధ్రమునుండి శ్వాస వదలునపుడు "భర్గో దేవస్య ధీమహి", జలము పారబోసేటపుడు "ధియోయోనః ప్రచోదయాత్" మంత్ర భాగము ఉచ్చరించవలె.

ఈ క్రియను మూడు పర్యాయములు చేయవలె. దానివలన కాయము, ప్రాణము, మనస్సు చేసిన త్రివిధ పాపములు సంహరింపబడతాయి.

## 5. న్యాసము

న్యాసమనగా ధారణ గావించుట, అంగప్రత్యంగములలో గాయత్రీమాత సత్వగుణ శక్తిని ధారణచేయుట, స్థాపనచేయుట, నింపుట, మిశ్రితమగుటకు న్యాసము గావింపబడుతుంది. గాయత్రీ మంత్రంలోని ప్రతి శబ్దమునకూ (అక్షరమునకు) మహత్వపూర్ణమైన స్థలాలకు ఘనిష్టసంబంధమున్నది. సితారు (సంగీత వాద్యం) కున్న తంత్రులలో ప్రత్యేక భాగములను స్పృశించినపుడు, ఆ భాగములను వ్రేళ్ళతో వత్తిడి కల్గించినపుడు, విభిన్న స్వరములుత్పన్నమౌతాయి. అటులనే శరీర వీణ గూడా వ్రేళ్ళ సహాయముతో దివ్యభావములను జాగృతపరచబడతాయి.

అపవిత్రమైన శరీరము వలన, దేవీసాన్నిధ్యము పవిత్రముగా నుండదని స్వభావ సిద్ధంగా అంగీకరిస్తారు. కావున ఆ ప్రముఖ స్థానములలో దైవీపవిత్రతను స్థాపించుట కొరకై తగుమోతాదులో దైవీతత్వములను స్థాపించినచో సాధకుడు దైవీసాధనకు అర్హుడౌతాడు.

న్యాసము కొరకు భిన్న భిన్న ఉపాసన విధులలో, వివిధ విధి విధానములున్నవి. ఆ ప్రకారంగా వ్రేళ్ళకు పని కల్పించెదరు. గాయత్రీ బ్రహ్మ సంధ్యలో అంగుష్ఠము, అనామిక ప్రయోగము, ప్రయోజనీయముగా చేయబడినది "యీ నా అంగములు గాయత్రీ శక్తితో పవిత్రము, శక్తివంతములైనవి" అని భావిస్తూ అంగుష్ఠము అనామికలు కలిపి విభిన్న అంగములను స్పర్శించవలె అంగస్పర్శ చేయునపుడు దిమ్న (క్రింది) ప్రకారము మంత్రోచ్చారణ చేయవలె.

| | | |
|---|---|---|
| ఓం భూర్భువః స్వః | - | మూర్ధాయై |
| తత్సవితుః | : | నేత్రాభ్యాం |
| వరేణ్యం | : | కర్ణాభ్యాం |
| భర్గో | : | ముఖాయ |
| దేవస్య | : | కంఠాయ |
| ధీమహి | : | హృదయాయ |
| ధియోయోనః | : | నాభ్యై |
| ప్రచోదయాత్ | : | హస్తపాదాభ్యాం |

ఈ సప్తాంగముల శరీరము బ్రహ్మాండము యొక్క సప్తలోకములు. లేక ఆత్మరూపుడైన సవిత (సూర్యుడు) యొక్క సప్తాశ్వములుగా తెలుసుకోండి. శరీరము సప్తాహము యొక్క సప్తదినములు. ఏలనన సాధారణంగా దశేంద్రియములని అంగీకరిస్తారు. కాని గాయత్రీ యోగాంతర్గములో సప్త (ఏడు) ఇంద్రియములని అంగీకరించడమైనది.

(1) మూర్ధము (మస్తిష్కము, మనస్సు) (2) నేత్రములు (3) కర్ణములు (చెవులు), (4) వాక్కు, నాలుక, (5) హృదయము అంతఃకరణము, (6)నాభి, జనేంద్రియములు (7) హస్త పాదములు.

ఈ సప్తములు అపవిత్రంగా కూడదు. వీటిద్వారా కుమార్గమును అవలంభించ గూడదు. అవివేకపూర్ణ ఆచరణను అనుసరింపరాదు. కావున న్యాసమొనరింపవలె. ఈ సప్తాంగములలో భగవతి యొక్క సప్తశక్తులు నివసించి యుంటాయి. వాటిని పైన చెప్పబడిన న్యాసము ద్వారా జాగృతపరచవలె. జాగృతము గావించబడిన మాతృకలు తమ తమ స్థానములను రక్షిస్తాయి. అవాంఛనీయ తత్వములను న్యాసము నిర్మూలిస్తుంది. ఈ విధంగా సాధకుని లోపలనున్న బ్రహ్మశక్తి సుదృఢమైన దుర్గముగా తయారవుతుంది.

ఈ పంచకోశములను వినియోగపరచిన తదుపరి, ఆచమన, శిఖాబంధనము, ప్రాణాయామము, అఘమర్షణ, న్యాసముల నివృత్తి గావించిన తరువాత, గాయత్రీ జపము ధ్యానము చేయవలె పెదవులను కదిలిస్తూ,, శబ్దోచ్చారణ జరగవలెకాని సమీపముననున్న వ్యక్తులకది వినిపించగూడదు.

గాయత్రీ మాత మన హృదయ సింహాసనముపై నధివసించి, తన శక్తి పూర్ణ కిరణములను నలుదిక్కుల వెదజల్లుచున్నట్లు ఆ ప్రకాశ స్పర్శవలన మన శరీరాంతర్గతములో అలౌకిక భావనానుభవమును పొందుచున్నట్లు, భావించి వేదమాత గాయత్రిని ధ్యానించి జపించవలె. ఆసమయములో నేత్రములను మూసికొనవచ్చు. లేక అర్థ నిమీలితములు గావించుకొనవచ్చు. మన హృదయాకాశమును బ్రహ్మాకాశ సమాన విస్తృతలోక జ్ఞానతేజస్వీజ్యోతిని కల్పించుకొనవలె ఈ జ్యోతి ప్రకాశవంతమైన గాయత్రీమాత జ్ఞానజ్యోతియే అవుతుంది. కొంత సమయంలోనే సాధకునకు యీఅనుభవము స్పష్టమౌతుంది.

ఈ విధమైన సాధనకు ఫలస్వరూపము, శ్వేతరంగుగల జ్యోతిలో వివిధ రంగులు గోచరిస్తాయి. సాధన నీవిధంగా క్రమ క్రమంగా కొనసాగించిన ఆత్మోన్నతి పొందుట నిశ్చయము. ఆధ్యాత్మ యొక్క ఉన్నతసోపానముల నధిరోహించవచ్చు

# గాయత్రీ యొక్క సర్వశ్రేష్ఠ సర్వసులభ ధ్యానము

మానవ మస్తిష్కము ఆశ్చర్యజనకమైనదియు, శక్తిశాలి, మంటిక గుణమునందున దాని గమనవిధి, సామర్థ్యము, క్రియాశీలత వీక్షించి గొప్ప గొప్ప విజ్ఞానశీలురు ఆశ్చర్యము పొందెదరు. ఈ అణువులను విశేష మార్గములో నియోగించినపుడు, ఆమార్గములో నిగనిగలాడే అగ్నిజిహ్వ అగ్రగామి యౌతుంది. ఏ మార్గములో మానవునికోర్కె, ఆకాంక్ష, లాలస వుంటాయో, అదే దిశలో, అదే రంగంలో, ఆకోరిక కొరకే శరీరపు శక్తులు నియోగింపబడుతాయి.

ప్రథమంగా భావనలు మనస్సులో పుద్భవిస్తాయి. ఆ భావనలపై చిత్తమేకాగ్రత నొందినపుడు, ఒక అగ్నిశక్తి ఆకర్షణీయరూపంలో ప్రకటమవుతుంది. అపుడది తన అభీష్ట తత్వములను అఖిలాకాశమునుండి ఆకర్షిస్తుంది. ధ్యానము యొక్క విజ్ఞానమిదియే. ఈ విజ్ఞానంపై ఆధారపడి ప్రకృత్యాంతరాళములో నివసించే సూక్ష్మ ఆద్యశక్తి బ్రహ్మస్ఫురణ గాయత్రీ దేవిని తనవైపు ఆకర్షించుటకు వీలవుతుంది. ఆమె యొక్క శక్తి భండారపు ఆధిక్యత తనలో ధారణ గావింపబడుతుంది.

**జప సమయంలోగాని, లేక అన్య సౌకర్య సమయములోగాని, నిత్యమూ గాయత్రీ ధ్యానము చేయవలె.** ఏకాంతము, కోలాహల రహితము శాంత వాతావరణ, ప్రదేశంలో స్థిరచిత్తంతో ధ్యానమునకు కూర్చొనవలె. దుస్తులు వదులుగా నుండవలె. జప సమయంలో ధ్యానము చేయవలసినపుడు కాళ్ళు ముడుచుకొని (బాసిపట్టు వేసికొని) మేరుదండమును (వెన్నెముకలు) నిటారుగా నుంచుకొని ధ్యానము చేయవలె. **ఇతర సమయములలో చేయవలసివస్తే చేతులున్న కుర్చీపై (Armchair) పండుకొనిగాని, పెద్ద దిండు లేక బాలీసుపైగాని, చెట్టును ఆధారంచేసుకొనిగాని సాధన చేయవలె.**

శరీరమును పూర్తిగ వదులుగా చేయవలె. నిర్జీవమైపోయేటంతగా శరీరమును వదులుగానుంచవలె. ఈ స్థితిలో నేత్రములను మూసివుంచి, రెండుచేతులను తొడల పైనుంచుకొని ధ్యానము చేయవలె. "ఈ ప్రపంచమంతటా సర్వత్ర కేవలం నీలాకాశమున్నది. దీనిలో యెచ్చటా యే వస్తువూలేదు" అని భావించవలె. ప్రళయకాలంలో ఆకాశము తప్ప యితరమేది వుండదు. అటువంటి స్థితిని మనఃఫలకముపై కల్పనాచిత్రమును వూహించి, పూర్తిగా అంకితముగావలె. ఈ విధంగా కల్పనాచిత్రమును బాగుగా నేర్పరచుకొన్న తరువాత సుదూరాకాశంలో ఒక సూక్ష్మ జ్యోతిపిండమును, సూక్ష్మనేత్రములద్వారా

చూడవలె సూర్యునితో సమానమైన ప్రకాశమును కలిగిన యొక చిన్న నక్షత్ర రూపంలో గాయత్రీని ధ్యానించవలె. ఈ జ్యోతిపిండమును అధికంగా ధ్యానించినందున, ఆ జ్యోతి సమీపమునకు వస్తుంది. పెద్దదై, అధిక తేజస్సును విరజిల్లుతుంది.

చంద్రునిగాని, సూర్యునితో ధ్యానపూర్వకంగా (ఏకాగ్రతతో) పరిశీలించి చూచిన వారి బింబములలో నల్లనల్లటి మచ్చలు కనిపిస్తాయి. ఈ విధంగానే గాయత్రీ తేజపుంజములో, ధ్యానపూర్వకంగా గమనిస్తే ఆరంభంలో గాయత్రీ దేవియొక్క అస్పష్టమైన ప్రతిమ దృష్టిగోచరమవుతుంది. నెమ్మది నెమ్మదిగా ధ్యానము గావించువారికి యీ మూర్తి అధికమైన స్పష్టతతో, అధిక స్వచ్ఛముగా, అధిక చైతన్యముగా నవ్వుతూ, మాట్లాడుతూ, సైగలుచేస్తూ సంకేతములనందిస్తూ, భావప్రకటనలు గావించుతూ దర్శనమిస్తుంది.

మా యీ గాయత్రీ పుస్తకారంభంలో భగవతీ గాయత్రీ దేవియొక్క చిత్రము నిచ్చితిమి. ఆ చిత్రాన్ని ధ్యానించుటను ప్రారంభించకముందు, అనేకసార్లు ప్రేమతో, గాఢంగా నిశ్చల చిత్తముతో ఆదేవి అంగప్రత్యంగములను తీక్షణముగా వీక్షించి, ఆ మూర్తిని మనోక్షేత్రముపై జ్యోతిపిండము నందట్టి ప్రతిమనే ప్రతిష్ఠించుకోవలె. అట్టి మూర్తినే దర్శించి ధ్యానించవలె. కొలది దినములలోనే ఆ తేజోమండలముచే ఆవరింపబడిన భగవతీ గాయత్రీదేవి మెరుపు అత్యంత హృదయగ్రాహ్యమైన రూపంలో ధ్యానావస్థలో దృష్టి గోచరమవుట ప్రారంభమవుతుంది.

సూర్యుని కిరణరశ్మిలో కూర్చొనిన మనుష్యునిపై కిరణప్రసారము పడునట్లు ఆ కిరణముల వేడి ప్రత్యక్షముగా ననుభవించునటుల, యీ జ్యోతిపిండము (జ్యోతిః పుంజము) సమీపమునకు వచ్చినపుడు యేదోవిధమైన దివ్యప్రకాశము తన మస్తిష్కములో, అంతఃకరణములో, శరీరములోని రోమ రోమములలో ప్రవేశించి తన అధికారమును కూడగట్టుకొన్నట్లు అనుభవమవుతుంది. ఉదాహరణకు, అగ్నిలోపడిన లోహము క్రమక్రమంగా వేడిని సంతరించుకొని, ఎరుపు రంగులో అగ్నివర్ణంగా మారునట్లుగా, గాయత్రీదేవి తేజస్సును ధ్యానావస్థలో సాధకుడు తనలో ధారణగావించినపుడు అదే సచ్చిదానంద స్వరూపము, ఋషికల్పమై బ్రహ్మ తేజస్సుతో, అలలుగా పుప్పొంగుతుంది. ఆ తేజస్సు తన సంపూర్ణ శరీరములో తపస్వర్ణము మాదిర రక్తవర్ణముగా నున్నట్లు అనుభవమౌతుంది. యీ తేజోసంస్థానములో ఆత్మపై కూడగట్టుకొనివున్న తన కలుషకషాయజలము భస్మమై పోతుంది. సాధకుడు తననుతాను బ్రహ్మస్వరూపునిగా, నిర్మలునిగా, నిర్భయునిగా, నిష్పాపునిగా, నిరాసక్తునిగా, అనుభవాన్ని పొందుతాడు.

ఈ తేజోధారణ ధ్యానంలో అనేకసార్లు రంగురంగుల ప్రకాశము కనిపిస్తుంది. అనేకసార్లు విచిత్ర రంగులలో చిన్నవి, పెద్దవి నక్షత్రములు గోచరమవుతాయి. తళతళలాడుతూ, అదృశ్యమవుతూ వుంటాయి. అవి ఒక దిశనుండి మరొకదిశకు వెళుతూ, మరల తిరిగివస్తూ, వంకరగా తిరుగుతూ వస్తాయి. అనేకసార్లు చక్రాకారంలో బాణంవలె వేగంగా ఒకేదిశవైపు పయనించుతూ, కొద్దిగానో, గొప్పగానో ప్రకాశఖండములు దర్శనమిస్తాయి. ఇవన్నీ సఫలతనిచ్చే చిహ్నములు. అంతరంగంలో గాయత్రీ శక్తి వృద్ధియైనకొలది, సూక్ష్మశక్తులనేకం సద్గుణములు వికసిస్తాయి. అవి గూడా చిన్న చిన్న విచిత్ర రంగులలో పరిరక్షింపబడుతాయి.

సాధన అధికంగా, ప్రగాఢమైనపుడు, స్పష్టము పరిపక్వమైనపుడు, మస్తిష్కపు మధ్యభాగంలోగాని హృదయస్థానములోగాని, ఆ గాయత్రీ తేజము స్థిరంగా వుంటుంది. ఇదియే సిద్ధావస్థ. ఆ తేజము బ్రహ్మకాశము నుండి ఆకర్షింపబడి తనలో స్థిరంగా నెలకొనినపుడు, తన శరీరము గాయత్రీ ప్రాణమొకేస్థానములో సమ్మిళితమయ్యే స్థితి చేకూరుతుంది.

భూతప్రేతములు శరీరముపై ఆవేశించినపుడు మనుష్యుడు ప్రేతాత్మ యిచ్చాను సారము ప్రవర్తిస్తాడు. అటులనే గాయత్రీ శక్తిస్థాపన తన అంతరంగములో ప్రవేశించినపుడు సాధకుని ఆలోచనలు,పనులు, ఆచరణ, మనోభావాలు, అభిరుచులు, కోరికలు ఆకాంక్షలు అన్నీ ధ్యానపరమార్థంగా వుంటాయి. దీని వలన మనుషత్వంలోని పశుత్వం నశించి, దైవత్వము పెంపొందుతుంది.

ఉపర్యుక్త ధ్యానము గాయత్రీ సర్వోత్తమమైనది. గాయత్రీ తేజఃపుంజపు కిరణములు తనపై ప్రసరిస్తున్నాయనే ధ్యానభావన జేసినపుడు ఆ కిరణములు సద్బుద్ధి సాత్వికతనూ, సశక్తిని గూడా మనపై ప్రసరిస్తున్నాయని, సూర్యుడు తన కిరణములతోపాటు వేడిని, చైతన్యశక్తినెటుల ప్రసరిస్తాయో యట్లేయని భావించవలె. యీ ధ్యానమునుండి లేచిన వెంటనే, సాధకునకు తన మస్తిష్కములో సద్బుద్ధి, అంతఃకరణములో సాత్వికత, శరీరంలో సూక్ష్మత చేకూరినట్లు అనుభవమవుతుంది. యీ విధమైన అభివృద్ధి కొంచెము కొంచెముగా ప్రతిదినము జరుగుతున్నందున క్రమక్రమంగా కొలది రోజులలోనే ఎక్కువ మోతాదులో ఏకత్రితమవుతుంది. తరువాత అదియొక భండారమవుతుంది. బ్రహ్మతేజోదర్శనమైనపుడు, శ్రేయస్సుగాని (శుభము, పుణ్యము, మంగళకరములు) ప్రేయస్సుగాని, రెంటిలోనొకటి బాంకులో జమచేయండి, తత్ఫలితంగా దైవీ సంబంధమైనవిగాని లేక సాంసారిక సుఖములుగాని, వస్తువులుగాని సంప్రాప్తించగలవు.

# పాపనాశక, మరియు శక్తివర్ధక తపశ్చర్యలు

అగ్ని యొక్క వేడిచే ప్రపంచములోని సర్వపదార్థములు మాడిపోవుట, గందరగోళమగుట జరుగుతుంది. అగ్ని సంపర్కముతో పరివర్తనంగాని వస్తువేదీలేదు. తపస్సుచే అగ్నిగూడ అటువంటిదే. తపస్సు పాపసమూహములను నిశ్చయంగా ఎదిరించి వాటి శక్తిని సన్నగిల చేస్తుంది. వాటిని మార్చి మనోరంజకంగా తయారు చేస్తుంది. లేక వాటిని భస్మం చేస్తుంది.

ప్రారబ్ధకర్మ పరిపక్వము వలన, ప్రారబ్ధము భవితవ్యమున్నపుడు, వాటిని అనుభవించడం నశించని( చెరగని) రేఖవలె సునిశ్చితమై నపుడు, ఆ కష్టసాధ్య అనుభవం, తపసాగ్నికారణంచే తీవ్రత తగ్గి బలహీనమవుతుంది. అపుడుకష్టమును భరించుట సుగమమవుతుంది. రెండు మాసముల వరకు భయంకర ఉదరశూలయై ప్రకటింపబడ వలసిన పాపములు, సాధారణ నొప్పిగా మారి రెండు మాసములవరకు మాములు గడబిడ జరిగి సులభంగా తగ్గి పోతుంది. కొన్ని పాపముల కారణంగా చేతులు కాళ్ళు తెగిపోవుట సంభవించవలె. మరియు రక్తస్రావ మెక్కువ జరగవలె. కాని తపస్సుచే చిన్న దెబ్బ తగిలి, చాకు మొదలైన వాటివలన తెగి, పది లేక ఇరవై రక్తపు బొట్లు మాత్రమే ప్రవహించుట జరిగి పాపముల ఫలితము నివృత్తిని సంభవిస్తుంది. జన్మ జన్మాంతరముల సంచిత(కూడుకొని) పాపములు, అనేకానేక జన్మముల వరకు, సహింపరాని కష్టములను కలుగజేస్తుంటాయి. అవి తపస్సు వలన చిన్న చిన్న విపత్కర చిహ్నములుగా వచ్చి, యీ జన్మలోనే నివృత్తిగావింపబడతాయి. మరణానంతరము స్వర్గము తదుపరి ముక్తిని చేకూర్చు అత్యంత వైభవోపేతమైన జన్మ ప్రాప్తించడానికి మార్గము సుగమమవుతుంది. తపస్వులకు యీ జన్మలో ప్రాయశః కొన్ని అసౌకర్యములుంటాయి. కారణమేమనిన జన్మ జన్మాంతర సమస్త పాపములు యీ జన్మలోనే యనుభవించి, రానున్న మార్గము సుగమమవుతుంది అందువలన ఈశ్వర వరదానము వలన తేలికపాటి కష్టములు తపస్వులకు సంభవించడం కద్దు. ఇది పాప పరిహారము.

పాప ఫలితముల మారుట యీ విధంగా వుంటుంది. పాప ఫలితములనుభవించ వలసినపుడు, ఆ ఫలితము తపస్సువలన అది యిష్టమైనదిగాను, అతి రుచికరమైనదిగా మారుతుంది. ధర్మంకోసం కర్తవ్యపాలన కొరకై, యశస్సు, కీర్తి, పరోపకారము కొరకు కష్టమును సహించవలసినపుడది ప్రసవవేదన వలె వుంటుంది. గర్భిణీ స్త్రీకి ప్రసవకాలము

కష్టతరమైనదే. కాని దానితోపాటు ఉల్లాసముగూడా కలసివుంటుంది. చంద్రబింబము లాంటి కుమారుని గాంచిన వెంటనే ప్రసవవేదన పూర్తిగా మరిచిపోతారు.

రాజా హరిశ్చంద్రుడు, దధీచి మహాముని, భక్త ప్రహ్లాదుడు, మయూరధ్వజాడు మొదలైనవారు కష్టముల ననుభవించవలసి వచ్చినది. కాని వారికున్న కీర్తికాంక్ష అమరత్వము, సద్గతి ప్రాప్తించునన్న దృష్టి ఆ పరిస్థితులలో గూడా ఉత్సాహకరముగా మారినవి. దానమివ్వడంలో ఎచట ఆసక్తి యున్నదో, శుభగతి కూడా ప్రాప్తిస్తుంది. తపస్సు ద్వారా యీ ప్రకారం ఋణవిముక్తి కావడం, అతిధి తృప్తిగా భోంచేయడం రెండు కార్యములు కలసి జరుగుతాయి.

భస్మీకరణ - యీ ప్రకారం జరుగుతుంది. ఇపుడే ప్రారబ్ధముగా మారనటువంటి పాపములు, అజ్ఞానంచేగాని,మతిమరపువలనగాని, బలహీనతచేగాని, సంభవించినట్టైన, ఆ చిన్నా, పెద్దా అశుభకార్యములు తపసాగ్నిచే మండిపోయి కాలి తనంతట తామే భస్మీ పటలమవుతాయి ఎండుగడ్డి వాము (కుప్ప) చిన్న నిప్పురవ్వచే మండునట్లుగా, యీ శ్రేణికి చెందిన పాపకర్మములు, తపశ్చర్యచే, పశ్చాత్తాప ప్రాయశ్చిత్తములచే, భవిష్యత్తులో ఆ పాపములు చేయననే దృఢనిశ్చయము వలన తమంతట తామే నశిస్తాయి.

ప్రకాశపు సమ్ముఖంలో అంధకారమేవిధంగా తొలగి విలీనమవుతుందో, అట్లే తపస్వి యొక్క అంతఃకరణము నుండి ప్రసరించే ప్రచండ కిరణములచే సంస్కారములు నశిస్తాయి. ఆ సంస్కారముల ఛాయగాని, దుర్గంధముగాని, కష్టకారకమైన పరిణామ లేశములుగాని, అంతరిస్తాయి.

తపశ్చర్యచే పురాకృత పాపములకు గ్లాని సంభవించడం, మార్పిడి జరగడం, భస్మీపటలమగుటయేగాక ఆ తపస్వియొక్క మిక్కిలి నవ్య సాత్వికాగ్ని ఉద్భవిస్తుంది. ఈ అగ్నిని దైవ విద్యుత్ శక్తియని, ఆత్మతేజమని, తపోబలమని వివిధ నామములతో పిలువబడుతుంది. ఈ బలము వలన అంతఃకరణములో దాగివున్న గుప్తశక్తులు జాగృత (మేలుకొనుట) మై దివ్య సాత్విక గుణముల వికాసము సంభవిస్తుంది. స్ఫూర్తి,ఉత్సాహము, సాహసము, దూరదర్శనము, సంయమనము, సన్మార్గమునందు ప్రవృత్తి మొదలైన అనేక గుణములు విశేషంగా ప్రత్యక్ష, పరిరక్షితమగుట జరుగుతుంది. కుసంస్కారములు, కువిచారములు; దురభ్యాసములు, కుకర్మలనుండి విముక్తికై తపశ్చర్య రామబాణము వంటిది. ప్రాచీనకాలంలో అనేక దేవదానవులు తపస్సానరించి వారి అభీష్టములను పొందే వరములను పొందినారు.

వస్తువును అరిగిపోవునట్లొనరించే రాపిడి వలన వేడి జనిస్తుంది. తనను తాను తపస్సుచే శుష్కింప చేసుకొన్నందున ఆత్మశక్తి వుద్భవిస్తుంది. సముద్రమును మథించుటవలన పదునాలుగు రత్నములు లభించాయి. పాలను మథించినందున నెయ్యి వస్తుంది. కామ మంథనము వలన ప్రాణమున్న బాలుడుత్పన్నమవుతాడు. భూమిని దున్నుట (మంథనము) వలన అన్నముద్భవిస్తుంది. తపస్సుద్వారా జరిగిన ఆత్మమథనముద్వారా ఉన్నత ఆధ్యాత్మిక తత్వముల అభివృద్ధియనే ప్రయోజనము చేకూరుతుంది. రాతిపై రుద్దితే కత్తికి పదును లభిస్తుంది. అగ్నిచేత పింపజేయ బడినందున బంగారము నిర్మలమవుతుంది. తపస్సుచే తపింపబడిన మానవుడు పాపవిముక్తుడవుతాడు. తేజస్వి, వివేక వంతుడుగా రూపొందుతాడు.

మన తపస్సులలో గాయత్రీ తపస్సు యొక్క స్థానము మహత్వపూర్ణమైనది. పాపనాశనము, బ్రహ్మతేజో వర్థనీయమైన తపశ్చర్యలు కొన్ని క్రింద నీయబడినవి.

## 1. అస్వాదు తపము

అలవాటైన వస్తువుల కొరత యేర్పడినపుడు, సహనభావము కావలె. ఆ సహనభావము కష్టతరమైనది. ఆ కష్టమును సహించుటను తపస్సు అంటారు. భోజన మందు "ఉప్పు", "తీపి" రుచికి ప్రధానములు. ఈ రెండు వస్తువులలో యేవొక్కటి లోపించినప్పటికి భోజనము యింపుగా నుండదు. బహుశః ప్రజలకు స్వాదిష్ట భోజన మందు ప్రీతి యెక్కువ, అలవాటుగూడా. ఈ రెండింటిలో స్వాదిష్ట తత్వమును వదలి తయారుచేయబడిన భోజనమును సాత్విక ప్రకృతి కలిగిన భోజనమని అందురు. రాజసప్రకృతిగలవారలా భోజనమును సహింపలేరు, భరించలేరు. రుచిలేని భోజనమందు ప్రీతి యేర్పడిన కొలది సాత్వికత పెరుగుతుంది. ప్రారంభంలో ఒక వారంరోజులు, ఒక మాసము, ఒక ఋతువు (3మాసములు) దీనిని ప్రయోగించవలె. ప్రారంభంలో దీర్ఘ కాలము ప్రయత్న చేయ గూడదు. దీనికే "అస్వాదు తపము" అని పేరు.

## 2. తితీక్ష తపస్సు

చలిలేక వేడివలన సంభవించే శరీరబాధను కొంచెము కొంచెముగా భరించుట అలవాటుచేసుకొనవలె. శీతాకాలంలో ధోవతి, ఉత్తరీయము లేక చొక్కాతో, గడపుట, రాత్రిళ్ళు ఉన్నివస్త్రములు ధరించకుండా, కేవలము కంబళి, దుప్పటితోనే పనిజరుగునట్లు అభ్యసించవలె. వేడినీళ్ళ స్నానముకన్న, తాజానీళ్ళతో స్నానముచేయవలె. అగ్నివద్దనే

వేడికొరకు ప్రయత్నించవద్దు. ఇది చలిని తట్టుకొనుటకు చేసే తపస్సు. పంఖా, గొడుగు మంచుగడ్డలను త్యజించుట వేడిని తట్టుకొనుటకు తపస్సు

## 3. కర్షణ తపస్సు

ప్రాతఃకాలము ఒకటి రెండు గంటల రాత్రి మిగిలివున్నదనగా, నిద్రలేచి నిత్యకర్మలను ప్రారంభించవలె. తనచేతితో తయారుచేసుకొనిన భోజనము చేయవలె. తన నీరు తానే తెచ్చుకొనవలె. తన బట్టలు తానే ఉతుకుకొనవలె. తన పాత్రలు స్వయంగా తోముకొనవలె. తనకు కావలసిన పనులకు యితరులచే సాధ్యమైనంతవరకు తక్కువ సేవ చేయించుకోవలె. చెప్పులు ధరించకుండ పాదుకలు లేక కట్టెతోను నవారుతో చేసిన చెప్పులతో పని నెరవేర్చవలె. మంచముపై పరుండరాదు. బల్లపైగాని, నేలపైగాని నిద్రించవలె. లోహపాత్రను (కంచము) వుపయోగించకుండ, విస్తరిలో భోంచేయవలె. పశువులపై సవారీ చేయకూడదు. ముతకబట్టలు ధరించి, కాలినడకన యాత్రలు చేయవలె. యీ విధమైన ఆచరణను "కర్షణ తపస్సు" అంటారు. దీనిలో ప్రతిదినము శారీరక కష్టములు అనుభవిస్తూ సుఖములను త్యజించవలె.

## 4. ఉపవాసము

'గీత' ఉపవాసమును విషయవికార నివృత్తిజేయునిదిగా చెప్పబడినది. ఒకసారి అన్నాహారము, రెండవ సారి ఫలాహారం ఆరంభంలో ఉపవాసము. క్రమక్రమంగా దీనిని కఠోరంగా సాగునట్లు చేయవలెను. రెండు సార్లు పండ్లు పాలు, పెరుగు మొదలైన ఆహారము కంటె కఠినమైనవి. కేవలం పాలు, మజ్జిగపై నుండుటకు వాటిని పెక్కుసార్లు సేవించవలె. జలము (నీరు) ఉపవాసంలో అనేకసార్లు అధిక పరిమాణంలో దప్పికగా లేక పోయినా త్రాగవలె. ఉపవాసముండేవారు నీరు త్రాగకపోయినా, పొరపాటే. దీనివలన కుక్షి (కడుపు) లో నున్న ప్రేగులలో మలమును ఎండునట్లు చేస్తుంది. కావున ఉపవాసంలో పెక్కుసార్లు నీరు త్రాగవలె. దానిలో నిమ్మ సోడా, పంచదార కలసినట్లైతే ఆరోగ్యానికి, ఆత్మశుద్ధికి మరీమంచిది.

## 5. గవ్యకల్ప తపము

శరీరానికి మనస్సుకూ ఉన్న వివిధ వికారములనుండి విముక్తి పొందడానికి గవ్యకల్పము అద్భుతమైనది. రాజా దిలీపుడు నిస్సంతుడైనపుడు తన కులగురువైన

ఆశ్రమంలో ఆవును మేపే పనిని పత్నీసహితంగాచేశాడు. నందినీ ధేనువునుమేతకు తోలుకొనిపోయి గౌరవంతో సేవించేవాడు. ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు మజ్జిగ, ఆవు నెయ్యి సేవించవలె. ఆవు పేడతో కాచిన ఆవుపాలను త్రాగవలె. ఆవు మూత్రముతో శరీరమును మర్దించి, శరీరముపై చల్లుకొని స్నానం చేయడం చర్మరోగులకు, రక్తదోషములకు మంచి లాభదాయకము. ఆవు శరీరంనుండి వెలువడే తేజస్సు సాత్వికత అధికముగా కలిగియుంనందున బలదాయకము. కావున ఆవులను మేపుటలో సూక్ష్మరూపమైన ప్రయోజనమున్నది ఆవుపాలు, పెరుగు, నెయ్యి మజ్జిగలను మనుష్యుడు మూడు మాసములు పుచ్చుకొనిన అతని శరీరములో "కాయకల్ప" చికిత్స జరుగుతుంది.

## 6. ప్రదాతవ్య తపస్సు

తనవద్దనున్న శక్తిలో తగు మాత్రము తనవద్దనుంచుకొని, ఇతరులకు అధిక మోతాదులో దానమివ్వవలె. ధనవంతుడు ధనమును దానమిస్తాడు. ధనములేని వ్యక్తి తన సమయమును, బుద్ధిని, జ్ఞానమును, చాతుర్యమును, సహకారము మొదలైనవాటిని అరువుగానైనా, దానముగానైనా యిచ్చి యితరులకు లాభమును చేకూర్చగలడు. శరీర,మానసిక దానము, ధనదానమువలె శక్తివంతమైనది. అవినీతితో సంపాదించిన ద్రవ్యమునకు, సరియైన ప్రాయశ్చిత్తము సత్కార్యములకా ద్రవ్యమును దానమిచ్చుటయే. తన సమయంలో కొంతభాగమైనా లోకసేవ కొరకై ఉపయోగించడ మొక తపస్సు. దానమిచ్చునపుడు పాత్రము ఆవశ్యకతలనెరిగి చేయవలె. కుపాత్రునకిచ్చిన దానము, అనుపయుక్త కార్యమునకు యిచ్చినది వ్యర్థము. మనుష్యేతర ప్రాణిగూడ దానమున కధికారియై యున్నది. ఆవు, చీమ, పక్షి, కుక్క మొదలైన యుపయోగకర జీవ జంతువులకు గూడా, అన్నము జలము దానమిచ్చుటకు ప్రయత్నము చేయవలె.

సర్వ కష్టములను సహించి, అభావగ్రస్తులైనప్పటికి (తక్కువ శక్తిగలవారలైనను) యితరులకు ఉచిత సహాయము చేయుట, వారిని మహోన్నత శీలవంతులుగా, సాత్వికులుగా, సద్గుణవంతులుగా తీర్చిదిద్దడంలో సహాయ పడుతుంది. సౌకర్యమిచ్చుట దానముయొక్క వాస్తవిక పుద్దేశ్యము. దానముయొక్క ప్రశంసతో ధర్మశాస్త్రముల ప్రతి పుట నిండియున్నది. ఆ పుణ్యమును గూర్చి యింతకంటె అధికంగా చెప్పడానికే మున్నది? వేదమిలా ప్రవచించినది-

"నూరు చేతులతో సంపాదించినది వేయి చేతులతో దానమొసంగుటకే"

## 7. విష్కాసన తపస్సు

తనలోని దోషములను, పాపములను గోప్యంగా నుంచినందున మనస్సు భారముతో కృంగిపోతుంది. కుక్షిలో నిండిన మలము వలన నానా ప్రకారముల వ్యాధులు సంభవిస్తాయి. అటులనే తన పాపములను దాచినందున, అవి గుప్తముగా నున్న మలము మాదిరి దుర్గంధాన్ని వెదజల్లి కుళ్ళు కంపును వ్యాపంపజేసి సమస్త మానసిక క్షేత్రమును దోషభూయిష్ట మొనరిస్తుంది. అందువలన, గంభీరుడు విశ్వాసపాత్రుడైన మిత్రుని యెన్నుకొనవలె. అతనికి తన పాపపు కథలను వినిపించవలె. తన కష్టములను, దుఃఖగాథలను వాంఛలను, అనుభూతులనుగూడా యీ విధంగా ఉదాత్తులకు ఘృణరహితులకు (అసహ్యించుకొననట్టివారికి) చెబుతూ వుండవలె. అట్టివారు విరోధ మొచ్చినప్పటికి యితరులపై నింద మోపనట్టివారై వుండాలి. ఈవిధమైన ప్రకటీకరణము వలన ఔషధంగా పని జరిగి మనోభూమి నిర్మలమవుతుంది.

ప్రాయశ్చిత్తములలో "దోషప్రకటన" కు విశేష స్థానమున్నది. గోహత్య చేసినందుకు శాస్త్రములలో ప్రాయశ్చిత్తమిలా చెప్పబడినది. మరణించిన ఆవు తోకను పట్టుకొని, నూరు గ్రామములలో ఆవ్యక్తి ఉచ్చస్వరంతో కేకలువేస్తూ తనవలన గోహత్య జరిగినదని చాటవలె. యీ దోషప్రకటనతో గోహత్యాదోషము పోతుంది. ఎవరికైనా అపకారము చేసినపుడు క్షమాపణ కోరవలె. అపరాధము తొలగించుకొనవలె. ఆ వ్యక్తి నన్నివిధముల సంతుష్టునిగా నొనరింపవలె. ఈ పని జరగనపుడు పాపమును ఇతరులకు ప్రకటించుకొనుటద్వారా భారమును తేలికపరచుకొనవలె, ఈ విధమైన దోషప్రకటనను "ఈ పుస్తక రచయితకు" విశ్వసనీయ మిత్రునిగా భావించి లేఖ వ్రాసినచో ప్రాయశ్చిత్త మొనరించు కొన్నట్లవుతుంది. ప్రసన్నతాపూర్వక సలహా అవసరమైతే లభిస్తుంది.

## 8. సాధనా తపస్సు

గాయత్రీ జపము 24 వేలు తొమ్మిది రోజులలో పూర్తిచేయడం. 1 1/4 ఒకటింబావు లక్ష 40 రోజులలో పూర్తిగావించడం, గాయత్రీ యోగసాధనలలో పురశ్చరణ, పూజ, స్తోత్రపాఠముల సాధనల వలన పాపములుతొలగి పుణ్యమధికమౌతుంది. విద్యలో వెనుకబడినవారు "గాయత్రీ చాలీసా" నిత్యమూ పఠించిన గాయత్రీదేవి యందు భక్తి అధికమై ఈ మహాస్త్రము వలన శక్తియధికమై, తద్వారా తపోబలమున కధికారి యగును.

## 9. బ్రహ్మచర్య తపస్సు

వీర్యమును రక్షించుకొనుట, మైథునము నుండి రక్షించుకొనుట, అల్పవికారములను స్వాధీనములో నుంచుకొనుట, బ్రహ్మచర్యమనబడుతుంది. మానసిక కామసంతృప్తి, శారీరక కామతృప్తివలె హానికరము. మానసిక కామక్రీడ నుండి మనస్సు మరల్చుటకు, నిరంతరాధ్యాత్మిక చింతన, నైతికపరమైన ఆలోచనలతో మనస్సును నింపుట అత్యుత్తమైన ఉపాయము. లేనపుడు బ్రహ్మచర్యమవలంభించుట సాధ్యముకాదు. మనస్సును బ్రహ్మయందు, సత్యమందు లగ్నమొనరించుట వలన ఆత్మోన్నతిగూడా లభిస్తుంది. ధర్మసాధన, వీర్యరక్షణ సమకూరుతాయి. ఈ ప్రకారంగా ఒకే ఉపాయంతో మూడు ప్రయోజనాలు బ్రహ్మచర్య తపస్సు వలన గాయత్రీ సాధకులకు అన్ని విధముల ఉత్తమమైనది.

## 10. చాంద్రాయణ తపస్సు

ఈ వ్రతము పూర్ణిమతో ప్రారంభించవలసి వుంటుంది. తాను జపమారంభించు పూర్ణిమరోజున తన ఆహారమెంత స్వీకరించునో, దానిలో "పదునారవ భాగము మాత్రము తగ్గించవలె. అనగా ఒక శేరు భోజనము ప్రతిదినము భుజించుచున్న యెడల, అందులో 16వ భాగము మొదటిరోజు, 1/8 వంతు రెండవరోజు (1/8 + 1/8) 8/10 వంతు మూడవరోజు చొప్పున తగ్గించవలె. కృష్ణపక్ష చంద్రుని కళలు రోజుకొకటి చొప్పున తగ్గుతాయో, అటులనే యొక షోడశాంశ (1/16) ప్రతిదినము తగ్గించుకుంటూపోవలె. అమావాస్య పాడ్యమీలకు చంద్రుడు పూర్తిగా అదృశ్యుడౌతాడు ఆ రెండు రోజులు పూర్తిగా ఆహారమును మానివేయవలె. మరల శుక్లపక్ష విదియ నుండి చంద్రుడు ఒక కళచే బయల్పడుతాడు. క్రమ క్రమంగా వృద్ధిచెందుతాడు. అట్లే ఒక్కొక్క షోడశాంశ ఆహారాన్ని పెంచుకుంటూ పూర్ణిమ తిథి వరకు చేరేటప్పటికి పూర్తి ఆహారపు మోతాదుకు చేరుకుంటుంది. ఒక నెలలో ఆహారవిహారములు సంయమనము, స్వాధ్యాయము, సత్సంగములలో ప్రవృత్తి, సాత్విక జీవన చర్యలను గాయత్రీ సాధనలో ఉత్సాహ పూర్వకముగా సంలగ్నము చేయవలె.

అర్థ చాంద్రాయణము పదిహేను దినములు దీనిలో భోజనములోని యెనిమిదవ (1/8th) భాగము, ఎనిమిది దినములు తగ్గించి, ఎనిమిది పెంచవలె. ఆరంభంలో అర్థచంద్రాయణము మాత్రమే చేయవలె. ఒకసారి సఫలమైన పూర్ణ చాంద్రాయణ తపమునకు ముందుకు సాగవలె.

ఉపవాసము, స్వాస్థ్యరక్షణకు మిక్కిలిప్రభావశాలిసాధన, మానవుని అన్న పానీయములలో, స్వభావ సిద్ధంగాగాని, పరిస్థితుల ననుసరించి గాని లోపముంటుంది. అందువలన శరీరములో అనవసరమైన లేక విజాతీయ తత్వములభివృద్ధి పొందుతాయి. ఉపవాసకాలంలో కుక్షి (పొట్ట) ఖాళీగా ఉన్నపుడు. జఠరాగ్ని యాదోషములను హరిస్తుంది. దీనివలన శరీరము శుద్ధమై, రక్తము స్వచ్ఛముగా అవుతుంది. విజాతీయ తత్వములు లేకుండా, నాడులలో స్వచ్ఛమైన రక్తము యే వ్యక్తిలో పరిభ్రమణము చేయుచుండునో, ఆవ్యక్తికి సరాసరి జ్వరముగాని, వ్యాధిగాని సంభవించదు. కావున స్వాస్థ్యకాముడైన పురుషునకు ఉపవాసము గొప్ప సహాయకారియైన బంధువునకు సమానము. ఇతర ఉపవాసములకు, చాంద్రాయణ వ్రతమునకు గల తేడా "యిందులో భోజనము తగ్గించుట, పెంచుట, క్రమ పద్ధతిలో నియమానుసార మొనరించుట విశేషము కాన, ఉపవాసపు విపరీత ప్రభావము కించిత్తు గూడా వుండదు. ఇతర దీర్ఘ ఉపవాసములలో భోజన మొకసారే, పది, పదిహేను రోజులు మానివేసి, ఉపవాసము పూర్తి యయ్యే సమయంలో జాగ్రతపడవలసి వుంటుంది. ఆ సమయంలో చాలామంది యెక్కువ మోతాదులో, అనుపయుక్తమైన ఆహారము తీసికొన్నందున కఠిన రోగములకు గురియై బాధపడతారు. చాంద్రాయణ వ్రతములో అట్టిబాధ వుండదు.

## 11. మౌన తపస్సు

మౌనము వలన శక్తి క్షయముండదు. ఆత్మ బలము, సంయమనము వస్తుంది. దైవీతత్వములభివృద్ధి చెందుతాయి. చిత్తమున కేకాగ్రత పెరుగుతుంది. శాంతి ప్రాదుర్భవిస్తుంది. బాహ్యవృత్తులు, అంతర్ముఖమైనందున ఆత్మోన్నతిమార్గము తేటతెల్లమవుతుంది. ప్రతిదినముగాని, వారానికొక రోజున గాని, నియమిత సమయంలో మౌనము పాటించుటకు నిశ్చయించుకొనవలె. అనేక రోజుల తరబడి మౌనవ్రతమా చరించవచ్చు. తన అభిరుచిననుసరించి, స్థితిగతులనుబట్టి, సౌకర్యము గలుగుట కనుగుణంగా, మౌనము పాటించవలసిన గడువును యేర్పరచుకొనవలె. మౌనకాలంలో అధికాంశము ఏకాంతములో, స్వాధ్యాయమునకు లేదా బ్రహ్మచింతనలో గడపవలె.

## 12. అర్జన తపస్సు

విద్యాధ్యయనము, శిల్పశిక్ష, దేశాటనము, మల్లవిద్య, సంగీతము మొదలైన వివిధోత్పాదక, ఉపయోగకరమైన విద్యాప్రాప్తి కొరకు తమ శక్తిని యోగ్యతను,క్షమతను

క్రియాశీలతల ఉపయోగమును పెంపుజేయడాన్ని అర్జన తపస్సు అంటారు. విద్యార్థి కష్టమును సహింపవలసి వుంటుంది. మనస్సుకు శ్రమకల్పించవలసి వుంటుంది. సౌకర్యములను వదలి సుఖరహితమైన కార్యక్రమము ననుసరించవలసి వస్తుంది. ఇవి అర్జన తపోలక్షణాలు. కేవలం బాల్యంలోనేగాక, వృద్ధావస్థయందుగూడా, మృత్యుపర్యంతము ఏదో ఒక రూపంలో సర్వదా అర్జన తపస్సొనరించుట ప్రయత్నిస్తూనే వుండవలె. సంవత్సరంలో కొంత సమయాన్ని యీ తపస్సులో అవశ్యం లగ్నంచేయవలె. దీనివలన తమ తపస్సు శక్తివంతమై తద్వారా అధికలోక సేవన మొనర్చేటందుకు కలుగుతుంది.

సూర్యునకు పన్నెండు రాశులున్నాయి. గాయత్రీకవి పన్నెండు తపస్సులు. ఈతపస్సులలో తన అభిరుచిని, సౌకర్యాన్ని స్థితులనుబట్టి, అనుసరించి తనదిగా చేసుకొనవలె. సంవత్సరానికున్న పన్నెండు నెలలలో నెలకొక తపస్సొనరించి సంవత్సరంలో అన్ని తపస్సులు పూర్తిచేయవచ్చు.

సప్తమ స్థానంలోనున్న నిష్కామ తపములో, ఒకటి రెండుసార్లు విశ్వసనీయ మిత్రుల సమ్ముఖంలో తన దోషములను ప్రకటించుకోవలె. నిత్యమూ తన డైరీలో, ఒక మాసము వరకు దోషములను వ్రాసి తన మార్గదర్శకులకు దానిని చూపవలె. ఈ క్రమాన్ని ఎక్కువ రోజులవరకు అనుసరించుట ఉత్తమము. మహాత్మా గాంధీజీ సబర్మతీ ఆశ్రమంలో తన ఆశ్రమవాసుల డైరీలను దీర్ఘాలోచనముతో పరిశీలించేవారు.

ఇతర తపస్సులను ప్రత్యేకంగా ప్రయోగించుటకు వివిధ రీతులున్నాయి. అవి కొద్ది కొద్ది పరిమితులమేరకు నిర్ధారింపబడి, తన అభ్యాసాన్ని సాహసంతో పురోగమించవలె. ప్రారంభంలో కొద్దిగా, సరళమైన తపమును తనదిగా చేసుకొని, తరువాత దీర్ఘకాలము వరకు, కఠినము, కష్టసాధ్యమైన సాధన చేయడం సులభమవుతుంది.

## గాయత్రీ సాధన వలన పాపవిముక్తి

గాయత్రీదేవి అనంత కృపవలన పతితులకు ఉన్నతి చేకూరుతుంది. పాపం నశిస్తుంది. యీ తత్వమును విచారించేటపుడు ఆత్మ సర్వదా స్వచ్ఛము, నిర్మలము, పవిత్రము, శుద్ధము, బుద్ధము, నిర్లిప్తమని బహు చక్కగా తెలిసికొనవలె. తెల్లటి గాజు గ్లాసులోగాని లేక పారదర్శనీ పాత్రలోగాని, యేదైనా రంగునీళ్ళు పోస్తే, అదే రంగుగా కనిపిస్తూంది. సాధారణంగా ఆ పాత్ర గూడా అదే రంగులో కనిపిస్తూంది. సాధారణంగా ఆ పాత్రనుకూడా అదే రంగు గలిగినదిగా తలపోస్తారు. అయినప్పటికీ పాత్ర సహజముగా

రంగులేనిదై ఉంటుంది. వేరొక రంగునీళ్ళు వుంచినట్లైన మరోవిధంగా కనిపిస్తుంది. మనుష్యుని స్థితిగూడ యటువంటిదే. స్వభావతః ఆత్మ నిర్వికారమైనది. కాని దానిలో ఏవిధమైన గుణము కర్మలు, స్వభావములు నిండివుంటాయో, ఆవిధంగానే గుణము గీతాచార్యుడిలా నుడివారు.

**"విద్యా – వినయ, సంపన్నుడైన బ్రాహ్మణుడు. గోవును, ఏనుగును శునకమును, ఛండాలుని మొదలైనవాటిని సాత్విక బుద్ధిచే పరికించుతాడు అతడే పండితుడు.**

ఈ సమన్వయ రహస్యమేమనగా, ఆత్మ సర్వదా నిర్వికారము. దాని మూల స్థితియందు పరివర్తనము జరగదు. కేవలము మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారములనే అంతఃకరణ చతుష్టయము, వివిధ రూపముల వికార గ్రస్తమవుతుంది. యీ కారణము వలన మనుష్యుడు, అస్వాభావిక విపన్నుడై వికృతమైన దశలో మనుగడ సాగిస్తాడు. యీ స్థితిలో మనుష్యునకు పరివర్తన వచ్చినట్లైతే, యీ రోజున దుష్టుడు, రేపు సాధువుగాను, యోగిగాను, మారుట కష్టముగాదు. ఛండాల కులోత్పన్నతస్కరుడు (దొంగ) పరివర్తనము వలన మహర్షి వాల్మీకిగా రూపొందినాడని ఇతిహాసము వక్కాణించుతుంది. జీవితామంతా వేశ్యవృత్తిచే జీవిస్తూవుండే గణిక, ఆంతరంగిక పరివర్తన కారణముగా పరమ సాధ్వీమతల్లులకు ప్రాప్తించే పరమగతికి అధికారిణియైనది. కసాయిగా వ్యవహరిస్తూ జీవితాన్ని గడిపే అజామీళుడు, పరమ భాగవతోత్తముల శ్రేణిలో నివసిస్తున్నాడు. యీ విధంగా నీచకర్మలొనరించే అనేకులకు ఊర్ధ్వగతులు ప్రాప్తించినవి. హీనకులోత్పన్నులకు అగ్రవర్ణముల కీర్తి, ప్రతిష్ఠ సంభవించినది. 'రైదాసు' చర్మకారుడు, కబీరు సాలె, రామానుజులవారు శూద్రుడు, షటకోపాచార్యుల వారు పండ్లు కూరగాయలు అమ్మి జీవించేప్రత్యేక జాతికి చెందినవారు. తిరువాళ్వారు అంత్య కులములో ఉద్భవించారు. కాని వారి సాధన స్థితి యనేక మంది బ్రాహ్మణులకన్న అధికము. విశ్వామిత్రుడు క్షత్రియుడుగా జన్మించి బ్రాహ్మణుడైనాడు.

ఇతిహాసములలో అనేక ఉదాహరణలు, పతిత స్థానము నుండి ఉన్నత స్థానముల నధిరోహించిన వ్యక్తుల గురించి వున్నట్లే, ఉన్నత స్థానమునుండి పతితులైనవారు కోకొల్లలు ఆ ఇతిహాసములలోనే చెప్పబడినవి. ఉత్తమ బ్రాహ్మణుడైన పులస్త్య బ్రహ్మవంశములో జన్మించి మహాపండితుడైన రావణుడు మానవునకన్నా పతితుడై "రాక్షసుడని" వక్కాణింపబడినాడు. దోష భూయిష్టమైన ఆహారమును స్వీకరించినందున భీష్ముడు, ద్రోణుడు లాంటి జ్ఞానపురుషులు న్యాయదూరులై కౌరవులను సమర్థించారు. విశ్వామిత్రుడు క్రోధముతో, నిర్దోషులైన వశిష్ఠ పుత్రులను బాలురైనప్పటికీ వధించాడు.

పరాశరుడు మత్స్య రాజకుమారితో వ్యభిచరించి సంతానమును పొందాడు. విశ్వామిత్రుడు వేశ్యపై ఆసక్తితో ఆమెను తనవద్ద దీర్ఘకాలముంచుకొన్నాడు. చంద్రుని లాంటి దేవత, గురుపత్నితో కుమార్గగామిగా ప్రవర్తించాడు. బ్రహ్మ తన పుత్రికనే మోహించాడు. బ్రహ్మ చారియైన నారదుడు వివాహమాడుటకై స్వయంవరంలో పాల్గొన్నాడు. శరీరమంతా కుళ్ళిన వయోవృద్ధి ఋషిపుంగవునికి కుమారి సుకన్యతో వివాహము జరిగినది. బలిచక్రవర్తి దానమిచ్చేటపుడు ఆటంకపరచి శుక్రాచార్యుడు తన కంటిని పోగొట్టుకొన్నాడు. ధర్మరాజైన యుధిష్టిరుడు "అశ్వత్థామాహతః" అని అసత్యమాడి "నరోవా కుంజరోవా" అని గొణిగి తన ముఖానికి నల్లటి రంగు పులముకొని, తన అబద్ధాన్ని రక్షించుకోవడానికి ప్రయత్నించాడు. ఎంతవరకు చెప్పినా, ఎవరెవరికి చెప్పినా, యీ సృష్టిలో చాలా గొప్పవారు చ్యుతులైనారు. దీనివలన ఆంతరంగిక స్థితిపై ముసుగువేసి మార్చినంతట మనుష్యుడు చెడ్డవాడు మంచిగా మంచివాడు చెడుగా వెలామణిగాలేడు.

అందరూ జన్మతః శూద్రులేనని శాస్త్రములు చెబుతున్నాయి. తరువాత తమ తమ సంస్కారముల ప్రభావాన్ననుసరించి ద్విజులనబడతారు. ముఖ్యంగా యీ సంస్కారములే ద్విజునిగాను రూపొందిస్తాయి. గాయత్రీ తత్వజ్ఞానమును హృదయము నందు ధారణ గావించుకొంటే, అట్టి సంస్కారములు ఉద్భవిస్తాయి. అపుడు మనుష్యుని ఉన్నతునిగా తీర్చిదిద్దుతాయి. ఆ పాత్రలో నిండివున్న ప్రథమ ఎరుపురంగు నివృత్తి గాబడుతుంది. ఆ స్థానంలో నీలిరంగు కనిపించడం ప్రారంభమవుతుంది.

పాపముల నాశనము ఆత్మతేజపు ప్రచండతచే గావింపబడుతుంది. ఆ తేజస్సు అధికమైనకొలది సంస్కారపు కార్యము శీఘ్రముగాను, అధిక పరిమాణములో సంభవిస్తుంది. ఖడ్గపుధార (పదును) కున్నంత తీక్షణత, ఇనుప మువ్వకు పదునులేనపుడుండదు. ఈ తేజమెలా వస్తుంది? దీనికి ఉపాయము కాల్చుటవలన, సానబెట్టుటవలన, లోహమును అగ్నిలో తపింపజేసి దానికి పదును పెడతారు మరల రాతిపై నూరి పదును బాగా వచ్చేటట్లు చేస్తారు. అపుడాఖడ్గము శత్రుసేనను సంహరింప గలుగుతుంది. మనం గూడా మన ఆత్మశక్తి యొక్క తేజస్సును పెంపొందించు కొనడానికి తపించవలె. సానబట్టే ప్రణాళికను స్వయంగా ఆచరించవలె ఆధ్యాత్మిక భాషలో దీనిని తపము లేక ప్రాయశ్చిత్తమని పిలుస్తారు.

అపరాధికి ప్రతిచోట 'దండము శిక్షాపద్ధతి వుంటుంది. బాలురు గడబిడ చేస్తే తల్లి దబ దబ బాదుతుంది. శిష్యుడు అపరాధమొనరించితే గురువు బెత్తముపయోగిస్తాడు.

సామాజిక నియమములను భంగపరచి ప్రవర్తిస్తే పంచాయితీలో శిక్ష వేస్తారు. చట్టము నతిక్రమిస్తే జరిమానా, జైలు, జీవితాంతపు ఖైదు లేక "ఉరి" శిక్ష వేస్తారు. ఈశ్వరుడు, దైవిక, దైహిక, భౌతిక దుఃఖములను కల్పించి, పాపములకు దండన విధిస్తాడు. దండ విధానము ప్రతీకారము కొరకు, హింసద్వార వ్యతిరేకచర్య తీసికొనుట కొరకు మాత్రమేకాదు. "రక్తానికి బదులు రక్తము" అనునది ఆరణ్యక విధానము వలన కాదు. శిక్షావిధానము యొక్క నిర్మాణము ఉన్నత ఆధ్యాత్మిక విజ్ఞానముపై ఆధారపడి యేర్పరచబడినది. కారణమేమనగా, దండ స్వరూపంలో సంభవించిన కష్టము అనుభవించుట కియబడినది. దానివలన మానవుని అంతరంగములో వ్యాకులత, గందరగోళము జరుగుతుంది. ప్రతిక్రియ జరుగుతుంది. వేగము ఏర్పడి, దానివలన అతని గుప్త మనస్సు చకితమౌతుంది. మూలతత్వము నొదలి ఉచిత మార్గము లోనికి మరలుతుంది. తపస్సులో అవిధమైన శక్తియే యున్నది తపస్సుయొక్క వేడి అనాత్మ తత్వములను శిక్షించి సంహరిస్తుంది.

ఇతరులద్వారా దండరూపములో బలవంతంగా తపస్సు చేయించడంవలన మనకు శుద్ధి కలుగుతుంది. ఆ ప్రణాళిక మనము స్వయంగా చేయవచ్చు. గుప్తంగావున్న మన పాపములకు శిక్షను స్వయంగా, స్వేచ్ఛాపూర్వకంగా విధించుకొని తపస్సు చేసినట్లైతే, ఇతరులచే జపము చేయించినదానికంటె అసంఖ్యాకమైన రెట్లు ఎక్కువ అందులో అవమానము లేదు, హింసలేదు, ఆత్మగ్లానిచే చిత్తక్షోభ జరగదు.

అయితే స్వేచ్ఛాతపస్సుచే ప్రత్యేకమైన ఆధ్యాత్మికానందము లభిస్తుంది. శౌర్యము,సాహసము ప్రకటిత మవుతుంది. అందువలన దృష్టిలో తన శ్రేష్ఠత్వము ప్రతిష్ఠ పెరుగుతుంది. పాపముల నివృత్తికొరకు ఆత్మతేజపు అగ్ని కావలె. ఈ అగ్ని ఉత్పత్తి యైనందున రెండు విధముల లాభమున్నది. ప్రథమంగా హానికారక తత్వముల కషాయకల్పము నశిస్తుంది. తరువాత రెండవది, ఆ అగ్ని యొక్క వేడి, ప్రకాశముచే దైవీతత్వముల వికాసము, పోషణ అభివృద్ధి జరుగుతుంది. వీటివలన సాధకుడు తపస్వి, మనస్వి, తేజస్విగా రూపొందుతాడు. మన శాస్త్రములలో, ప్రతిపుట (పేజీ) యందు, ఉపవాసము, దానము, స్నానము, ఆచరణ, విచారణము మొదలైనవి, వాటి విధి విధానము యీ దృష్టితోనే చెప్పబడినది. వీటిని అలవరచుకొన్న మనుష్యునకు పైన చెప్పబడిన ద్వితీయ లాభము చేకూరుతుంది.

తనచే చేయబడిన పొరపాటుకు, పాపమునకు, చెడుపనులకు ప్రతిఫలంగా సంభవించే అనుభవముల నివారణకు ప్రాయశ్చిత్తమేమనగా, వాటిని మరల చేయకుండుటకు దృఢనిశ్చయమేర్పరచుకొనవలె. యీ నిశ్చయంతో పాటు

కొంచెము తపశ్చర్య మొనరించితే, అది ప్రతిజ్ఞాబలముతో కలసి, ఆచరణలో పెట్టుటకు కావలసిన సంకల్ప బలము చేకూరుతుంది. దానితో పాటు సాత్వికత తీవ్రగతిలో వృద్ధి పొందుతుంది; చైతన్యముద్భవిస్తుంది. యీ ఉతమోత్తమ గుణములు, పవిత్రమయ, సాధనామయ, మంగళమయమైన జీవనము గడుపుటకవసరమైన కర్మ స్వభావముల ఉత్పత్తికి సుగమ మవుతుంది. గాయత్రీ శక్తిపై ఆధారపడి చేసిన తపశ్చర్య గొప్ప గొప్ప పాపులను గూడా నిష్పాపులను జేసినది. వారి పాపములను నివృత్తిగావించుటయేగాక, భవిష్యత్తులో నిష్పాపులుగా నుండటకు యోగ్యులుగా జేస్తుంది.

పాపకార్యముగా గోచరించే ప్రతీదీ సర్వదా పాపమని తలవగూడదు. ఒకానొక కార్యము పాపముగాదు, పుణ్యముగాదని చెప్పబడినది. కర్తయొక్క భావన ననుసరించి పాపపుణ్యము లుంటాయి ఒక మనుష్యునకు పాపమైనది, రెండవవానికి పాపరహితమై యున్నది. కొన్నిసార్లతనికి పుణ్యమౌతుందిగూడా. హత్య యొనరించుటొక కార్యము. అది ముగ్గురు వ్యక్తులు విభిన్న పరిస్థితులలో వివిధ కారణములవలన చేస్తారు. కొందరు ఇతరుల ధనము నపహరించుటకు హత్య చేస్తారు. ఇది ఘోర పాపము. న్యాయాధీశుడు సమాజానికి శత్రువైన అపరాధిని న్యాయాన్ని రక్షించడానికి ప్రాణదండన విధిస్తాడు. ఉరితీసే వ్యక్తి తన కర్తవ్యపాలనకు ఉరితీస్తాడు. దుర్మార్గులైన దొంగలు దండెత్తినపుడు నిర్దోషులను రక్షించడానికే వ్యక్తియైనా తనకు తాను అపాయములో జొరబడి, ఆ అత్యాచారులను సంహరిస్తే యది పుణ్యకార్యమవుతుంది. యీ మూడు హత్యలు విభిన్న పరిణామములు గలవి. యీ ముగ్గురు హంతకులు- దొంగ, న్యాయాధీశుడు, దుర్మార్గులనెదుర్కొని వారిని చంపిన వ్యక్తి-సమాన రూపంలో పాపులుగా పరిగణించగూడదు.

చోరత్వమొక దుష్కార్యము. పరిస్థితుల ప్రాబల్యము వలన సదా దొంగతనము చెడ్డకార్యముగాదు. స్వయంగా సంపన్నుడైనప్పటికీ, అన్యాయపూర్వకంగా ఇతరుల ధనమును హరించేవాడు పూర్తిగా, నిజంగా చోరుడు. రెండవ ఉదాహరణ తెలుసుకోండి - ఆకలి వలన ప్రాణం పోయే స్థితి వచ్చినపుడు, బలహీనమైన మానసిక స్థితిలో సంపన్నుడైన వ్యక్తికి సంబంధించిన వానిలో కొంతభాగము దొంగిలించి ఆత్మరక్షణ గావించుకొనుటంత పెద్ద పాపము గాదు మూడవస్థితిలో, దుర్మార్గుని సాధన సామగ్రిని దొంగిలించి, వానిని శక్తిహీనునిగా జేయడం, ఆ దొంగిలించిన సామాగ్రిని సన్మార్గములో వినియోగపరచడం పుణ్యకార్యము. యీ ముగ్గురు దొంగలను సమాన శ్రేణిలో నుంచగూడదు.

పరిస్థితి, మానసిక బలహీనత, ధర్మరక్ష, స్వల్పమాత్ర బుద్ధివికాస కారణములవలన యనేక పనులు జరుగుతాయి. అవి స్థూలదృష్టితో పరిశీలించితే నింద్యములుగా గోచరిస్తాయి. కాని వాస్తవంగా, వస్తుతః వాటి వెనుక పాపభావన గుప్తమై వుండదు. అటువంటి వాటిని పాపములని చెప్పలేదు. బాలకుని వ్రణము (పుండు) ను కోయుటకు తల్లి యాతనిని హాస్పిటల్‌కు తీసికెళ్ళవలె. బాలకునకు కష్టము కలిగించవలసి వస్తుంది. రోగియొక్క ప్రాణాన్ని రక్షించడానికి డాక్టరు కసాయివాని మాదిరిగా చిన్న ముక్కలుగా కోయవలసి వుంటుంది. రోగి పథ్యము చేయుటకు కోరికలను తప్పించుటకై, ఉపచారకులు అబద్ధములు చెప్పి, సముదాయిస్తారు. బాలకుల మొండివై ఖరులకుగూడా, బహుశా సమాధానంగూడా పైన జెప్పినట్లే. క్రూర జంతువులను, ఆయుధధారులైన ఆటవికులను ముఖాముఖిగా ఆక్రమించకుండా వెనుకనుండి లొంగదీసుకొనవలె.

ప్రాచీన ఇతిహాసములపై దృష్టి సారించితే, అనేక మహాపురుషులకుగూడా ధర్మముయొక్క స్థూలమర్యాదలను ఉల్లంఘించవలసినట్లు గోచరిస్తుంది. లోకహితము, ధర్మబుద్ధి, అధర్మాన్ని నశింపజేయడానికి సద్భావనతో వారు చేసినందున, అదే పాపములను సాధారణ మానవులు సాధారణంగా చేసినపుడు సంభవించే పాపము అంటదు.

భస్మాసురుని నుండి శంకరుని ప్రాణమును రక్షించుటకు, శ్రీమహావిష్ణువునకు "మోహిని" రూపము ధరించి మాయోపాయమున రాక్షసుని అంతముచేయవలసి వచ్చినది. సముద్ర మథనములో పుట్టిన అమృతభాండమును పంచుకొనుటలో దేవతలకు, రాక్షసులకు పోట్లాట జరిగినప్పుడు గూడా శ్రీ మహావిష్ణువు, మోహినీ రూపము ధరించి, రాక్షసులను మోసగించి, దేవతలచే అమృతాన్ని త్రాగించాడు. సతి 'బృంద' సతీత్వమునుభంగపరచడానికి భగవానుడు జలంధరుని రూపమును ధరించాడు. బలిచక్రవర్తిని అణుచుటకై వామనావతారము ధరించాడు శ్రీ మహావిష్ణువు. చెట్టు చాటునుండి అనుచితంగా శ్రీరాముడు వాలిని సంహరించాడు.

మహాభారతంలో ధర్మరాజైన యుధిష్ఠిరుడు అశ్వత్థామ మృత్యువును కపటంతో సమర్థించాడు. శిఖండి చాటున నిల్చుని అర్జునుడు భీష్ముని విగతజీవుని గావించాడు. కర్ణుని రథము భూమిలో క్రుంగిపోయినప్పటికీ అతనిని వధించాడు అర్జునుడు. ఘోర దుర్భిక్షంలో క్షుదాపీడితుడై విశ్వామిత్రుడు ఛండాలుని గృహంలో కుక్కమాంసాన్ని దొంగిలించి తిన్నాడు. ప్రహ్లాదుడు తండ్రి ఆన ధిక్కరించాడు. విభీషణుని సోదర పరిత్యాగము, భరతుని మాతృదూషణము, వాలి తన గురువు మాటను పాటింపకుండుట, గోపికలు పరపురుషుడైన శ్రీకృష్ణునిపై మగులుగొనుట, పతిని త్యజించుట, పరశురాముడు

తన తల్లి శిరస్సును ఖండించుట మొదలైనవి సాధారణంగా అధర్మములని ప్రతీతి. కాని వీటి నాచరించినవారు సదుద్దేశ్యంతో ప్రేరేపింపబడి చేశారు. ఏలనన ధర్మమును సూక్ష్మదృష్టితో పరిశీలించినపుడు, పైన చెప్పబడిన కార్యములు పాతకములుగా పరిగణింపబడలేదు.

శివాజీ అఫజల్‌ఖాన్‌ను కుటిలనీతి చాతుర్యంతో వధించాడు. భారతీయ స్వాతంత్ర్య సమర యితిహాసంలో క్రాంతికారులు బ్రిటిషు ప్రభుత్వము నుండి తెలుసుకొని తాము అవలంబించిన నీతిలో, చోరత్వము, దోపిడీవిధానము, రహస్య పరిశోధన, హత్య, సంహరణ, అసత్యమాడుట, కపటము, విశ్వాసఘాతము మొదలైనవన్నీ కలిపి స్థూల దృష్టిలో మాత్రమే అధర్మమౌతాయి. కాని ఆత్మ పవిత్రము అసంఖ్యాకమైన దీన దుఃఖితుల కరుణాజనక స్థితినిగాంచి, మనస్సు ద్రవించినవారలై, అన్యాయ శాసనమును ఉల్లంఘించుటకై వారటుల ప్రవర్తించారు. చట్టము వారిని అపరాధులుగా గుర్తించింది. కాని వారిని పాపులుగా చెప్పలేదు.

అధర్మ నాశనము, ధర్మ రక్షణ కొరకు భగవంతుడు యుగ యుగములలో అవతరించి, అసంఖ్యాకమైన హత్యలు చేయవలసి వస్తుంది. రక్తధారలు ప్రవహింపజేయవలసి వస్తుంది. వీటిలో పాపము లేదు. సదుద్దేశ్యంతో చేయబడిన అనుచిత ఉచిత కార్యము వలె ఉత్తమమైనదిగా అంగీకరించబడినది. యీ విధంగా గత్యంతరము లేక, హింసింపబడి, ఆకలితో అలమటిస్తూ, భయపడిన దుఃఖభాజనుడు, ఉత్తేజితుడు, ఆపదలోనున్న వారు. లేక అజ్ఞానియైన బాలుడు, రోగి, పిచ్చివాడు, యేదైనా యొనరించినపుడు, వారు క్షమింపదగినవారు కారణమేమనగా వారి మనోక్షేత్రము మనుష్యధర్మాన్ని, కర్తవ్యాన్ని దృష్టిలోనుంచుకొని సవ్యమైన ఆలోచనాపంథా ననుసరించుటకు సమర్థవంతము కాదు.

పాపులనబడేవారిలో అధికాంశము యీ కోవకు చెందినవారే. వారు పైన నుదహరించబడిన కారణముల వలన అనుచిత కార్యములు చేయవలసి వచ్చింది. తరువాత అది వారి స్వభావమైనది. పరిస్థితులలో, గత్యంత రహితులై, అలవాట్లవలన వారు నిస్సహాయులై వారా చెడు మార్గముపై పయనించారు. వారు అన్య పరిస్థితులు, సౌకర్యము లభ్యమైనపుడు, సంతోషకరమైన సాధన, ఉన్నతిని పొందే అవకాశము లున్నపుడు, నిశ్చయముగా సజ్జనులవుతారు.

చట్టము, లోకము, యెవరినైనా దోషిగా ముద్రవేసినప్పటికీ స్థూల దృష్టిలో వ్యక్తి అత్యంత దుర్మార్గుడైననూ, వాస్తవికంగా యీ ప్రపంచంలో పాపుల సంఖ్య బహు తక్కువ

పరిస్థితుల ప్రభావము వలన పాపియైన వ్యక్తిని ఉద్ధరించవచ్చు. ఏలనన ప్రతి వ్యక్తి ఆత్మ ఈశ్వరాంశయైన కారణమున, తత్వదృష్టిలో పవిత్ర మైనది. చెడ్డతనమూ వ్యక్తిపై ఛాయారూప మలముగా నున్నది. దానిని పరిశుభ్రపరచుట అసంభవమూకాదు కష్టసాధ్యముగాదు. మిక్కిలి సులభము

అనేకమంది భావిస్తారు "మేమింతవరకు యెంతో పాపము చేశాము. మా ప్రకటించని పాపముల సంఖ్య అసంఖ్యాకము. మాకు మోక్షము (విముక్తి) లేదు. మేమెంత కాలము నరకమనుభవించవలెనో! మాకెపుడు వుద్ధరణ, కళ్యాణము చేకూరుతుంది? సన్మార్గమువైపు పయనించు దృఢప్రతిజ్ఞ చేసుకొనిన తక్షణమే, వారి పురాతన పాపపంకిలపు మురికివస్త్రపు ఆచ్ఛాదన తొలగిపోతుంది. ఆ వస్త్రములోనున్న కీటకములుగూడా దాంతో పాటు నశిస్తాయి.

పాపవాసనలను పరిత్యజించుట, స్వచ్ఛమైన హృదయంతో ప్రాయశ్చిత్త మొనరించు కొనుట వలన, లోగడ చేసిన పాపములవలన ప్రాప్తించే దుష్ఫలముల విముక్తి లభిస్తుంది. కేవలము యీ జన్మకోసం మనకు సంప్రాప్తింప వలసిన పరిపక్వ కర్మఫలమును మాత్రము, యేరూపములోనైనా అనుభవింపవలసినదే. దీనికి భిన్నంగా ప్రాచీన కాలంలోగాని ప్రస్తుతకాలంలోగాని, ప్రస్తుతము ప్రారబ్ధముగా మారిన కర్మలు, వాటి సంచిత (కూడుకొనిన) సమూహము నశింపగలవు. ఈ జన్మలో దుఃఖకారకములుగా భోగ్యదాయకమైనవిగూడా తేలికగా మారుట జరుగవచ్చు. అవి కష్టమును కలిగించి సహజంగా శాంతిస్తాయి.

గడచిన జీవితంలో అధికాంశముకు మార్గగామియై యుండి, అత్యధిక కాలము నిరర్థకముగా జీవించిన మనుష్యుడు, కేవలము విచారించుట వలనగాని, కించిత్ప్ర యోజనముండదు. జీవితములో మిగిలివున్న భాగముగూడా తక్కువ శక్తి ప్రయోజనము కలది కాదు. అనగా వున్న కొద్ది సమయముగూడా యెక్కువ మహత్వపూర్ణమైనది, పరీక్షిన్మహారాజు మృత్యువునకు ముందు సప్తాహ (ఏడు) దినములు ఆత్మకళ్యాణార్థము మిగిలినాయి. ఆ కొద్దికాలమునే పరీక్షిత్తు సద్వినియోగించుకొని అభీష్టాన్ని నెరవేర్చు కొన్నాడు. మోక్షమును పొందినాడు. సూరదాసు తన జీవితమంతా వ్యభిచరించు అలవాట్లనుండి విముక్తి పొందలేక చివరకు తన కండ్లను పెరికివేసుకొనవలసి వచ్చినది. తులసీదాసు కామాతురతను నిగ్రహించుకొనలేక మామగారి గృహమునకు వెళ్ళి, గోడపై వ్రేలాడుచున్న పామును పట్టుకొని తన భార్యను చేరుట లోక ప్రసిద్ధమై యున్నది. ఈవిధంగా అసంఖ్యాకమైన వ్యక్తులు తమ జీవితంలో అధిక భాగము యితర కార్యములకై వినియోగించి, చివరకు సత్పథగాములై కొలది కాలములోనే యోగ్యులై, మహాత్ములై సద్గతి పొందుటకు అధికారులైరి.

ఇంతవరకు దుర్మార్గంగా విచిత్రంగా నున్నటువంటి వ్యక్తులు నిజంగా శక్తిసంపన్నులే. కాని వారి శక్తి కుమార్గంలో నున్నది. వారే కనుక తమ శక్తి సన్మార్గమువైపు మరలించితే, అచటగూడా ఆశ్చర్యజనక విజయమును సాధింపగలుగుతారు. గాడిద సంవత్సరమంతా మోసే బరువును, ఏనుగు ఒక్కరోజులో మోయగలదు. ఆత్మోన్నతి కూడా యొక పురుషార్థము, స్నాయువులలో బలమున్నవారు, మనస్సులో అణచివేయలేని సాహసమున్న వారు, అమిత ఉత్సాహవంతులీగమ్యాన్ని శీఘ్రంగా చేరుకుంటారు. వీరే పురుషార్థులు వీరి రక్తనాళములలో బలము, అద్భుతమైన మనశ్శక్తి గలిగి మిక్కిలి ఉత్సాహవంతులుగా వుంటారు.

గడచిన జీవితంలో వక్రమార్గంగా పయనించినవారు, టపాకాయలమాదిరి గడబిడ గావిస్తారు. వారు పొరపాటున భ్రష్టులైనమాట నిశ్చయము కాని యీ చెడు ప్రక్రియ ద్వారా గూడా వారు తమ చైతన్యాన్ని బుద్ధిబలాన్ని జాగరూకతను, క్రియాశీలతను వృద్ధిచేసుకుంటారు. యీ అభివృద్ధి శక్తివంతమైన మూలధనం. భ్రష్టుడైనందున చేసిన పాపము దుఃఖహేతువు. పశ్చాత్తాపపడవలసినట్టిది. సంతోషకరమైన విషయమేమనగా, కంటకమయము, కఠిన శిలామయము, రక్తమయమైన మార్గమున నడుస్తూ, ఎగుడుదిగుడు మార్గములో దుఃఖముతో గడుపుతూ గూడా చివరకు లక్ష్యమును చేరుతారు. ప్రస్తుతము జాగ్రత్తలో వ్యవహరిస్తూ, సవ్యమైన రాజమార్గములో సత్వగుణ ప్రధానంగా పయనిస్తూ పురోగమించేటపుడు, పురాకృత కర్మలు గూడా సహాయపడతాయి.

పాపమునకు, దోషమునకు ప్రధాన కారణము బహుశః మానసిక భావనలచే సంభవించుతుంది. గర్హనీయ భావనల వలన మనుష్యుని బుద్ధి భ్రష్టమౌతుంది. దానివలన వ్యక్తి అకార్యములకు పాల్పడుతాడు. కావున మానవుడు సద్విచారముల ద్వారా, కువిచారములను తొలగించుకొనుటయే పాపముల నుండి విముక్తి పొందుటకు ముఖ్యమైన మార్గము. మనోభూమి నిర్మలంగానున్నపుడు హానికరమైన మనో ప్రవృత్తులు త్పన్నముగావు. మానవుడు చెడుమార్గము నుండి మరలి సన్మార్గమువైపు పయనించగలడు. దీనికి స్వాధ్యాయము, సత్సంగము మొదలైన ప్రతిభావంతమైన సాధనములు చెప్పబడినవి.

గాయత్రీ మంత్రము సద్బుద్ధి ప్రేరణదాయకమైనందున స్వాధ్యాయమునకు ప్రముఖ అంగముగా చెప్పవచ్చు. దానివల్ల మనస్సు శ్రేష్ఠ విచారములవైపు మరలుతుంది. అపుడు దుర్బుద్ధి స్వయంగా తనంతటతానే అంతరిస్తుంది.

ఏదైనా భావనను యేకాగ్రతతో భావిస్తే గొప్పశక్తి కలుగుతుంది. మనము శుభకరమైన ఆలోచనలపై మనస్సును, బుద్ధిని కేంద్రీకరిస్తే, పాపయుక్త భావనలు క్షీణించుట సహజము, స్వాభావికము.

పురాకృత పాపములు నశిస్తాయి. చెడు మార్గము ననుసరించినందుకు తగిలిన గాయములు స్వల్పదుఃఖములను కలిగించి, మాయమౌతాయి. వాటిని గురించి నిరాశతో చింతించవలసిన పనిలేదు. కేవలము తమ అభిరుచులను, కార్యకలాపములను కూర్చుకోవలె. ఈ పరివర్తనమే శీఘ్రంగా సవ్యమార్గంలో ప్రగతి చేకూర్చుతుంది. దూరదర్శన తత్వముల ప్రకారము దుర్మార్గము ననుసరించి వారిలో పరివర్తన చెందినపుడు ఆశ్చర్యజనకమైన రీతిలో సన్మార్గంలో ప్రగతిని సాధించి స్వల్పకాలములోనే నిజమైన మహాత్ములవుతారు. వారు బద్మాష్‌లుగా ఏ కారణముల వలన ప్రవర్తించారో, అదే విశేష కారణము వలన సాధువులుగా మారుతారు. గాయత్రీని ఆశ్రయించినందున దుర్మార్గులు, క్రూరులు, చెడ్డవారు, స్త్రీ పురుషులలో ఎవరైనప్పటికి సన్మార్గులై పాపరహితులవుతారు.

## ఆత్మశక్తికి అపరిమితమైన భండారము

గాయత్రి నిత్యోపాసనకు యోగ్యమైనది. త్రికాల సంధ్యలలో ప్రాతః, మధ్యాహ్న సాయంకాలములలో మూడుపార్లు నిత్యోపాసన గావించుట అవశ్యమని శాస్త్రములో చెప్పబడినది. అధికంగా జపము, పూజ,చింతన, మననము గావించగలిగితే, ఇతోధికంగా ఫలముంటుంది. ఏలనన "అధికస్య అధికం ఫలమ్".

కాని యేదైనా విశేష ప్రయోజనము నాశించినపుడు, విశేష శక్తి సంచయమవసరమవుతుంది. దానికొరకై విశేష క్రియాకలాపములవసరము. యీ క్రియను 'అనుష్ఠానము' అనే పేరుతో వ్యవహరిస్తారు. పరదేశయాత్ర చేయవలసినపుడు, మార్గంలో అవసరానికి భోజనసామాగ్రి, ఖర్చులకోసం కొంచెం ధనము తీసుకవెళ్ళడం అవశ్యము. అవసరమైనవి లేనపుడు యాత్ర కష్టతరమవుతుంది. అనుష్ఠానము గూడా ఒక ప్రత్యేకమైన మార్గ యాత్రా ఖర్చు. అనుష్ఠానము వలన మౌలిక శక్తి సంచయము జరుగుతుంది. అనగా యాత్రకు కావలసిన మూలధనం సమకూరుతుంది. ఈ ధనాన్ని తమ భౌతిక, ఆధ్యాత్మిక కార్యముల కుపయోగించిన జీవనయాత్ర సరళమౌతుంది.

సింహము లేడిపై ఆక్రమణ జరిపేముందు, పిల్లి ఎలుకపై దూకేముందు, కొంగ చేపను కబళించేముందు ఒక క్షణం స్తబ్ధత వహిస్తుంది. తరువాత శ్వాసను స్తంభించి కొంచెము వెనుకకు జరిగి తనలో దాగివున్న శక్తులను జాగృతపరచుకొని, తేజోవంతము గావించుకొని, తాము వేటాడు జంతువునకు తెలియకుండా దుముకుతాయి. అపుడు మనోవాంఛితము వాటికి లభిస్తుంది. పైకి ఎగిరేటపుడుగాని, దూరం దూకేటపుడుగాని, ఆటగాండ్రు కొంచెము ఆగుతారు. వెనుకకు వస్తారు. తరువాత దూకుతారు. కుస్తీపట్టేవారు గూడా కొంచెమిలాగే ప్రవర్తిస్తారు. అనుష్ఠానము ద్వారా యీ కార్యము

ఆధ్యాత్మిక ఆధారంపై జరుగుతుంది. సంభవించిన ఆపదను దాటుటకు గాని, ఏదైనా ప్రత్యేక లబ్ధిని పొందుటకు గాని అనుష్ఠాన మవసరము.

బిడ్డ రోజంతా 'అమ్మా' 'అమ్మా' అని పిలుస్తాడు . తల్లి గూడా 'నాన్నా', 'నా తండ్రీ' అంటూ జవాబిస్తుంది. ఈ తల్లి బిడ్డల ప్రేమ రోజంతా జరుగుతూనే ఉంటుంది. కాని యేదైనా విశేషావసరము గలిగినపుడు, కష్టములొచ్చినపుడు దుఃఖము సంభవించినపుడు భయము కలిగినపుడు, తక్షణ సహాయమవసరమైనపుడు, బాలుడు విశేషబలంతో, విశేష స్వరంతో తల్లిని పిలుస్తాడు. ఆ పిలుపులోని ప్రత్యేకతను గుర్తించి, తల్లి తన యితర పనులను వదలి కుమారుని వద్దకు పరుగెత్తుకుని వస్తుంది. తన సహాయాన్నందిస్తుంది అనుష్ఠానపు పిలుపుగూడా అటువంటిదే దానికి ప్రత్యేక బలమున్నది. విశేషమైన ఆకర్షణ ఉన్నది. ఆకర్షణ వలన గాయత్రీ శక్తి గొప్పదైన రూపంలో సాధకుని సమీపంలో ప్రకటితమవుతుంది.

ప్రాపంచిక ప్రయత్నము ఫలించనపుడు, ఆపద నివారణకు మార్గము కానరానపుడు, నలువైపులా అంధకారము ఆవరించినపుడు, పరిస్థితులు రోజా రోజుకు విషమిస్తున్నపుడు, సవ్యంగా చేసిన పని అపసవ్యంగా మారుతున్నపుడు, స్వభావసిద్ధంగా మనుష్యుని కాళ్ళు చేతులు నిర్వీర్యమవుతాయి. చింతాగ్రస్తుడు ఉద్విగ్న మనస్కుడైన మానవునికి బుద్ధి సరిగా పనిచేయదు. వలలో చిక్కిన పావురమువలె ప్రయత్నించినకొలది, బంధము యెక్కువగా బిగుస్తుంది. ఆ అవసరంలో 'దీనునకు దైవనామము' బలమిస్తుంది. గజేంద్రుడు, ద్రౌపది, నరసీ, ప్రహ్లాదుడు మొదలైన వారంతా ఆ బలాన్నే ఆశ్రయించవలసి వచ్చింది. పురుష ప్రయత్నం పనిచేయనపుడు, దైవసహాయము లభించిన వెంటనే పరిస్థితంతా మారుట గమనించవచ్చు. విపత్తుల రాత్రి ఘోర అందకారమును చీల్చుకొని మెరుపు కనిపిస్తుంది. ఆ మెరుపు కాంతిలో మార్గము గోచరిస్తుంది. అనుష్ఠానపు ఆ ప్రక్రియయే. నిస్పృహతో ఓడిపోయేటపుడు, దేవతల సింహాసనము గోచరిస్తుంది. అనుష్ఠాన విస్ఫోటము హృదయాకాశంలో ప్రకాశ రూపము వలె గోచరించి, తద్వారా విపత్తిగ్రస్తునకు,కష్టములను గడచుటకు మార్గము గోచరిస్తుంది.

ప్రాపంచిక కష్టములు, మానసికాందోళనలు, ఆంతరంగిక ఉద్వేగములలో, గాయత్రీ అనుష్ఠానము వలన అసాధారణ సహాయము లభిస్తుంది. "బంగారు కలశంలో సువర్ణ నాణెములను నింపి గాయత్రీ దేవి ప్రసాదించదు" అనుట నిజమే కాని 'గాయత్రీ ప్రభావంతో మనోభూమిలో మౌలిక పరివర్తన కలుగుతుంది. అందువలన కష్టములు తేలికవుతాయి' అన్నదిగూడా నిజమే.

ఉపాసకునిలో, బుద్ధి, ప్రతిభ, సరియైన ఆలోచనా విధానము, దూరదర్శన జ్ఞానము, తీవ్ర శక్తితో ఉద్భవిస్తాయి. వీటివలన కష్టములను నివారించుటకు తగిన ఉపాయము గోచరించి రామబాణమువలె ఫలప్రదమౌతుంది. భ్రాంతి మనస్కుడు, అసంగతము, అసంభవము, అనావశ్యక ఆలోచన విధానములతోను కోర్కెలతోను, గౌరవముల ఊబిలో కూరుకుపోతాడు. వీటి వలన వ్యక్తి అకారణంగా దుఃఖితుడౌతాడు. గాయత్రీ సాధన వలన మస్తిష్కంలో నిర్మలత్వము సంభవించి, అత్యంత ఆవశ్యకమైనవిగా తలపోసినవి. అనావశ్యము, అనుపయుక్తమైనవని భావన కలుగుతుంది. వాటి నుండి మనస్సుమరలుతుంది. ఈ మానసిక పరివర్తన అత్యంత ఆనందాన్ని సిద్ధింపజేస్తుంది. పూర్వపు కల్పిత భ్రాంతకోర్కెలు తీరినప్పటికీ సంభవించని సుఖము ప్రాప్తిస్తుంది. అనుష్ఠానము, జ్ఞాత అజ్ఞాత, పరివర్తన గలిగి, కారణ దుఃఖ, చింతాగ్రస్థ మానవునకు కొద్దికాలంలోనే సుఖశాంతులు, స్వర్గీయ జీవన విధానాన్ని గడిపే స్థితి సంభవిస్తుంది.

లక్షా ఇరువది యైదు వేల జపాన్ని అనుష్ఠానమంటారు. ప్రతి వస్తువూ పరిపక్వమవడానికి కొన్ని అవసరము పప్పు,కూర, ఇటుక, గాజు,పక్వమవడానికి నియమిత శ్రేణిలో వేడి అవసరము. వృక్షముల పైన పండ్లు నియమిత కాలంలో పండుతాయి. గ్రుడ్డు పరిపక్వమైన తరువాత పగులుతుంది. గర్భంలోనున్న బాలుడు తన పూర్తి సమయాన్ని వినియోగించుకొంటాడు. తరువాత జన్మిస్తాడు. అసంపూర్ణ క్రియ వలన నియమిత అవధికన్నా ముందు విక్షేపముత్పన్నమైతే సఫలతకు అవకాశముండదు. అటులనే అనుష్ఠానమునకు అవధి, పద్ధతి, లక్షాయిరువది యైదు వేలు జపము ఇది పూర్తియైన వెంటనే సత్పరిణామము కలుగుతుంది పరిపక్వమైన సాధన మధురమైన ఫలమును యిస్తుంది.

## అనుష్ఠాన మొనరించవలసిన పద్ధతి

అనుష్ఠానము యే నెలలోనైనా చేయవచ్చు పంచమి, ఏకాదశి, పూర్ణిమ తిథులు శుభప్రదము, పంచమి దుర్గతత్వమునకు, ఏకాదశి సరస్వతీ తత్వమునకు పూర్ణిమ లక్ష్మీ తత్వమునకు ప్రధానమైనవి. కృష్ణపక్షమనిగాని శుక్లపక్షమనిగాని ప్రత్యేక నిషేధమేమీలేదు. ఏలనన శుక్లపక్షము క్రిష్ణపక్షముకన్నా శుభమైనది గావున.

అనుష్ఠాన ఆరంభములో గాయత్రీ ఆవాహనము; చివరలో విసర్జనము చేయవలె. ఇందులో ప్రతిష్ఠాభావన, నివేదన ప్రధానము శ్రద్ధాపూర్వకంగా; భగవతీ, జగజ్జననీ, భక్తవాత్సల్య గాయత్రీని ప్రతిష్ఠించుటకు అనుజ్ఞ కోరవలె. ఇది సంస్కృతములోగాని,

మాతృభాషలోగాని కోరవలె. మన ప్రార్థనను స్వీకరించి గాయత్రీమాత దయతో వచ్చినదని విశ్వసించవలెను. విసర్జన సమయంలో-ఆదిశక్తి, భయహారిణి, శక్తిదాయిని తరణతారిణి, మాతృదేవీ తమరు దయచేసి వెళ్ళండి అని ప్రార్థించవలె. ఈ భావనను సంస్కృతములోగాని, తమ మాతృభాషలోగాని వుచ్చరించవలె దీనితోపాటు దేవి వదలి వెళ్ళినదని పూర్తి విశ్వాసంతో భావించవలె. ప్రార్థన స్వీకరించి 'విసర్జన' జరిగినట్లు భావించవలె.

అనేక గ్రంథములలో, జపములో పదవ వంతు హవనము చేయుటకు, హవనములో పదవ వంతు తర్పణమునకు, తర్పణములో పదవ వంతు బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెనని వున్నది. ఈ నియమము తంత్రోక్త పురశ్చరణ రీతి కొరకు. ఈ పంక్తులలో వేదోక్త రీతితో జరుపబడే దక్షిణమార్గ సాధన చెప్పబడుతున్నది. దీని ప్రకారం తర్పణ ఆవశ్యకత లేదు అనుష్ఠాన అంతంలో 108 ఆహుతుల హవనము కనీసపు అవసరము అధికంగా జేయుట, సామర్థ్యాన్నిబట్టి అవకాశాన్నిబట్టి చేయవలె. కనీసం త్రిపద గాయత్రీ కొరకు కనీసం ముగ్గురు బ్రాహ్మణులకు భోజనము గావించవలె. దానము కొరకు ప్రత్యేక పద్ధతి లేదు. సాధకుని శ్రద్ధ, భక్తిననుసరించి దానపు ఆవశ్యకత వుంటుంది.

ఏదైనా చిన్న నాలుగు కాళ్ళ పీటగాని, వేదిక గాని, ఆసనముపైగాని, పూలతో సుందరమైన ఆసనమేర్పరచి దానిపై గాయత్రీ దేవిని ప్రతిష్ఠించినటుల భావించవలె. సాకారోపాసనా సమర్థులు 'భగవతీ' గాయత్రీ యొక్క సుందర చిత్రమును గాని లేక ప్రతిమను గాని పువ్వులపై స్థాపింపవచ్చు. నిరాకారోపాసకుడు, నిరాకార భగవతీ శక్తి పూజకు ప్రత్యేక తెల్లటి లింగమును ప్రతిష్ఠించినటుల భావించవలె. వేర్వేరు వ్యక్తులు, ధూపపు వత్తినిగాని, దీపపు అగ్ని శిఖను గాని గాయత్రీ చైతన్య జ్వాలగా దర్శిస్తారు. ఆ దీపాన్ని లేక ధూపవత్తిని పూలపై ప్రతిష్ఠించి, తమ ఆరాధ్య శక్తిని ఆవాహనము చేసికొన్న అనుభవాన్ని పొందుతారు. విసర్జన సమయంలో ప్రతిమను తీసి పయంనించుమనట్లుజేసి, జలాశయంలోగాని, పవిత్ర స్థానంలోగాని విసర్జించవలె. సగం కాలిన వత్తీపీ, దూదివత్తిని ఆర్పిపూలతోపాటు విసర్జించవలె. మరుసటి రోజు రెండవ వత్తి నుపయోగించవలె. కాలిన వత్తి నుపయోగించరాదు.

గాయత్రీ పూజకు ఐదు వస్తువులు ప్రధాన రూపంతోమంగళకరమైనవిగా పరిగణింపబడుతున్నాయి. పూజా పదార్థములలో అవి ప్రాణములు. అవి గాయత్రీకి అనుకూలములు. అందువలన పుష్పాసనముపై ప్రతిష్ఠింపబడిన గాయత్రీదేవి సమ్ముఖంలో ధూపము వెలిగించుట, దీపమునుంచుట, నైవేద్యము పెట్టుట, చందనము పూయుట,

అక్షతలు చల్లుట చేయవలె. దీపాన్నిగాని, ధూప వత్తినిగాని, గాయత్రీగా స్థాపించినపుడు, వాటి స్థానంలో జలమును సమర్పించి ఐదు పూజా పదార్థములను సమర్పించవలెను

పైన వర్ణించిన విధితో ప్రాతఃకాలము తూర్పు ముఖంగా పరిశుభ్రమైన భూమిపై . స్నానమొనరించి, కుశాసనముపై కూర్చొనవలె. జలపాత్రను సమీపమందుంచుకొనవలె. ధూప దీపములు జపము చేయునపుడు జ్వలిస్తూ వుండవలె. వత్తి ఆరిపోతే దానిని విసర్జించి, వేరొకదాని నుంచవలె. అటు నే ధూపవత్తిని గూడా కొత్తదానిని వెలిగించవలె. దీపముపైబడే నేతిని తొలగించవలె.

పుష్పాసనముపై గాయత్రీ దేవిని ప్రతిష్టించిన తరువాత, పూజానంతరం జపము ప్రారంభించవలె. నిత్యము ఇదే క్రమమును పాటించవలె. ప్రతిష్ఠపూజ అనుష్ఠాన కాలంలో నిత్యము జరుగవలె. స్థిర భావనతో నుండవలెను.

మనస్సు నలుదిక్కులకు పరుగిడరాదు. పూర్వము చెప్పిన ప్రకారం గాయత్రీ దేవిని ధ్యానిస్తూ జపము చేయవలె. ధ్యానంలో గాయత్రీదేవి ముఖంలోని ప్రత్యేక అంగమును భావించిన యెడల మనస్సు స్థిరమై వుంటుంది. నలుదిక్కుల పారిపోదు. పారిపోయే మనస్సును నిగ్రహించి ఆపి, మరల ధ్యానభావన పైకి తీసుకురావలె. ఈపని వలన ఏకాగ్రత రోజు రోజుకు వృద్ధి అవుతుంది.

లక్షా ఇరువదియైదు వేల జపము 40 రోజులలో పూర్తిచేసే క్రమము పూర్వకాలము నుండి ఆచరణలో నున్నది. ప్రతి నిర్బలుడు, తక్కువ సమయము సాధన కొరకై వినియోగించగల సాధకుడు, దీనిని రెండు మాసముల గడువులో చేయవచ్చును. ప్రతిదినము జపసంఖ్య సమానంగా నుండవలె. ఒకరోజు అధికం, మరొక దినం తక్కువగా జపించడం సరియైనది కాదు.

40 రోజులలో అనుష్ఠానము పూర్తి కావలెనంటే - 1, 25, 000 ÷ 40= 3, 125 మంత్రములు నిత్యము జపించవలె. మాలలో 108 పూసలుంటాయి. ఈ మంత్రములకు 3,125 ÷ 108= 29. ఈ విధంగా 29 మాలలు నిత్యము జపించవలె. ఇట్లుగాక రెండు మాసములలో జపించితే, 1,25,000 ÷ 60 = 2080. ప్రతిదినమూ జపించాలి. దీనిని మాలలు 2080 ÷ 108=20 మాలలు. ప్రతిదినము మాలలు లెక్కించడానికి సీమ సున్నపు వుండలను 20గాని 30గాని గంగాజలముతో శుభ్రపరచుకొని, ఒకచోటనుంచుకొని మాల పూర్తియైన వెంటనే ఒక వుండను రెండవచోటుకి మార్చుతూ, అన్నీ పూర్తియైన తరువాత జపము పూర్తి అయినట్లుగా భావించవలె. అపుడు జపసంఖ్యలో పొరపాటు వుండదు.

గాయత్రీ ఆహ్వాన మంత్రము :

ఆయాతువరదాదేవి అక్షరేబ్రహ్మవాదినీ
గాయత్రీ చందసాం మాతా బ్రహ్మయోనిర్న మోస్తుతే ।

గాయత్రీ విసర్జన మంత్రము :

ఉత్తమే శిఖరేదేవీ భూమ్యాం పర్వత మూర్ధనీ
బ్రాహ్మణే భ్యోభ్యనుజ్ఞాతా గచ్ఛదేవి యదాసుఖమ్ ।

అనుష్ఠానము చివర హవనము (యజ్ఞము) చేయవలయును. తదనంతరం శక్త్యానుసారం దానము, బ్రహ్మ భోజనం గావించవలె. వాస్తవంగా బ్రాహ్మణులైనవారికే బ్రహ్మ భోజనం చేయించవలె. బ్రహ్మపరాయణుడై వుండవలె. కుపాత్రదానంగాని. భోజనంగాని విష్ఫలం. కావున దగ్గరగా నున్నట్టిగాని, దూరంగా నున్నట్టిగాని బ్రాహ్మణులకు భోజనము చేయించి తృప్తిపరచవలె.

## నిత్య శుభ గాయత్రీ యజ్ఞము (హవనము)

గాయత్రి అనుష్ఠానానంతరముగాని లేక యేదైనా శుభకార్యము కొరకుగాని గాయత్రి యజ్ఞమొనరించవలె. వేదమాత సరళత, సౌమ్యత, వాత్సల్యత, సుశీలత యెటుల ప్రసిద్ధమో, గాయత్రీ హవనముగూడ నట్లే ప్రసిద్ధము. సుగమము, దీనికొరకు, నీటిలోవున్న చేపనుగాని, బలసిన పొట్టేలునుగాని తేనవసరము లేదు. కర్మకాండ పండితుల నాశ్రయించనవసరం లేదు. మామూలు పరిజ్ఞానముతో దీన్ని భారీగా చేయవచ్చు.

యజ్ఞకుండము త్రవ్విగాని, వేదిక నేర్పరచిగాని రెండువిధాల చేయవచ్చు. నిష్కామ బుద్ధితో ఆత్మ కల్యాణం కొరకు కుండమును త్రవ్విచేయుట సరియైనది. మనోకామనను సిద్ధింప జేయుటకొరకు 24" చదరపు వేదికను తయారు చేసుకొనవలెను. కుండము త్రవ్వినపుడు లోతు కూడ 24 అంగుళము లుండవలెను మరియు వంకరగా కుండము అడుగునకు వెళ్ళేటప్పటికి 6' పొడవు 6' వెడల్పు ఉండవలె. వేదిక తయారు చేసేటపుడు సారములేని మట్టితో 4' ఎత్తులో 24"x24" పొడవు, వెడల్పులు గల దానిని తయరుచేయవలె. హవనము చేయడానికి ముందు రెండు గంటలకు పూర్వము కేవలము నీటితో ఆ వేదిక గాని, యజ్ఞకుండముగాని సమతలంగా వుండేటట్లు అలకవలె. ఎత్తుపల్లములుండకుండ చూడవలె. కుండము లేక వేదిక నుండి నాలుగంగుళముల దూరములో చిన్న కాలువను, రెండంగుళముల వెడల్పు, రెండంగుళముల లోతున

త్రవ్వి, దానిని నీటితో నింపవలె. కుండము లేక వేదిక దగ్గరలో గోధుమపిండినీ, పసుపు కుంకుమలు మొదలైన మంగళకర పదార్థములచే చిత్రమైన ముగ్గులువేసి తమ కళాప్రియత్వమును పరిచయము చేసికొనవలయును. యజ్ఞ స్థలాన్ని తన శక్తి ననుసరించి మండపమును పుష్ప పల్లవముల సుందరంగా, ఆకర్షణీయంగా తీర్చిదిద్దవలె.

యజ్ఞకుండపు లేక వేదిక ఈశాన్య దిక్కున కలశస్థాపన చేయవలె. మట్టితోగాని, ఉత్తమ లోహముతోగాని తయారుచేయబడిన కలశమును పవిత్ర జలముతో నింపి, దానిలో మామిడి ఆకులను వుంచవలె. దానిపై మూకుడుంచి అందులో బియ్యము, గోధుమ పిండి, మృష్టాన్నము లేక యితర మంగళ ద్రవ్యములుంచవలె. కలశపు నలువైపుల పసుపుతో స్వస్తిక్ వేయవలె. కలశమునకు సమీపంలో చిన్న వేదికపైన పుష్పములను, గాయత్రీ మాత ప్రతిమను, పూజా సామాగ్రి నుంచవలె.

వేదికగానీ, కుండముయొక్క గాని మూడు దిక్కులయందు ఆసనములను పరచి యిష్టమిత్రులను బంధువులతోగూడి కూర్చొనవలె. గాయత్రీ దేవిని, కలశమును స్థాపించిన తూర్పు దిశయందు శ్రేష్ఠబ్రాహ్మణునిగాని, లేక తమ వయోవృద్ధుని ఆహ్వానించి, సత్కరించి ఉపవిష్టుని గావించవలె. అతడే యజ్ఞమునకు బ్రహ్మ. యజమానుడు బ్రహ్మ కుడిచేతికి సూత్రబంధన చేయవలె. కుంకుమ లేక గంధముతో వారికి తిలకము దిద్దవలె. పాదములను స్పృశించవలె. తరువాత బ్రహ్మ అచటనున్న వారందరిని తన సమీపమునకు రావించుకొని, సూత్రము కట్టి, నుదుట కుంకుమ బొట్టు పెట్టాలి. వారి శిరస్సులపై అక్షతలుంచి, ఆశీర్వచన మంగళ వాక్యములు పలుకవలె.

యజమానుడు పడమర కూర్చొనవలె. అతని ముఖము తూర్పుకు తిరిగి వుండవలె హవన సామాగ్రి, ఘృతము అధికంగా వుంటే, అనేక పాత్రలలోనికి విభజించి పెక్కుమంది యజ్ఞము చేయవచ్చు. సామాగ్రిని తనవద్ద వుంచుకొనవలె. యజమాని భార్య నేతి పాత్రను దగ్గరనుంచుకొని చంచాతో అవసరమొచ్చినపుడు ఉపయోగించవలె భార్య లేనపుడు, స్నేహితుడుగాని, సోదరుడుగాని నేతి పాత్రను ముందుంచుకొనవచ్చు.

సమిధలు 7 రకములుగా వుంటాయి. అన్నీ దొరకనపుడు దొరికినన్ని రకములుపయోగించవచ్చు. హవన సామాగ్రిని త్రిగుణాత్మక సాధనలలో ప్రథమమైనదిగా పేర్కొనబడినది. ఆ త్రిగుణములను స్వీకరించవలె. కాని ఆధ్యాత్మిక సాధనలో సత్వగుణ ప్రధాన సామాగ్రిని సగము, రజస్తమోగుణముల వస్తుసంచయము పావు, పావు(1/4) చొప్పున సమకూర్చుకొనవలె. భౌతిక కోర్కెను పొందుటకై హవనమొనరించే

టపుడు రజోగుణ సామాగ్రి సగము సత్వ తమోగుణ సామాగ్రిపావు. పావు (1/4) తీసుకొనవలె.

సామాగ్రిని శుభ్రపరచుకొని, ఎండలోనుంచి చెరగి వుంచుకొనవలె. సామాగ్రలో ఏదైనా వస్తువు దొరక నపుడు, తక్కువ పరిమాణంలో దొరికినవుడు, అదే గుణము గలిగిన వేరొక పదార్థమును పయోగించవచ్చు.

హవనమొనర్చు వ్యక్తులు స్నానమొనరించవలె. హాజరైన వ్యక్తులు గూడా దర్శించుటకు వచ్చినయెడల కొంచెము దూరముగా కూర్చుండవలె.

హవనము ప్రారంభించిన వెంటనే యజమాని బ్రహ్మ సంధ్యారంభంలో చేయ వలసిన పవిత్రీకరణ, ఆచమనము, శిఖాబంధనము అపమర్షణము, న్యాసములను చేయవలె తదుపరి వేదికపైగాని, కుండముపైగాని సమిధలను కర్పూరము సహాయంతో వెలిగించి, గాయత్రీ మంత్రోచ్చారణముతో అగ్నిని ప్రజ్వలింపజేయవలె అందరూ కలసి మంత్రము చెప్పవలె. చివరకు 'స్వాహా' అంటూ నేతిని సామాగ్రితో పాటు హవనం చేసేవారు హవనము గావించవలె. ఆహుతి చివరలో చంచాలో మిగిలిన నేతిని తనవద్దనున్న జలపాత్రలో ఒక్కొక్క బిందువు చొప్పున నుంచవలె ఆదిశక్తి "గాయత్రీ ఇదన్నమమ" అని ఉచ్చరించవలె. హవనంలో మధురస్వరంలో మంత్రోచ్చారణ చేయవలె. ఉదాత్త, అనుదాత్త స్వరతానుసారంగా సామూహిక సమ్మేళనంలో మంత్రోచ్చారణ లేక పోయినా దోషం కాదని శాస్త్రకారులు చెప్పియున్నారు.

ఆహుతులు కనీసం 108 జరుగవలె. అధికంగా రెట్టింపుగాని, రెండు రెట్లుగాని, మూడురెట్లుగాని, ఎన్ని రెట్లైనా చేయవచ్చు. సామాగ్రి కనీసం ప్రతి ఆహుతకి 32 గురివిందగింజల ప్రమాణము అనగా 6 చటాకులు, నేయి ప్రతి ఆహుతికి 2 చటాకులు కావలె. సామర్థ్యాన్నిబట్టి అధికంగా పెంచవచ్చు. బ్రహ్మ మాలతో కూర్చుని ఆహుతులను లెక్కిస్తూ ఉండవలె. మాల పూర్తియైన వెంటనే పూర్తి గావించవలె. ఆరోజు వండిన మృష్టాన్నములో ఉప్పు లేని మధుర పదార్థములుండవలె ఉప్పు, కారం కలసిన శాకములు, ఊరగాయలు, పుల్లటివి హోమమునకు నిషేధములు. ఈ భోజనమును కొంచెము తీసికొని హవనములో పాల్గొనిన వారందరూ హవనములోనే అర్పించవలె చివరలో కొబ్బరి కురిడీని విడదీసి యజ్ఞ శేష ఘృతముతో నింపి, నిలబడి పూర్ణాహుతి రూపంలో అగ్నికి సమర్పింపవలె. మిగిలిన సామాగ్రిని గూడ యజ్ఞకుండాగ్నికి సమర్పించవలె.

తరువాత, అందరూ నిలబడి యజ్ఞమునకు ప్రదక్షిణము చేయవలె "ఇదన్నమమ" నీటిలో తేలుతున్న నేతిని వ్రేలుతో తీసికొని కనురెప్పలపై నుంచుకొనవలె. ఆరిన

పుష్పములు : తెలుపు (వెలవెలబోయేతెలుపు) దీపమునందు: గేదెనెయ్యి
పాత్ర : కంచు పాత్ర తిలకము (బొట్టు) : కుంకుమ
సమిధలు : మామిడి కొమ్మలు, సంద్ర కొమ్మలు
హవన సామాగ్రి : దేవాదారు, పెద్ద యాలకులు, కుంకుమ పువ్వు మంచి కారము, పునర్నవము, జీవంతి ఖర్జూరాలు,, తాటాకులు, వడ్లు, తుంగ, ఉన్నాదిము, మోచరసము, పొవు, చత్రికము, పచ్చి శనగపప్పు వెన్న, కిస్మిస్, బియ్యము, పానకము

**తమోగుణము :**

మాల : రుద్రాక్ష వస్త్రము : ఉన్ని వస్త్రము
ఆసనము : ఉన్ని (పూలు) ముఖము : పడమర దిక్కువైపు ముఖముండవలె
పుష్పములు : లేత ఎరుపు గాని, లేక ముదురు ఎరుపు పూలు
దీపమునందు : మేక నెయ్యి లేక గొర్రె నెయ్యి
తిలకము (బొట్టు) : బూడిద
పాత్ర : లోహపాత్ర (ఇనుప పాత్ర)
సమిధలు : వేలము, భౌకరము, అడవి కాకర
హవన సామాగ్రి : రక్తచందనము తగరు, జయపరమ, నాగకేశరము, రావికొమ్మలు, పకోడి, వడియము, కొమ్ము, నేలవేము, అపమార్గము, దోసతీగె, కులంజనము, ఎలుక రక్తము మెంతులు కాకి ఈకలు భారంగము, చెయ్యిలేని చెయ్య, పిస్తా, అక్రోడ్, దీపస్తంభము నువ్వులు, మినుములు, బెల్లం.

గణానుసారంగా సాధన సామాగ్రి ఉపయోగించినందున సాధకుని గుణములు అభివృద్ధి చెందుతాయి. తదనుగుణ్యంగా సఫలతామార్గంలో అధిక సులువు చేకూరుతుంది.

## నవదుర్గలో గాయత్రీ సాధన

సంవత్సరంలో శరత్, శిశిర, హేమంత, వసంత, గ్రీష్మ వర్షఋతువులనే ఆరు వున్నాయి. గ్రీష్మ, చల, వర్షఋతువులని మూడుగా అంటారు. కాని వస్తుతః ఋతువులు రెండు మాత్రమే. అవి గ్రీష్మ ఋతువు, శీత ఋతువులు ఎండాకాలంలో శ్రావణమాసంలో

వర్షమొస్తుంది. చలికాలంలో పుష్యమాసంలో వర్షము కురుస్తుంది. ఎండాకాలంలోని వర్షము అధిక నీటిని వర్షిస్తుంది. శీతాకాలంలోని వర్షము తక్కువ నీటిని వర్షిస్తుంది. తేడా వున్నప్పటికీ రెండు ఋతువులలో వర్షించడానికి ఆస్కారమున్నది. ఈరెండు ఋతువులు సమ్మేళనమయ్యే సంధి కాలమును "నవదుర్గ" అంటారు.

పగలు రాత్రి కలయిక సమయాన్ని సంధ్యాకాలమంటారు. ఆకాలము మహత్వ పూర్ణమైనది. జాగ్రత్తగా వ్యవహరించవలసి వుంటుంది. సూర్యోదయ సమయంలో, సూర్యాస్తమయ సమయంలో, భుజించుట, నిద్రించుట, మైథున మొనరంచుట, యంత్రారంభము గావించుట మొదలైన అనేక కార్యములు వర్జింపబడినవి. ఆ సమయంలో ఈశ్వరారాధన, సంధ్యావందనము, ఆత్మ సాధన మొదలైన వాటిలో మనస్సు లగ్నము చేయవలె. ఏలనన ఆ సమయంలో, సూక్ష్మదృష్టితో చేయవలసిన పనులకు అధిక వుపయోగముంటుంది. ఆ పనులకు బహు తక్కువ శ్రమతో అధిక ఆశ్చర్యజనక సహాయం లభిస్తుంది. కావున వర్జింపబడిన పనులు ఆ సమయంలో హానికారకములు. శీతాగ్రీష్మ ఋతువుల కలయిక, దివారాత్రముల కలయిక మాదిరి సంధ్యాకాలములు, పుణ్యపర్వములు ఋతువులలో 9 రోజులు ఋతుమయమై, రజస్వలగా నుంటాయి. రజస్వల కన్యకు పుష్టికరమైన ఆహారము ఆచార వ్యవహారము అవసరము. జాగ్రత్తగా నుండవలె. అటులనే సంధ్యాకాల సమయంలో, రజస్వలావధిలో ప్రత్యేక స్థితిలో నుండుట అవసరము.

అశ్వనీ నక్షత్రంలో, చైత్రమాసంలో జరిగే బహు సూక్ష్మ ఋతుపరివర్తన ప్రభావము శరీరంపై అధికాధిక మోతాదులో ప్రభావాన్ని చూపెడుతుందని ఆరోగ్యశాస్త్ర పండితులందరికీ విదితమే. ఆ ప్రభావము వలన ఆరోగ్యపు గోడలు బీటలువాలిపోయి, అనేక మంది జ్వరంతోను, చలిజ్వరంతోను, కలరా వలనను నీళ్ళ విరేచనములతోను, మశూచి వలనను, అలసటతోను, యింకా యితర రోగములతో రోగగ్రస్తులవుతారు. ఆ రోజులలో డాక్టర్ల వైద్య శాలలు తిరునాళ్ళలోలా రద్దీగా వుంటాయి. వాంతులకు విరేచనాలకు, జలుబులకు, చెమటకు రక్తము లేకుండుట మొదలైన శరీరానికి సంబంధించిన వ్యాధులకు అశ్వనీ నక్షత్రము, మరియు చైత్రమాసము తగినవని వైద్యులందరికీ తెలుసు. ఈ సమయంలో దసరా, శ్రీరామ నవమి పండుగలు 'నవదుర్గల అంతంలో వస్తాయి. మహత్తు అధికంగా వున్న యీ రెండు పండుగలకు యీ సమయం అత్యంత ఉపయుక్తమైనది. నవదుర్గ చివరలో 'భగవతీ దుర్గ' ఆవిర్భవించినది. చైత్ర నవదుర్గ చివరలో రామావతారము జరిగినది. అమావాస్య పూర్ణిమల సంధ్యా ఉషలు. వీటి చివరిలో సూర్యుడు గాని, చంద్రుడు గాని ఉదయిస్తాడు.

ఋతువులు మారినపుడు సామాన్య దృష్టిలో కష్టకారక సమయమనీ, హాని ప్రదమనీ సహజంగా భావిస్తారు. ఆ సమయంలో పెక్కుమంది, యేదోవిధమైన శారీరక క్లేశమును తక్కువ మోతాదులో గాని అనుభవించడం కద్దు. వాస్తవంగా పరిస్థితి వ్యతిరేకము. ఆ సమయంలో శారీరక జీవనశక్తిలో జ్వరావస్థత వుత్పన్నమౌతుంది. ఆ ప్రభావం వలన గడచిన ఆరు మాసములలో ఆహార వ్యవహారములలో అనియమిత సామాగ్రినిగ్రహించుట జరిగి, దూషిత తత్వములభివృద్ధి చెందినందున జీవనశక్తి వాటిని నిరాకరించడం ప్రారంభిస్తుంది. ఈ దోషనివారణ ప్రతి క్రియ సామాన్య చలిజ్వరంగాను, జలుబు దగ్గు రూపంలోను, యింకా యితర విధములుగా ప్రకటమౌతుంది. కాని ఉపవాస మొనరించుట, స్వల్పమాత్ర ఆహారాన్ని మాత్రమే స్వీకరించుటవలన తన శరీరమును తనంతట తాను శుభ్రపరచుటకు అవకాశమిచ్చి, ఉపవాసముద్వారా నిన్ను నీవు నీ మానసిక క్షేత్రములోని మలినాన్ని, విక్షేపములను పోగొట్టుకోవడానికి ప్రయత్నిస్తే రాగల కొన్ని నెలల వరకు రోగముల నుండి రక్షణ పొంది ఆరోగ్యవంతమైన జీవనం గడుపుటకు యోగ్యతను పొందగలవు. గాయత్రీ యొక్క ఈ లఘు అనుష్ఠానము యీ దృష్టిలో పరమ ఉపయోగకరమైనది.

చైత్రమాసపు శుక్లపాడ్యమి మొదలు నవమి వరకు 'నవదుర్గ' ఉంటుంది. యీ సమయం గాయత్రీ సాధనకు అధికశ్రేష్టమైనది. ఈ రోజులలో ఉపవాసమునుండి 24 వేల మంత్రముల చిన్న అనుష్ఠానము చేయవలె. ఈ కొద్ది అనుష్ఠానము ఉపయోగ సిద్ధమైనది.

ఒకసారి అన్నాహారము మరొకసారి ఫలాహారము, రెండుసార్లు పాలు, పండ్లు ఒకసారి ఆహారము మరొకసారి పండ్లు-పాలు, కేవలం పాలు ఆహారంగాను, వీటిలో యేదైనా సరే తన సమర్థనుకూలంగా తీసుకొని ఉపవాసం చేస్తూ సాధనను ఆరంభించవలె.

ప్రాతఃకాలము బ్రహ్మ ముహూర్తములో మేల్కొని, శౌచ స్నానాదులు గావించి, పైన చెప్పిన నియమములను పాటిస్తూ ధ్యానమునకు కూర్చుండవలె. తొమ్మిది రోజు లలో 24 వేలు జపించవలె. ప్రతిదినము 2,668 మంత్రములు జపించాలి. ఒక మాలలో 108 పూసలుంటాయి. ప్రతి దినము 27 మాలలు జపించిన యెడల యీ సంఖ్య అనగా 24 వేల మంత్రములు పూర్తవుతాయి. మూడు నాలుగు గంటలు తమ వేగము ననుసరించి అన్ని మాలలు సులభంగా చేయగలరు. ఒకేసారి యింత సమయాన్ని యేకంగా జపించుట కష్టసాధ్యమైనపుడు అధికాంశము ప్రాతః కాలమున పూర్తిచేసి, న్యూనాంశమును (మిగతా తక్కువైన జపాన్ని, సాయంకాలము పూర్తచేయవలె చివరి రోజున హవనం కొరకు ఆరోజు (లోగడ వర్ణించిన) హవనవిధి ప్రకారం కనీసం 108

ఆహుతులను సమర్పించవలె. బ్రాహ్మణ భోజనము యజ్ఞం పూర్తియైనందున దాన దక్షిణలు యధావిది నొనరించవలె.

ఈ అల్పానుష్ఠానము 'నవదుర్గ' సమయంలో ప్రతి సంవత్సరము చేస్తూ వుండటం సర్వశ్రేష్ఠము, ఉత్తమము. తాను స్వయంగా చేయలేనపుడు, అధికారియైన యే సుపాత్రునితోనో చేయించవచ్చు. ఆతడు తొమ్మిది రోజుల సాధనకు చాల ఉపయోగకారి. కష్ట నివారణకు సంకల్ప సిద్ధికి, ఆత్మబలాభివృద్ధికి, యీ రోజులలో ఉపవాస ముండుట బహు లాభదాయకము. సిద్ధిప్రదము రానున్న "నవదుర్గ" సమయము చాల దగ్గరలో నున్నది. ప్రతి పాఠకుడు ఆ సమయానికి ఒక స్వల్పానుష్ఠాన మొనరించి ప్రయోజనాన్ని పరికించాలి.

"నవదుర్గ" సమయంలోనేగాక, యీ స్వల్పానుష్ఠానము ఇతర సమయాలలో గూడ చేయవచ్చు.

లక్షా పాతికవేల జపము 40 రోజులలో పూర్తిగావించబడేది "పూర్ణ అనుష్ఠానము". రోజులకు ఒక పాద (పంచమాంశం) అనుష్ఠానమంటారు. సౌకర్యాన్నిబట్టి ఆవశ్యకత నుబట్టి, ఏకపాద అనుష్ఠానము గూడ చేయవచ్చు. ఈ తపోధనాన్ని యెంత ఎక్కువగా సేకరించితే అంత ఉత్తమము.

## చిన్న గాయత్రీ మంత్రము :

లక్షా పాతిక వేల జపము యొక్క పూర్ణ అనుష్ఠానము చేయలేనివారికి, తొమ్మిది రోజుల 24 వేల జపానుష్ఠానము సరిపోతుంది. అటులనే అల్ప శిక్షితులకు, అశిక్షితులైన బాలురకు, లేక స్త్రీలకు లఘు గాయత్రీ మంత్రము గూడా వున్నది. 24 అక్షరముల పూర్ణ గాయత్రీ మంత్రము గుర్తుంచుకొనలేనివారికి, ప్రణవము (ఓం) వ్యాహృతులు "ఓం భూర్భువః స్వః" మాత్రపు పంచాక్షరి మంత్రమును జపిస్తే పని జరుగుతుంది. నాలుగు వేదముల బీజములు 24 అక్షరముల గాయత్రీలో నున్నవి. అట్లే గాయత్రీ మంత్రానికి మూలము పంచాక్షరీ మంత్ర ప్రణవము. మరియు వ్యాహృతులు. 'ఓం భూర్భువః స్వః' మంత్రం అల్పజ్ఞానుల సౌకర్యం కొరకు యెక్కువ వుపయోగకారి.

## మహిళలకు కొన్ని విశేష సాధనా మార్గములు

పురుషులకు మాదిరి స్త్రీలు గూడా వేదమాత గాయత్రీ జపింతురు, సాధన చేయుటకు అధికారము కలదు. చైతన్యరహితము, చలన హీనమునైన సృష్టి వ్యవస్థను

చైతన్యవంతము, చలనము గల శక్తివంతమైన పరిణామము పొందుటకు, రెండు భిన్న జాతుల పారస్పరిక ఆకర్షణ కలిగించే తత్వముల ఆవశ్యకత వున్నది. 'ఋణ' (నెగటివ్) మరియు 'ధన' (పాజిటివ్) శక్తుల పారస్పరిక ఆకర్షణ, వికర్షణ ద్వారా "విద్యుత్ వేగపు సంచాలనము కలుగుతుంది. పరమాణువు యొక్క 'ఎలక్ట్రాన్', 'ప్రోటాన్'ల భాగపు పారస్పరిక శక్త్యాకర్షణ కారణము వలన దానికి గతిశీలత యేర్పడినది. శాశ్వత చైతన్యము, క్రియాశీలరూపము నొందుటకు సజీవసృష్టి నర, నారీ యను రెండు రూపములుగా విభజింపబడనది. యేలనన, ఆ విభజన(పురుషుడు స్త్రీ లేనపుడు) విశ్వము, చేష్టారహితము, చైతన్య రహితముగా నుండేది. "శరీర" "ప్రాణము"ల శక్తుల సమ్మేళనమే చైతన్యము. నరతత్వము, నారీ తత్వముల పరస్పర సమ్మేళనములేనపుడు, చైతన్యము లేదు. ఆనందము, స్ఫురణ, చేతనత్వము, గతి, క్రియ, వృద్ధి మొదలైనవి లోపించి, జడస్థితి మాత్రమే విరాజిల్లుతుంది.

నరత్వము, నారీతత్వము రెండూ ఒకదానిని మరొక్కటి పూర్ణత్వము కలుగజేస్తుంది. ఈ రెండు తత్వముల గొప్పతనము ఉపయోగము, అధికారము, స్థానము సమానము. వేదమాత గాయత్రీ సాధనకు పురుషులకు వలె స్త్రీలకు సమానాధికారమున్నది. గాయత్రీ వేదమాత యైనందున స్త్రీలకు అధికారము లేదనడం పొరపాటు. ప్రాచీన కాలములో స్త్రీలు మంత్రద్రష్టలు. వేదమంత్రములు వారిద్వారా అవతరించాయి. గాయత్రీ స్వయం స్త్రీలింగము కావున వారికి అధికారము లేకపోవ డానికి కారణములేదు. ఆశిక్షితులు, హీనమతులు, అపవిత్రులు, స్త్రీలు కావచ్చు. వారికి స్వయంగా ప్రవృత్తి లేదు. గొప్పతనాన్ని గుర్తించలేకపోవచ్చు. కావున తమ నిజమైన మానసిక అవస్థవలన అధికార వంచితులయ్యెదరుగాక. స్త్రీలు పురుషులకు వలె గాయత్రీ సాధన చేయగలరు. యీ పుస్తకంలో ఈయబడిన సాధనలన్నిటికీ వారర్హులు.

కాని, వివాహిత స్త్రీలు, గృహకార్యములలో నిమగ్నులై వుంటారు. కనీసం కొంతమందికి చిన్న చిన్న పిల్లలుంటారు. వారు ఆ పిల్లల మల, మూత్రములను శుభ్రపరచవలసినందున, పవిత్రత తక్కువగా నుండి, దీర్ఘకాలంలో చేయవలసిన సాధనలు వారికి సులభంగావు. వారి పనులకు సంక్షిప్త సాధనలు పనికివస్తాయి. పూర్తిగా గాయత్రీ మంత్రాన్ని గుర్తుంచుకోలేనివారు సంక్షిప్త గాయత్రీ "ఓం భూర్భువః స్వః" తో కార్యసిద్ధి చేసుకోవచ్చు. స్త్రీ బహిష్ఠ రోజులలో గాయత్రీ మంత్రాన్ని జపించుట మానాలి. అనుష్ఠానం రోజులలో ఆ రోజులు మాత్రంమాని, స్నానానంతరము తిరిగి ప్రారంభించవచ్చు.

నిస్సంతాన మహిళలు గాయత్రీ సాధన పురుషుల మాదిరి చేయవచ్చు.

అవివాహితులు, విధవ స్త్రీలు పురుషులకు వలె సాధన చేయవచ్చు. పిల్లలు పెద్దగావున్న స్త్రీలు, చంటిపిల్లలు లేనివారు, వయోవృద్ధి స్త్రీలకు అసౌకర్యం వుండదు. సాధారణ దైవిక సాధనకు విశేష నియమములు పాటించనవసరం లేదు. దాంపత్య జీవనపు సాధారణ ధర్మపాలన గావించుటలో బాధలేదు. ఏదైనా ప్రత్యేక సాధనగాని, అనుష్ఠానముగాని చేయవలసి నపుడు ఆ రోజులలో బ్రహ్మచర్యపాలన అవసరం.

వివిధ ప్రయోజనములకు కొన్ని సాధనలు క్రింద పొందుపరచబడినవి.

## మనోనిగ్రహము, బ్రహ్మ ప్రాప్తి కొరకు :

విధవ సోదరీమణులకు ఆత్మ సంయమనము, సదాచారము, వివేకము, బ్రహ్మచర్యపాలన, ఇంద్రియ నిగ్రహము, మనస్సును వశములో నుంచుకొనుటకు గాయత్రీసాధన బ్రహ్మాస్త్రము మాదిరి వుపయోగపడుతుంది. సాధన ప్రారంభించిన రోజునుండే మనఃశాంతి, స్థిరత్వము, సద్బుద్ధి, ఆత్మసంయమన భావన జన్మిస్తుంది. మనస్సు ఆధీనములో వుంటుంది. చిత్తచాంచల్యము నశిస్తుంది. ఆలోచనలలో సత్వగుణము పెంపొందుతుంది. కోరికలు, అభిరుచులు, కార్యకలాపాలు, భావనలన్నీ సత్వగుణ ప్రధానమై, నిర్మలంగాను, పవిత్రంగానుంటాయి. ఈశ్వరప్రాప్తి, ధర్మరక్ష తపశ్చర్య ఆత్మకళ్యాణము ఈశ్వరారాధనలలో మనస్సు విశేషంగా లగ్నమౌతుంది. క్రమేణ ఆమె పరమ సాధ్వీమతల్లిగాను, తపస్వినిగా, ఈశ్వరపరాయణగా, బ్రహ్మవాదినిగా రూపొందుతుంది. గాయత్రీ రూపంలో ఆమె భగవంతుని దర్శిస్తుంది. వివాహిత స్త్రీ పొందే సంసార సుఖం తుచ్ఛమైనదిగా గోచరించి అత్యంత ఆత్మ శాంతిని పొందుతుంది.

ప్రాతః కాలంలో శరీరము సహించే నీటితో స్నానము చేయవలె. అతి శీతలపు నీరుగాని, అత్యుష్ణపు జలముగాని మంచివిగావు. ఇది అందరికీ. కాని స్త్రీలకు ప్రత్యేకంగా సహించలేని నీటి స్నానము హానికరము. స్నానానంతరము గాయత్రీ సాధనకు కూర్చొనవలె. దగ్గరలో నీటితో నింపిన పాత్ర నుంచుకోవలె. జపమునకు తులసి మాల, కూర్చొనుటకు కుశాసనము సరియైనది. వృషభ వాహనముపైనున్న శ్వేత వస్త్రధారిణి, చతుర్భుజములు కలిగిన ఒకచేతిలోమాల, మరియొక హస్తములో కమండలము, పుస్తకము, కమలము గలిగి, ప్రసన్న ముఖంతోనున్న ప్రౌఢ గాయత్రీ దేవిని ధ్యానభావన చేయవలె. ధ్యానము చేయవలె, ధ్యానము సద్గుణ సంపత్తికొరకు, మనోనిగ్రహము కొరకు విశేష లాభదాయకము. యీ విధమైన ధ్యానమును పదే పదే చేయవలె. జపము చేసేటపుడు కంఠము నుండి కొంచెము మాత్రము ధ్వని వెలువడవలయును. పెదవులు కదులుచుండవలె. కాని,

మంత్రము దగ్గరనున్న వారకి గూడా స్పష్టముగా వినిపించగూడదు. ప్రాతః, సాయం కాలములు రెండు వేళలా జపించవచ్చును. కనీసమొక మాల జపించవలె. సౌకర్యాన్ననుసరించి అధిక సంఖ్యలో జపించవచ్చు. తపశ్చర్య ప్రకరణలో వ్రాయబడిన ప్రకారము తపము చేయుట ఉత్తమము. ఏవిధమైన ఆరోగ్యము కొరకుగాని, మరే యితర పరిస్థితులకు అనుగుణ్యంగా గాని, ఏ తపశ్చర్య అవసరమో ఈ లేఖకుని నుండి సలహా పొందవచ్చును.

## కన్యలకు ఆశాప్రద భవిష్యత్తు కొరకు సాధన :

కన్యలైన కుమారీలు తమ వివాహిత జీవతంలో అన్నివిధముల సుఖశాంతులను పొందుటకు భగవతీ గాయత్రీ ఉపాసన చేయవచ్చు. పార్వతీ తన మనోనాయకుని భర్తగా పొందుటకై నారదుని ఆదేశానుసారము తపస్సు చేసినది. చివరకు సఫల మనోరథయైనది. మాతా సీతాదేవి మనోవాంఛిత పతిని పొందుటకు గౌరీ (పార్వతి) ఉపాసన మొనరించినది. నవదుర్గ సమయంలో ఆస్థిక గౌరవప్రద గృహకన్యలు భగవతీ ఆరాధన గావిస్తారు. గాయత్రీ ఉపాసన వారికి సర్వవిధముల మంగళప్రదము.

గాయత్రీ దేవి చిత్రపటముగాని, చిన్న ఆసనముపై లేదా నాలుగుకాళ్ళ పీటపైగాని స్థాపించవలె. ఇతర దేవత నారాధించునపుడెట్లు మనము చేస్తామో అటులనే చేయవలె. ప్రతిమ ముందు చిన్న పటము నుంచవలయును. అచట గంధము-ధూపము, దీపము, అక్షతలు, నైవేద్యము, పుష్పములు, జలము భోగము (పిండి వంట) మొదలైన పూజ సామాగ్రి నుంచవలె. హారతీయవలయును. మూర్తిమస్తకముపై గంధము నుంచవలె. పటమైతే గంధము మొదలైనవి వుంచగూడదు. ఏలనన ఆ గంధముపై మలినము పడవచ్చు. నేత్రములను మూసి ధ్యానించవలె. కనీసం 24 సార్లు గాయత్రీ మంత్రమును జపించవలె. గాయత్రీ చిత్రముగాని మూర్తి గాని లభించకపోతే, "గాయత్రీ తపోభూమి, మధుర" కు వ్రాసి తెప్పించుకొనవలె. ఈ విధమైన గాయత్రీ సాధన కన్యలకు అనేక అనుకూల వరప్రదము, దివ్యమైన గృహము, సౌభాగ్యము లభించుట కుపయోగపడుతుంది.

## గృహిణులు, సౌభాగ్యవంతులకు మంగళమయ సాధన :

తమ భర్తల సుఖానికి, సమృద్ధికి, సంపన్నతకు, స్వాస్థ్యమునకు (ఆరోగ్యానికి), ప్రసన్నతకు, దీర్ఘాయువు కొరకు, వివాహిత స్త్రీలు గాయత్రీ దేవిని శరణు కోరవలె. దీనివలన భరల యొక్క చెడు మనస్తత్వము, ఆలోచన, ఆచారము నిర్మలమై వాటిస్థానే

సాత్విక బుద్ధి జనించి, తమ గృహస్థ జీవనపు కర్తవ్యాన్ని, ధర్మాన్ని పాటించుటలో తాదాత్మ్యము చెంది, ప్రసన్నతాపూర్వకంగా గడుపుతారు. ఈ సాధన వలన స్త్రీలు ఆరోగ్యము, స్వభావములలో మార్పు గలిగి, వారు అధిక ఆకర్షణతో విరాజిల్లి, సర్వులకు పరమప్రియులౌతారు. వారు సముచిత సత్కారములను పొందుతారు. పాడైపోయిన తన ఆరోగ్యము, ఇంటిలోని ఇతరుల అనారోగ్యము ఆర్థిక యిబ్బందులు, దరిద్రం పెరిగిన విపరీతపు ఖర్చులు, తగ్గిన ఆదాయము, కుటుంబ క్లేశములు, వైమనస్యత, మనోవేదన, కుటుంబ క్లేశములు, వైమనస్యత, మనోవేదన కుటుంబ కలహములు రాగద్వేషాలు, వెడురోజుల ఉపద్రవములు శాంతించుటకు మహిళలు గాయత్రీ ఉపాసన చేయవలె పుట్టినింటికి, మెట్టినింటికి, గూడా యీ సాధన ఉపయోగకారి. పునీతస్త్రీల ఉపాసన ప్రతి వంశమునకు లాభదాయకము.

ప్రాతఃకాలము మొదలు మధ్యాహ్నము వరకు ఉపాసన చేయవలె. సాధన పూర్తికాకుండ భోజనము చేయరాదు. నీరు త్రాగవచ్చు. శరీరము, మనస్సు, శుద్ధ వస్త్రములతో తూర్పు ముఖముగా కూర్చొనవలె కుంకుమ పువ్వుతో కలిపిన చందనమును చేతితో తీసికొని తలకు, హృదయానికి కంఠమునకు పూసుకొని, తిలకముగా ధరించవలె. తిలకము కొద్దిగా ధరించవలె. గాయత్రీ మూర్తినిగాని, చిత్రాన్ని గాని ఉంచుకొని విధి ప్రకారం పూజించవలె. పసుపు పచ్చని పూలతో పూజ సర్వకార్యములకు వుపయోగించ వచ్చు. ప్రతిమ యొక్క ఆవరణను పసుపు రంగులో నుంచవలె. పసుపు రంగు పుష్పాలు, పసుపుతో తయారుగావించిన అక్షతలు, శనగపిండి లడ్లు మొదలయిగా గల, పసుపు పదార్థములతో భోగము కేసరి, చందనము కలిపిన తిలకము, హారతి కొరకు పసుపుపచ్చని గోఘృతము (నెయ్యి) గంధపు పొడి, ధూపముతో అధికాంశము పసుపుపచ్చని వాటితో పూజ చేయవలె.

నేత్రములను మూసి, పీతవర్ణపు ఆకాశంలో, పాలిపోయిన రంగులోనున్న సింహముపై స్వారిచేస్తూ, పసుపచ్చని వస్త్రధారిణియైన గాయత్రీ మాతను ధ్యానించవలె. పూజ సమయంలో పసుపురంగు వస్త్రములు లభ్యపడనిచో కనీసమొక వస్త్రమైన పసుపు రంగులో ధరించవలె. యీ విధమైన పీతవర్ణ గాయత్రీ దేవి పూజలో కనీసము 24 సార్లు గాయత్రీ మంత్రమును జపించవలె. అవసరమొచ్చినపుడు మనస్సులో ధ్యానిస్తూ వుండవలె. నెలలో ప్రతి పూర్ణిమ రోజు వ్రతమాచరించవలె. నిత్య ఆహారంలో ఒకదాన్ని పసుపురంగులో వుండేటట్లు చూడవలె. ఈ పీతవర్ణ సాధన దాంపత్య జీవన సుఖానికి పరమోత్తమము.

సంతానము వ్యాధిగ్రస్తులై, అల్పాయువుతో మరణిస్తున్నపుడు కేవలం పుత్రసంతానము లేక స్త్రీ సంతానము మాత్రమే కలిగినపుడు, గర్భపాతములు జరుగుతున్నపుడు, గర్భము రానపుడు వంధ్యా దోషమున్నపుడు, దీర్ఘకాలము వరకు సంతానము కలగనపుడు సోమరి, మందబుద్ధియైనపుడు దుర్మార్గుడు, దుష్టుడు, ఆజ్ఞాపుల్లంఘన చేయువాడైనపుడు కటుభాషి, కుమారియైనపుడు, ఆ తల్లిదండ్రులు వేదమాత గాయత్రీ శరణుపొంది కష్టములనుండి విముక్తులు గావచ్చు.

మా వద్ద అనేక వేల ఉదాహరణలున్నాయి: అందులో స్త్రీలు వేదమాత గాయత్రీ చరణములవద్దకు చేరి తమ అచంచల భక్తితో సంతాన సుఖమును కోరారు. భగవతీదేవి వారికి ప్రసన్నతాపూర్వకంగా సంతానాన్ని ప్రసాదించినది. మాత యొక్క భండారంలో దేనికీ కొరత లేదు. ఆమె కృపకు పాత్రులై మనుజులు దుర్లభాతిదుర్లభమైన వస్తువులను పొందగలరు. ఆమె తన దయచే నీయ లేని వస్తువేలేదు. అందులో సంతానము పొందుటకు సాధారణమైన దానిని పొందుట ఆశ్చర్యజనకముగాదు.

గర్భవతియైన స్త్రీ ప్రాతఃకాల సూర్యోదయమునకు పూర్వముగాని, రాత్రి సూర్యాస్తమయము తర్వాతగాని, తన గర్భములో నున్న సూర్యసదృశ ప్రచండ తేజమును ధ్యానించునట్టైన మనస్సులోనే గాయత్రీ దేవిని జపించిన, ఆమె కుమారుడు తేజస్వీ, బుద్ధికుశలుడు, చతురుడు, దీర్ఘజీవి మరియు యశస్వియై విలసిల్లుతాడు.

ప్రాతఃకాలమందు, కటి ప్రదేశమునందు తడిసిన వస్త్రమునుంచుకొని శాంత చిత్తములో ధ్యానావస్థిత యందుండవలె. తన యోని మార్గము నుండి గర్భాశయము వరకు వెళ్ళు గాయత్రీ ప్రకాశమైన సూర్యకిరణములను ధ్యానించవలె. ఈ సాధన వలన శీఘ్రంగా గర్భము నిలుస్తుంది. కుంతీదేవి యీ సాధన వలననే, గాయత్రీ దేవి దక్షిణ భాగమును (సూర్యభగవానుని) ఆకర్షించి, కన్యగానున్నపుడే కర్ణునికి జన్మనిచ్చినది. ఈ సాధనము కన్యలు చేయగూడదు.

సాధన నుండి లేచిన వెంటనే సూర్యునకు జలమును విడువవలె. అర్ఘ్యమిచ్చిన తరువాతనున్న కొంచెము నీరును త్రాగవలె, దీనివలన వంధ్యా స్త్రీలు గర్భవతులు గాగలరు. గర్భస్రావమవుతున్న స్త్రీలకు గాని, పుట్టిన శిశువులు మరణిస్తున్నా, గాయత్రీ సాధన, ఈ కష్టములను పోగొట్టి సంతోషప్రదమైన సంతానమునిస్తుంది.

రోగి, కుబుద్ధి, సోమరి, కొరకొరలాడెడు బాలకుని తన వొడిలో నుంచుకొని తల్లులు, హంసవాహినియై, గులాబీ పుష్పములలో నున్న, శంఖ చక్రహస్తధారిని గాయత్రీదేవిని ప్రార్థించాలి. మనసులోనే జపించవలె. తల్లిచేసేజప ప్రభావము

వాడిలోనున్న బిడ్డపై పడుతుంది. దానివలన ఆ బిడ్డ శరీరంలోను, మస్తిష్కంలోను ఆశ్చర్యజనక ప్రభావం కలుగుతుంది. చిన్న బిడ్డ అయితే సాధన సమయంలో తల్లి పాలిస్తూ వుండవలె. పెద్దవాడైనట్లయితే అతని తలపైన, శరీరంపైన తల్లి తన హస్తముతో నిమురుతూ వుండవలె. కుమారుని శుభము కొరకు గురువార వ్రతము వుపయోగకరమైనది. సాధన పరిసమాప్తి అనంతరం సూర్యునకు జలముతో అర్ఘ్యమునీయవలె. తరువాత మిగతా జలాన్ని కొంచెము బిడ్డపై చల్లవలె.

## ప్రత్యేక అవసరం కొరకు :

తన కుటుంబమునకు బంధువులకు, ప్రియజనులకు సంభవించే ఆపదలను నివారించుటకుగాని లేక నిర్వర్తింపవలసిన ఆవశ్యకత కార్యములలో సంభవించే ఆటంకములను, కష్టములను తొలగించుకొనుటకై గాయత్రీ సాధనలోనున్న దైవీ సహాయముచే కష్టముల నెదుర్కొనవచ్చు. విశేషమైన కోర్కెలు మనస్సులో నుండవచ్చు. వాటిని పొందుటకు అనేక బాధలుండవచ్చు. కాని నిర్మలమైన హృదయంతో వేదమాత గాయత్రీదేవిని ఆహ్వానించవలె. తల్లి తన ప్రియ పుత్రుని పిలుపు విని స్పందించి, పరుగెత్తుకొని వస్తుందో, అటులనే గాయత్రీ ఉపాసకులు గూడా ఆ తల్లి యొక్క అమిత కరుణను ప్రత్యక్షంగా పరిచయ ప్రాప్తిని గావించుకొనెదరు.

తొమ్మిది దినముల అనుష్ఠానము, నలభై దినముల అనుష్ఠానమీ పుస్తకంలో వేరేచోట వర్ణింపబడినది. తాత్కాలికావశ్యకత కొరకు దానిని ఉపయోగించుకొనవలె. స్వయంగా చేయలేనపుడు, ఎవరైనా గాయత్రీ విద్య తెలిసినవారు వాటిని ఆచరించ వలయును. తపశ్చర్య ప్రకరణములో వ్రాయబడిన తపశ్చర్యలు, భగవతీదేవిని ప్రసన్నం చేసుకోవాడానికి పనికివస్తాయి. ఒక సంవత్సరపు గాయత్రీ వుద్యాపన అన్ని కోర్కెలను నెరవేరుస్తుంది. ఇది తరువాత వ్రాయబడుతుంది. పురుషులకు గాయత్రీ అనుష్ఠానమెటుల సర్వప్రధాన సాధనయో, అటులనే మహిళలకు గాయత్రీ వుద్యాపన విశేష మహిమ గలది. దానిని ప్రారంభించుట కష్టమేమీగాదు. ప్రతిబంధములుగూడా యెక్కువ వుండవు సరళదృష్టిలో స్త్రీలకు మాతను ప్రసన్నం చేసుకొనేటందుకు ఉద్యాపన పుష్పమాల పరమ ప్రియమైన కానుక.

నిత్యసాధనకు గాయత్రీ చాలీసా పఠించుట స్త్రీలకు హితకారి. జంధ్యము స్థానే 'కంఠీ'(హారము) వారికి ద్విజత్వాన్ని సంప్రాప్తింపజేస్తుంది. గాయత్రీకి అధికారిణులవుతారు. సాధన ప్రారంభించడానికి పూర్వము 'ఉత్కీలనము'' గావించవలె.

# ఒక సంవత్సరపు ఉద్యాపన
## (ఇది యొక సాధన)

అనేకమంది జీవనక్రమము చాలా అస్తవ్యస్తంగా వుంటుంది. వారి పనులన్నీ సదా అపసవ్యంగా వుంటాయి. వ్యావహారిక జీవనంలోని కష్టములు వారిని ప్రశాంతంగా వుండనీయవు. తమజీవనమునకు అవసరమైన కోర్కెలలోను, సామాజిక వ్యవహారములను జరుపుటలోను, కుటుంబ సభ్యులయందు తన బాధ్యతను పూర్తి చేయడంలోను, వ్యతిరేక పరిస్థితులను చక్కబరచడంలోను, ఎదుర్కొనే కష్టములను నివారించుటకు వారి సమయము, శక్తి సర్వస్వము వ్యయమైనందున, కొంత సమయమెప్పుడైన తీరిక దొరికే ఘడియ సమీపించుచున్నప్పటికే, వారు అలసి మందులై, శక్తిహీనులై, పరిశ్రమ ఫలితంగా శిథిలమై, మూర్ఛమవుతారు.

ఆ సమయంలో, తనను నిశ్శబ్దంగా వుండవలెననే ప్రగాఢమైన కోరిక ఆఖరి కోర్కె; తన నెవ్వరు వదలి వేయకుండ, తనకు విశ్రాంతినిచ్చి తన అలసటను తొలగించవలెననే వాంఛ బలీయంగా వుంటుంది. చాలమంది వ్యక్తుల మస్తిష్కము అల్పశక్తివంతమై వుంటుంది. మామూలు దైవిక కార్యములను నిర్వర్తించుటలో గూడా వారి శక్తి పూర్తిగా నశిస్తుంది. వారి కాళ్ళు, చేతులు గూడా స్వాధీనతను కోల్పోతాయి.

సాధారణంగా ఆధ్యాత్మిక సాధకులందరికీ, ప్రత్యేకంగా గాయత్రీ సాధనకు, ఉత్సాహవంతమైన మనస్సు, శక్తి, సంపన్నమైన శరీరము అవసరము. దానివలన స్థిరంగా, దృఢంగా, ఏకాగ్రతలో, శాంతిపూర్వకంగా మనస్సు సాధనయందు లగ్నమవుతుంది. ఈ స్థితిలో గావించిన సాధన ఫలితాన్నిస్తుంది. కాని ఆ స్థితి పొందినవారెందరున్నారు? అస్థిర బుద్ధితో, అవ్యవస్థిత చిత్తంతో యేదోవిధంగా సాధనలో లగ్నము కావించిన రావలసిన సత్ఫలితాలు సంభవించవు. స్వచ్ఛతలేని మనస్సుతో జేసిన ఉపాసన స్పష్టంగా వుండదు.దానివలన సంభవించే ఫలితం గూడా నిర్దుష్టంగా వుండదు.

అటువంటి స్త్రీ పురుషులకు, సరళమైనది, మహత్వపూర్ణమైన సాధన "గాయత్రీ ఉద్యాపన". దీనిని పెక్కు కార్యక్రమాలలో మునిగి, కార్యభారమెక్కువగానున్న వారు గూడా చేయవచ్చు. చిన్న చిన్న బిందువులు కలిపితే ఘటము నిండుతుంది కొంచెము, కొంచెముగా ఆరాధన చేస్తే, కొంత కాలానికి, గొప్ప పరిమాణంలో, సాధనాశక్తి చేకూరుతుంది.

ప్రతిమాసములో, అమావాస్యమరియు పూర్ణిమ రెండురోజులు ఉద్యాపన సాధన చేయవలసివస్తుంది. ఏదో ప్రత్యేక మాసంలో పూర్ణిమ రోజు సాధన ప్రారంభించవలె. సరిగ్గా సంవత్సరం తరువాత, అదే పూర్ణిమలో ఉద్యాపన సమాప్తము గావించవలె ప్రతి అమావాస్య పూర్ణిమ రోజులలో క్రిందనీయబడిన కార్యక్రమమును కొన సాగించవలె. నియమములను పాటింపవలె.

1. గాయత్రీ ఉద్యాపన కొరకు యోగ్యుడు, సదాచారి, గాయత్రీ విద్య తెలిసిన బ్రాహ్మణుని ఎన్నుకొని, వారిని 'బ్రహ్మ' గా నియమించుకొనవలె.
2. బ్రహ్మకు ఉద్యాపన ప్రారంభిచేటపుడు అన్నము వస్త్రము, పాత్ర మరియు యధాశక్తి దక్షిణ సమర్పించి' ఈ యజ్ఞానికి యెన్నుకోవలె.
3. ప్రతి అమావాస్య పూర్ణిమలలో, సాధకునివలె, బ్రహ్మ గూడా తన నివాసస్థల మందుండి, యజమాని సహాయంతో తన కోసం, అదేవిధంగా సాధన గావిం-చవలె. యజమాని, బ్రహ్మ, సమాన నియమములను పాటించవలె. అందువలన,ఉభయ పక్షీయ సాధనలు మేళవించి, సర్వాంగపూర్ణ సాధన యొకటి ఆవిర్భవించుతుంది.
4. ఆ రోజు బ్రహ్మచర్యాన్ని పాటించుట అవసరము.
5. ఆ రోజు ఉపవాసముండవలె. తన స్థితిని, ఆరోగ్య పరిస్థితిననుసరించి, ఒక్కసారి భోజనము లేక ఫలహారము పాలు లేక నీటి మిశ్రమము ఆధారంగా ఉపవాసము చేయవచ్చు. తపశ్చర్య, ప్రాయశ్చిత్త ప్రకరణములలో దీని గురించి విస్తృత సమాచారమీయబడింది.
6. తపశ్చర్య ప్రకరణములో చెప్పబడిన తపశ్చర్యలలో ఏ ఇతర నియమములు, వ్రతపాలన చేయవలెనో, వాటిని సాధ్యమై నంతవరకు యధావిధిగా పాటించవలె. ఆరోజు క్షవరం చేయించుకొనుట పురుషులకు నిషిద్ధము. స్త్రీలకు అలంకరణ, కేశాలంకరణ,పిండి మొదలైనవి పిసుకుట వర్జనీయము.
7. ఆరోజు ప్రాతఃకాలపు నిత్యకర్మలను పూర్తి గావించుకొని, స్వచ్ఛతాపూర్వకంగా సాధన కుపక్రమింపవలె. గాయత్రీ సంధ్య గావించిన ప్రతిమనుగాని, పటమును గాని, మూర్తినిగాని ధూప, దీప, అక్షతలు పుష్పములు, చందనము కుంకుమ, నీరు, మృష్టాన్నములతో పూజ గావించవలె. అటు పిమ్మట యజమాని ఈ వుద్యాపన బ్రహ్మను ధ్యానించి మనస్సులోనే నమస్కరించాలి. 'బ్రహ్మ' గూడా యజమానిని మనస్సులోనుంచుకొని ఆశీర్వదించవలె. తరువాత గాయత్రీ మంత్ర జపము నారంభించవలె. జప సమయంలో పుస్తకారంభంలో ఇయబడిన

గాయత్రీ చిత్రాన్ని ధ్యానించవలె. వెయ్యి మంత్రజపము చేయడానికి పదిసార్లు మాలను త్రిప్పవలె. ఒక మట్టిపాత్రలో నిప్పును వుంచి, దానిలో నేతితో కలిపిన హవనద్రవ్యం వేస్తూ వుండవలె. దానివలన యజ్ఞములలో మాదిరి సుగంధ ముంటుంది. ప్రక్కనే నేతి దీపము ప్రజ్వరిల్లుతూ నుండవలె.

8. జపము పూర్తియైన వెంటనే నేతితోగాని, కర్పూరంతోగాని హారతినీయవలె. హారతి తరువాత భగవతీ గాయత్రీ దేవికి మృష్టాన్నభోగము సమర్పింపవలె. దానిని ప్రసాదంగా సమీప వ్యక్తులకు పంచవలె.

9. పాత్రలోని జలమును సూర్యునకర్ఘ్యము గావించవలె.

10. ఈ కార్యక్రమమంతా రెండు గంటలలో పూర్తవుతుంది. పదిహేను రోజుల తరువాత మరలా రెండు గంటలు సమయం గడుపుట కష్టమేమీగాదు. ఎక్కువ పనులున్న వ్యక్తి, రెండు గంటలకు లేచి సూర్యోదయం వరకు తన పనిని పూర్తి చేసుకోవచ్చు. సాయం సంధ్యా సమయంలో సమయం దొరికితే ఆ సమయంలో గూడా సాధారణ రీతిలో చేసుకోవచ్చు. సంధ్యా పూజావశ్యకత లేదు. ప్రాతః కాలమో లేక సంధ్యా సమయమో నిశ్చయించు ·కొనవలె యజమాని, బ్రహ్మ ఇద్దరూ కలసి సాధన గావించుటనవసరము.

11. యెప్పుడైన అనారోగ్యము సూతకము, ఆకస్మిక కార్యము సంభవించిన కారణమున సాధన చేయలేకపోతే, రెండవసారి, రెండుసార్లు చేసి, (తరుగు) క్షతి పూర్తిగావించుకోవలె. లేక యజమాని కార్యము బ్రహ్మ లేక బ్రహ్మ కార్యము యజమాని పూర్తి చేయవచ్చు.

12. అమావాస్య పూర్ణిమలే గాకుండా, యితర సమయంలో గూడా గాయత్రీ జపిస్తూనే వుండవలె. అధికంగా చేయలేకపోతే, స్నానానంతరం గాని, స్నానము చేసేటపుడుగాని '4' సార్లు మనస్సులో గాయత్రీ మన్త్రాన్ని జపించవలయును.

13. ఉద్యాపనపూర్తి యైన తరువాత అదే పూర్ణిమ రోజున గాయత్రీ పూజ హవనము జపము బ్రాహ్మణ భోజనము గావించవలె. బ్రాహ్మణులకు చిన్నదిగాని, లేక పెద్ద గాయత్రీ పుస్తకాన్ని దక్షిణలో సమర్పింపవలె. గాయత్రీ పూజకొరకు, తన శక్త్యానుసారం, బంగారంతోగాని, వెండితోగాని, రాగితోగాని గాయత్రీ ప్రతిమను తయారు గావించుకొనవలె. ప్రతిమ, వస్త్రము, పాత్ర, దక్షిణ సమర్పించుకొని బ్రహ్మకు వీడ్కోలు నీయవలె.

ఈ గాయత్రీ వుద్యాపన, ఆరోగ్యమును, ధనమును సంతానప్రాప్తిని గావించి సుఖశాంతులు గల్గునట్లు రక్షిస్తుంది. ఆపదలను నివారించుతుంది. శత్రుత్వాన్ని, ద్వేషాన్ని పోగొడుతుంది. సద్బుద్ధిని, వివేకాన్ని ఉత్పన్నము గావిస్తుంది. మానసిక శక్తిని అభివృద్ధిగావిస్తుంది. ప్రత్యేక కార్యాన్ని తలంచుకొని, సఫలంగావాలంటే, గాయత్రీ కృపకొరకు గాయత్రీ వుద్యాపన ఉత్తమమైన తపస్సు. దీనివలన భగవతీదేవి ప్రసన్నత చెంది సాధకుని మనోరథాన్ని పూర్తిగావిస్తుంది.

సఫలత ప్రాప్తించిన యెడల అభీష్టసిద్ధి కలిగినపుడు, సుఖము ప్రాప్తించినపుడు, ఆ సంతోషంతో, భగవతీదేవికి కృతజ్ఞత ప్రకటించుటకు ఉద్యాపన చేస్తూవుండవలె. గీతలో పరమాత్మ యిలా బోధించారు :

"దేవా భావయతానేన తేదేవా భావయన్తువః
పరస్పరం భావయన్తః శ్రేయః పరమ వాప్స్య థ I

"యీ యజ్ఞము ద్వారా మీరు దేవతల నారాధించండి, ఆదేవతలు మిమ్ములను రక్షించెదరు. యీ విధంగా పరస్పరం ఆదరించుకొన్నందున పరమ కళ్యాణ ప్రాప్తి జరుగుతుంది.

## గాయత్రీ సాధన వలన అనేక ప్రయోజనములు సిద్ధిస్తాయి

గాయత్రీ మంత్రము సర్వోపరి మంత్రము. దీనికన్నా గొప్పది మరియొకటి లేదు. యీ ప్రపంచంలో ఇతర మంత్రములచే కాని పనులు నిశ్చయంగా గాయత్రీ మంత్రముతో సమకూడుతాయి. యోగ సాధకులు, దక్షిణమార్గం ద్వారా వేదోక్త పద్ధతి ననుసరించి యితర మంత్రములద్వారా, యే సాఫల్యాన్ని పొందుతారో, ఆకార్యములన్నీ గాయత్రీ మంత్రము ద్వారా పూర్తిగా గలవు. ఆదేవిధంగా వామమార్గీయులైన తాంత్రికులు తమ తాంత్రిక ప్రణాళికల ద్వారాయే కార్యములను సలుపుతారో, అవి గూడా గాయత్రీ మంత్రము ద్వారా చేయవచ్చు.

ఇది యొక ప్రచండశక్తి. దీనిని దేనిపై ప్రయోగించినా, అక్కడ చమత్కారమైన ఫలితాలు లభిస్తాయి.

కామ్యకర్మలకొరకు, సకామప్రయోజనాలను ఆశించునపుడు అనుష్ఠానము అవసరము. లక్షా యిరువది యైదు వేల పూర్ణానుష్ఠానము, 24 వేల ఆంశిక

అనుష్ఠానము తమ, తమమర్యాద ననుసరించి ఫలితాలనిస్తాయి. "బెల్లము యెంత యెక్కువేస్తే అంత యెక్కువ తీపి" అనే సామెత యిచట గూడా చరితార్థ మవుతుంది.

సాధన తపశ్చర్యల ద్వారా సంతరించుకొన్న ఆత్మబలము యే కార్యముపై వినియోగించినప్పటకీ, దాని ప్రతిఫలముంటుంది. తప్పకుండా. తుపాకీ యొక్క ఉపయోగం దానిలో నున్న అధిక కార్ట్రూస్ల పైనుంటుంది. గాయత్రీ ప్రయోగవిధి ఒకవిధంగా ఆధ్యాత్మిక తుపాకీ. తపశ్చర్య సాధన ద్వారా సంగ్రహించబడిన ఆత్మిక శక్తి కార్ట్రూస్ల పేటిక. రెండూ కలిసినపుడే లక్ష్యచ్ఛేదన జరుగుతుంది.

కొందరికి ప్రయోగవిధి తెలిసివుండవచ్చు. కాని వారి వద్ద సాధనాబలము లేనట్లైతే, ఖాళీ తుపాకీతో గుర్రమును తొందరగా పరుగెత్తించి గురి తప్పకుండా లక్ష్యమును ఛేదిద్దామను కొన్నట్లవుతుంది. అటులనే తపోబలమున్న వ్యక్తి యైనప్పటికీ, కామ్య ప్రయోజనానికి, విధివశాత్తు తన తపోబలాన్ని వుపయోగించే విధము తెలియ నట్లైతే, తుపాకీ తూటాల పెట్టె యొక్క, కట్టిన ముడి విప్పకుండా, శత్రువుల వైపు వాటిని విసరి శత్రుసేనను సంహరించడానికి ప్రయత్నించి నట్లవుతుంది. ఇది హాస్యాస్పద మైన పద్ధతి.

ఆత్మ బల సంపాదన కొరకు యెంత యెక్కువ సాధన గావిస్తే అంత మంచిది. గాయత్రీ మంత్రాన్ని సిద్ధి పొందిన వారు 5 రకములగా నుంటారు.

1) కనీసము 12 సంవత్సరాలు కనీసము రోజుకొకమాల గాయత్రీ జపమునిత్యము గావించినవారు

2) గాయత్రీ బ్రహ్మ సంధ్యను తొమ్మిది సంవత్సరములు నిత్యము చేసినవారు.

3) బ్రహ్మచర్యాను ష్ఠానముగావించుతూ 5 సంవత్సరములు రోజుకు వేయి చొప్పున గాయత్రీ మంత్ర జప మొనర్చినవారు.

4) 24 లక్షల గాయత్రీ అనుష్ఠానము పూర్తిగా నొనరించిన వారు

5) ఐదు సంవత్సరములు విశేషంగా గాయత్రీ జపాన్ని జపించినవారు.

పైన చెప్పబడిన వాటిలో యేదైన నొక్కటి కనీసంగాని, లేక అధికంగా తపశ్చర్యలను పూర్తిగావించితే, ఆ పూర్తిగావించిన వ్యక్తి గాయత్రీ మంత్రమును కామ్యకర్మల కొరకు ప్రయోగించి సఫలత్వము నొందగలడు.

24 లక్షల అనుష్ఠానపురాశి కలిగివున్న వ్యక్తి గూడా తన శక్త్యానుసారము పరిమిత పరిధివరకు ఫలితాన్ని సాధిస్తాడు.

## విషనివారణ మరియు రోగనివారణకు :

స్వయంగా రోగగ్రస్తుడై నప్పటికి యేస్థితిలో నైనా వున్నప్పటికీ, మనస్సులో గాయత్రీ జపము చేయవలె. ఒక మంత్రము పూర్తియైన వెంటనే, రెండవ సారి మంత్రము నుచ్చరించే ముందు 'బీజమంత్రం' తో సంపుటీకరణము చేయవలె. అనగా ఆ బీజాక్షరమును మధ్యలో జపించవలయును.

చలి, నెమ్ము ప్రాధాన్యము గలిగిన (కఫ) రోగములలో 'ఐం' బీజమంత్రాన్ని వుచ్చరించవలె. పిత్తరోగములలో (గాస్) గూడా 'ఐం' బీజమును అజీర్తి, విషము, వాతరోగములలో, "హ్రీం" బీజమును ప్రయోగించవలె. స్వస్థత, రోగరహితమటకు వృషభవాహిని, హరితవస్త్రధారిణి యైన గాయత్రీ దేవిని ధ్యానించవలె.

ఇతరులకు ఆరోగ్యాన్ని రోగనివారణను కలిగించడానికి గూడా ఈ బీజ మంత్రములను కలిపి ధ్యానప్రయోగాన్ని చేయవలె. రోగియొక్క పీడిత అంగములపై, పైనచెప్పబడిన ధ్యానమును, జపమును చేస్తూ చేతితో నిమురుతూ వుండి, జలము అభిమంత్రించి రోగిపై పోయడంగాని, చిలకరించడం గాని చేయవలయును. యీ పరిస్థితులలో తులసీ పత్రములు నల్లమిరియములు గంగాజలముతో మర్దించి ఔషధపు రూపములో నీయవలె. యీ వుపచారము యే రోగికైనా, యే రోగానికైనా యిచ్చిన యెడల ప్రయోజనం లేకుండా పోదు.

సర్పము, తేలు, కందిరీగ, తేనెటీగ మరియు విషజీవుల కాటు జరిగినపుడు చాలా బాధ కలుగుతుంది. విషము శరీరమంతా ప్రాకినపుడు మరణము సంభవించడం కూడా కద్దు. యీ విధమైన సంకటములు సంభవించినపుడు గాయత్రీ శక్తి ద్వారా సేవ, ఉపచారము చేయవచ్చు.

పిప్పళ్ల సమిధలతో గాని, రావి సమిధలతో గాని హవనము చేసి ఆభస్మాన్ని భద్రపరచుకొనవలె. తమనాసికలలో నడిచే స్వరాన్ననుసరించి, ఆచేతి కొంచెము భస్మాన్నుంచుకొని రెండవచేతితో అభిమంత్రిస్తూ , మధ్యలో 'హూం' బీజమంత్రాన్ని సంపుటీ కరణము గావిస్తూ, రక్తవర్ణ, అశ్వారూఢ గాయత్రీని ధ్యానిస్తూ ఆభస్మాన్ని విషజంతువుచే వేయబడిన కాటుపై రెండు, లేక నాలుగు నిముషములు రుద్దవలె. బాధ మాయమవుతుంది. ఆశ్చర్యము కలుగుతుంది.

సర్పపు దంష్ట్ర చిహ్నముపై రక్తచందనముతో గావించిన హవన భస్మము నుంచవలె, అభిమంత్రించిన నేతిని త్రాగించవలె. ఆవాలను అభిమంత్రించి వాటిని పిండిచేసి దశేంద్రి యద్వారముల నద్ద కొంచెము కొంచెము పూయవలె. యీ విధంగా చేస్తే సర్ప విషమునుండి విముక్తి కలుగుతుంది.

గాయత్రీ మంత్రము, ముఖ్యంగా బుద్ధిని సమున్నతముగావించు నట్టి మంత్రము. మందబుద్ధులు, జ్ఞాపక శక్తి తక్కువగానున్నవారు, యీ మంత్రము వలన అధిక ప్రయోజనాన్ని పొందగలరు. బాలుడు పరీక్షలోను తీర్ణుడు కాలేనపుడు, పాఠములను సరిగా గ్రహించలేనపుడు, కంఠతా చేయలేనపుడు, ఆతనికి క్రింద చెప్పబడిన ఉపాసన ఉపయోగకారి.

నీళ్లలో తడిపిన బాలుని తలపై సూర్యోదయమపుడు ప్రథమ కిరణములు పడేటట్లు చేయవలె. తూర్పువైపు ముఖముంచి అర్ధనిమీలిత నేత్రములతో సూర్యదర్శనము చేసుకుంటూ, మూడుసార్లు "ఓం"ను ఉచ్చరించి గాయత్రీ మంత్రము జపించాలి. కనీసము '108' అవశ్యము జపించవలె. తరువాత 'అరచేతులను' సూర్యునివైపు చూపి అగ్నికాలుతున్న విధముగా చేయవలె. యీ విధంగా చేస్తూ 12 గాయత్రీ మంత్రములు జపించి, అరచేతులను మర్దించవలె. అటులమర్దించగా వేడి పుడుతుంది.ఆ వేడి అరచేతులను ముఖము, నేత్రములు నాసిక, కంఠము, చెవులు, తల, మొదలైన సమస్త శిరోభాగముల పై స్పృశించవలె.

## రాజకీయ సఫలతకు :

ప్రభుత్వపు కార్యముగాని, కోర్టుకేసులుగాని, పదవీ స్వీకరణగాని పదవి కాంక్షించిన వారికి విజయము చేకూరవలెనంటే గాయత్రీ ఉపయోగించ వచ్చు. అధికారి సమ్ముఖమునకు వెళ్లిన సమయంలోగాని, లేక వినతి పత్రమును సమర్పించినపుడుగాని, యేశ్వాస (స్వరము) పనిచేస్తున్నదో గమనించవలె. దక్షిణ స్వరము పనిచేస్తున్న యెడల పీత వర్ణపు జ్యోతిని మనస్సులోధ్యానించవలె. లేక వామ స్వరమైన పచ్చని రంగుగల్గిన ప్రకాశమును ధ్యానించవలె.

మంత్రములో సప్తవ్యాహృతులను (ఓం భూః, భువః, స్వః, తపః జనః మహః, సత్యమ్) జోడించి, పన్నెండును మంత్రములను మనస్సులో జపించవలె. యేస్వరమాడుతున్నదో ఆ చేతి యొక్క 'అంగుష్ఠము (బొటనవ్రేలు) గోరుపై దృష్టి నుంచవలె. భగవతీ గాయత్రీ మాతను మానసికంగా ధ్యానిస్తూ, ఆరాధిస్తూ, ప్రార్థిస్తూ రాజద్వారములో ప్రవేశించిన విజయము చేకూరుతుంది.

## దరిద్ర నాశనమునకు :

దరిద్రము, కష్టములు,ఋణభారము, పనిలేకుండుట, వస్తువుల కొరత అధికఖర్చు ఆగిపోయిన పనులు, వ్యర్థ చింతన నుండి ముక్తి పొందడానికి గాయత్రీ సాధన యెక్కువ

సహాయపడి, సిద్ధిని కలుగజేస్తుంది. యీ సాధనవలన వర్తమాన ఆర్థిక విషమయము నుండి విముక్తి గలిగి, సాధకునకు సంతోష జనక స్థితిని పొందేటట్లు తయారు చేస్తుంది. దరిద్ర నాశనము కొరకు 'శ్రీ'శక్తి గాయత్రీలో నున్నది గాన, దాని ఉపాసించవలె. మంత్రముచివర మూడు సార్లు 'శ్రీం' బీజమును సంపుటీకరించవలె (అనగా చివరచేర్చి ఉపాసించాలి). సాధన సమయంలో పీతవర్ణపు (అనగా పసుపుపచ్చని వస్త్రములు, పీతవర్ణపు పూలు పీతరంగు యజ్ఞోపవీతము, పీత తిలకము, పసుపుపచ్చని ఆసనమును యోగించవలె. శుక్రవారమునాడు శరీరమును పసుపు కలిపిన నూనెతో మాలీసు గావించవలె. ఆదివారమునాడు ఉపవసించవలె. పసుపుపచ్చని వస్త్ర ధారిణి,గజారోహిణి యైన గాయత్రీ మాతను భావించి ధ్యానించవలె. పసుపు వర్ణము లక్ష్మీదేవికి ప్రతిరూపము. భోజనంలో గూడా పసుపురంగు పదార్థములను ప్రధానంగా తీసికొనవలె. యీ విధంగాచేసిన యెడల ధనవృద్ధి, దారిద్ర్య నాశనము కలుగుతుంది.

## సుసంతతి ప్రాప్తి కోసం :

సంతాన మెవరికిలేదో, సంతతికలిగి మరణిస్తారో, శిశువులు రోగగ్రస్తులైనా, గర్భస్రావములు జరుగుతున్నా కేవలము స్త్రీ సంతతియే కలుగుతున్నా తల్లిదండ్రులకు దుఃఖము గలుగుట స్వాభావికము. దీని నుండి భగవతీ గాయత్రీ కృప వలన విముక్తి పొందవచ్చు.

యీ సాధనలో స్త్రీ పురుషులిద్దరూ కలిసి ప్రయత్నించుట చాలా మంచిది. కేవల మొక్కరే భారాన్ని భుజస్కంథముల పైమోపినందున అంశిక ఫలితమే దక్కుతుంది.

ప్రాతః కాలమున నిత్య కర్మలను పూర్తి గావించుకొని, పూర్వాభి ముఖులై (తూర్పు దిక్కు వైపు ముఖముంచి) సాధనకు కూర్చొనవలె. నేత్రములను మూసికొని, శ్వేత భూషణాలంకృత పన్నెండు సంవత్సరముల బాలిక రూపిణి, చేతియందు కమలములను ధరించి నట్టి, గాయత్రీని భావించి ధ్యానించవలె 'య్యైం' బీజమును జోడించి గాయత్రీ జపమును 'చందనపు' మాలతో చేయవలె.

నాసికతో శ్వాసను పీల్చి పొత్తికడుపువరకు తీసుకు వెళ్లవలె. పొత్తికడుపును పట్టినంత గాలితో నింపవలె. శ్వాసను ఆపి 'య్యైం' బీజమును సంపుటీకరించిన గాయత్రీ మంత్రమును కనీస మొక్కసారి గాని, మూడుసార్లు అధికంగా గాని జపించవలె. తరువాత నెమ్మదిగా శ్వాసను వెలుపలకు పంపవలె.

యీ విధంగా వెన్నెముకలోనికి గాయత్రీ శక్తిని ఆకర్షించి, ధారణగావించి ప్రాణాయామములు పదిసార్లు చేయవలె. తదనంతరము తన యొక్క వీర్య కోశములో

గాని లేక గర్భాశయములో గాని శుభ్ర (తెల్లని) వర్ణ జ్యోతిని భావించి ధ్యానించవలె. ఆరోగ్యకరమైన అందమైన, తేజస్వియైన, గుణవంతులైన, బుద్ధిమంతులైన, సంతానము కలుగుటకు యీ సాధన ప్రయోజనకారి.

యీ సాధన గావించు సమయంలో ప్రత్యేకంగా ఆదివారంనాడు అన్నము పాలు, పెరుగు మొదలైన కేవలము శ్వేత వస్తువులతో భుజించవలె.

## శత్రుసంహారము :

ద్వేషము, కలహము సంభవించినపుడు, కోర్టులో కేసు పెట్టబడినపుడు, వైమనస్య మేర్పడినపుడు వాటిని తొలగించుటకు, అత్యాచారము, అన్యాయము జరిగినపుడు, దురాక్రమణచేయువారి మనోవృత్తిని హరించుటకు ఆత్మకు సమాజానికి శాంతి కలుగచేయవలసి నపుడు నాలుగు 'క్లీం' బీజసంపుటి సమేతంగా, రక్తచందనమాలతో, పశ్చిమాభిముఖంగా కూర్చుండి గాయత్రీ జపము గావించవలె.జపకాలంలో యజ్ఞ భస్మపు తిలకమును ధరించవలె. ఉన్ని ఆసనముపై కూర్చుండవలె. యెర్రని వస్త్రములు ధరించి, సింహారూఢి, ఖడ్గహస్తి, భయంకరముఖము కల్గిన, దుర్గావేషధారిగా గాయత్రీ దేవిని భావించి ధ్యానించవలయును.

ద్వేష దుర్భావములను నివారించవలసిన వ్యక్తి యొక్కపేరును, రావి ఆకుపై రక్తచందనపు సిరాతో, దానిమ్మ కొమ్మను కలముగా చేసుకుని వ్రాయవలె. యీ ఆకును తల్లక్రిందులుగావుంచి, ప్రతిసారి మంత్రమును జపించిన తరువాత జలపాత్ర నుండి చిన్న చెంచాతో నీరుతీసికొని ఆ ఆకుపైనుంచవలె. యీ విధంగా 108 మంత్రములు జపించవలె. దీనివలన శత్రువు యొక్క స్వభావములో పరివర్తన కలుగుతుంది. ఆతని ద్వేషించే సామర్థ్యము నశిస్తుంది.

## భూతబాధ శాంతించుటకు :

కొన్ని మనోవైజ్ఞానిక కారణములవలన, సాంసారిక వైపరీత్యముల వలన ప్రేతాత్మల కోపములో అనేక ఉపద్రవములు కలుగుతాయి. కొంతమంది ఉన్మాదులవలె ప్రవర్తిస్తారు. వారి మస్తిష్కములపై వేరొక ఆత్మ ఆధిపత్యాన్ని వహించడం గోచ రిస్తుంది. దీనికి భిన్నంగా మనుష్యుడుగాని, పశువుగాని చిత్రంగా రోగముచే బాధ నొందుట జరుగుతుంది. మామూలు రోగం కన్నా భిన్నమైన రోగమిది. భయంకరా కృతులు గోచరించడం, అదృశ్య మనుష్యునిద్వార చేయబడిన క్రియలు భూత బాధకు నిదర్శనములు.

దీని నివారణ గాయత్రీ యజ్ఞము సర్వశ్రేష్ఠము. సత్వగుణ హవన సామాగ్రి విధి పూర్వక యజ్ఞములు చేయవలె. రోగిని సమీపమున దగ్గరగా కూర్చుండనీయవలె. హవన అగ్నిచే కాగిన నీళ్లను రోగిచే త్రాగించవలె. ఆరిన హవన భస్మమును సురక్షితంగా నుంచుకొనవలె. అకస్మాత్తుగా భూత బాధ కలిగినపుడు యీ భస్మాన్ని అతని హృదయముపై కంఠమున, మస్తకముపై, నేత్రములపై, చెవులపై, ముఖమునకు ముక్కుపై పూయవలె.

## ఇతరును ప్రభావితులను గావించుటకు :

తనకు వ్యతిరేకంగా ప్రవర్తించే వ్యక్తిని, అనుకూలంగా చేసుకొనుటకు, తనపై ప్రేమ, అభిమానము కలిగేటందుకు గాయత్రీ ద్వారా ఆకర్షించవచ్చు. వశీకరణము ఘోర తాంత్రిక చర్య ద్వారా గావించవచ్చు. కాని 'మంబ కీయ ఆకర్షణ' – దీనివలన యితరులమనస్సును తనవైపు మరల్చుకొనుటకు, సద్భావనతో ఆకర్షించుకొనుటకు, గాయత్రీదేవి 'దక్షిణమార్గ' యోగసాధన గావించవచ్చు.

గాయత్రీ జపాన్ని మూడుప్రణవములు (ఓం, ఓం, ఓం) జోడించి చేయవలె. తన 'త్రికుటి' యందు (మస్తిష్కపు మధ్యభాగము) నుండి యొక నీలవర్ణ విద్యుత్ తేజపు త్రాడువలె సాగి శక్తిని విరజిమ్ముతూ, ఆకర్షించ వలసిన వ్యక్తిని చేయునట్లుగా చేసినట్లుగా చేసి, అతని చుట్టూ వలయముగా తిరుగు నట్లు చేసి బిగించ గలిగినట్లుగా ధ్యానించవలె.యీ విధంగాబంధింపబడిన వ్యక్తి అర్థ నిద్రితావస్థలో నెమ్మది నెమ్మదిగా తనకై ఆకర్షించబడుతాడు. అతని ముఖంలో అనుకూలితా ప్రసన్నత గోచరిస్తుంది. ఆకర్షణ కొరకీ ధ్యానము అతి ప్రభావశాలి.

యితరుల మనస్సులో, మస్తిష్కంలో అనుచితమైన ఆలోచలను దూరము గావించి, వుచితములైన ఆలోచనలు కలగజేయడానికి, శాంతచిత్తంతో ఆయితర వ్యక్తి అఖిల నీలాకాశంలో నిద్రిస్తున్నట్లు భావించుకొని, అతని విచారములను తొలగించి, మంచి ఆలోచలను నింపు తున్నట్లు ధ్యానించవలె. యీ ధ్యాన సాధన సమయంలో తన శరీరము గూడా వదులుగా నుండవలె నీల వస్త్రముచే మూయబడి యుండవలె.

## రక్షాకవచము :

మంచిరోజున (శుభదినమున) ఉపవాసముండి, నాగకేశము, కస్తూరి, జాజికాయ, జాపత్రి, గోరోచనము యీ ఐదు వస్తువుల మిశ్రముతో తయారుచేయబడిన సిరాతో, దానిమ్మ పుల్లతో తయారు చేసిన కలముతో,ఐదుసార్లు ఓం, ఓం, ఓం, భం,భం,తో

కలిపి గాయత్రీ మంత్రాన్ని (పాలిష్) నునుపు చేయని కాయితంపైగాని, భోజపత్రంపై గాని వ్రాయవలె. తరుహాతవెండి తాయత్తులో నుంచి, ధరించిన వారికి అన్ని విధముల రక్షణ లభిస్తుంది. రోగమునుండి విముక్తి, అకాలమృత్యువు లేకుండుటకు శత్రుభయము తొలగుటకు, చోర బాధలు, కష్టములు, కలుగకుండుటకు, చెడ్డ రోజులు గడుచుటకు, కలహ నివారణకు, భయము, రాజదండన నుండి తప్పించుకొనుటకు హింస కలుగుటకై చేసిన హోమము నుండి కాపాడబడుటకు యీ కవచము రక్షగా నుంటుంది. దీని ప్రతాపము వలన, ప్రభావముచే శారీరక, ఆర్థిక, మానసిక సుఖములు వృద్ధి చెందుతాయి.

పైన చెప్పబడిన విధముగా, గాయత్రీ మంత్రాన్ని లిఖించి కంచుతా యెత్తులో నుంచి, ప్రసూతి సమయంలో కష్ట ప్రసవము చే బాధ పడు స్త్రీకి చూపి, నీటిలో కడిగి ఆనీటిని త్రాగించిన, సుఖప్రసవము శీఘ్రంగా జరుగుతుంది.

## దుశ్శకున, దుర్ముహూర్త పరిహారము :

సాధారణంగా అపుడపుడు, యేపని చేయదలచినా, వెళ్లదలచినా ఆసమయంలో నున్న శకునముగాని, ముహూర్తముగాని సుముఖముగా లేని కారణమున కార్యము కొనసాగించుటకు సంకోచము కలుగుతుంది. ఆ సమయలలో 108 సార్లు (ఒకమాల) గాయత్రీ జపంచేసి కార్యమును ఆరంభించ వచ్చు. అందువలన, అన్ని అరిష్టములు, కుశంకలు మటుమాయ మవుతాయి. అరిష్టములు సంభవించవు. వివాహము జరుగకుండ, తనజాతి వధువు గాని వరుడు గాని లభించనపుడు, వివాహముహుర్తములో సూర్యుడు, బృహస్పతి, చంద్రుడు మొదలైనగ్రహములకు నీచత్వము పీడ సంభవించినపుడు, వెయ్యి గాయత్రీ జపము చేసి లఘు అనుష్ఠానము చేసిన యెడల ఆ పీడ తొలుగుతుంది, అపుడే వివాహముచేయవలె. ఆ వివాహము జోతిష సమ్మత మైన వివాహము మాదిరి నిర్మలమైనదిగా భావించవలె.

## దుస్స్వప్న ఫలనాశనమునకు :

రాత్రిగాని పగలుగాని నిద్రించినపుడు భయంకర స్వప్నములు గోచరిస్తాయి. వాటి వలన స్వప్నకాలములో గూడా వ్యాకులత, దుఃఖము కలుగుతుంది. నిద్ర మేల్కొనిన తరువాత గూడా ఆ స్వప్నము స్మరణకు వచ్చి మనస్సును ఆందోళనకు గురిచేస్తుంది. అటువంటి స్వప్నములు అరిష్టానికి సాంకేతాలు. అటువంటి స్వప్నములు కలిగినపుడు సప్తాహము (7 రోజులు) పది పదిమాలలు గాయత్రీ జపము చేయవలె.

గాయత్రీ దేవిని పూజించవలె. గాయత్రీ సహస్ర నామము గాయత్రీ చాలీసా దుస్వప్న ప్రభావములను నాశనము చేస్తాయి

పైన పంక్తులలో కొన్ని ప్రయోగములు మాత్రమే సూక్ష్మంగా చెప్పబడినాయి. అనేకవిషయములలో అనేక పద్ధతులలో గాయత్రీ ఉపయోగ పడుతుంది. వాటి పని చాలా విస్తృతమైనది. చిన్న చిన్నవాక్యములలో వాటిని వ్రాయడందుర్లభము.వానిని స్వయంగా అనుభవించవలసినదే. లేక అనుభవజ్ఞుడైన ప్రయోక్త ద్వారా ప్రదర్శింబడిన తెలియవలసినదే. గాయత్రీ మహిమ అపారము. ఆమె కామధేనువు. గాయత్రీ సాధన చేయు వ్యక్తి యేనాటికి నిరాశ చెందడు. అతనికి గాని,ఆమెకు గాని నిరాశ కలుగదు.

## గాయత్రీ మంత్రపు అర్థ చింతన

ఓం భూః ర్భువః స్వః తత్స వితుర్వ రేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనఃప్రచోదయాత్

| | |
|---|---|
| ఓం | : బ్రహ్మ |
| భూః | : ప్రాణ స్వరూపము (భూలోకానికి ప్రతీక) |
| భువః | : దుఃఖనాశకము (భువర్లోకానికి ప్రతిబింబము) |
| స్వః | : సుఖ స్వరూపమైన (స్వర్గానికి ప్రతిరూపము) |
| తత్ | : ఆ, అది, ఆశక్తి |
| సవితుః | : తేజస్వి, ప్రకాశవంతుడు (సూర్యుడని గూడా అర్థమున్నది) |
| వరేణ్యం | : శ్రేష్ఠుడైన, శ్రేష్ఠమైన |
| భర్గో | : పాపనాశకము. (ఈశ్వరుడని గూడా అర్థము) |
| దేవస్య | : దివ్యమైన, ఇచ్చునటువంటివాడు |
| ధీమహి | : ధారణ గావించి, (మనస్సులో, ఆత్మలో భావించి |
| ధియో | : బుద్ధిని |
| యో | : యేది |
| నః | : మనయొక్క |
| ప్రచోదయాత్ | : ప్రేరేపించుగాక ! |

గాయత్రీ మంత్రపు అర్థమును చింతించుట వలన అంతఃకరణములో మనుష్యుడు దైవత్వము వైపుప్రయాణించుటకు అవసరమైన తత్వములు విజృంభిస్తాయి. ఆ భావము చాలా శక్తివంతమైనది. ఉత్సాహప్రదమైనది సత్వగుణప్రధానమైనది. సాటిలేనిది ఆత్మబలమును పెంపొందుచునట్టిది యీ భావములను నిత్యమూ కొంచెము సేపు మననము చేయవలె.

మననము చేయుటకు కొన్ని సంకల్పములు క్రింద నీయబడినవి. యీ శబ్దములను కండ్లు మూసికొని మనస్సులోనే పునః ఉచ్ఛరించవలె. కల్పనా శక్తితో, భావుకతతో, మానస చిత్రంలోని మనోలోకంలో యెక్కువగా అంకితముగావించు కొనవలె.

1. భూః లోకము భువ ర్లోకము స్వర్గలోకము, యీ మూడు లోకాలలో 'ఓం' పరమాత్మ నిండివున్నాడు. యీ సమస్త విశ్వ బ్రహ్మాండము పరమాత్మ యొక్క సాకార స్వరూపము. అణువణువునా భగవంతుడున్నాడు. సర్వవ్యాపకుడైన పరమాత్మను సర్వత్రా దర్శిస్తూ, చెడు కర్మలను కువిచారములను ఎల్లపుడూ దూరంగావుంచవలె. సంసారపు సుఖశాంతులను, శోభను పెంపొందింపజేసేటందుకు పరమాత్మకు నిజమైన పూజచేయవలె.

2. తత్ - "యీ పరమాత్మ, సవితుః - తేజస్వి,వరేణ్యా-శ్రేష్ఠ, భర్గో- పాప రహితము మరియు దేవస్య-దివ్యమైనది. దానిని అంతః కరణయందు ధారణ గావించుకొనుచున్నాను. యీగుణ సంపన్నుడైన భగవానుడు నా అంతః కరణ మందునెలకొని నన్ను తేజస్విగాను శ్రేష్ఠునిగాను పాపరహితునిగా, దివ్యునిగా నొనరించును.నేనుప్రతిక్షణము యీ గుణములచే యోగ్యుడనగుచున్నాను. యీ రెండు నామస్తిష్కము నందు నా శరీరపు ప్రతికణమునందు వృద్ధి పొందుగాక. యీ గుణములు కలయిక జరుగుతుంది."

3. "ఆ పరమాత్మ, నః మనయొక్క, ధియో బుద్ధిని, ప్రచోదయాత్- సన్మార్గమువైపు ప్రేరేపించుగాక.మనందరకూ, మనస్వజనుల .., పరిజనులకూ బుద్ధి సన్మార్గమువైపుపయనించు గావుత. యీ ప్రపంచము నందు అన్నిటకంటె మిన్నయైన ఐశ్వర్య సుఖాలు, భోగములు మొదలైనవి, అది మాత యొక్క ఆశీర్వచనముచే సద్బుద్ధిని పొంది, యీ జీవితమందే స్వర్గీయ ఆనందములనుభవించెదముగాక. మానవ జన్మ సఫలమగు గావుత.

పైన పేర్కొనబడిన మూడు భావములను నెమ్మది నెమ్మదిగా చింతనా సంకల్పములుగా మననము గావించుకొనవలె. ప్రతియొక్క శబ్దముపై కొంచెము సమయము ఆగి ఆ శబ్దపు కల్పనా చిత్రమును మనః ఫలకము ముద్రించు కొనవలె.

యీ శబ్దమును పలుకునపుడు భూః, భువః స్వః పరమాత్మ మూడు లోకములయందు వ్యాపించియున్నాడని, మనము పాతాళలోకము పృథ్వీలోకము స్వర్గములోకమును పూర్తిగా మనస్సుతోదర్శించుతూ ఆలోకములలో వేడి, ప్రకాశము, విద్యుల్ శక్తి, ప్రాణుల మాదిరిగా పరమాత్మ సర్వత్రా వ్యాపించి యున్నాడని కల్పనా సంకల్పమును గావించవలె. యీవిరాట్ బ్రహ్మాండము, యీశ్వరుని యొక్క ప్రత్యేక జీవిత జాగృతసాకార ప్రతిమ.

గీతలోఅర్జునునకు భగవానుడేవిధంగా తనవిరాట్ స్వరూపాన్ని చూపాడో ఆవిధంగా మనము మనయొక్క కల్పనాలోకంలో మానసిక చక్షువులతో ఆ మహానీయుని బ్రహ్మాండవిరాట్ స్వరూపమును దర్శించవలె. హృదయంనిండా విరాట్ బ్రహ్మను, విశ్వపురుషుని తృప్తిగా, గాంచవలె. నానలువైపు లా పరమాత్మయే, పరమాత్మ మాత్రమే యున్నాడని భావించవలె. అట్టి మహాశక్తి సర్వత్రా, మనచుట్టూ వ్యాపించి యున్నపుడు చెడ్డభావములకు కుకర్మలకు ఆస్కారము అంగీకారమెట్లుంటుంది. యీ విశ్వ పురుషుని ప్రతికణకణము నాకు పూజనీయము.ఆ విశ్వపురుషుని సేవ చేసి, సుర్క్షా-శోభ పెంపొందించే ప్రవృత్తిని కలిగి యుండుటయేనా జీవితమునకు శ్రేయస్కరము.

సంకల్పానికి రెండవ భాగమును ఆలోచించేటపుడు, మన హృదయంలో భగవానుని సింహాసనమును భావించి అనుభవించవలె. ఆ పరమ తేజస్వీ, సర్వశ్రేష్ఠ, నిష్కళంక, దివ్య గుణసంపన్నుడైన పరమాత్మ నా సింహాసనముపై విరాజిల్లు చున్నట్లు దర్శించవలె. భగవానుని సందర్శనాస్వరూపము మూడువిధములు.

1. విరాట్ పురుషరూపము

2. రామ, కృష్ణ, విష్ణు, గాయత్రీ, సరస్వతి మొదలైనరూపములు

3. దీప జ్యోతిరూపం

యీ స్వరూపదర్శనము తమ తమ భావనానుగుణ్యంగా, యిష్టానుసారంగా అభిరుచులను బట్టి వుంటుంది. పరమాత్మను పురుషరూపంలో గాని, లేక గాయత్రీ మాతారూపంలో గాని, అభిరుచికనుగుణ్యంగా ధ్యానించవచ్చు. పరమాత్మ 'స్త్రీ' మరియు 'పురుషుడు' గూడా ! గాయత్రీ సాధకులకు మాతా గాయత్రీ రూపంలో బ్రహ్మను ధ్యానించుటలో అధిక రుచి, సంతృప్తి వుంటుంది. సుందరమైన కాంతి కిరణము ధ్యానిస్తూ, ఆ జ్యోతిలో సూర్య సమానతేజస్సునూ, సర్వోపరి శ్రేష్ఠతనూ, పరమ పవిత్రతనూ, నిర్మలతనూ, దివ్య సత్వ గుణమునూ దర్శించవలె. యీ విధంగా గుణ కోష స్వరూపమైన బ్రహ్మశక్తి తన హృదయంలో స్థాయీ రూపంలో నిర్మించుకొని

తన రోమ రోమములయందు ఆ రూపమును నిండించుకొన్నట్లు భావించు కొన వలయును.

సంకల్పానికి మూడవభాగము ఆలోచించేటపుడు ఆ గాయత్రీ బ్రహ్మ శక్తి మన హృదయములందు నివసిస్తున్నట్లు భావన చేసి మన మస్తిష్కములోని బుద్ధిని పట్టుకొని, సాత్విక, ధర్మ, కర్తవ్య, సేవా సన్మార్గములవైపు ఈడ్చుక పోతున్నట్లు అనుభవించవలె.

యీ మూడు సంకల్పములు ప్రేమను కలిగించి, ఆనందంతో ఉత్సాహంతో, సంతోషాన్ని కలిగించి, మాతా గాయత్రీమనతో పయనిస్తున్నట్లు బుద్ధి భావనను సదాయేర్పరచు కొనవలె.

గాయత్రిలో నీయబడిన యీ మూడు భావనలు క్రమంగా జ్ఞానయోగమునకు, భక్తి యోగమునకు కర్మయోగమునకు ప్రతీకలు. యీ మూడు భావనలు వ్యాపించి విస్తరించి యోగము యొక్క జ్ఞాన, భక్తి కర్మలనే మూటికి ఆధారమైనవి. గాయత్రీ చింతనకు అర్థము బీజ రూపంలో మన అంతః కరణను యీ మూడు యోగముల త్రివేణిలో స్నానము గావించుట తో సమానము.

యీ విధంగా చింతించి నట్లైతే గాయత్రీమంత్రానికి అర్థము సంపూర్తిగా హృదయంగమమవుతుంది. ఆభావనా సముద్రము మనఫలకముపై చెరగకుండా వుంటుంది. అందువలనపరిణామ స్వరూపంగాకొన్ని దినములలో, మనస్సుకు విచారములు లేకుండ, కుకర్మగామి గాకుండా వుండుట జరుగుతుంది. మనుష్యోచిత సద్విచారములలో మనస్సు సత్కర్మానుష్ఠానములో లగ్నమై ఆనందరసాన్నను భవిస్తుంది. యీ ప్రవృత్తి ఆరంభంలో చాల నెమ్మదిగా నున్నప్పటికీ, మొదలైనది నశించకుండా ఆత్మ దినదినానికి సమున్నతంగా మారుతూ, జీవన పరమలక్ష్య సమీపమునకు చేర్చుట నిశ్చయము.

## మాలతో మాట్లాడుకు సాధన :

సాధన యొక్క దివ్య జ్యోతి అధిక ప్రకాశాన్ని సంతరించు కొన్న కొద్దీ అంతః కరణ గ్రాహ్య శక్తి అభివృద్ధి పొందుతుంది. రేడియో యంత్రంలో బల్బుంటుంది. విద్యుత్ సంచారములో ఆ బల్బు వెలుగుతుంది. వెలుగువచ్చిన వెంటనే యంత్రములోని ధ్వనిని గ్రహించే భాగము జాగృత మవుతుంది ఈథర్ తత్వములో భ్రమణము చేస్తూవుండే సూక్ష్మ శబ్దతరంగములను పట్టుకొనుట జరుగుతుంది.యీ ప్రక్రియను రేడియో మోగడం అంటారు. సాధన యొక విద్యుత్. దీని వలన మనస్సు బుద్ధి, చిత్తము, అహంకారములనే బల్బు దివ్య జ్యోతిగా వెలుగుట ప్రారంభించుతుంది. యీ విధంగా ప్రత్యక్షంగా సరాసరి ప్రభావము అంతరాత్మపై పడుతుంది. దానివలన సూక్ష్మ చేతనము

జాగృతమవుతుంది. తద్వారా దివ్యసందేశాలను, ఈశ్వరీయ ఆదేశములను ప్రకృతిలోని గుప్తరహస్యములు అవగాహన మగుటకు తగిన యోగ్యత వుత్పన్నమవుతుంది. యీ విధంగా సాధకుని అంతఃకరణము రేడియోలాగా తయారవుతుంది. దీనివలన సూక్ష్మజగత్తులో నున్నగహనమైన ఘనమైన రహస్యములు ప్రకటితమవుతాయి.

దర్పణమెంత స్వచ్ఛంగా, నిర్మలంగా నుంటుందో, ప్రతిబింబముగూడా అంతే స్ఫుటంగాను, స్పష్టంగాను గోచరిస్తుంది. మలిన దర్పణము కపటమైనది. నమ్మదగినది గాదు. అందులో ముఖము సరిగా కనుపించదు. సాధనవలన అంతఃకరణము నిర్మలమవుతుంది. దైవీతత్వములు యీశ్వరీయ సంకేతాలు స్పష్టంగా అనుభవమవుతాయి. చీకటిలో జరుగుతున్నదేమిటోతెలుసు కోవడం కష్టం. దీప సహాయంతో,దీపము వెలిగించినవెంటనే, క్షణంలో అంధకారములో దాగి వున్న ప్రతి సంగతీ ప్రకటీ కృతమవుతుంది. తెలియని రహస్యముస్పష్టంగా ప్రత్యక్షంగా గోచరిస్తుంది.

గాయత్రీ సాధకుల మనోభూమి శుభ్రమవుతుంది. ఆ మనస్సులోఅనేక గుప్త విషయ రహస్యాలు తమంతట తామెస్పష్టంగా తెలియడం ప్రారంభమవుతుంది. నిజంగా యీ పరిస్థితి నెలకొన్నట్లయితే, గాయత్రీ దర్శనము, సంభాషణ యని యీ స్థితిని చెబుతారు. సాధనయొక్క పరిపక్వస్థితిలో స్వప్నంలోగాని లేక జాగ్రదావస్థలోగాని భగవతి దర్శనమొందటానికి యోగ్యమైన దివ్యచక్షు లాభము కల్గుతుంది. ఆ మాతృదేవి సందేశము వినడానికి యోగ్యమైన కర్ణసౌభాగ్యం కలుగుతుంది. కొందరికి ప్రకాశవంతమైన జ్యోతిస్వరూపంలోను మరికొందరి అలౌకిక దేవ రూపంలోను బంధురూపంలో యింకొందరికి, స్నేహమయ నారీరూపంలో కొంతమందికి దర్శనమిస్తుంది. ఆమె సందేశం భాషణ ద్వారా కొందరు సాధకులకు లభిస్తుంది.

కొంతమందికి మాటలు వినిపిస్తాయి. అపుడపుడు తెలియజేయబడుతాయి. ఆకాశవాణిమాదిరి స్పష్టంగా సందేశముకొన్ని సార్లు లభించడం జరుగుతుంది. సాధకుని మనోభూమిపై సందేశమాధారపడి వుంటుంది. అందరికీ ఈ విధమైన అనుభవం లభించదు.

కాని సాధకుడైన ప్రతివ్యక్తి యేదోవొకవిధంగా తల్లి సమీపానికిచేరుతాడు. ఆ వ్యక్తికి తన ఆత్మిక స్థితి కనుగుణ్యంగా, స్పష్టంగా గాని అస్పష్టంగా గాని సమాధానం ప్రాప్తిస్తుంది. ఒక పద్ధతి ఏకాంత స్థానములో శాంత చిత్తంతో విశ్రాంతిగా శరీరమును సడలించి, తేలికగా వేయవలె, చిత్తమును చింతారహితముగావించవలె. శరీరము, వస్త్రము శుభ్రముగా నుండవలె. కూర్చొనవలె నేత్రములను మూసికొని, ప్రకాశవంతమైన

జ్యోతిని గాని, హంస వాహిని రూపములోనున్న గాయత్రీ దేవి శక్తిని హృదయ స్థానమున ధ్యానించ వలె. మనస్సులో భగవతీ సమ్ముఖమును మరల మరల గుర్తు తెచ్చుకోవలె యీ ధ్యానమును పదినిముషములు చేసిన తదుపరి మూడు దీర్ఘ శ్వాసలు తీసుకొనవలె. ఈ శ్వాస పీల్చునపుడు అఖిల వాయుమండలములో వ్యాపించియున్న మహాశక్తిని శ్వాస ద్వారా ప్రవేశింపజేసుకొని అంతఃకరణపుప్రతి కణము నందు వ్యాపింప జేసి నట్లు భావించవలె. ఇపుడు ధ్యానమును నిలుపవలె. మనస్సులో నున్న అన్ని రకముల ఆలోచనలను పూర్తి లేకుండ చేయవలె. మనతరపునుండి ఆలోచనలను రానీయగూడదు మనస్సు,హృదయము సర్వదా ఆలోచనా శూన్యము గావలె.

యీ శూన్యావస్థలో స్తబ్దతను భంగపరుస్తూ అంతకరణములో స్ఫురణ కలుగుతుంది దీనిలో అనాయాసముగా అచింత్య భావములు ఉత్పన్న మౌతాయి. అనగా యేదో అజ్ఞాత శక్తి వలన మనస్సుకు సమాధానం తడుతుంది.

యీ విధంగా చెప్పడిన సాధన పవిత్ర హృదయ సాధన ద్వారా, యింకా అధిక దివ్య పవిత్రతత వలన పరిపూర్ణమవుతుంది. అపుడువ్యష్టి (వ్యక్తిగత) అంతరాత్మ సమిష్టి పరమాత్మ రూపంలో సూక్ష్మదేవీశక్తికి సమానమై వ్యాప్తి చెంది ఆ పవిత్ర హృదయ ఫలకము పై పనిచేయడం ప్రారంభిస్తుంది. ఆ సమయంలో వివాదాస్పదమైన, సందేహాన్వితమైన రహస్య మయమైన ప్రశ్నలకు అనుమానాలకు, శంకలకు జవాబులభిస్తుంది. యీ ప్రక్రియవలన భగవతీ వేదమాత గాయత్రి సాధకునితో సంభాషిస్తుంది. జిజ్ఞాసువులకు సమాధానమిస్తుంది. యీ క్రమము నియమయుక్తంగా, క్రమపద్ధతిలో పురోగమించితే,అభివృద్ధి చెంది, శరీర రాహిత్య దివ్య మాతతో, జన్మనిచ్చిన శరీరధారి యైన తల్లితో సంభాషించిన మాదిరిగా భాషించుట సల్లాపించుట, సమాధానము పొందుట అవశ్యము జరుగుతుంది. క్రమేణా సుగమమవుతుంది.

అమ్మతో సంభాషణ తక్కువస్థాయి విషయములకొరకు చేయరాదు. విశేషించి ఆర్థిక సమస్యలలో భీతనానికి జరుపరాదు. యీప్రశ్నలతో స్వార్థపరమైన, సాంసారికమైన యితర మలిన భావనలు వుత్పన్న మవుతాయి. మాతతో సంభాషించుటకుఅనువైన పవిత్ర అంతఃకరణమును అపవిత్రము చేస్తాయి. దొంగిలించబడిన వస్తువులు, భూమిలో గుప్తంగా దాచబడిన ధనసంపదలు, మార్కెటు ధరలు హెచ్చుతగ్గులు, జూదము లాటరీ జయాపజయములు, ఆయువు, సంతానము స్త్రీ కోర్టు దావాలు ఉద్యోగము లాభనష్టాల గురించి మధ్యవర్తిగా జేసి ప్రజలాదేవీశక్తితో సంభాషించదలచితే, మాతదృష్టిలో వారు సంభాషించుటకు అధికారులుగారు. బహుశా అట్టి అనధికారుల ప్రయత్నం సఫలీకృతం గాదు. వారి మనస్సులలో దైవీ సందేశము రాదు మాతతో సంభాషించుటకన్నా, యితరులు

వారికెక్కువ ఫలస్వరూపంగా జరిగే సహాయము, లోక కళ్యాణము సందిగ్ధముగా నుంటుంది.

యీ దోషము ప్రస్తుతము ప్రజలలో అధికముగా నున్నది. ధనముకున్న అధిక ప్రాముఖ్యతముందు యీ యుగంలో ఆధ్యాత్మిక శక్తి బహుఅల్పమైనదిగా భావించబడు చున్నదని అర్థము. వారిదృష్టిలో దేవీ, దేవతల పూజ, యీశ్వరోపాసనకు మూల్యము, వాటి ద్వారా సాంసారిక వైభవము సంపద పొందుటయే. రూపాయిమోహినీమాయ మనుష్య బుద్ధి, దానం కోసము ధర్మాన్ని వేగంగా త్యాగముచేయడానికి, అమ్మడానికి తయారైధనాన్వేషణచే ఆచ్ఛాదితమైనది. యీ రకం ప్రజలు కొంచెము పూజగావించిగాని, జపము చేసిగాని, భజనతోగాని స్వల్పంగా కర్మకాండ జరిపి వారు అలౌకిక శక్తిని అవసర మొచ్చిన దైవీ సహాయము పొందలేరు. తమ దృష్టిని ఉన్న తముగా నుంచుకోవలె. కేవలం స్వార్థముకొరకేగాక పరార్థమునకు గూడా దృష్టి సారించవలె. ఆచరించవలె.

ఆధ్యాత్మిక ధార్మిక, ఆత్మకల్యాణ కారకమునకు, జనహితమునకు పారమార్థికతకు, కామితానికి, సంబంధించిన ప్రశ్నలకు జవాబుల కొరకు మాత్రమే మాతతో సంభాషించ వలెను. కర్తవ్యాకర్తవ్యముల చిక్కునుండి విడదీయుటకు, వివాస్పద ఆలోచనలకు సమాధానం కావలసినపుడు. విశ్వాసములు గౌరవించదగిన సాంప్రదాయముల గురించి మాతతో సంభాషించుట మొదలిడవలె.

యీ విధమైన సంభాషణలలో తమయొక్క, ఇతరుల యొక్క పూర్వ జన్మలు, పూర్వసంబంధములు, మొదలైన మహా విషయములు వెలువడుతాయి. జీవన నిర్మాణానికవసరమైన మార్గము లభిస్తుంది. మనకు లభించిన సంకేతముల ద్వారా అనుసరించవలసిన మార్గము లభించి, ఆ విధంగా నడచుకొనిన ఆశాజనకమైన ప్రయోజనములు సమకూడుతాయి. సద్గుణములు, సాత్వికభావములు మనోబలము, దూరదర్శనత్వము, బుద్ధి, ఆంతరంగిక శాంతి కలుగుతాయి. ఇది తప్పక జరుగుతుంది. యీ విధంగాతల్లితో సంభాషణ, సాధకునకు సర్వ శ్రేయస్కరమై, కళ్యాణ కారకసిద్ధియై యున్నది.

## సాధకుల స్వప్నము నిరర్థకము కాదు

సాధన వలన విశేషమైన దిశలో మనోభూమి నిర్మాణ మవుతుంది. శ్రద్ధ, విశ్వాసము, సాధనా పద్ధతి ప్రణాళికానుసారంగా, ఆంతరిక క్రియలు మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారములనే చతుష్టయములా మార్గములో ప్రయాణించుట జరుగుతుంది.

అవి ఆరూపాన్నే ధరిస్తాయి. భావనాసంస్కారములు అంతర్మనస్సులో చొచ్చుకొని పోతాయి. గాయత్రీ సాధకునకు మానసిక స్థితిలో ఆధ్యాత్మిక, సాత్వికతలు ప్రముఖ స్థానాన్ని పొందుతాయి. అందువలన జాగ్రదావస్థలో మాదిరి స్వప్నవస్థలో గూడా సాధకుని క్రియాశీలత సారగర్భితము వైపున్నందున, ఆతనికి సార్థక స్వప్నములు గోచరిస్తాయి.

సాధారణ వ్యక్తుల మాదిరిగా గాయత్రీ సాధకులకు విరుద్ధ స్వప్నములు చాలా తక్కువ. అతని మనోభూమి అస్తవ్యస్త స్వప్నములను గాంచుటకు అనువైన రీతిలో నుండదు. క్రమము వ్యవస్థలున్నచోట జరిగే పనులన్నీ క్రమమంగాను సువ్యవస్థతగా నుంటాయి. గాయత్రీ సాధకుల స్వప్నములను మేము చాలా కాలము నుండీ వినుచున్నాము. వాటి మూలకారణముల పై విచారణ జరుపుతున్నాము. తదనుసారంగా, సాధకుల స్వప్నములలో అధికముగా నిరర్థకములు గావు. వాటిలో సార్థకత యే యెక్కువ భాగము.

నిరర్థక స్వప్నములు అసంపూర్ణములు. అందులో అసలు సంగతుల ఛాయ బహు కొద్దిగా వుంటుంది. వెంటనే తారుమారవుతాయి. దైనిక వ్యవహారముల సాధారణ క్రియల సామాన్యస్మృతి మస్తిష్కంలో పునఃపునః జాగృత మవుతుంటాయి. భోజనము స్నానము, గాలిపీల్చడం లాంటి సాధారణ చర్యలు దైనిక స్మృతులను తారుమారుచేసి అస్తవ్యస్త స్వప్నములకు కారణమవుతాయి. ఆ స్వప్నములు అర్థరహితములు. స్వప్నములు విశేషమైన ప్రత్యేకతగలవి. అందులో విచిత్రిత, నవీనత, ఘటనాక్రమము, ప్రభావోత్పాదక క్షమత వుంటుంది. ఆ స్వప్నములను గాంచుటలో భయము, శోకము, చింత, క్రోధము సంతోషము, విషాదము, లోభము, మోహాదిభావములు గలుగుతాయి. నిద్రలేచి నప్పటికి వాటి ప్రభావము, ఛాయ మనస్సుపై నుంటుంది. పదే పదే యీ స్వప్నానికర్థ మేమిటనిమనం తలపోస్తుంటాము.

## 1. కుసంస్కారముల బహిష్కరణ :

సాధకుల సార్థక స్వప్నములను 4 భాగములుగా విభజించవచ్చు.

1. పూర్వ సంచిత కుసంస్కారముల బహిష్కరణ.
2. శ్రేష్టతత్వముల వ్యవస్థాపనా ప్రకటీకరణ.
3. భవిష్యత్ సంభవముల సూచన.
4. దివ్య దర్శనము.

గాయత్రీ సాధన ద్వారా ఆధ్యాత్మిక నవ్యతత్వముల వృద్ధి అంతఃకరణములో జరుగుతుంది. కావున సంచితకుసంస్కార బహిష్కరణ జరుగుతుంది. అందువలన కుసంస్కారములను పోగొట్టే స్వప్నములొస్తాయి. వస్తువు నొక చోటనుంచినపుడు, రెండవవస్తువును తొలగించవలసి వుంటుంది. గ్లాసును నీళ్లతో నింప వలసి నపుడు దానిలో నున్న గాలిని తొలగించవలె. రైలుపెట్టెలో క్రొత్త ప్రయాణీకులను కూర్చో పెట్టవలెనంటే, పాత ప్రయాణీకులు ఖాళీ చెయ్యాలి. పగటి ప్రకాశము వచ్చిన వెంటనే అంధకారము పోతుంది. అదేవిధంగా గాయత్రీ సాధకుని అంతఃకరణములో వృద్ధి చెందే దివ్యతత్వములు సుసంస్కారములకు స్థానమేర్పచుటకు, కుసంస్కారములను పార ద్రోలడం స్వాభావికము. యీ బహిష్కరణ జాగ్రదావస్థలోనూ, స్వప్నావస్థలోనూ జరుగుతుంది. విజ్ఞాన సిద్ధాంతానుసారము విస్ఫోటముద్వారా ఉష్ణశక్తి పదార్థము, స్థానచ్యుతి పొందినపుడొక వూపు (నెట్టుట) వస్తుంది. తుపాకీ ప్రయోగింపబడినపుడు దాని వెనుకవైపు బలమైన వూపువుంటుంది. పెద్ద సమూహము మండునపుడు శబ్దము పుడుతుంది. దీపము ఆరిపోయేముందు పెద్దగా వెలుగుతుంది. అదే మాదిరి కుసంస్కారము మానసలోకమును వదలేటపుడు, ప్రయాణసమయంలో మస్తిష్క తంతువులను కదలించి దెబ్బవేస్తాయి. ఆ ఘాతము వలన ప్రతిస్వరూపంగా విక్షేపములుత్పన్నమవుతాయి. ఆ స్వప్నావస్థలో భయంకర, అస్వాభావిక, అరిష్ట, ఉపద్రవరూపములు కనుపిస్తాయి.

భయానక హింస పశువులు, సర్పములు, సింహములు, వ్యాఘ్రములు, పిశాచములు, చోరులు, బందిపోట్లు మొదలైన ఆక్రమణలు, వినుట,ఏకాంతము, భయము గల్గించే అరణ్యములు కనుపించుట, ప్రియజనుల మృత్యువు అగ్నికాండదహనము. కరువు, భూకంపములు యుద్ధము మొదలైన భయానక దృశ్యములు చూడడం, అపహరణ జరగడం, అన్యాయము, అలసట, విశ్వాస ఘాతుకముల ద్వారా మనలను బాధించుట, విపత్తులు రావడం, అరిష్టములతో, అనుమానములతో చిత్తము గాబరాచెందుట, మొదలైన మనస్సును ఆందోళనపరచే స్వప్నములు సంభవించి, వాటి కారణంగా మనస్సు చింతా శోక, దుఃఖ, భయ, క్రోధ, ద్వేష, పిరికి, గ్లాని, ఘృణ, మొదలైన భావములు ఉత్పన్నమవుతాయి. అవి పూర్వ సంచిత కుసంస్కారములు అంతిమ కదలికకు ప్రమాణము. జన్మ జన్మాంతరముల సంచిత కుప్రవృత్తుల అంతిమదర్శనమని, అభివాదన గావించుతూ శలవు తీసుకుంటున్నాయని యీ స్వప్నములు చెబుతున్నాయని అర్థము. మనస్సు యీ స్వప్నములలో పరివర్తనమును యేకాగ్రతతో గమనిస్తూ,

ప్రత్యేక అలంకారిక కథా రూపంలో యేదో శృంఖలాబద్ధ ఘటనా చిత్ర కల్పిత కందకాన్ని యేర్పరచి,దానిని స్వప్నరూపంలో చూసి జీవుడు తృప్తి చెందుతాడు.

కామవాసనలు, యితరప్రవృత్తులు బలీయమైనవి. కామ భోగములు, స్వాధీనములో లేని కోర్కెలు మనస్సులో ఉద్భవిస్తాయి.వాటిని తీర్చుకోవడానికి వీలులేదు అందువలన పరిస్థితుల కనుగుణ్యంగా అని దుర్మార్గంగా మారుతాయి. మనస్సును స్వాధీనం చేసుకొని అవి, సంతుష్టిలేని, తృప్తిలేని ప్రేయసిమాదిరి అంతర్మన స్సనేకోప గృహంలో మంచముపై పడివుంటాయి. అసంతృప్తి మౌనంగా వుండదు. అవకాశమొచ్చి నపుడు నిద్రావస్థలో తన గొప్పతనాన్ని అధికారాన్నుపయోగించి చరితార్థతపొందేటందుకు, మనస్సనే లడ్డును భుజించడానికి, మనస్సుకు నచ్చినరీతిలో స్వప్నాన్ని రచించి అభినయిస్తుంది. పగలుయింటిలోని వారుమేల్కొన్నందున ఎలుకలు భయపడుతాయి. తమ బొరియలనుండి బయటకురావు.రాత్రియింటి వారు నిద్రించినవెంటనే, ఎలుకలు తమ కలుగులనుండి బయటకు వచ్చి నిర్భయంగా, తిరుగుతూ, దూకుతూ అల్లరిచేస్తాయి. తీరని కామవాసనలు గూడా యీ పనినే చేస్తాయి. ఇవి 'జ్ఞాపకమనే పలావు'ను భుజించి యేదో విధంగా తమ క్షుత్తును తీర్చుకుంటాయి.

స్వప్నావస్థలో సుందర సుందరమైన వస్తువులను చూచుట, వాటితో ఆడుకోవడం, ప్రేమించడం, సంపాదించడం, రూపవతులైన స్త్రీలను గాంచుట, వారికి దగ్గరగా చేరడం, మనోహరమైన నది, చెఱువు వనము, ఉపవనము, పుష్పములు, ఫలములు నృత్యము గీతము, వాయిద్యము, ఉత్సవము, పూజాసమూహము మొదలైన దృశ్యములను చూసి అసంతృప్తి వాసనలుతమనుతృప్తి పరచుకొంటాయి. ధనాశ, పదవీ వ్యామోహము కీర్తి కాంక్ష మొదలైన తీరని ఆకాంక్షలు గూడా తమ తృప్తి కొరకు కృత్రిమ అభినయములను సృష్టించు కొంటాయి. కొన్నిసార్లు తన అసంతృప్తి వలన కలిగే బాధలు మానసిక గాయములు, కష్టములు స్పష్టంగ అనుభవించుటకొరకు ముందుగానే స్వప్నరూపంలో కనుపించి మన అసంతృప్తిని యెక్కువచేస్తాయి. కొంచెము సుఖము గూడాచే జారిపోతుంది. మనోవాంఛ తీరినప్పటికి, ఆకస్మిక కారణంచే విఘ్నము జరుగుతుంది.

అసంతృప్తుల ఏ అంశమైనా, వేరొకవిధంగా తృప్తిపడడానికి ప్రయత్నం జరిగి నపుడా అసంతృప్తి బలీయమైన ఉగ్రరూపంలో స్వప్నంలోకిప్రవేశిస్తుంది. అణగదొక్క బడిన ప్రవృత్తులు గాయత్రీ సాధన వలన పెల్లగింపబడి నిర్మూలమై తమ స్థానమును ఖాళీ చేస్తాయి. యీ పరివర్తనా కాలంలో తమ గుప్త రూపమునుప్రకటించుతూ శలవు పుచ్చుకొంటాయి.తదనుసారంగా సాధనా సమయంలో యీ విధమైన స్వప్నములు రావడం పరిపాటి. మరణించిన ప్రేయసి, యొక్క దర్శనము సుందరదృశ్యావ లోకనము,

స్త్రీలతో కలిసి సరససల్లాపాలు, మనోవాంఛా పరిపూర్తి, యిష్టమైన వస్తువుల కొరత అధికమగుట. మొదలైన స్వప్నములు తరచుగావస్తుంటాయి. అనేకమైన అణగద్రొక్కబడిన కోర్కెలు, అతృప్తితృష్ణలు నెమ్మది, నెమ్మదిగా వీడ్కోలుపుచ్చుకుంటున్నాయని యీ స్వప్నములకర్థము. ఆత్మిక తత్వములు బలాన్ని పుంజుకుంటున్నపుడు యీ విధంగా జరగడం సహజము, స్వాభావికము.

## 2. దివ్య తత్వముల వృద్ధి సూచన స్వప్నములు :

తమలోవున్నసాత్వికతామోతాదు ఒక్కసారి విజృంభించి అభివృద్ధి చెందు తున్నదనే సూచన యిచ్చే విధంగాకొన్ని స్వప్నములు సంభవిస్తాయి. ఇవి రెండవ శ్రేణికి సంబంధించినవి. సత్వగుణప్రధా కార్యములుస్వయంగా ఆచరించడం, యితరులు చేయడం లాంటి స్వప్నములు సాత్వికతామోతాదు అభివృద్ధిని సూచిస్తాయి. పీడితజనసేవ, నిస్సహాయులకు సేవజేయడం, దానము, జపము యజ్ఞములు, ఉపాసన, తీర్థ యాత్రలు, దేవాలయ దర్శనము, పూజచేయడం ధార్మిక కర్మకాండలొనరించడం,హరికథాశ్రవణము, భగవంతుని కీర్తించటం, భాగవతోపన్యాసములువినడం, ఉపదేశము పొందడం మాతాపితల దర్శనము సాదు మహాత్ముల సందర్శనము, నేతలు, విద్వాంసులకు, సజ్జనులకు సమీపంగా చేరడం, స్వాధ్యాయనము, అధ్యయనము. ఆకాశవాణిని వినుట,దేవీ దేవతలను గాంచుట, దివ్యప్రకాశదర్శనము మొదలైన ఆధ్యాత్మిక తత్వముల సత్వగుణప్రధాన శుభస్వప్నములవలన తమంతట తాము అంతరంగము నందు వచ్చే శుభ తత్వములను పరికించుటయే. అదృశ్యముల వలన మనశ్శాంతి లభిస్తుంది.

## 3. భవిష్యత్తులో సంభవించే సంఘటనలకు సంకేతము :

మూడవ రకపు స్వప్నములు భవిష్య ఘటిత సంఘటన సూచితములు. ప్రాతః కాలానికి పూర్వము, ఒకటిరెండుగంటల ముందు చూచేస్వప్నములు నిజమవడానికి అవకాశములు యెక్కువ.బ్రహ్మ ముహూర్తములోసాధకుని మస్తిష్కము నిర్మలముగా నుంటుంది. రెండవది ప్రకృతి అంతరాళము లోని కోలాహలము, రాత్రి యందుండే స్తబ్దత కారణంగా అనేక విధముల శాంతముగా నుంటుంది. ఆ సమయమందు సాత్విక గుణము ప్రధానంగా అమలులో నున్న కారణంగా, వాతావరణము స్వచ్ఛంగా వుంటుంది. సూక్ష్మ జగత్తులో సంచరించే భవిష్యత్తులో జరుగనున్న భావి ఆలోచనల యెక్కువ భాగము సంకేతరూపములో లభిస్తుంది.

కొన్నిసార్లు అపుడపుడు అస్పష్ట సంక్షిప్తదృశ్యములు కనుపిస్తాయి. వీటి వల్ల భవిష్యత్తులో జరుగబోయే మంచి చెడ్డల సంకేతమని తెలుస్తుంది. కాని వాస్తవంగా

మనకు విదితముగా నిది వీటి వాస్తవిక తాత్పర్యమే మని? యిట్టి చిక్కుతో గూడుకొన్న స్వప్నములకు కారణము -

1. భవిష్యత్ విధానము ప్రారబ్ద కర్మలననుసరించి వుంటుందని, కానివర్తమాన కర్మలవలన ఆ విధానములలో మార్పు జరుగవచ్చునని. యిదివరకే నిర్ణయింప బడిన విధానము. సాధకుని వర్తమాన కర్మల కారణంగా కొంత పరివర్తనము జరుగవచ్చునని, దాని నిశ్చిత, స్పష్ట స్వరూపాన్ని చూపి, అనిశ్చితంగా అస్పష్టంగా మారిపోతాయి.తదను సారంగా స్వప్నంలో విడివడని సమస్యరూపంలో గోచరిస్తుంది.

2. కొన్ని భవిష్యత్ విధానములు యీ విధంగా వుండవచ్చు. నవ్యకర్మల నవ్య పరిస్థితుల ప్రకారము వుంటుంది. పరివర్తన జరుగుతూ వుంటుంది. ధరల హెచ్చుతగ్గులు స్పెక్యులేషన్, లాటరీ మొదలైన వాటికి సంబంధించినంత వరకు భవిష్యత్ సునిశ్చితము గాదు. పూర్ణ స్వరూపము స్పష్టంగా రాదు. అంతవరకు పూర్వాభాస సాధకుని స్వప్నంలోని కలయిక, అపూర్ణము.

3. నేను అనే పరిమితి క్షేత్రంలో యెంత వుంటుందో ఆ వ్యక్తి యొక్క 'అహం' ఆధ్యాత్మిక క్షేత్రంలో అంతగావుంటుంది. అతని విస్తృత క్షేత్రమెంత భవిష్యత్తు కలిగివుంటుందో తనభవిష్యత్తు గూడా అలాగే వుంటుంది. భవిష్యత్ సూచన స్వప్నము. యీ అహం క్షేత్ర పరిధి వరకు అతనికి గోచరించగలదు. అందువలన అతనికొచ్చిన సందేహ స్వప్నము తనకు సంబంధించినదై, తనకుగాని, తన ఇరుగు పొరుగు వారికిగాని, బంధువులకుగాని, మిత్రులకుగాని, తనకుటుంమునకుగాని సంభవించబోయే వాటిని గురించి తెలియ పరుస్తుంది.

4. సాధకుని మనోభూమి నిర్మలంగా లేనపుడు ఆకాశంలో సూక్ష్మ అంతరాళంలో చాలా యెక్కువగా జరుగుతున్న సత్యములు, వికటంగానో, లేక రూపాంతరము చెందో స్వప్నంలో కనుపిస్తాయి.ఉదాహరణకు మనలను కలవడానికి వస్తున్న వ్యక్తి బయలుదేరినప్పటికి అతనిస్థానంలో వేరొకవ్యక్తి వస్తున్నట్లు భ్రమ కలుగుతుంది. సాధకుని దివ్యదృష్టి మసకబారి స్పష్టత లోపిస్తుంది. దృష్టిదోషము గలిగినపుడు దూరంగా వెళ్లేవ్యక్తి స్వరూపము ఛాయమాత్రంగా కనుపించి అనేకరూపము గోచరించనట్లు, సాధకుని దృష్టి వుంటుంది. అస్తవ్యస్తంగాను, అ స్పష్టంగాను వున్న భ్రమ స్వప్నమై కల్పిత ఆవరణాన్ని సృష్టించి అసత్య, అనిశ్చిత ఆకృతినితోడు చేసి తాడును పాముగా భావించేటట్లు చేస్తుంది.

అటువంటి స్వప్నము సగము అసత్యము కాని సాధకుని మనోభూమి యొక్క నిర్మలత్వము పెరిగిన కొద్ది ఆ విధంగానే ఆతనిదివ్య దృష్టి స్వచ్ఛమవుతుంది. అతని స్వప్నము, అధిక సార్థకతాయుక్త మగుట మొదలవుతుంది.

### 4. జాగృత స్వప్నము లేక దివ్యదర్శనము :

స్వప్నము కేవలం రాత్రి యందు లేక నిద్రావస్థయందు మాత్రమే కలుగవు. అవి జాగ్రదావస్థలో గూడా జరుగుతాయి. ధ్యానమొకవిధమైన జాగృత స్వప్నమని తెలుసు కొనవలె. కల్పనా అశ్వమునధిరోహించి మనము సుదూర స్థానములలో నున్న వివిధ విధి సంభవ, అసంభవ దృశ్యములను చూస్తుంటాము. ఇది గూడ ఒక విధమైన స్వప్నమే. నిద్రావస్థలో వచ్చే స్వప్నములు క్రియా ప్రధానములు. జాగ్రదావస్థలో వచ్చేస్వప్నములు బహిర్మనో క్రియల ప్రముఖ రూపమువలన పనిచేస్తాయి. యీ తేడాతప్ప, జాగ్రద నిద్రావస్థల స్వప్నముల ప్రణాళికలు వొక్కడే. జాగ్రదావస్థలో సాధకుని మనోలోకంలో నానాప్రకారముల ఆలోచనా స్రవంతులు కల్పనలు స్ఫూరీచేస్తుంటాయి. ఇవిగూడా మూడురకములు. పూర్వకుసంస్కారముల బహిష్కరణ శ్రేష్టతత్వముల ప్రకటీకరణ, భవిష్య పూర్వాభాస సూచనకు మస్తిష్కములో వివిధ రకముల ఆలోచనలు, భావములు చిత్రములు గోచరించుట. నిద్రావస్థలో నొనగూడిన ఫలితమే జాగ్రదావస్థలో గూడా.

అపుడపుడు జాగ్రదావస్థలో గూడాయేదైనా చమత్కార స్వరూపంలో దైవీశక్తిలో అలౌకికదృశ్యము కొంతమందికి గోచరిస్తాయి. కొంతమందికి వారి ఇష్ట దైవము చర్మ చక్షువులకు కనుపిస్తుంది. కొందరు భూత ప్రేతములను ప్రత్యక్షంగా చూస్తారు. మరికొందరికి యితరుల ముఖముల చుట్టు తేజోవలయములు వారి మనోగత భావములు ప్రస్ఫుటమౌతాయి. వారి ఆధారములతో వారి అంతరంగిక స్థితిని గుర్తించ గలుగుతారు. వ్యాధిగ్రస్తుడు రోగవిముక్తుడగునా? లేదా? సంకుల సమస్యా సంఘర్షణలలో విజయము పొందునా?లేదా? దొంగిలింపబడిన వస్తువు తిరిగి లభ్యమగునా?లేదా? రానున్న లాభనష్టములు విపత్తులు సంపత్తులు మొదలైన వాటిని గురించి, మనుష్యుని అంతఃకరణములో నున్న ప్రత్యేక ఆకాశవాణి ద్వారా తెలిసి,అనేక సార్లు నిజమై ఆశ్చర్యకరముగా అనుభవైక వేద్య మవుతుంది.

## విజయ లక్ష్యము

గాయత్రీ సాధన వలన సాధకునిలో ప్రత్యేక సూక్ష్మదైవీ చేతనా శక్తి ఉపర్భవిస్తుంది. ప్రత్యక్షంగా ఆతని శరీరంలోగాని, ఆకృతిలోగాని విశేషమైన మార్పురాదుగాని అంతరంగలో

లోపల భారీయెత్తున సంచలన మార్పు తథ్యము. ఆధ్యాత్మిక వృద్ధివలన ప్రాణమయ కోశము, విజ్ఞానమయకోశము, మనోమయకోశములో వచ్చినమార్పులు, అన్నమయ కోశములో కొంచెము గూడా గోచరించవు. శరీరచక్ర మంతతొందరగా మారదు. ఇది నిజము. కాని శరీరములో జరిగే సంచలనమార్పులు బయటకు ప్రకటనగాకుండా నుండవు. ఇది గూడా సత్యమే.

సర్పము యొక్క మాంస కోశములో క్రొత్త చర్మము పొరతయారైనపుడు అది సర్పశరీరముపై గోచరిస్తుంది. దానిదేహము బరువెక్కుతుంది. వేగంగా అది పరుగెత్త జాలదు.స్ఫూర్తి ఉత్సాహములు దానిలో లోపిస్తాయి. ఒకచోట పడివుంటుంది. తయారైన చర్మము అసలు చర్మముతో కలసి పోయినపుడు సర్పము బయట చర్మము పొరను విసర్జించుతుంది. దీనినే కుబుసము విడుచుట అంటారు. కుబుసము విసర్జించిన తరువాత సర్పంలో క్రొత్త ఉత్సాహమొస్తుంది. దాని చేష్టలలో మార్పు వస్తుంది.దాని క్రొత్త చర్మము పై మెరుపు (తళుకు) మెరుస్తుంది. కోమలత్వము స్పష్టంగా గోచరిస్తుంది. అట్టి మార్పే అందరిలో జరుగుతుంది. సాధకుని గర్భంలో సాధన పరిపక్వమైనపుడు ఆతనిలో కొంచెము ఉదాసీనభావము, భారభావము(గంభీరత) అనుత్సాహము శిథిలత్వము మొదలుగా గల లక్షణములు ప్రతీతమవుతాయి. సాధన పరిపూర్ణమైనతరువాత మరియొకలక్షణములు ప్రస్ఫుటమవుతాయి. మాతృగర్భములో గర్భము పరిపక్వత చెందునపుడు ఆమె శరీరము భారంగాను, తిరుగు తున్నట్లుగా నుంటుంది. ఉత్సాహ ముండదు.ఆమె ప్రసూతి నుండి నివృత్తియైనపుడు, ఆమెలో తేలిక శరీరభావన, ఉత్సాహము, చైతన్యము కనుపిస్తాయి.

సాధకుడు సాధనకు కూర్చొన్నపుడు తనలో ప్రత్యేమైన ఆధాత్మిక గర్భధారణ జరుగుతుంది.తంత్ర శాస్త్రంలో సాధనను మైథున మనిపిలుస్తారు. మైథునము రహస్యంగా జరగాలి. అటులనే సాధన గూడా గుప్తంగా వుండవలెనని ఆదేశింపబడినది. ఆత్మ పరమాత్మ సన్నిధి చేరి ఆలింగనము గావించుకొన్నపుడు, ఆత్మ అనిర్వచనీయ ఆనందాన్ని అనుభవిస్తుంది.దీనినే భక్తి యొక్క తన్మయావస్థయని అంటారు. రెంటి యొక్క ప్రగాఢ ఐక్యత చేకూరినపుడు ఒకదానితో నొకటి ఆత్మసమైక్యత చెందుతాయి. ఆ స్థితినమును సమాధియని చెబుతారు. ఆధ్యాత్మిక మైథునానికి సమాధిసుఖము అంతిమ స్థితినము"

గాయత్రీ ఉపనిషత్తులోను, సావిత్రీ ఉపనిషత్తులోను అనేక మైథునము తీయబడినవి. వర్ణింపబడినవి. సవిత, సావిత్రీలు దంపతులని చెప్పబడినది. సావిత్రీ, గాయత్రీల

ఆరాధన వేయడం వలన సాధకుడు తన ఆత్మ నొకయోనిగాచేస్తాడు.అందులోసవితా తేజఃపుంజము పరమాత్మ తేజోవీర్యము పడుతుంది.దీనినే 'శక్తిపాతము' అని చెప్పబడినది.శక్తిపాత విజ్ఞానుసారము దీని వలన అమైథున సృష్టి ఉత్పన్నముగాగలదు. కుంతీ కర్ణునకు, మరియమ్మ 'ఏసు' నకు జన్మనీయుట అసంభవము కాదు. దైవీశక్తుల ఉత్పత్తి యీ విధమైన సూక్ష్మమైథునముల వలన జరుగుతుంది. సముద్ర మథనము మైథునము. ఋణ, ధన (నెగెటివ్, పాజిటివ్) పరమాణువుల ఆలింగనము వలన విద్యుత్ ప్రవాహరసముత్పన్న) మవుతుంది. తంత్ర శాస్త్రములో ప్రతిచోట, ప్రతి తంత్రములో మైథునమునుప్రశంసించుట జరిగినది. అదియే యీ సాధనా మైథునము.

తనలో నున్న అంతరంగిక శ్రద్ధను, అభ్యాసశక్తులను సమ్మిళితముగావించి, నవీనశక్తినొకదానినావిర్భవింపజేయుట యేయని సాధనకు అర్థము. దీనినే సిద్ధి' యని,దేవీ శక్తియని, విచిత్రమైన స్థితి, చమత్కారమని నుడువబడుతుంది. యీ విధమైనది లభించడానికి మనవద్ద సాధన ప్రప్రథమంగా కావలెనని దీని పుద్దేశ్యము. మనము వెళ్ల వలసిన స్థానమునకే మార్గము గుండావెళ్లినప్పటికీ, దారిలో ఖర్చునకు రూపాయలు, పైసలు అన్నపానీయములు, వస్త్రాదులు అవసరముంటుంది. అటులనే దైవీశక్తి యేదైనాసరే దానిని గురించి సాధన గావించేటపుడు, సద్గుణములు సదా సద్విచారములు సత్కర్మల అవసరముంటుంది. ప్రారంభం నుండి కలుషిత, పాపపంకిలా పూర్ణ, దూషిత జీవనము గడిపిన వ్యక్తికి సాధనాసంపన్నత్వము సంభవించుట అసంభవము గూడా. కావున వ్యక్తి స్వచ్ఛమైన మనస్సుతో సాధనచేయవలెనని సంకల్పించితే,ఆసాధనవలన ఉన్నత లక్ష్యమును పొందవలెననికోరితే, ఆవ్యక్తి ప్రప్రథమంగా తన మనస్సును, మాటను, శరీరమును శుభ్రపరచు కొనవలె. అపుడే విధమైన సిద్ధికొరకైనా ఆశించగల సమర్థవంతమైన వ్యక్తికా గలడు.

ఆత్మ, పరమాత్మల, సవితా సావిత్రుల,మైథునముప్రగాఢల లింగనా బద్ధమైనపుడు ఫలస్వరూపంగా ఆధ్యాత్మిక గర్భధారణ జరుగుతుంది. దీనినే ఆధ్యాత్మిక భాషయందు 'భర్గ' యని అనియెదరు. భర్గను సాధకుడేయే అంశలలో ధారణగావిస్తాడో అతడు ఆదే స్థానమును తనలో యీ నవ్యతత్వముల కొరకు అర్పణ గావించు కొనవలె. నవ్య తత్వముల స్థాపనకు పూర్వ తత్వములను పోగొట్టవలె, నశింప జేయవలె. యీ సంక్రాంతి కారణము వలన స్వాభావిక క్రియా విధిలో మార్పుజరుగుతుంది. యీ తేడాలక్షణము సాధకునిలో, గర్భవతి స్త్రీ లక్షణముల మాదిరి, అరుచి, వాంతులు మలబద్ధకము, ఆలసటలవలె, ప్రకటమౌతాయి. సరిగా అటువంటి లక్షణములే సాధకునికి గూడా. యీ లక్షణములుఅతని లో వున్నంత వరకు సాధకుని అంతర్యోని పరిపక్వము

చెందుతూ వుండడం పరరక్షించవచ్చు. కుబుసముచే నిండివున్న సర్పము మాదిరి భారమైన, బంధింపబడిన బిగువైన దగుటచే అవసానదశయందున్నట్లుంటుంది. సాధనావస్థలో సాధకుడుగూడా యిదే అవస్థలో వుంటాడని ఆత్మ విద్య నెరిగినాచార్యులకెరుక. అందువలన ఆచార్యులు సాధనాకాలంలో విశిష్టమైన ఆచార వ్యవహారములును ఆలోచనలను పాటించవలసినదిగా ఆదేశిస్తారు. రజస్వలస్త్రీలకు గర్భవతులకు సరిపోయెడి ఆహార విహారములు సాధకులు గూడా పాటించవలె. అపుడే వారా సాధనా సంక్రాంతి దాటగలరు.

మహత్తరమైన కార్యములను చేయదలచిన వారికి, అనేక విధములైన విఘ్నములు, ఆటంకములు, భయము, ప్రలోభన, సంభవిస్తాయి. వీటిని విజయ పూర్వకంగా యెదుర్కొనినవారే, గొప్ప పనులను సాధించడంలో సఫలులవుతారు. ఆహారదోషము, అలసత్వము, అధైర్యము అసంయమనము, ఘృణము, ద్వేషము విలాసజీవనము, కుజనులతోటి స్నేహము అభిమానము మొదలైన వాటివలన సాధకుడు తన మార్గము నుండి వేరవుతాడు. దాని సిద్ధి పొందడం అసంభవమవుతుంది. భ్రష్టాచారము, చోరీసంపాదన ఇతరుల అధికారము అపహరించుట, ఘోరమైన స్వార్థ పరత్వము లాటి దోషములు ప్రస్తుతము బహుళముగా నున్నవి. ఇవి గూడా మానవుని దైవీ అనుగ్రహము పొందుటకు అయోగ్యునిగా చేస్తాయి. కావున వ్యక్తి తన సాధనలో పరిపూర్ణత పొంది సిద్ధి పొందడానికి,వాస్తవంగా అన్నివిధములైన త్యాగములు బలిదానములు చేసి కష్టములను సహించినపుడే, ఆవ్యక్తి సాధన పరిపక్వమై, అభిలషించిన ఫలమును ప్రసాదిస్తుంది.

గుడ్డునుండి పిల్ల బయటకు వస్తుంది. గర్భమునుండి సంతానము జనిస్తుంది. సాధకునికి గూడా సాధనా ఫలితమొకవిధమైన సంతానము. దానినే శక్తి లేక సిద్ధి అని అంటారు ముక్తి, సమాధి, బ్రహ్మస్థితి తురీయావస్థ, మొదలైన పేర్లన్నీ దీనికే. ఈ సంతానము ప్రథమంలో బలహీనంగాను లఘు ఆకారంలో నుంటుంది. గుడ్డులో నుండి బయటకు వచ్చిన పిల్ల ఎముకల గూడులా వుంటుంది. మాతృ గర్భమునుండి వచ్చిన శిశువు కోమలంగా నుంటుంది. అటులనే సాధన పూర్తియైన క్రొత్తగా జన్మించిన సిద్ధుడు గూడా కోమలంగా వుంటాడు. బుద్ధిమంతుడైన సాధకుడా 'సిద్ధి' ని తల్లి పసి వారి నెటులపెంచునో, అటులనే పెంచి పెద్దచేస్తాడు. బాలారిష్టములన్నిటి నుండి కాపాడి పోషిస్తాడు.

సాధన సాధకుని గర్భములో నున్నంతవరకు పచ్చిగా వుంటుంది. అప్పటివరకు అలసట, నిస్సత్తువ చిహ్నములుంటాయి. ఆరోగ్యము క్షీణించి నట్లుగాను ముఖము

తగ్గినట్లుగా నుంటుంది. కాని సాధకుని పరి పక్వమై సుకోమల 'సిద్ధి'యనే సంతానము ప్రసవమైనపుడు సాధకునిలో తేజస్సు ఓజస్సు తేలికతనము, చైతన్యము, ఉత్సాహము వస్తాయి. కుబుసమువిడిచిన సర్పము మాదిరిచలాకీ తనంవస్తుంది. 'సిద్ధి' యనే ప్రసవము జరిగినదా?లేదా? విజయము ప్రాప్తించినదా?లేదా? అని పరీక్షించుట యీ క్రింది లక్షణముల వలన తెలుసుకొన వచ్చు. ఇవి పది లక్షణములు.

1. శరీరము తేలికగాను, మనస్సు ఉత్సాహ భరితంగా నుంటుంది.
2. శరీరములో నుండి యొక ప్రత్యేక సుగంధము వెలువడుతుంది.
3. నాలుకపై మెరుపు, కోమలత్వము మెండుగా వుంటాయి.
4. తామసిక ఆహారముపై అయిష్టత యేర్పడుతుంది. సాత్వికాహారంపై కోర్కె మరలుతుంది.
5. స్వార్థము కొరకు తక్కువ, పార మార్థికత పై అధికధ్యానము.
6. నేత్రముల యందు తేజస్సుంటుంది.
7. ఇతరుల విషయములలో వెల్లడింపబడిన అభిప్రాయములు తమంతట తామె బయల్పడి అత్యధిక భాగములు నిజమవుతాయి.
8. ఇతరుల అభిప్రాయములు మనోవిషయము సులభంగా గ్రహించగలుగుతారు.
9. భవిష్యత్తులో జరుగబోయే విషయములు ముందుగా స్ఫురిస్తాయి
10. శాపమిచ్చినా, ఆశీర్వదించినా సఫలమవుతాయి. తన గుప్తశక్తులతో ఇతరుల కు మంచిగాని చెడుగాని చేయగలడు.

సాధకుని గర్భము పక్వమై సిద్ధి ప్రసవమైనదనడానికి పది లక్షణములు ప్రమాణములు. యీ శక్తిసంతతినే సాధకుడు జాగ్రతగా పాలనచేసి పోషిస్తాడో, బలమైనదిగా తీర్చిదిద్దుతాడో ఆతడు భవిష్యత్తులో ఆజ్ఞాను వర్తులైన సంతానము గల పూజ్యులైన తలితండ్రులమాదిరి ఆనందమయ భోగములనుభవిస్తాడు. అసభ్యంగా 'సిద్ధి' నిదురుపయోగం చేసేవారు, తన స్వల్ప శక్తిని గుర్తించక దానిపై యెక్కువ భారాన్ని మోపి, శక్తిహీనులై, మృత వత్స మాతల పగిలి పశ్చాత్తాప పడవలసివస్తుంది.

## సిద్ధులను దురుపయోగము గావించరాదు

గాయత్రీ సాధన గావించేవారికి అనేక ప్రకారముల అలౌకిక శక్తులు ప్రాప్తిస్తాయి. ఎందువలననగా యిది యొక శ్రేష్ఠమైన సాధన. ఇతర సాధనల వలన ప్రాప్తించే

ప్రయోజనాలు, అన్యయోగములచే ఫలించేసిద్ధులు, గాయత్రీ మంత్రము వలన, సాధనచే పొందవచ్చు. కొన్ని రోజుల శ్రద్ధ, విశ్వాసము, వినయపూర్వక ఉపాసన జరిగినట్లైతే ఆత్మశక్తి యొక్క మోతాదు దినాదినాభివృద్ధి పొందుతుంది. ఆత్మతేజము ప్రకాశించడం ప్రారంభమవుతుంది. అంతఃకరణమునావరించిన మాలిన్యము వదలుతుంది. ఆంతరంగిక నిర్మలత్వము అభివృద్ధి పొందుతుంది. ఫలస్వరూపంగా ఆత్మజ్యోతి తన అసలు స్వరూపాన్ని ప్రకటించడం జరుగుతుంది.

నిప్పుపై నివురు గప్పు కొన్నంతకాలము దాని దాహక శక్తి వ్యక్తము కాదు. దానిని ముట్టుకొన్నంతమాత్రమున విశేషమైన అనుభవముండదు. కాని నిప్పుపై నున్న బూడిదను తొలగించిన వెంటనే, మండే అగ్ని ప్రజ్వలితమవుతుంది. యీ విషయము ఆత్మ యందుగూడా నున్నది. సాధారణంగా ప్రజలు యెక్కువగా మాయాగ్రస్థులు. భౌతిక జీవనంలో బహిర్ముఖవృత్తుల యందు నిమగ్నులై వుంటారు. ఇది యొక్క పరదా. దీనివలన ఆత్మతేజపు ఉన్నత, ప్రకాశము బహిర్గతముకాదు. మనుష్యుడేనాడు అంతర్ముఖుడౌతాడో, ఆత్మను స్పృశిస్తాడో, సాధనద్వారా తన మహాపంకిలమును నిర్మూలించుకొంటాడో, పవిత్రతను సంతరించుకొని ఆత్మదర్శనస్థితిని పొందుతాడు.

ఆత్మపరమాత్మ యొక్క అంశ. అందులో పరమాత్మలోనున్న సప్తతత్వములు, గుణములు, అంశలున్నాయి. అగ్ని యొక్క అన్ని గుణములు నిప్పురవ్వలో లుప్తమై వున్నాయి. కాని అవసరాన్ని బట్టియీ నిప్పురవ్వయే దావానలం మాదిరి పనిచేస్తుంది. ఆత్మపై నున్న మలినము తొలగిన తరువాత, నివారించబడిన తదుపరి, పరమాత్మ యొక్క ప్రత్యక్ష బింబము దృగ్గోచరమవుతుంది. అందులో సకల శక్తులు పరిరక్షింపబడుతాయి. అపుడు పరమాత్మ అంశయైన ఆత్మ, పరమాత్మగా మారుతుంది.

అష్టసిద్ధులు, నవనిధులు ప్రసిద్ధమైనవి. ఇవిగాక అగణిత, చిన్నవి, పెద్దవి, వృద్ధి సిద్ధులున్నాయి. అవిసాధన పరిపక్వమైన తరువాత కనుపించి, పెరిగి పెద్దవవుతాయి యేదైన ప్రత్యేకమైన సిద్ధికొరకు ఘనమైన ప్రయత్నము చేయనప్పటికీ, యువావస్థలో యవ్వన చిహ్నములు గోచరించునట్లు, సాధనా పరిపక్వముతోపాటు సిద్ధులు తమంతట తామే సంక్రమిస్తాయి. గాయత్రీ సాధకుడు నెమ్మది నెమ్మదిగా సిద్ధావస్థ వైపు పురోగమిస్తూ, అగ్రగామి అవుతాడు. ఆతనికి అనేక అలౌకిక శక్తులు దృగ్గోచరమవుతాయి. శ్రద్ధతో గాయత్రీ సాధనలో దీర్ఘకాలము నిష్ఠా పూర్వకంగా తల్లీనమైన వారిలో అనేక విశిష్టతలు స్పష్టరూపంలో గోచరించడం జరుగుట వున్నది- అవి

1. వారిలో వ్యక్తిత్వము, ఆకర్షణ, నేత్రములలో మెరుపు, మాటలో బలము, ముఖంలో ప్రతిభ, గంభీరత, స్థిరత్వము వుంటాయి. వీటి ప్రభావం యితరులపై బలంగా వుంటుంది. అట్టి వ్యక్తుల సంపర్కములోకి వచ్చినవారిపై, వారి వ్యక్తిత్వ ప్రభావముంటుంది. వారు చెప్పినట్లే నడుస్తారు. ఆచరిస్తారు.
2. సాధకుడు తనలో దైవీతేజము వుండడం గమనిస్తాడు. దానిని అనుభవిస్తాడు. తనలో యేదో నవ్యశక్తి పని చేస్తుందని గ్రహిస్తాడు.
3. చెడు పనులయందాతనికి రుచి వుండదు. కార్యములయందు మనస్సులగ్నమవుతుంది. చెడు మార్గావలంబులను గాంచియెక్కువ ఖేదము పొందుతాడు. వారి కొరకు పశ్చాత్తాపము చెందుతాడు. సుఖములలో అధిక ఆనందము పొందడు. దుఃఖములలో, కష్టములలో, ఆపదలలో ధైర్యముండి, కింకర్తవ్యతా విమూఢత యుండకుండుట ప్రత్యేక విశేషమాతనిలో.
4. భవిష్యత్తులో జరుగబోయే సంఘటనలు, ముందుగనే వారి మనస్సులో తెలియబడతాయి. ఆరంభంలో తేలికైన సంగతులు, క్రమక్రమంగా వారికి భవిష్యజ్ఞానము పూర్తిగా కలుగుతుంది.
5. వారి శాపము ఆశీర్వాదము సఫలమవుతుంది. వారు నిజంగా అంతరాత్మలో దుఃఖము కలిగి యెవరికైనా శాపమిస్తే, ఆ శపింపబడిన వ్యక్తి ఘోరవిపత్తుకు లోనవుతాడు. ప్రసన్నులై, అనుగ్రహించి సత్యాంతః కరణులై ఆశీర్వదించితే, మంగళకరమవుతుంది. వారి ఆశీర్వాదము వైఫల్యము కానేరదు.
6. వారు యితరుల మనోభావము చూచిన వెంటనే గ్రహిస్తారు. రహస్యంగా వుంచదలచిన విషయములు గూడా వారి వద్ద దాగవు. వారు యితరుల గుణ, దోషములు, ఆలోచనలను, ఆచరణలను పారదర్శివలె తమ సూక్ష్మదృష్టితో చూడగలరు.
7. వారు తమ భావములను యితరులహృదయములలో ప్రవేశింపచేయగలరు. బహుదూరములోనున్న వారితో, పత్ర సహాయంలేకుండా, టెలిఫోను సహాయం లేకుండా సందేశమివ్వగలరు. పంపగలరు.
8. వారున్నచోట చుట్టూ వాతావరణము శాంతముగా నుంటుంది. వారి సమీపమున కూర్చున్నంతవరకు, వ్యక్తులలో, సాత్వికభావనలు, అద్భుతమైనశాంతి, పవిత్రత అనుభవమవుతుంది.
9. వారు తమ తపస్సులోను, ఆయువులోను భాగమును యితరులకివ్వగలరు. వారిద్వారా యితరుల ప్రయాసలేకుండా లేక స్వల్పప్రయాసముతో అధిక

ప్రయోజనాన్ని, లాభాన్ని పొందగలరు. అట్టి వ్యక్తులు యితరులపై 'శక్తిపాతమును' చేయగలరు.

10. వారికి, స్వప్నంలోను, జాగ్రదావస్థలోను, ధ్యానావస్థలోను, రంగురంగుల ప్రకాశపుంజములు, దివ్యధ్వనులు, దివ్యప్రకాశములు గోచరించుటయే గాక, దివ్యవాణి వినిపిస్తుంది. ఏదో అలౌకిక శక్తివారితో పదేపదే సల్లాపిస్తున్నట్లు, ఆటలాడుతున్నట్లు కనుపిస్తుంది. సాధారణంగా అలౌకికశక్త ప్రభావంతో గాని జరగని విషయముల వారికి అనేక విధములు దివ్య అనుభవములు కలుగుతాయి.

యీ చిహ్నములు ప్రత్యక్ష ప్రకటనములు. అప్రత్యక్షరూపంలో అణిమ, లఘిమ, మహిమ మొదలైన యోగశాస్త్రంలో వర్ణింపబడిన యితర సిద్ధులు గూడా సంకేతముగా లభిస్తాయి. అద్భుతమైన, అలౌకిక ఆశ్చర్యజనక కార్యములను నెరవేర్చుట కప్పుడతడు సమర్థుడౌతాడు.

సిద్ధులు సంభవించేటపుడు, వికాసము గలిగేటపుడు, చాలా సుకుమారంగా జాగ్రత్తగా వ్యవహరించవలె. బాల్యకిశోరావస్థ అంతంలోను, నవయవ్వనావస్థ ప్రారంభంలోను, శరీరంలో వీర్యము యొక్క నవీనత్వము పొడసూపుతుంది. ఆ ఉద్భవకాలమందు మనస్సు, ఉత్సాహకరంగాను, కామక్రీడలయందు వ్యామోహము కలదిగాను, బహుచంచలంగాను వుంటుంది. యీ మనోదశ యందు, నియంత్రణ లేకపోతే తాజావీర్యము అపవ్యయముగావడం జరుగుతుంది. నవయువకుడు కొద్దిసమయంలోనే శక్తిహీనుడు, వీర్యహీనుడు, యవ్వనహీనుడుగా మారి శాశ్వతంగా నిరుపయోగిగా వుంటాడు. సాధనలో సిద్ధి ప్రారంభ దశావస్థలో సాధకుడు తనలో ప్రత్యేక నవీన చైతన్యమును అనుభవిస్తాడు. అందువలన తన మహత్తును ప్రదర్శించుట ద్వారా యితరులపై తన మహత్తు ముద్రవేయవలయునని వాంఛిస్తాడు. యీ క్రమమీవిధంగా జరిగితే ఆ తాజావీర్యము ప్రారంభసిద్ధి తత్వము స్వల్పకాలంలోనే అపవ్యయమై సమాప్తమవుతుంది. సాధకుడు శాశ్వతంగా చుంచెలుకవలె నిరుపయోగిగా తయారవుతాడు.

యీ ప్రపంచములో జరిగే ప్రతికార్యము కర్మఫలాధారంగా జరుగుతుంటా వున్నది యీశ్వరీయ సునిశ్చిత నియమములాధారంగా బంధీకృతమైన జీవులు తమ తమ జీవనమును గడుపుతున్నారు. ప్రాణులకు సేవచేయడానికి సరియైన మార్గము, వారిని సత్కర్మల యందు నిమగ్నులగునట్లు చేయుట. ఆ పదలలో సహించుటకు కావలసిన సాహసాన్ని వారికి కలిగించుట. ఇవి ఆత్మిక సహాయములు. తాత్కాలిక కష్టముల

తొలగుటకు, తెలికపరచుటకు కావలసిన భౌతిక సహాయములు చేయవలె. ఆత్మికశక్తిని ఖర్చుచేసి కర్తవ్యహీన వ్యక్తులను సంపన్నులనుజేసినట్లైతే వారినది అధికంగా నిరుపయోగులను గావించుతుంది. కావున యితరుల సేవకు సద్గుణములు, వివేకము దానము చేయుట శ్రేష్ఠము. దానమివ్వదలచితే ధనము మొదలైన వాటిని దానము చేయవలె. యితరులవైభవమును పెంపొందించుటకు ఆత్మశక్తిని సరాసరి సమర్పించడం తమ శక్తులను పోగొట్టుకొనుటయే. యితరులను ఆశ్చర్యములో ముంచుటకు, తమ అలౌకిక శక్తులను ప్రకటించడమేమనే తుచ్ఛ సంకల్పముతో కష్టసాధ్య ఆత్మబలాన్ని వ్యయం చేయడం, మూర్ఖుడు హోళీ ఆడుటకు యిచ్ఛగించి తన రక్తాన్ని తీసి చిలకరించడం లాంటిది. ఇదే మూర్ఖత్వానికి హద్దు. దూరదర్శియైన ఆధ్యాత్మికవాది ప్రజల నుండి గౌరవమును పొందేటందుకు కించిత్తు గూడా యిష్టపడడు. మానసుర్యాదలను లెక్కచేయడు.

కాని ప్రస్తుతము సమాజంలో వీటికి విపరీతమైన ఆకర్షణ వున్నదని గోచరిస్తుంది. మానవులు యీశ్వరోపాసన, పూజాపునస్కారములు, జపతపములు గూడా లౌకిక ప్రలోభముల కొరకే గావించుచున్నారు. వారు పేకాట, జూదము, లాటరీ మొదలైన వాటిలో గెలుపొందడానికి భజనలు, జపములు చేస్తున్నారు. దేవతలకు మ్రొక్కుకుంటారు. ప్రసాదములు చెల్లించుకుంటున్నారు. యేవిధంగానైనా ధనం పొందడమే వారి ఆ కాంక్ష. దొంగతనం చేసిగాని, జపతపాలవల్లగాని ధనమే రావాలి. కావాలి. వారికి ప్రథమంగా ఉపాసనా జనిత శక్తి లభించదు. బహుశా స్వల్పశక్తి లభించి కొంచెము ధనము సంక్రమించినా, ఆ ధనము వివిధములైన అనుచిత కార్యములలో నష్టమవుతుంది. భవిష్యత్తులో దారి మూసుకుపోతుంది. యితరులకు అరిష్టము కలిగించే విధంగా దైవీశక్తి అయోగ్యులకు సామర్థ్యాన్ని ప్రసాదించదు సామాన్యంగా.

తాంత్రిక పద్ధతి ద్వారా యెవరినైనా చంపడం, మోహాన్వితులనుగావించడం, ఉచ్చాటన జేయడం, వశీకరణం ప్రయోగించడం, రహస్యంగా మనోభావములను ఆచరణలను తెలుసుకొని ప్రకటించడం, ఆతని ప్రతిష్ఠను తగ్గించడంలాంటి పనులు ఆధ్యాత్మిక సాధకులకు సర్వదా నిషిద్ధము. **లోకులచే సిద్ధపురుషుడనిపించుకోవడానికి అద్భుతాలను చూపించడం గాయత్రీ ఉపాసకులకు కఠినంగా వర్జనీయము.** ఒకవేళ యీ భ్రమలో సాధకుడు పడినట్లైతే, కొద్దిరోజులలోనే తన కష్టసాధ్య ఆధ్యాత్మిక శక్తిని కోల్పోయి, చుంచెలుక మాదిరి అల్పుడౌతాడు. ఆతడు ప్రపంచమునకు సత్‌జ్ఞానము దానము చేయడమే మంచిది. దీనివలన నాతడు సాధారణ జనులకు, అంతరంగిక, బాహ్య, సామాజిక కష్టములను చాలవరకు దూరం చేయగలడు. స్వల్ప సాధనలలోనే

స్వర్గీయ సుఖములను ఆస్వాదించుతూ ప్రజలజీవనము సుఖమయం చేయగలడు యీ దిశలో పని చేయడంవలన ఆతని ఆధ్యాత్మిక శక్తి వృద్ధి పొందుతుంది. అటులగాక చమత్కారము చూపించడం, అద్భుతాలను ప్రదర్శించడంలాంటి భ్రమలో పడితే, కొద్దికాలం ప్రజల క్షణిక కుతూహలం, తనంటే ఆకర్షణ. కొద్ది సమయంలో బాగుంటుంది, కాని తనకు, ప్రజలకు అపకారం, చేయడం సంభవం.

పైన చెప్పబడిన విషయాలను గుర్తుంచుకొంటూ మేమీ పుస్తక పాఠకులకు, అనుయాయులకు హెచ్చరించుతూ కఠినంగా ఆదేశించునదేమనగా– 'మీరు మీ సిద్ధులను గుప్తంగా నుంచుకొనండి. ఇతరులపై ప్రయోగించవద్దు. వారికి ప్రకటించవద్దు' అని. దైవీకటాక్షము, చమత్కారము తమకు దృష్టి గోచరమైనా, విశ్వసనీయ, సహృదయ మిత్రులకు తప్ప అన్యులకు తెలియనీయవద్దు. అవసరమనితోస్తే యీ పుస్తకలేఖకునకు తెలియపరచవచ్చు. ప్రాప్తించిన శక్తులను కించిత్ గూడా దురుపయోగం చేయకుండుట గాయత్రీసాధకుల బాధ్యత, కర్తవ్యము. యీ మర్యాదయే సాధకుడు అతిక్రమించకూడదని హెచ్చరిస్తున్నాము".

## గాయత్రి ద్వారా వామమార్గ తాంత్రిక సాధనలు

యీ పుస్తక ప్రారంభంలో గాయత్రీవుత్పత్తిని గురించి చర్చిస్తూ, బ్రహ్మ చే శక్తి ప్రాదుర్భవించినదనీ, ఆ శక్తి రెండు విభాగములుగానున్నదని చెప్పబడినది. మొదటిది సంకల్పమయి గాయత్రి. రెండవది పరమాణుమయి గాయత్రీ. సంకల్పమయి గాయత్రి, ఆత్మికశక్తుల అభివృద్ధికి తద్వారా దైవసాన్నిధ్య ప్రాప్తికొరకు వుపయోగకారి. ఆత్మికగుణములు, విశేషతలు అభివృద్ధి చెందినందున సాధకునకు సాంసారిక కష్టములు దాటుటకు, స్వల్పసాధనతో గూడా సుఖంగా వుండుట, సుఖస్థితిని పొందుట సహజము. యీ యోగ విజ్ఞానమును దక్షిణ మార్గమని ఉద్ఘోషిస్తారు. యిది సత్వగుణప్రధానమై హానిరహితము. వ్యక్తికీ, సమాజానికి అన్నివిధముల హితకరము.

శక్తియొక్క రెండవశ్రేణి పరమాణుమయి గాయత్రి. దీనిని స్థూలప్రకృతియని, పంచభూతములని, భౌతిక సృష్టియని పేర్లతో సంబోధిస్తారు. యిందులో ప్రకృతి యందున్న పరమాణువుల ఆకర్షణ వికర్షణవలన యీ ప్రపంచంలోని నానావిధములైన పదార్థముల వుత్పత్తి, వృద్ధి, సమాప్తి జరుగుతుంది. యీ పరమాణువుల స్వాభావికమైన సాధారణ ప్రక్రియకు పేరు 'విజ్ఞానము'. యీ విజ్ఞానము రెండు భాగములుగా నున్నది. ఒకటి, యంత్రములద్వారా ప్రకృతి పరమాణువులను మన కొరకు వుపయోగించుకొనుట.

రైలు, తంతి, టెలిఫోను, రేడియో, విమానము, టెలివిజను, విద్యుత్‌శక్తి మొదలైనయనేక వైజ్ఞానిక యంత్రములు. యీ విజ్ఞానముద్వారా ఆవిష్కరింపబడినవి. భవిష్యత్తులో వేర్వేరు విధములు రాగలవు. యంత్రవిజ్ఞాన మిదియే.

రెండవది తత్వవిజ్ఞానము. దీని వలన యంత్రములస్థానే మానవ అంతరాళములో నున్న విద్యుత్‌శక్తిని, కొన్ని ప్రత్యేక విశేషతలచే సంపన్నము గావించి, దానిద్వారా ప్రకృతిలోని సూక్ష్మపరమాణువులను, మానవుడు కోరినరీతిలో పరిణామము చెందునట్లుంచుకొనుట. పదార్థరచనము. సంవర్తనము, వినాశనము, యే యంత్రముల సహాయము లేకుండానే, తంత్ర విద్య ద్వారా సంభవము. విజ్ఞానము యొక్క యీ తంత్రభాగమును 'సావిత్రీ-విద్య' 'తంత్రసాధన' 'వామమార్గము' అనే పేర్లతో నుడువుతారు.

తంత్రవిద్య యొక విధమైన స్వతంత్రవిద్య. యీ పుస్తకంలో దానిని గురించి, దాని ఆధారమును గురించి, కార్యమును గురించి చర్చచేయగూడదు. యీ పంక్తుల ద్వారా తంత్రవిజ్ఞానమును గూర్చి పాఠకులకు కొంత పరిచయము చేయవలె. ప్రాచీనకాలంలో భారతదేశంలో విజ్ఞానాచార్యులు, అనేక ప్రయోజనముల కొరకు యీ మార్గమును అవలంబించేవారు. ప్రాచీన ఇతిహాసంలో దీనికనేక సాక్ష్యాధారాలున్నాయి. యీ రోజులలో యంత్ర సహాయంతో గూడా కాని పనులు, ప్రాచీనకాలంలో యంత్రాలు లేకుండా జరిగాయని ఆ సాక్ష్యముల వలన ప్రకటీకృతమవుతున్నది. యీ రోజులలో యుద్ధములలో విలువైన అస్త్రశస్త్రముల ప్రయోగిస్తున్నారు. ప్రాచీన కాలంలో, వారుణాస్త్రము నీటిని వర్షము వలె కురిసేది. ఆగ్నేయాస్త్రము- భయంకర అగ్నిజ్వాలల దావానలాన్ని ప్రకటించేది, సమ్మోహనాస్త్రము- ప్రజలను నిర్వ్యాపారులుగా సంజ్ఞాశూన్యులుగా నొనరించేది. నాగపాశము బిగించి బంధించేది. అవి యీ రోజులలో యెక్కడున్నాయి? యీ ప్రకారము ఇంజిన్, ఆవిరి పెట్రోలులాటివి లేకుండా ఆకాశంలోను, భూమిపై, నీటిలో వెళ్లి గలిగిన రథములు యీరోజులలో ఎక్కడున్నాయి. మారీచునిలా మనుష్యుడు పశువుగా మారడానికి, సురస మాదిరి మహాశరీరాన్ని ధరించడానికి హనుమంతునిలాగా ఈగ శరీరమును (అతిలఘురూపాన్ని) దాల్చడం, సముద్రాన్ని లంఘించడం, పర్వతమునెత్తడానికి, 'నలుని' మాదిరి నీళ్లలో తేలేవంతెన రాళ్లతో నిర్మించడం, రావణుడు, అహిరావణుల మాదిరి లంకా, అమెరికాల (పాతాళలోకం) మధ్యవార్తాలాపం జరగడం, అదృశ్యమవడంలాంటి అనేక అద్భుత కార్యములున్నాయి. యీ పనులు యంత్రముల వలన గూడా జరగనేరవు. కానిఒక సమయంలో యంత్రాలు లేకుండా, కేవలం ఆత్మికశక్తి యొక్క తాంత్రిక వుపయోగంతో సులభంగా పైన చెప్పబడినవి

జరిగాయి. యీ క్షేత్రంలో భారతదేశం చాలా ఔన్నత్యాని సాధించింది. ప్రపంచానికి చక్రవర్తులవలె శాసిస్తూ జగద్గురువులవడానికి కూడా మరియొక కారణము.

నాగార్జునుడు, గోరఖనాథ్, మచ్ఛేంద్రనాద్ మొదలైన సిద్ధపురుషుల తరువాత భారతదేశంలో యీ విద్య నశించుతూ వచ్చినది. యీ క్షేత్రంలో ప్రస్తుతము అధికారులుగా చెప్పడానికి తగిన వ్యక్తులు దొరకడం కష్టసాధ్యములతో గూడిన పని. యీ తంత్ర మహావిజ్ఞానము యొక్క శిధిలమైన అసంపూర్తి అవశేషముల శాఖప్రశాఖలు అచ్చటచట వికలాంగములతో దొరకుతున్నాయి. ఆ చమత్కారములు చూపేవారు అరుదుగా దొరుకుతున్నారు. అందులోని ప్రత్యేకశాఖ- యితరుల శరీరము, మనస్సుపై, మంచిగాని, చెడుగాని ప్రభావమును చూపుట. వీటిని చేయువారు, ప్రయోగము (అభిచారము) చేసి ఆరోగ్యముగా నున్న వారిని రోగులుగా మార్చగలరు. ప్రాణఘాతమైన పీడ, కష్టము, బాధ, జబ్బును కలిగించగలరు. బాధను కలిగించే ప్రాణఘాతుకమై ... ప్రహారమును (దెబ్బను) వేయగలరు. కొంతమంది యొక్క బుద్ధిని పాడు ...గలరు. వారిని పిచ్చివారిగా, ఉన్మత్తులుగా, నిక్షిప్తులుగా, మందబుద్ధులుగా, వ్యతిరేకంగా ఆలోచించేవారుగా చేయగలరు, భ్రమ, భయము, సందేహము. అనుమానం వ్యాకులతతో గుండె దడదడలతో చిక్కుకొనునట్లుచేసి ఆతనిని మానసిక వ్యవస్థను అస్తవ్యస్తము చేయగలరు. యీవిధంగా అప్రత్యక్షచేతనా శక్తిద్వారా యితరులపై చెడు ప్రభావమును గల్గించివారిని దూరం చేయగలరు. దృష్టితగులుట, ఉన్మాదము, భూతోన్మాదము, గ్రహారిష్టములు, చెడురోజులు యితరులచే ప్రయోగము చేయింపబడుట, మానసోద్వేగము మొదలైన వాటిని శాంతింపచేయవచ్చు. శారీరక రోగముల నివారణ, సర్ప..., వృశ్చికముల కాటుల విషములను తగ్గించవచ్చును. మంత్రముద్వారా చిన్న పిల్లలపై యీ విద్య సులభంగా చెడు ప్రభావాన్ని చూపగలదు.

తంత్ర సాధనద్వారా సూక్ష్మ జగత్తులోచరించే అనేక చేతనాగ్రంధులను, కొన్ని విశేషగ్రంధులను తన కొరకు మేల్కొనజేసి, చైతన్యంగాను, క్రియాశీలముగాను, తననుసరించునట్లు చేయవచ్చు. అనేకమంది తాంత్రికులు భూతములను, పిశాచములను, భైరవుని, ఛాయాపురుషుని బ్రహ్మరాక్షసిని, బేతాళుని, కర్ణపిశాచిని, త్రిపుర సుందరిని, కాళరాత్రిని, దుర్గ మొదలైన వారి సిద్ధి పొందడం గమనించబడినది. సేవకుడు ప్రత్యక్ష శరీరముతో యజమానికి నౌఖరీచేస్తూ, ఆజ్ఞానుసారం నడుచుకొంటాడు. అటులనే యీశక్తులు అప్రత్యక్షరూపముతో, తంత్రసిద్ధ పురుషుని వశమై యెల్లపుడూ ఆ పురుషుని సమీపమున వుంటాయి. ఆజ్ఞ యిచ్చిన వెంటనే తమసమర్ధతానుసారం

పూర్తిచేస్తాయి. దీనితోవారు అపుడపుడు చేసే అద్భుత కార్యములను గాంచి దిగ్భ్రాంతులవడం జరుగుతుంది.

జరిగేదేమిటనగా, అదృశ్యలోకపు 'చేతనాగ్రంధులు సదా సంచారము చేస్తుంటాయి. తాంత్రిక సాధనా విధానముల ద్వారా తమకు కావలసిన యోగ్యగ్రంధులను సంగ్రహించి వాటికి ప్రాణమీయడం జరుగుతుంది. అవి ప్రాణగ్రహీతలైన వెంటనే, వాటి ఆక్రమణ సాధకునిపై నుంటుంది. తన ఆత్మిక బలంతో ఆ ఆక్రమణను సహించగలిగితే, వాటికి లోబడకుండా వున్నయెడల, ప్రతిగా హితముగోరి ఆ గ్రంధులు సాధకుని వశవర్తులై, యిరువదినాలుగుగంటలూ ఆతని సాన్నిధ్యము నందుంటూ సేవకునివలె పనిచేస్తాయి.

అటువంటి సాధనలు చాల అపాయములతో కూడు కొన్నవి. నిర్జనప్రదేశము, స్మశానము మొదలైన భయంకర ప్రదేశములలో, అటువంటి రోమాంచితవిధాన వ్యవస్థ నాచరించ వలసి వుంటుంది. యీపనులు సాధారణమనుష్య హృదయాన్ని కలవరపరుస్తాయి. ఆ సమయంలో ఘోరమైన అనుభవములు జరుగుతాయి. కొన్ని సమయాల్లో భయముపొందుట, జబ్బుపడుట, పిచ్చిపట్టుట లేక మృత్యుముఖములో నుండుటకు అవకాశమున్నది. ఆ సాధనలందరూ చేయలేరు. బహుశా పూర్తిగా చేసినప్పటికీ, ఆ శక్తులు అదృశ్యంగా తమ వద్ద నుండుటకు కష్టసాధ్యమైన షరతులుంటాయి. వాటిని పాటించడం వీలుకాదు. యీ కారణమువలననే, యీమార్గమున పయనించ దలచుటకు కొద్దిమంది మాత్రమే సాహసిస్తారు. అందులో కొద్దిమంది మాత్రమే విజయము పొందుతారు. ఆవిజయం పొందిన వారిలో కొద్దిమంది మాత్రమే అంత్యము వరకు ఆశక్తులవలన సముచిత లాభాన్ని పొందుతారు. యీతంత్ర సాధనల విధులను చెప్పుటకు మాకిష్టము లేదు. యేలనన, గోప్యంగా వుంచవలసిన రహస్యములను, సాధారణ జనులకు ప్రకటించిన యెడల దాని అర్థము బాలురక్రీడాస్థలములో తుపాకీమందు వెదజల్లినట్లవుతుంది. క్రీడాకుతూహలంతో సర్వనాశనము సంభవిస్తుంది. యీతాంత్రిక సాధనాపరంపర అధికారులైనవారు, అధికారాధారముపై, ఒకరు యింకొకరికి నేర్పవలసి వుంటుంది. మాకు స్వయంగా యీ మార్గముపై ప్రాణఘాతుక అపాయముల ననుభవించిన చేదు అనుభమున్నది. కావున అమాయకులు, భోళాభాళీ పాఠకులకు అపాయము కల్గించుటకు, ఆ శిక్షణా విధులనెట్లు వ్రాసి చంపుటకెట్లు కోరుదుము? మేమీ పంక్తులద్వారా యిష్టపడునదేమనగా, కేవలము వాంచించున దేమనగా, ప్రకృతి యొక్క పరమాణుమయి సావిత్రీ శక్తిపై గూడా ఆత్మిక విద్యుత్‌ద్వారా పూర్వము అధికారం చేయబడినదనీ, భవిష్యత్తులో ఆశక్తులను లోబరచుకొనవచ్చునని తెలియ పరచడమే.

ప్రస్తుతము యంత్రములు చేసే పని మాదిరి, అంతరంగిక విద్యుత్‌తో చేసే వ్యక్తులు కనుపించడం లేదు అనేది వాస్తవము. గడచిన రెండు వేల సంవత్సరాలలో క్రమక్రమంగా యీ విద్యలుప్తమైనది. ఇపుడీవిద్య తెలిసిన జ్ఞాతలు వెదకినా లభ్యమగుటలేదు. నేటి వివిధ రకముల యంత్రముల కారణము వలన ఇది వరకటి అవసరము లేదు. కాని ఆ మహావిద్యయొక్క ప్రకాశము సాగుతూనే వుండవలె. యీ లుప్తమైన మహా తాంత్రిక విద్యను, సావిత్రీని సాటిలేని పరిశ్రమద్వారా పునర్జీవింపజేయవలసిన బాధ్యతనేటి తాంత్రికులపైనున్నది. తద్వారా భారతీయ విజ్ఞాన మహత్తును ప్రపంచమునకు ప్రకటించవలసిన కర్తవ్యము వారిది.

యీ రోజున తాంత్రికులు చేయగలపనులు తక్కువేమీ గాదు. అల్పమైన ఆశ్చర్యజనకములు గూడాగావు. మహత్వపూర్ణమైనవే. కానీ పరమాణు ప్రకృతిపై ఆత్మశక్తి ద్వారా అధికారము, మన పూర్వీకులవలె పొందేటంతవరకు, ప్రస్తుత తాంత్రిక మార్గాములు నిశ్చింతగా, మౌనంగా స్తబ్దంగా వుండగూడదు.

వర్తమాన కాల తాంత్రిక విజ్ఞానపు అంశ ప్రాబల్యము, జ్ఞాత, క్రియాన్వితను గూర్చిపైన చర్చింపబడినది. మనుష్యులపై అదృశ్యంగా, మంచిగాను, చెడుగాను వుండేటట్లు ప్రభావం చేయడం నేటితాంత్రిక విజ్ఞానపు ధోరణి, మర్యాదగా నున్నది. వస్తువుల రూపాంతరము, పరివర్తనము ప్రకటీకరణము, అల్ప, అనల్పజాతిపరమాణువుల ఏకీకరణ గావించడం, వాటిని శక్తిగా ప్రయోగించడం ప్రస్తుతము బహుశః లుప్తము. చైతన్య గ్రంథులను మేల్కొలిపి, వాటిని వశపరచుకొని, అజ్ఞానువర్తులగావించుకొన్న విక్రమాదిత్యుల లాంటివారు నేడులేరు. కాని దీంతోపాటు మేము స్పష్టం చేయదలచిన విషయమొకటున్నది. నేడు తంత్ర విద్య పేరుతో సాధారణంగా మోసగించడం పరిపాటియై నున్నది. అటువంటి వారే యెక్కువమంది. వీరు ధనవ్యామోహముచే, లేకపారస్పరిక రాగద్వేషములచే, యితరవ్యక్తుల హాని కలిగించే చేష్టలు చేస్తారు. వారి ప్రయత్నంలో యెంతవరకు సఫలీకృతులౌతారో, వారు చెప్పేదానిలో, చేసేదానిలో సత్యమెంత వున్నదో, అది వేరే విషయం. కాని వారి విద్యనిటుల వుపయోగించినందువలన జరిగే పరిణామములు మాత్రము వారికి, వారి విద్యకు మంచిది కాదు. ప్రతిష్ఠాకరముకాదు. గొప్పవారు దీనిని వుపయోగములేని దానినిగా భావిస్తున్నారు.

**తంత్రశాస్త్రములో అనేక మంత్రములున్నాయి. ఆ మంత్రములన్నీ చేసేపని గాయత్రీ మంత్రముద్వారా చేయవచ్చు.** గాయత్రీయొక్క సంకల్ప శక్తి సాధన యీ పుస్తకంలో సవిస్తరంగా వ్రాయబడినది. కారణమేమనగా, గాయత్రీ మంత్రము సర్వులకూహితకారి. సులభము, సర్వమంగళమయము. పరమాణుమయి తంత్ర

ప్రధానము, వామమార్గ సావిత్రీ-విద్య విషయములు చాలా గోపనీయము. వాని పరిచయము మాత్రమే యీ పంక్తులయందీయబడినది. దీనికి సంబంధించినంతవరకు రహస్యమైన విషయములపై అధికంగా ప్రకటించుట, తత్సంబంధమైన సాధనలను బయల్పరచుట, ప్రజాహితమునభిలషించిన వుపయోగకరము, హితకరము కాదు. అందువలన పురోగమించకుండా యిచట సమాప్తము చేయడమైనది.

## గాయత్రీద్వారా కుండలినీ జాగరణ

శరీరంలో అనేక సాధారణ, అనేక అసాధారణ అంగములున్నవి. అసాధారణ అంగములను 'మర్మస్థానము'లని సంభోదిస్తారు. కేవలము చాలా సుకోమలమైనందున గానీ, వుపయోగకరములైనంత మాత్రమునగాని వాటిని 'మర్మస్థానము'లనలేదు. పోగా యీస్థానములయందు ఆధ్యాత్మిక శక్తుల మహత్వపూర్ణ 'కేంద్రము'లున్నాయి. గనుక వీటిని 'మర్మస్థానములన్నారు'. యీకేంద్రములలో కొన్ని 'బీజములు' సురక్షితంగా వుంచబడినాయి. వీటి యొక్క ఉత్కర్ష, జాగరణము జరిగినపుడు మనుష్యుడేదో శక్తిని పుంజుకొనినవాడై, గణనీయడౌతాడు. అందులో ఆత్మికశక్తి ప్రవాహము పొంగిపొరలుతూ వుంటుంది. వాటి, ఫాటమరింపు 'అభివృద్ధి యొక్క ఫలితమొక భండారమగుట నిశ్చయము. యిదియే సాధారణ ప్రజలకు' అలౌకిక ఆశ్చర్యకరము.

యీ మర్మస్థలములలో మేరుదండములేక వెన్నుముక ప్రముఖస్థానమును వహించుతుంది. మేరు దండము శరీరమునకు ఆధారశిల. యీమేరుదండము ముప్పదిమూడు (33) అస్థిఖండముల కలయిక వలన యేర్పడినది. యీ ప్రత్యేక అస్థిఖండములయందు, తత్వదర్శకులు విశేష శక్తులను పరిరక్షించెదరు. యివి దైవీ సంబంధ స్థానములు. దేవతల శక్తులకే స్థానములు కేంద్రమై యున్నవో, ఆశక్తులు భిన్నభిన్న రూపములలో మేరుదండపు యీ అస్థిఖండములలో నుండి పొందవచ్చును. అందువలన మేరుదండపు ముప్పది మూడు అస్థిఖండములు ముప్పదిమూడూ (33) దేవతలకు ప్రాతినిధ్యము వహిస్తున్నరని నిష్కర్షగా చెప్పబడినది. అష్టవసువులు, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, యింద్రుడు, ప్రజాపతి. (8+12+11+1+1+=33) యీ ముప్పది మూడు శక్తులు మేరుదండపు అస్థిఖండములలో బీజరూపములోనున్నవి.

యీ పొలిపోయిన రంగులో నున్న మేరు దండములో శరీర విజ్ఞానుసారము అనేక నాడులున్నాయి. యీ నాడులు వివిధ కార్యములకు నియోగింపబడినవి. ఆధ్యాత్మిక విజ్ఞానుసారము వాటిలో ప్రముఖ నాడులున్నవి. 1. ఇడ 2 పింగళ 3 సుషుమ్న. యీ మూడు నాడులు వెన్నెకమును చీల్చి ప్రత్యక్షరూపంలో కండ్లతో

చూచుటకు వీలులేదు. వీటి సంబంధము సూక్ష్మ జగత్తుతో మాత్రమే. యిదియొక విధమైన విద్యుత్ ప్రవాహము. విద్యుత్ నడిచేయంత్రములలో 'నెగెటివ్' పాజిటివ్ ధన, ఋణధృవముల కలయిక జరిగేచోట శక్తియేవిధంగా వుద్భవిస్తుందో, యీ విధంగా 'ఇడ' నునెగెటెవ్, 'పింగళ' ను పాజిటివ్‌గా చెబుతారు. ఇడను చంద్రనాడియని, పింగళను సూర్య నాడియని గూడా అంటారు. యీరెండు కలిసి వుద్భవించే మూడవ శక్తిని సుషుమ్నయని పిలుస్తారు. ప్రయాగలో గంగానది, యమునా నది కలుస్తాయి. యీ రెండూ కలసినందువలన మూడవ సూక్ష్మ ప్రవాహమువేరే తయారవుతుంది. దానినే సరస్వతీ నదియని పిలుస్తారు. అదేవిధంగా మూడు నదులు కలసి త్రివేణి అవుతాయి. మేరుదండపు అంతర్గతంలో గూడా అటువంటి ఆధ్యాత్మిక త్రివేణి వున్నది. 'ఇడ' 'పింగళ'ల రెండుధారలు సమ్మేళనము చెంది సుషుమ్న యనునది సృష్టింపబడుతుంది. ఒక పరిపూర్ణ త్రివేణి తయారవుతుంది.

యీ త్రివేణికి పైన మస్తిష్కములో మధ్య కేంద్రము నుండి, బ్రహ్మరంధ్రము గుండా, సహస్రార కమలమునకు సంబంధము కలిగి వుండి మరియు అధోభాగంలో మేరుదండపుకొన చివరవరకు వున్నది. అచట లింగమూలము మరియు గుదస్థానమునకు మధ్య అతుకు యందు నిట్టనిలువుగా చేరి అచట ఆగిపోతుంది. ఇది యీత్రివేణి ఆద్యము, అంతములు.

సుషుమ్నానాడియందు లోపల మరియొక త్రివేణి యున్నది. దాని అంతర్గతములో గూడా మూడు అత్యంత సూక్ష్మప్రవాహములు ప్రవహిస్తూ వుంటాయి. వాటిని వజ్రనాడి, చిత్రణి, బ్రహ్మనాడియని ఉటంకిస్తారు. అరటిచెట్టుబోదెను ఖండించినపుడు, దానిలో ఒకదానిలో వేరొక పొర కనుపించునట్లు, సుషుమ్నలోపల వజ్రనాడి వున్నది. వజ్రలో చిత్రణి, చిత్రణిలో బ్రహ్మనాడి వున్నవి. యీ బ్రహ్మనాడి అన్ని నాడులలోకెల్లా మర్మస్థలమైనది. కేంద్రము. శక్తిసారము. యీ మర్మమును రక్షించుటకే దానిపై యిన్ని పొరల మడతవేయబడినది.

యీ బ్రహ్మనాడి మస్తిష్క కేంద్రంలో-బ్రహ్మరంధ్రములో చేరి, అనేకవేల భాగములుగా నలుదిశల వ్యాపించుతుంది. ఇందువలననే దీనిని సహస్రదళకమలము అని పిలుస్తారు. విష్ణుభగవానుని శయ్య సహస్రఫణి శేషుడని అలంకారికంగా అనడం యీ సహస్రదళమును గూర్చియే. భగవాన్ 'బుద్ధుడు' లాంటి అవతారపురుషుల మస్తకములపై, ప్రత్యేకమైన వెంట్రుకల ముడిని వారి మూర్తి చిత్రములలో చూస్తాము. అవి సాధారణ వెంట్రుకలు గావు. మీదు మిక్కిలి సహస్రదళ కమలపు కళాత్మక చిత్రము. యీ సహస్ర దళము సూక్ష్మ లోకములలోని విశ్వవ్యాపక శక్తులతో సంబంధము కలిగి వుంటుంది.

రేడియో ట్రాన్స్‌మీటరు ధ్వనివిస్తారము తీగెద్వారా వెంటనే వ్యాపింపజేస్తుంది. దీనిని 'ఏరియల్' అంటారు. తంతువుల ద్వారా సూక్ష్మాకాశంలో ధ్వనివిసరివేయబడుతుంది. విస్తరించుతున్న తరంగములు గ్రహించబడతాయి. మస్తిష్కములోని 'ఏరియల్' సహస్రదళకమలము. దీని సహాయంతో పరమాత్మయొక్క అనంతశక్తులను సూక్ష్మ లోకంలో గ్రహించవచ్చు. ఆకలితో నున్న 'కొండచిలువ' మేల్కొని దీర్ఘశ్వాసను పీల్చినపుడు ఆకాశములో యెగురుతున్న పక్షులను తన తీవ్రశక్తితో బంధిస్తుంది. ఆపక్షులు మంత్ర ముగ్ధులవలె కొండచిలువ నోటియందు ప్రవేశిస్తాయి. అదేవిధంగా మేల్కొని జాగ్రదావస్థను గాంచిన సహస్రముఖి శేషనాగు సహస్రారకమలము అనంత ప్రకార సిద్ధులను లోక లోకాంతరములనుండి ఆకర్షించుతుంది. 'కొండచిలువ' యేవిధంగా కోపమొచ్చినపుడు విషమునుగ్రక్కినపుడు ఆ విషము వాయుమండలంలో కొంత పరిధివరకు విషగ్రస్థమవుతుందో అదేవిధంగా జాగ్రదావస్థలో నున్న సహస్రార కమలము ద్వారా శక్తివంతమైన భావన తరంగములను ప్రవహింపజేసి, సాధారణ జీవజంతువులనూ, మనుష్యులనేకాక, సూక్ష్మలోకములోనున్న ఆత్మలను గూడా ప్రభావింపజేయడం, ఆకర్షించడం చేయవచ్చు. శక్తివంతమైన ట్రాన్స్‌మీటర్ ద్వారా చేయబడిన బ్రాడ్‌కాస్ట్ అమెరికానుండి, భారతదేశములో వినవచ్చు. శక్తివంతమైన సహస్రారము ద్వారా నిక్షేపించబడిన భావనాప్రవాహము గూడా లోక లోకాంతరములతోనున్న సూక్ష్మతత్వము లను వికసింప చేస్తుంది.

యిపుడు మేరుదండపు క్రింద భాగములోనున్న మూలిమును పరిశీలించుదాము. సుషుమ్నలోపలనుండే మూడునాడులలో అన్నిటికంటె సూక్ష్మమైన బ్రహ్మనాడి మేరుదండపు అంతిమభాగమునకు సమీపమున, నల్లటివర్ణముగలిగి, షట్కోణములు గల పరమాణువుతో అతుకుకొని బంధింపబడి వుంటుంది. బలం కోసం గోడలో మూల గట్టిగా బంధిస్తాముతాడుతో.

అటులనే షట్కోణ కృష్ణవర్ణ పరమాణు నుండి బ్రహ్మనాడి బంధించబడి వున్నది. యీ శరీరములో బంధించడానికి, వ్యవస్థ నిర్మింపబడినది. యీకృష్ణవర్ణ షట్కోణ పరమాణువును అలంకారిక భాషలో 'కూర్మము' అని గూడా వ్యవహరిస్తారు. యేలననగా దాని ఆకృతి తాబేలు వలెనుంటుంది గాబట్టి. పృథ్వి కూర్మభగవానుని వీపుపై నున్నది. యీ అలంకారమునకు తాత్పర్యము జీవన-గ్రహము యీ కూర్మ పురాణముపై నిలిచివున్నదని. శేషనాగుతలపై పృథ్వి నిలిచి వున్నది. యీ 'ఉక్తి'కి ఆధారం బ్రహ్మనాడి ఆ ఆకృతి గలది. దీనిలో కూర్మముతో కలసి బిగాయించినది. జీవము ధరించియున్నది. బ్రహ్మనాడి తన ఆధారాన్ని త్యాగము చేసినట్లైతే. యీ

జీవన రూపము- (మాయామయ ప్రపంచము) చూర్ణమై పోవడానికి క్షణం గూడా ఆలస్యముగాదని తెలుసుకొనవలె.

కూర్మము నుండి బ్రహ్మనాడి యొక్క గుదస్థలమును ఆధ్యాత్మిక భాషలో 'కుండలినీ' అని వక్కాణిస్తారు. నల్లటిరంగు గల మనుష్యుని నల్లనివాడు అని సంబోధిస్తారు. అదేవిధంగా, కుండలీకారముతోనున్న, యీ ఆకృతిని కుండలిని అని చెప్పబడినది. ఇది మూడున్నర సార్లు మెలివేయబడి ఆకూర్మములో వేయబడినది. దాని ముఖము అధోముఖము. వివాహ సంస్కారములలో దీనిని అనుసరిస్తూ ప్రదక్షిణము లేక తిరుగుట వుంటుంది. సులువు కోసం నాలుగు మూడుసార్లు ప్రదక్షిణము వేయించడం, ముఖమును క్రిందకు దించుకొనేటట్లు చేయడం, యీ కుండలినీ ఆధారముపైననే నెలకొల్పబడినది. కారణము భావి జీవన నిర్మాణ వ్యవస్థ ఆధారశిల, 'కూర్మము', మరియు, బ్రహ్మనాడుల కలయిక మాదిరిగా నుండి, శరీరము, ప్రాణముల కలయిక, కుండలినీ శక్తివలె మహత్వపూర్ణమై వుంటుంది.

యీ కుండలినీ మహిమ, శక్తి, వుపయోగము మహత్తరము. దీనిని సరియైన పద్ధతిలో సంపూర్ణముగా తెలుసుకొన్నపుడు మనుష్యుని బుద్ధిలో చలనము కలుగుతుంది. భౌతిక విజ్ఞానాన్వేషులకు నేడు పరమాణువు చిక్కు సమస్యగా నున్నది. పరమాణువును విచ్ఛిన్నము చేయు ప్రక్రియ కనుగొన్నంతనే, ఆశ్చర్యకరమైన ప్రపంచము ప్రళయంకరమై పరమాణుబాంబు రూపంలో కనుగొన్నది. ప్రస్తుతము దాని విశేష విధ్వంసక రచనాత్మకత విచారణాంశము. సర్ ఆర్థర్ కథనం ప్రకారం - "పరమాణుశక్తి యొక్క పూర్తి విజ్ఞానము మనుష్యునకు పూర్తిగా గ్రాహ్యమైనపుడు, ఆతనికసంభవమేమియు లేదు. మానవుడు సూర్యుని చిన్నచిన్న ఖండములుగాజేసి తన వాడిలో నుంచుకొంటాడు. వాంఛించిన వస్తువులను, యిష్టమొచ్చిన రీతులలో ప్రాణులను సృష్టించగలడు. మొత్తం ప్రపంచం ఒకేపేటలో నివసించేవిధంగా చేయగల యంత్రము లాతనివద్ద నుండగలవు. వ్యక్తి కోరిన యెడల క్షణంలో రానూవచ్చు. పోనూవచ్చు. యెవరికి యేదడిగినా యివ్వవచ్చు. దేశదేశాంతరములలో నున్న వ్యక్తులు మూకగాచేరి, యిద్దరు మిత్రులు గప్పాలు కొట్టుకునే విధంగా, మాట్లాడుకొనగలరు".

జడజగత్తులోని వాకపరమాణువు యొక్క శక్తిని వూహించనలవిగానిది దాని మహత్తర శక్తి లక్షించినచో ఆశ్చర్యమునకు అవధులుండవు. కాని చైతన్య జగత్తు యొక్క విస్ఫులింగము జడ పరమాణు శక్తికంటె అనంతమైనరెట్లు శక్తిశాలిని. దీని అద్భుత శక్తి కల్పనకు గూడా అందుట దుర్లభము.

యోగులలో అనేక విధములైన అద్భుతశక్తులుండుట వర్ణించబడినది. దానికి అనేక ప్రమాణములున్నవి. యోగ సిద్ధులను గూర్చి అనేక గాథలు మనము విన్నాము. కొన్ని ఆశ్చర్యజనకములు. వీటి నిజమెంతయో, విశ్వసనీయమో తెలియదు. చెప్పజాలము. విజ్ఞానము తెలిసికొన్నవారు, పరమాణు చైతన్యస్ఫులింగ శక్తుల గురించి తెలిసిన వారికివి ఆశ్చర్యమనిపించవు. నేడు పరమాణుశక్తిని పరిశోధించుటకు దేశ దేశములలో ప్రత్యేకవ్యవస్థలున్నమాదిరి, పూర్వకాలంలో ఆధ్యాత్మిక విజ్ఞానవేత్తలు, తత్వదర్శులైన ఋషులు, మానవ శరీరాంతర్గత బీజరూప పరమాణువు యొక్క ఆత్మను పరిశోధించారు. రెండు పరమాణువులను విచ్ఛిన్నము చేయడానికి, సమ్మేళనము చేయడానికి, స్థానభ్రంశము చేయుటకు సర్వోత్తమమైన స్థానము కుండలినీ కేంద్రములో నున్నది. యేలననగా యితర చోట్లనున్న అన్ని చైతన్య పరమాణవులు గుండ్రము గాను మృదువుగా నుంటాయి. కాని కుండలినీలో యిది మిథునమువలె కలసి వుంటుంది. యురేనియం ప్లూటోనియ ధాతువులలో పరమాణువుల నిర్మాణము వక్రత, వంకర పద్ధతిలో నుంటుంది. వీటిని విచ్ఛిన్నము చేయుట యితర పదార్థముల పరమాణువులకన్నా అధిక సరళము. అదే ప్రకారం కుండలినీలో నున్న స్ఫులింగ పరమాణువుల గతివిధిని యిచ్ఛానుసారము సంచలింపజేయుట చాలా సులభము. సుగమము. అందువలన ప్రాచీనకాలంలో కుండలినీ జాగరణకొరకు యెక్కువ తత్పరతతో పరిశోధించబడినది. నేడు అదే విధంగా పరమాణు విజ్ఞానమును గురించి పరిశోధన జరుగుతూ వున్నది. యీ పరిశోధనలో, ప్రయోగముల ఫలస్వరూపంగా అనేక రహస్యములు పూర్వులకు కరతలాగతమైనవి. వాటిని నేడు 'యోగ చమత్కారములు' అని పిలుస్తున్నారు.

'మేడమ్ బ్లైవెటిస్కీ' కుండలినీ శక్తి విషయంలో తగినంత శోధన గావించినది. ఆమె యిలా వ్రాసినది- కుండలినీ విశ్వవ్యాపకమైన విద్యుచ్ఛక్తి. ఇది స్థూల విద్యుత్‌కన్నా అనేక రెట్లు అధిక శక్తి కలిగి. దీని నడక, పాకడ సర్పము వలె వంకరగా వుంటుంది. అందువలన దీనిని సర్పాకారము కలదని వచిస్తారు. కాంతివేగము ఒకలక్షాయేబదివేలయేళ్లు, కాని కుండలినీ వేగము 3,45,000 మైళ్లు. పాశ్చాత్య వైజ్ఞానికులు దీనిని 'స్ప్రెడ్-ఫైర్' అనియు, 'సర్పెన్‌టైల్‌పవర్' అని నుడివినారు. యీ సంబంధంలో సర్‌జాన్‌వుడ్‌రాఫ్ అధికంగా, విస్తృతంగా తర్కించి విశ్లేషణ గావించాడు.

కుండలినీ గుప్త శక్తుల ఇనుపపెట్టెగా అభివర్ణింపబడినది. రహస్యమైన పరిస్థితులలో బహుమూల్యమైన రత్నములను నిక్షేపించుటకు అజ్ఞాత స్థానంలో ఇనుపపెట్టెను

వుంచుతారు. దానికి చాలా తాళములు వేస్తారు. లేకపోతే ఇంటిలోని వారుగాని, బయటి అనధికారులుగాని, ఆ ఖజానాలో నుంచబడిన సంపత్తిని కాజేయడానికి అవకాశమున్నది. పరమాత్మ మనకు అనంతశక్తుల అక్షయభండారమునిచ్చి, దానికి ఆరుతాళములు వేశాడు. తాళములెందుకు వేశాడంటే, పాత్రతవచ్చిన వెంటనే ఆ ధనము యొక్క ఉత్తరాధికారిత్వము సవ్యంగా తెలుసుకొంటాడని, సంపత్తినంతను స్వాధీనము చేసి కొనగలడని. ఆ ఆరుతాళముల, తాళపుచెవులు మనుష్యునకు స్వాధీన పరచినాడు. సమయమొచ్చినపుడాతాళములను తెరచి తదనుగుణమైన లాభము పొందుతాడని.

యీ ఆరుతాళములు కుండలిని పై నుంచబడినవి. యివి ఆరుచక్రములని చెప్పబడినవి. యీచక్రములను తెలుసుకొని జీవుడు కుండలినీ సమీపమునకు చేరగలడు. వాటిని యథోచితంగా వుపయోగించి జీవనలాభమును పొందగలడు. అందరికీ కుండలినీ సాధారణంగా అస్తవ్యస్త వ్యవస్థలో పడి వుంటుంది. కాని దానిని మేల్కొలిపినట్లులైన, అది తన స్థానము నుండి వైదొలగుతుంది. అపుడు పరమాత్మ లోకమునకు ప్రవేశమేర్పడి, ఆయన శక్తులన్నీ సంక్రమిస్తాయి. మహా, మహా గుప్త నిక్షేపములు ప్రాచీన కాలములో భూమిలో నిక్షిప్తపరచబడినపుడు సర్పమును కావలిదారుగా నుంచే సాంప్రదాయమున్నది. ఖజానా ముఖద్వారమున చుట్టచుట్టుకొని న సర్పము సర్వదా కూర్చుని వుంటుంది. కాపలా కాస్తుంటుంది.

దేవలోకము గూడ అటువంటి ఖజానాయే. దాని ముఖములో షట్కోణ కూర్మపు శిల వుంచబడినది. శిలతో మేళవింపబడి భయంకరసర్పిణి కుండలిని బిడాయించివున్నది. ఆ సర్పిణి అధికారియైన సత్పాత్రత గలిగిన వారికై ప్రతీక్ష చేస్తూ వుంటుంది. అట్టి అధికారి దాని సమీపమునకు వచ్చిన వెంటనే, నిరోధించ కుండా, హాని చేయకుండా, తన స్థానమును వదలితొలగియిచ్చి, అధికారి కార్యము సఫలమవడానికి వీలు కల్గించుతుంది.

కుండలినీ జాగరణ ప్రయోజనాలను అభివర్ణిస్తూ, అనుభవజ్ఞుడైన సాధకుడిలా వ్రాశారు- "భగవతీ కుండలినీ కృపవలన సాధకుడు సర్వగుణసంపన్నుడౌతాడు. అన్నికళలూ, అన్ని సిద్ధులూ, అతనికి అనాయసంగా ప్రాప్తించుతాయి. ఆ సాధకుడు నూరు సంవత్సరములు సంపూర్ణ ఆరోగ్యంతో దృఢంగా వర్ధిల్లుతాడు. అతడు తన జీవితమును పరమాత్మ సేవకు అంకితము చేస్తాడు. పరమేశ్వరాదేశానుసారము లోకోపకారము గావించుతూ, అంతంలో స్వేచ్ఛగా కళేబరమును విసర్జించుతాడు.

# షట్చక్రములు

ఆజ్ఞా చక్రము
విశుద్ధచక్రము
అనాహత చక్రము
మణిపూరక చక్రము
స్వాధిష్ఠాన చక్రము
మూలాధార చక్రము

కుండలినీ శక్తిసంపన్న వ్యక్తి, పరిపూర్ణంగా నిర్భయంగా, ఆనందమయంగా వుంటాడు. భగవతీదేవి యొక్క కృప వానిపై సంపూర్ణంగా వుంటుంది. ఆమె యొక్క రక్షణలో ఛత్రఛాయలో వున్నట్లు అనుభవంద్యోతకమవుతుంది. ఆ సాధకుని చెవులలో మాతశబ్దము ప్రతిధ్వనిస్తూ వుంటుంది. ఆ శబ్దము- "భయపడవద్దు. నేను నీ వెనుకనే వున్నాను' అని. కుండలినీ శక్తి ప్రభావము వలన మనుష్యుని దృష్టికోణము దైవిక మవుతుందనుటలో సందేహము లేదు. దానికి కారణము ఆతని వ్యక్తిత్వమన్నివిధముల సంపన్నమై, సుఖంగా వుంటుంది. మస్తిష్కపు బ్రహ్మరంధ్రములో వ్యాపించియున్న సహస్రదళము గూడా సాధారణంగా, కుండలినీ అవస్థవున్న మాదిరిగానే, నిద్రావస్థలో వుంటుంది. బహుమూల్యమైన యిట్టి యంత్రము,కోశమున్నప్పటికీ మనుష్యుడు సాధారణంగా, చాలాదీనునిగాను, దుర్బలుడు,తుచ్ఛుడు, క్షుద్రుడు, విషయవికారములకు బానిస, పురుగుపక్షి మాదిరి జీవితాన్ని వెళ్లదీస్తున్నాడు. 'దుఃఖముతోను దరిద్రంతోను బాధపడుతూ కృశించి పోతున్నాడు. కాని యీ షట్యంత్రములను రత్నాగారములలో పరిచయమేర్పడినపుడు, వాటినివుపయోగించుకోగలిగినపుడు, వాటిపై అధికారము చలాయించగలిగినపుడు, అతడు పరమాత్మకు నిజమైన వుత్తరాధికారియై, సమస్త యోగ్యతలను, శక్తులనూ పొంది సంపన్నుడౌతాడు. కుండలినీ జాగరణ వలన పొందగలిగే లాభాలను పొందుపరుస్తూ యోగశాస్త్రంలో బహువిస్తృతమైన, ఆకర్షణీయమైన వర్ణనలున్నవి. ఆమొత్తము వర్ణనల సారాంశము కుండలినీ శక్తిని జాగరణగావించి విశ్వంలో నున్న ప్రతిదానిని పొందవచ్చు. ఆతనికి లభ్యంకానిదంటూయేమీ లేదు.

## షట్చక్రముల పరిశీలన, ప్రవేశము, దర్శనము

కుండలినీ శక్తి మూలము వరకు చేరుటకు మార్గములో ఆరుగేట్లున్నవి. (దర్వాజాలు) గేట్లని సంబోధించడానికి కారణము వాటికి తాళములు వేసివున్నాయి

గనుక. ఈ గేట్లను తాళములను తీసియే ప్రాణియైనా ఆశక్తి కేంద్రములవరకు చేరవచ్చు. యీ ఆరు అవరోధములను, ఆధ్యాత్మిక భాషలో 'షట్ చక్రములు' అంటారు.

సుషుమ్న నాడియొక్క అంతర్గతములో నున్న మూడు నాడులలో, అన్నింటికంటె లోపలవున్న బ్రహ్మనాడితో యీ ఆరుచక్రములకు సంబంధమున్నది. మాలలో నున్న, కమలపుష్పములను గుచ్చిన దారముతో, యీ బ్రహ్మనాడిని, పోల్చిన ఉపమానమున్నది. యిదివరకీయబడిన చిత్రములో యేయే చక్రములు యేయే స్థానములందున్నవో చెప్పబడినది. మూలాధార చక్రము యోనికి నిట్టనిలువున స్వాధిష్ఠాన చక్రము పొత్తికడుపుకు నిలువున, మణిపూరక చక్రము నాభికి నిలువుగా, అనాహత చక్రము హృదయానికి నిలువున, విశుద్ధచక్రము కంఠమునకు నిట్టనిలువున, ఆజ్ఞాచక్రము భృకుటి మధ్యలో నున్నవి. వీటిపైన సహస్రారమున్నది.

సుషుమ్ననాడి యొక్క అంతర్గతములో నున్న చిత్రిణి మొదలైన నాడులెంత సూక్ష్మమైనవనగా, వాటిని సాధారణనేత్రములతో చూచుట కష్టము. అదిగాక దీనితో సంబంధమున్న చక్రములింకా సూక్ష్మములుగూడా. శరీరము కోసి, చీల్చినపుడు యీ చక్రములు, నరములు, నాడులమాదిరి స్పష్టముగా చూడలేము. శబ్దతరంగము. వాయు పరమాణువులు, రోగకారణ సూక్ష్మజీవులు మనము కండ్లతో చూడలేము. కాని వాటి ఉనికిని, అస్థిత్వము కాదనలేదు. యీ చక్రములను యోగులు తమ యోగదృష్టితో తిలకించారు. వాటిని విజ్ఞానముతో పరిశీలించి, పరిలక్షించి, మహత్తరమైన ప్రయోజనాన్ని పొందారు. వాటి వ్యవస్థానిర్మాణాన్ని, విజ్ఞాన్ని యోగమార్గపథికుల కొరకు పదిల పరచారు.

'షట్చక్రములు' ప్రత్యేకవిధమైన సూక్ష్మగ్రంథులు. అవి బ్రహ్మనాడిమార్గములో యేర్పరచబడినాయి. యీ చక్రగ్రంథులపై సాధకులు ధ్యానముతో కేంద్రీకరించినపుడు, అచట సాధకునకు సూక్ష్మస్థితి విచిత్ర అనుభూతి, కలుగుతుంది. ఆ గ్రంథులు గోళాకారములో నుండవు. దానిలో నుండి కోణములు బయల్పడుతాయి. అవి పుష్పములోని పూరేకుల వలె వుంటాయి. వీటిని కోశములు లేక పూరేకులను 'పద్మదళము' అని పిలుస్తారు. ఇవి ప్రత్యేక విధమైనతంతు గుచ్ఛములు.

యీ చక్రముల రంగుగూడా విచిత్ర ప్రకారంగా వుంటుంది. యేమనగా కొన్ని గ్రంథులకు ప్రత్యేకంగా, ప్రత్యేకగ్రంథులకు వేర్వేరుగా తత్వములు ప్రధానంగా ఉంటాయి. యీ తత్వప్రాధాన్యత కారణంగా ఆస్థానంలో రక్తము ప్రభావానికి లోనవుతుంది.

ఆరంగు మారుతుంది. పృధ్వీ, తత్వము ప్రాధాన్యత వలన మిశ్రము కలిగి గులాబీరంగు, అగ్నికినీలము, వాయువునకు నిర్మలమైన యెరుపు. ఆకాశము ధూళిరంగు వుంటుంది. యిదియే మిశ్రణము చక్రముల రంగులను మార్చుతుంది.

'ఘన' పేరు గల పురుగు కర్రను తొలిచి రంధ్రం చేసుకుంటూవెళ్తుంది. అది తొలచిన ప్రదేశంలో ఆకృతి యేర్పడుతుంది. యీ చక్రములలో ప్రాణవాయువు చాకపోకడలు సాగిస్తూ వుంటుంది. దాని మార్గము ఆగ్రంధుల స్థితికి అనుగుణ్యముగా, కొంచెముసన్నగా, కొంచము లావుగా వుంటుంది. యీ 'గతి'కి (మార్గమునకు) రూపము, చాలా దేవనాగరిలిపిలోని అక్షరములవలె నుంటుంది. అందువలన, వాయు మార్గమును, చక్రముల అక్షరములని చెబుతారు.

ధృతగతితో ప్రవహించే నదిలో కొన్ని ప్రత్యేక స్థానములలో సుడిగుండము లుంటాయి. యీ నీటి సుడి గుండములు కొన్ని చోట్ల తక్కువలోతుగలవిగాను, కొన్నిచోట్ల బాగా లోతుగాను, కొన్నిచోట్ల వంకరగాను, కొన్న చోట్ల నాలుగు కోణములు గలిగి గుండ్రంగా తిరుగుతూ వుంటాయి. ప్రాణవాయువు యొక్క సుషుమ్న ప్రవాహము యీ చక్రములలో ధృతగతితో పయనిస్తూ వుంటుంది. అపుడచట ప్రత్యేకమైన సూక్ష్మ సుడిగుండమేర్పడుతుంది. దాని ఆకృతులు, చతుష్కోణము, అర్థచంద్రాకారము, త్రికోణము, గోళాకారము, లింగాకారము, అటులనే పూర్ణచంద్రా కారముగా యేర్పడుతుంది. అగ్నియే సమయమందు ప్రజ్వరిల్లినా దాని నాలుకలు వూర్ధ్వంగానే వుంటాయి. అవి అదోభ గంలో లావుగాను, పైన సన్నగా వుంటాయి. యీ విధంగా అవ్యవస్థితత్రికోణము యేర్పడుతుంది. అదేవిధంగా అనేక ఆకృతులు వాయు ప్రవాహము వలన యేర్పడుతాయి. యీ ఆకృతులను చక్రముల యంత్రములని పిలుస్తారు.

శరీరము పంచతత్వములచే యేర్పడినది. యీ తత్వముల న్యూనాధిక, సమ్మిశ్రణముతో వివిధ అంగప్రత్యంగముల నిర్మాణకార్యము, వాటి సంచలనము జరుగుతుంది. యేస్థానములో, యేతత్వము యొక్క ఆవశ్యకతయెంత వున్నదో, దానికి న్యూనాధికత యేర్పడినపుడా అంగము రోగగ్రస్థమవుతుంది. తత్వముల యధా స్థానము, యధామాత్రములో నున్నపుడే, నిరోగితకు చిహ్నముగా పరిగణిస్తారు. యే చక్రములో యే యే తత్వములు ప్రాధాన్యత వహిస్తాయో, అదే తత్వమును దాని తత్వముగా చెబుతారు.

బ్రహ్మనాడియొక్క బోలు గొట్టములో నుండి వాయువు యొక్క ఆగమన మనుంటుంది. అందువలన చక్రముల సూక్ష్మఛిద్రములకు దెబ్బతగిలి, వాటి నుండి,

పిల్లనగ్రోవిలో శబ్దము ప్రవేశించినపుడు రంధ్రముల ద్వారా ధ్వని బయల్పడునట్లు, ధ్వని ఉత్పన్నమవుతుంది. యీ ధ్వని ఛిద్రముల ఆధారంతో ఉత్పన్నమవుతుంది. పిల్లనగ్రోవిలో నున్న చిన్న రంధ్రముల ద్వారా, సరి, గమ, పద, నిస అనే స్వరములు వెలువడుతాయి. ఆ విధంగానే చక్రఛిద్రముల నుండియొక విశేషధ్వని ప్రవహించుతుంది. ఆ ధ్వని యం, లం, రం, హం, ఓం, లాటి స్వరములు విన్పిస్తాయి. వీటిని చక్రబీజము లనియెదరు.

చక్రములలో వాయుచలనములో అంతరము లేక తేడా వుంటుంది. వాత, పిత్త, కఫ నాడులలో పావురము, మండూకము, కుక్కుటము మొదలైన నడకలుంటాయి. ఆ నడకలను గుర్తించి వైద్యులు తమ పనిని నెరవేర్చుకుంటారు. వైద్యము చేస్తారు. తత్వమిశ్రణము, సన్నని విశాలమార్గము. సుడిగుండము, బీజము మొదలైన వాటి సమన్వయము వలన ప్రత్యేక చక్రములో రక్తప్రసరణ, వాయువు యొక్క అభిగమనముల సంయోగములవలన, ఒక విశేషమైన నడక అచట పరిరక్షింపబడుతుంది. ఇది ప్రత్యేక చక్రంలో యేనుగు మాదిరి మందగామిగాను, వేరొక చక్రములో మొసలి మాదిరి మునుగుతున్నపుడువచ్చే శబ్దమువలె, యింకొక చక్రములో లేడి మాదిరి దుముకు, ఒక చక్రంలో కప్ప మాదిరి యెగురుట వుంటుంది. దీని చక్రప్రవాహము అంటారు.

యీ చక్రములలో వివిధ దైవీశక్తులు సన్నిహితంగా వున్నాయి. ఉత్పాదనము, పోషణము, సంహారము (సృష్టిస్థితిలయములు) జ్ఞానము. సమృద్ధి, బలము మొదలైన శక్తులదేవతా విశేషము శక్తి అంగీకరించబడినది. లేకున్న యీ శక్తులే దేవతలని గూడా అనవచ్చు. ప్రతిచక్రములో, పురుష వర్గ ఉష్ణ వీర్యమొకటి, స్త్రీవర్గ శీతవీర్య శక్తి యొకటి వుంటాయి. యెందుకనగా, ధన, ఋణములు, అగ్ని సోమములను రెండు తత్వముల సమ్మిళితముగాకుండా గతి(కదలిక, నడక) జీవముల ప్రవాహముత్పన్నము కాదు. యీ శక్తులే చక్రములోని దేవిదేవతాశక్తులు.

పంచతత్వములకు ప్రత్యేక గుణములున్నవి. పృథ్వికిగంధము (వాసన) జలమునకు రసము (రుచి) అగ్నికి రూపము, వాయువునకు స్పర్శ, ఆకాశమునకు శబ్దము గుణములైవున్నాయి. చక్రములలో తత్వప్రాధాన్యతకు అనుగుణంగా వాటికి గుణములు గూడా ప్రాధాన్యతను కలిగి వున్నాయి. యివియే చక్రముల గుణములు.

యీ చక్రములు తమ యొక్క శక్తులను యథోచితంగా శరీరంలోనికి ప్రవహింపజేస్తాయి. కాని జ్ఞానేంద్రియమొకదానికి, కర్మేంద్రియానికి చక్రముల సంబంధము విశేషరూపంలో నుంటుంది. తత్సంబంధ యింద్రియములపై వాటి ప్రభావమధికంగా

వుంటుంది. చక్రముల జాగరణ చిహ్నములు యీా యీా యింద్రియములపై తక్షణము పరిలక్షింపబడుతాయి. యీా సంబంధ విశేషకారణముననే యీా యింద్రియములను చక్రేంద్రియములని ఉటంకించారు. దేవశక్తులలో డాకినీ, రాకినీ, శాకినీ, హాకినీ మొదలైన చిత్రనామములను విని వాటికి భూతమనీ, పిశాచి, ప్రేతములలాంటివి వున్నాయని భ్రమ వున్నది. కాని విషయము మాత్రమదికాదు. ముఖమునుండి మొదలై నాభివరకు చక్రాకారంలో 'అ' నుండి 'హ' వరకు సమస్త అక్షరములకు గ్రంథిమాల యొకటి వున్నది. ఆ మాల యొక్క రూపము ముద్రలను 'మాతృకలని' పిలుస్తారు. యీా మాతృకల యోగదర్శనము ద్వారా మాత్రమే ఋషులు దేవనాగరీ అక్షరమాలను రచించారు. చక్రముల అధిష్ఠానదేవతలే మాతృకలచే ఝంకృతులౌతారో, సంబద్ధులయ్యేదరో, వాటిని ఆయాదేవతల దైవశక్తులని వక్కాణిస్తారు. డ, ర, ల, క, శ అక్షరముల ముందు మొదటి మాతృకలైన 'కా' బోధకములకు 'కినీ' శబ్దము జోడించి రాకినీ, డాకినీ యనుపేర్లీయబడినవి. యివియే దేవశక్తులు.

ఉపర్యుక్త పరిభాషను తెలుసుకొనిన తరువాత, ప్రతిచక్రమునకు నిమ్న లిఖిత తెలుసుకొనదగిన విషయములు, పూర్తిగా తెలుసుకొనుటకు పాఠకులకు సుగమమవుతాయి. యిపుడు ఆరుచక్రముల పరిచయము క్రిందనీయబడినది.

**మూలాధారచక్రము :**

స్థానము :- యోని (గుదమునకు చేరువగా) వర్ణము-యెరుపు.

లోకము :- భూఃలోకము, దళమునకు అక్షరములు- వం, శం, షం, సం, తత్వము-పృథ్వీతత్వము బీజమూలం. వాహనము-ఐరావతము, ఏనుగు గుణము-గంధము, దేవశక్తి-డాకిని. యంత్రము-చతుష్కోణము. జ్ఞానేంద్రియము-నాసిక. కామేంద్రియము-గుదము. ధ్యానఫలము-వక్త, మనుష్యులలో శ్రేష్ఠత్వము, సర్వవిద్యావినోదము, ఆరోగ్యము, ఆనందచిత్తము కావ్యము, రచనా సామర్థ్యము.

**స్వాధిష్ఠాన చక్రము :**

పొత్తికడుపు (శిశినమునకు ముందుభాగము) దళములు ఆరు, వర్ణము-సింధూరము, లోకము భువర్లోకము. దళమునకు అక్షరములు- బం, భం, మం, యం, రం, లం. తత్వము-జలము, తత్వబీజము-వం. బీజవాహనము-మకరము. గుణము-రసము. దేవత-విష్ణువు. దేవశక్తి-డాకిని. యంత్రము చంద్రాకారము. జ్ఞానేంద్రియము. (నాలుక) కామేంద్రియము-లింగము. ధ్యానఫలము అహంకారాధికారముల నాశనము శ్రేష్ఠయోగము. మోహనివృత్తి. రచనాశక్తి.

**మణిపూరక చక్రము :**

స్థానము-నాభి, దళములు-పది, వర్ణము-నీలము, లోకము-స్వర్గము, దళముల అక్షరములు-డం, ఢం, ణం, తం, థం, దం, ధం, నం, పం, ఫం. తత్వబీజము-రం, బీజవాహనము-పొట్టేలు, గుణము-దైవము-వృద్ధరుద్రుడు, దైవశక్తి-శాకినీ, యంత్రము-త్రికోణము జ్ఞానేంద్రియము-చక్షువు, కర్మేంద్రియము-చరణము(పాదము) ధ్యానఫలము-సంహారము, పాలనా సామర్ధ్యము, వచనసిద్ధి.

**అనాహతచక్రము :**

స్థానము-హృదయము, దళములు-పన్నెండు, వర్ణము-అరుణ, లోకము-మహర్లోకము-దళమునకక్షరములు-కం, ఖం, గం, ఘం, ఙం, చం, ఛం, జం, ఝం, ఞం, టం, ఠం, తత్వము. వాయువు, దేవశక్తి-కాకినీ. యంత్రము-షట్కోణము. జ్ఞానేంద్రియము-త్వచము, కర్మేంద్రియము-కరము, ఫలము-స్వామిత్వము, యోగసిద్ధి, జ్ఞానము, జాగృతి, ఇంద్రియజయము, పరకాయప్రవేశము.

**విశుద్ధ చక్రము :**

స్థానము-కంఠము, దళములు-పదహారు, వర్ణము-ధూమ్రవర్ణము, లోకము-జనలోకము, దళముల అక్షరములు-అ నుండి అః వరకు, గుణము-శబ్దము, దేవ-పంచముఖ సదాశివుడు, దేవశక్తి-శాకినీ ,యన్త్రము-శూన్యము గోళాకారము, జ్ఞానేంద్రియము-కర్ణము(చెవి) కర్మేంద్రియము-పాదము. ధ్యానఫలము-చిత్తశాంతి, త్రికాల దర్శిత్వము, దీర్ఘజీవనము, తేజోవంతము, సర్వహితపరాయణత.

ఆజ్ఞాచక్రము-స్థానము-భ్రూ మధ్యము, రంగు-శ్వేతము దళముల అక్షరము-హం. క్షం తత్వము-అహంతత్వము, బీజపుదైవము జోతిర్లింగము-వాహనము. నాదము, లింగదేవీశక్తి-హాకినీ. యంత్రము-లింగాకారము లోకము-తపోలోకము. ధ్యానఫలము-సర్వార్థసాధన.

షడ్ చక్రములనగా పైనచెప్పబడిన ఆరుచక్రములు. కాని సహస్రారము లేక సహస్రదళకమలము కూడ కొందరు సప్తమచక్రముగా అంగీకరిస్తారు. దీనినే శూన్యచక్రముగా భావిస్తారు. దాని వర్ణన గూడా క్రిందనీయబడినది.

**శూన్యచక్రము :**

స్థానము :- మస్తకము (తల) దళములు-సహస్రము (వేయి), దళముల అక్షరములు- అం నుండి క్షం వరకు పునరావృత్తమవుతాయి, లోకము; సత్యలోకము.

తత్వములకతీతము, బీజతత్వము- (ః) విసర్గ, బీజవాహనము; బిందు దైవము- పరబ్రహ్మము, దైవశక్తి-మహాశక్తి, యంత్రము-పూర్ణచంద్రునివలె, ప్రకాశము-నిరాకారము. ధ్యానఫలము-భక్తి, అమరత్వము, సమాధి, సమస్త బుద్ధి సిద్ధులు కరతలామలకములు.

కుండలినీ శక్తి ప్రవాహమని పాఠకులకు తెలిసినది. ఆ శక్తి మన శరీరంలో అన్నిటికంటె అధిక సమీపమున వున్న చైతన్య స్ఫులింగము. దానిలో బీజరూపములో మనము వూహించలేని రహస్యశక్తులు నిగూఢంగా వున్నాయి.

కుండలినీ శక్తికి యీ ఆరుచక్రములు కేంద్రములు. ఆరుచక్రములలో గూడా తగినంత కుండలినీ ప్రకాశమున్నది. సౌరమండలములో తొమ్మిది గ్రహములున్నాయి. సూర్యుడామండలమునకు కేంద్రము. చంద్రుడు, కుజుడు మొదలైన గ్రహములు సూర్యునితో సంబంధమున్నందున సూర్యుచుట్టు పరిభ్రమించుచున్నవి. అటులనే కుండలినీ గూడా. యీ తొమ్మిది గ్రహములు సూర్యుని యొక్క వేడిమిని, ఆకర్షణను, కదలిక శక్తులనుండి ప్రభాన్వితములై, పడుగుపేకలవలె నున్నాయి. అటులనే కుండలినీ శక్తులు గూడా చక్రములలోకి ప్రసారితములై ఉంటాయి. ఇనుప పెట్టెలో అనేక సొరుగులుంటాయి. ఆ సొరుగులు చాల చిన్నవి. తేనె తుట్టెలో గూడా అనేక గదులుంటాయి. ప్రతిగదిలో తేనె కొంత వుంటుంది. అటులనే కుండలినీ శక్తులలో కొన్నిశక్తి ప్రకాశములు చక్రములలో గూడా నుంటాయి.

చక్రములు జాగరణగా వింపబడిన వెంటనే, వాటితో పాటు వాటిలో సన్నిహితంగా రహస్యంగా నున్న పెక్కు శక్తులుగూడా మేల్కొంటాయి. వాటిని సంక్షిప్తంగా, సాంకేతికంగా పైన చక్రముల ధ్యానఫలములలో చెప్పబడినది. వీటిని విస్తరించి చెప్పినట్లైతే, యీ శక్తులు గూడా ఆశ్చర్యకరములే కాకుండా, యితరవాటి కంటె తక్కువ ప్రశస్తమైనవేమీ కావు.

## షట్చక్ర పరిశీలన :

షట్చక్రములను తెలుసుకొంటూ కుండలినీ వరకు చేరడం, దానిని మేల్కొలిపి ఆత్మోన్నతి మార్గంలో ప్రవేశపెట్టడం అనేవిషయము మహావిజ్ఞానము. యిదేవిధంగా, పరమాణుబాంబును నిర్మించి, దానిని పేల్చుట అత్యంత బాధ్యతా పూర్ణమైన కార్యము. దీనిని తేలికగా తనంతటతాను కేవలం పుస్తకము చదివి ఆరంభించగూడదు. అనుభవజ్ఞుడైన మార్గదర్శి యొక్క సంరక్షణలో యిదంతా చేయడం తెలుసుకోవలె.

చక్రములను దర్శించడం ధ్యానశక్తి ద్వారా చేయబడుతుంది. మన మస్తిష్కమొక విద్యుత్ గృహమని అందకు తెలిసిన విషయమే. యి విద్యుత్ గృహములో ప్రముఖధార 'మనస్సు' మనస్సు నడక, పోకడ, చంచలము, బహుముఖమైనది. యీ మనస్సు

యెల్లపుడూ చంచలతామగ్నమై, సదా పరుగులిడుతూ, గెంతుతూ వుంటుంది. దానికి కారణము, విద్యుత్ పుంజము యేక స్థానమందు కుదురుగా కేంద్రీకరింపబడకుండుటయే. అటుల కేంద్రీకరింపబడినట్లైతే మనస్సు మహత్తర కార్యములను సాధించగలరు.

మనస్సు కేంద్రీకరింప బడకుండుటవలన, క్షణములు, నిమిషములు అస్తవ్యస్తమై వృథాగా దొర్లుతున్నాయి. యీ శక్తులను కేంద్రీకరించి, వొకే స్థానములో పోగు చేసినట్లైతే, భూతద్దము ద్వారా యేకత్రితము జేయబడిన సూర్యకిరణముల ద్వారా నిప్పురవ్వలుద్భవించునట్లుగా మహత్తరశక్తి దృగ్గోచరమవుతుంది. ధ్యానమనే సూక్ష్మ విజ్ఞానము ద్వారా, మనస్సులో చెల్లాచెదరుగానున్న బహుముఖశక్తులు, కేంద్రీకరంపబడివొకే పనిపైలగ్నము చేయబడతాయి. ఫలస్వరూపంగా అచట వొక అసాధారణ శక్తిధార ప్రవహించుతుంది. ధ్యానముద్వారా మనోక్షేత్రపు కేంద్రీయ శక్తియైన యీ విద్యుత్ షట్చక్రములను తెలుసుకొనవచ్చు.

షట్ చక్రములను దర్శించుటకు సాధన చేయడానికి అనేక గ్రంథములలో అనేక మార్గములు చెప్పబడినవి. యీవిధంగా గురుపరంపరలో సాగే సాధనలు వివిధములుగా నున్నాయి. యీ మార్గములన్నీ సఫలతను చేకూర్చునవియే. కాని ఒక షరతు. సాధకునకు పూర్ణవిశ్వాసముండవలె. శ్రద్ధ, నిష్ఠలతోపాటు సముచితమైన యోగ్యుడైన మార్గదర్శకుని సంరక్షణలో సాధన చేయవలె.

ఇతర సాధనల గురించి చర్చించుట, తులనాత్మక పరిశీలనగావించుట యిచట మా అభీష్టము గాదు. యిపంక్తులలో మేమొక సులభసాధన పాఠకులకు తెలియజేయ దలచినాము. దీని వలన గాయత్రీ శక్తితో చక్రముల జాగరణ సులభం కాగలదు. యితర సాధనలలో వుండే అసాధారణత్వము, కష్టము యిందులో లేదు. కాగా సర్వస్వతంత్ర మైనది.

ప్రాతఃకాలమున శుభ్రమైన శరీరముతో, స్వాస్థ్యచిత్తముతో జాగరూకతతో నుండి పద్మాసనాసీనులై కూర్చోండి. పూర్వము చెప్పబడిన బ్రహ్మసంధ్య యొక్క పంచకోశక్రియలను చేయండి. ఆసనము, శిఖాబంధనము, ప్రాణాయామము, అఘమర్షణమున్యాసము చేసిన తరువాత, గాయత్రీ మంత్రమును నూటయెనిమిదిసార్లు, (మాల) జపించండి.

బ్రహ్మ సంధ్యవార్చిన తరువాత, మస్తిష్కపు మధ్యభాగమైన త్రికుటిలో (ఒకచెవినుండివచెవికి వొక రేఖగ రెండవరేఖ కనుబొమల మధ్యనుండి మస్తిష్కపు మధ్యవరకు గీసినచో, రెండు కలిసిన చోటును 'త్రికుటి'యని చెబుతారు, వేదమాత

గాయత్రీ దేవియొక్క జ్యోతి స్వరూపమును ధ్యానించవలె. కమ్మరి లోహమును కరగించుటకు మూసను కొలిమిలోనుంచునట్లు, మహామధ్యలోనున్న జ్యోతిర్లింగపు మధ్యలో గాయత్రీదేవిని చొప్పించవలె. కమ్మరిలోహము కరిగిన తరువాత దానిని,మర్దించి తనకభీష్టమైన రూపములో తీర్చిదిద్దుతాడు. త్రికుటి స్థానములో నున్న గాయత్రీ జ్యోతిలో మనస్సును లగ్నముచేసినపుడు, కొంతసేపటికి, మనస్సు స్వయంగా తేజోరూపాన్ని పొందుతుంది. అపుడు దానిని ఆజ్ఞాచక్రపుస్థానమునకు తేవలె. బ్రహ్మనాడి మేరుదండమునుండి పైకివచ్చి త్రికుటిలో నున్న సహస్రారమునకు చేరుతుంది. యీ బ్రహ్మనాడి బోలు గొట్టాన్ని దీప్తివంతమైన మనస్సులోకి ప్రవేశింపజేసి ఆజ్ఞాచక్రమునకు తీసుకురావలె. అచట నిలిపినట్లైతే అంతా, చక్ర లక్షణములలో వర్ణింపబడినదంతా అవగతమవుతుంది.

మనస్సునకు, చక్రపు అక్షరములు, తత్వములు, దేశభక్తి బీజములు యాంత్రము, లోకము, వాహనము, గుణము రంగు అనుభవమవుతుంది. ప్రారంభంలో అనుభవము చాలా అస్పష్టముగా నుంటుంది. క్రమక్రమంగా చక్రము కొంత స్పష్టంగాను, కొంత అస్పష్టంగాను వీక్షింపబడుతుంది. క్రమేణా అధిక స్పష్టత గోచరిస్తుంది. కొన్ని సమయాల్లో కొంతమంది వ్యక్తుల చక్రములలో, కొంత తేడా లక్షణములలో నుంటుంది. వారి వారి అంతరములలో నున్న చక్రముల ఆకృతి అనుభవమవుతుంది. స్వాస్థ్యచిత్తంతో, జాగరూకతతో, ఒకమాసము ఒకచక్రము చొప్పున సాధనచేసినట్లైతే ఆ చక్రము స్ఫుటంగా గోచరమవుతుంది. ధ్యానంలో దాని లక్షణము అధికంగా స్పష్టమవుతుంది. చక్రస్థానంలో దానితో సమ్మిళితమైన మాతృకలలో, జ్ఞానేంద్రియములలో, కర్మేంద్రియములలో అకస్మాత్తుగా కంపనము. రోమాంచనము, ప్రస్ఫురణము, ఉత్తేజము, వేడి, దురదలాంటివి కలుగుతాయి. దీనివలన చక్రముల జాగరణ జరుగుతున్నదని సూచన. ఒక మాసముగాని లేక కొంచెము హెచ్చుతగ్గులుగా గాని, యీ రకమైన చిహ్నములు పొడసూపిన యెడల, ధ్యానంలో చక్రరూపము స్పష్టముగా గోచరించినట్లైన, ముందుకుసాగి, క్రిందనున్న చక్రమునందు ప్రవేశింపవలె. చేయవలసిన విధి యిది. అనుసరించవలసిన మార్గమిది.

గాయత్రీ జ్యోతిలో మనస్సును తపింపజేసి, బ్రహ్మనాడిలో ప్రవేశింప జేయవలె. అచటే ప్రథమచక్రమును తెలుసుకోవలె. దానిని దాటి రెండవ చక్రమును చేరవలె. యీ విధంగా ప్రతిచక్రమునందు మాసము దినములు సమయమవుతుంది. సాధన పరిపక్వత చెందినపుడు ఒకచక్రము నుండి, రెండవ చక్రమునకు వెళ్లుదారి తెరుచుకుంటుంది. సాధనలో పరిపూర్ణతలేనంతవరకు ద్వారము ( చక్రద్వారము ) మూసికొని వుంటుంది. సాధకుని మనస్సు ముందుకుపోవడానికి యిచ్ఛగించు స్వాగము

దొరకదు. సాధకుడు అదే చక్రపు తంతుజాలములో దారిగానక తిరుగుతూ, పరిభ్రమిస్తూ వుంటాడు.

సాధన చాలా కాలం వరకు పరిపక్వము కానపుడు, ముందునకు దారిపోగనపుడు, అనుభవజ్ఞుడైన గురువు సహాయమవుసరమవుతుంది. గురువుచెప్పిన ఉపాయమును, తు.చ, తప్పక పాటించవలె. యీ విధంగా క్రమ, క్రమంగా ఆరు చక్రములను దాటగలరు. దాటి మూలాధారమునందున్న కుండలినీ వరకు చేరి, అచట యీ జ్వాలాముఖీ కరాళ, కాల స్వరూపమైన మహాశక్తి సర్పిణి యొక్క భయంకర స్వరూపాన్ని దర్శిస్తారు.

మహకాళీ యొక్క ప్రచండ స్వరూపమిక్కడనేద్యోతకమవుతుంది. అనేకమంది సాధకులీ నిద్రించే సింహాన్ని మేల్కొల్పుటకు సాహసిస్తూనే కంపిస్తారు.

కుండలినీ జాగరణలో, సాధకుడు దానిని పీడించవలె. దానిని చీల్చవలె. పరమాణువునేవిధంగా విస్ఫోటముగావించుటకు, విచ్ఛేదము చేయవలెనో, ఆదేవిధంగా కుండలినీశక్తి, గతిశీలిగా చేయుటకదేవిధముగా ఆఘాతమొనరించవలె. దీనిని ఆధ్యాత్మిక భాషలో 'కుండలినీ పీడనము' అనియెదరు. పీడింపబడినస్తబ్ధ కుండలినీ, బుసకొడుతూ మేల్కొంటుంది. దాని ప్రథమ ఆక్రమణ (ప్రభావము) మనస్సుపై నున్న జన్మజన్మాంతర సంస్కారములపై నుంటుంది. కుండలినీ సంస్కారములను అంతరింపజేస్తుంది. ఛాతిపైన తన శస్త్రములతో సహా బిగాయిస్తుంది. అచట నున్న మాయాపరాయణతను నాశనముగావించి, బ్రహ్మభావమును పరిణతగావిస్తుంది.

యీ కుండలినీ జాగరణ దాని మేల్కొలుపు, ప్రభావ శక్తి పురాణములలో మహా ఆలంకారికంగా, హృదయ గ్రాహ్యంగా వర్ణింపబడినది.

మహిషాసుర, దుర్గాదేవి యుద్ధము, యీ ఆధ్యాత్మిక రహస్యమునకు ప్రతీకయే తన ముక్తి గోరుతూ, దేవి హస్తముల చే మరణింపనభిలషించి, ఉత్సాహియై మహిషాసురుడు (మహి=పృథ్వి మొదలైన పంచభూతములతో తయారైన మనస్సు) చండి (కుండలినీ)తో యుద్ధంచేయబూనుతాడు. నిశ్శబ్దంగా,మౌనంగా నున్నదానిపై దాడి చేస్తాడు. దేవి క్రోధంతో ఆతనితో యుద్ధం చేస్తుంది. యెదురుదాడి మహిషాసురునిపై సలుపుతుంది. ఆతని వాహనమైన మహిషమును, సంస్కారముల సమూహమును నాశనము గావిస్తుంది. మనస్సు యొక్క భౌతికాచరణమును, మహిషాసుర శరీరమును, పదిభుజములతో పది దిక్కులు నుండి, అన్ని వైపులనుండి చీల్చి వేస్తుంది. చివరలో మహిషాసురుడు (సాధారణబీజము) చండిజ్యోతిలో కలిసిపోతుంది.

భక్తిమయసాధన కారౌద్రరూపము బహువిచిత్రముగా నుంటుంది. దీనినే 'సాధనా సమరము' గా పచిస్తారు. అనేకమంది భక్తులు, ప్రేమతోను, భక్తితోను బ్రహ్మను పొందుతారు. అటులనే అనేకమంది భక్తులు సాధనాసమరములో బ్రహ్మతో యుద్ధముచేసి బ్రహ్మను పొందుతారు.

భగవంతుని ఆకలి, నిష్ఠ, ఆయన నిజమైన ప్రేమతో గూడా లభించగలదు. నిజమైన శత్రువుకు గూడా. భక్తులైన యోగులు గూడ భగవంతుని చేరగలరు. సాధనా సమరంలో రెండు రెండు చేతులు చూపే హఠయోగీ తంత్రమార్గీయులు గూడా బ్రహ్మను పొందవచ్చు. కుండలినీ జాగరణ యొక హఠతంత్రము దీనివలన ఆత్మ, తుచ్ఛస్థానము నుండి మహోన్నతస్థానమునకు, అణుస్థితినుండి విభునిస్థితిని పొంది, యీశ్వరీయ సర్వశక్తులచే సంపన్నమవుతుంది.

షట్చక్ర సాధన చేయునపుడు ప్రతిదినము బ్రహ్మనాడిలో ప్రవేశించి చక్రములను ధ్యానిస్తాము. యీ ధ్యానము ఐదు నిముషములుగా ప్రారంభించి, 30 నిముషములవరకు చేరవచ్చు. ఒకేసారి దీనిని అధికంగా చేయుట హానికరము. యేలనన అధిక ధ్యానముచే కలిగే అధిక వేడిని భరించుట కష్టము. ధ్యాన సమాప్తముచేయు సమయంలో, అదే మార్గములో తిరిగి వాపసు వచ్చి త్రికుటిలో లగ్నముచేయవలె. అపుడు ధ్యానమును ముగించవలె.

సాధనాకాలములో బ్రహ్మచర్యములో నుండవలెనని వేరే చెప్పనవసరములేదు. భోజనమొక్కసారి మాత్రమే. సాత్విక స్వాదు పదార్థమును భుజించవలె. యేకాంత సేవ. స్వస్థవాతావరణములో, దినచర్యను సరిగా నుంచుకొనుట అనివార్యము. యేలనన యిది సాధనకు ప్రారంభనియమముగా గుర్తించబడినది.

షట్ చక్రదర్శనము, కుండలినీ జాగరణము. బ్రహ్మరంధ్రములోనున్న యీశ్వరీయ దివ్యశక్తి దర్శనము చేయిస్తాయి. అనేక గుప్తసిద్ధులు లభిస్తాయి.

## ఈ దివ్యప్రసాదాన్ని యితరులకు గూడా పంచి యివ్వండి

పుణ్యకార్యములతో పాటు ప్రసాదమును పంచిపెట్టడం సాధారణంగా అవసరమైన కార్యముగా పరిగణించడం పరిపాటి. సత్యనారాయణస్వామి కథాశ్రవణానంతరం పంచామృతము, గోధుమప్రసాదం పంచుతాము. యజ్ఞానంతరము హల్వాగాని, యితర

మృష్టాన్నం పంచబడుతుంది. గీతాపారాయణము మంగళకార్యము, పూజ, కీర్తనము తరువాత ప్రసాదమీయబడుతుంది. దేవతలు, పెద్దల ఆశీర్వాదం కోసం, వారిని ప్రసన్నులను గావించుకొనుటకొరకు చిన్నచిన్న జీడీలుగాని, యితరములుగాని ప్రసాదంగా వుంటాయి. దేవాలయాలలో యెక్కువ గుంపు వుంటుంది. అచట ప్రసాదమునకు అధికంగా ఖర్చవుతుంది. కాబట్టి నీటిలో తులసీపత్రములు వేసి, చరణామృతాన్ని ప్రసాదరూపంగా తీర్థమిస్తారు. శుభకార్యముల తర్వాత యేదైనా ప్రసాదము పంచవలెనని, అవసరమని, దీని తాత్పర్యము.

దీనికి కారణము, శుభకార్యముతోపాటు శుభకర వాతావరణముంటుంది. దానిని ఖాద్యపదార్థములతోపాటు సమన్వయము చేసి, ఉపస్థితవ్యక్తులకు యిచ్చినయెడల, వారు కూడా ఆ శుభతత్వములను గ్రహించి ఆత్మశాంతిని పొందుతారు. రెండవ విషయమేమనగా, ఆప్రసాదంతోపాటు దివ్యతత్వములపై శ్రద్ధయేర్పడి, దివ్యధారణ కలుగుతుంది. మధురపదార్థములను స్వీరించుటవలన, ప్రసన్నతా విర్భావమా సమయంలో జనిస్తుంది. యీ రెండు తత్వములభివృద్ధి చెందినందున, ప్రసాదమును స్వీకరించువారు, ఆధ్యాత్మికతవైపు ఆకర్షితులవుతారు. యీ ఆకర్షణ చివరకు వారికి కళ్యాణప్రదమై, సర్వతోముఖ సిద్ధి ప్రాప్తిస్తుంది.

యీ పరంపర ఒకరినుండి మరొకరికి, వారినుండి మూడవవారికి, అదే విధంగా క్రమంగా ధర్మవృద్ధి జరుగుతుంది. దీని ప్రయోజనమును లక్షించియే, ఆధ్యాత్మ విద్యాచార్యులు, శుభకార్యపరి సమాప్తితరువాత ప్రసాదమును పంచవలెనని ఆదేశించారు. చివర ప్రసాదము పంచని శుభకార్యములు నిష్ఫలములవుతాయని శాస్త్రములు ఘోషిస్తున్నాయి. యితరులు దీనిని జాగరూకతతో పాటిస్తారని, ప్రసాదమహత్వమిదియని తాత్పర్యము.

గాయత్రీ సాధన గూడా యజ్ఞమే. ఇది సాధారణము. అగ్నిలో సామాగ్రిని ఆహూతులుగా వేల్చడం స్థూలకర్మకాండ. కాని ఆత్మలో పరమాత్మను స్థాపించుకొనడం సూక్ష్మ యజ్ఞం. యీ సూక్ష్మ యజ్ఞం స్థూల అగ్నిహోత్రముకన్నా అనేక రెట్లు అధికము. యీ మహాధర్మకృత్యముతోపాటు ప్రసాదము పంచుటగూడా సరితూగు నట్లుండవలె. చిన్న జీడీలు, పంచదార బిళ్లలు, లడ్లు, హల్వాపూరీ పంచినంత మాత్రాన యీ కార్యము పూర్తిగాదు. గాయత్రీప్రసాదమెలా వుండాలి? దానిని గ్రహించినవారు స్వర్గరుచి ననుభవించవలె. దానిని భుజించి వారు ఆత్మతృప్తి నొందవలె. గాయత్రీ బ్రాహ్మీశక్తి. ఆ దేవి ప్రసాదము గూడా బ్రాహ్మీప్రసాదముగావలె. అపుడే ఆ కార్యము ఉపర్యుక్తవిధంగా గౌరవము పొందుతుంది. యీ విధమైన ప్రసాదము–బ్రహ్మదానము,

బ్రహ్మస్థితిని పొందుటకవసరమైన ప్రయత్నము చేయడానికి ఆకర్షింపబడడం, ప్రోత్సాహింపబడడం.

బ్రహ్మప్రసాదమును స్వీకరించదలచినవ్యక్తి, ఆత్మకల్యాణము వైపు ప్రేరేపింపబడి ఆకర్షితుడవాలి. ఆ వైపు పయనించడానికి తగిన ప్రోత్సాహమిచ్చుటయే ప్రసాదము.

భౌతిక, ఆత్మిక ఆనందమున కన్నింటికీ మూలస్థానము మానవ ప్రాణుల అంతఃకరణములో దాగి వున్నదని తెలిసిన విషయము. సంపద ప్రపంచమునకు వెలుపలలేదు. వెలుపలరాళ్లు, లోహముల చిద్రములు, నిర్జీవపదార్థములు నిండుగావున్నాయి. సంపదల సమస్త కోశాగారములు ఆత్మకు సన్నిహితంగా వున్నాయి. వాటి దర్శనమాత్రము చేతనే మానవునకు తృప్తి లభిస్తుంది. వాటిని వుపయోగించినపుడు ఆనందమునకు అవధులు లేవు. ఆ ఆనంద భాండారములను తెరచుటకు తాళపు చెవి ఆధ్యాత్మిక సాధనలలో నున్నది. ఆ ఆధ్యాత్మిక సాధనలలో గాయత్రీ సాధన సర్వశ్రేష్ఠము. యీ శ్రేష్ఠత అతులనీయము. అసాధారణము. దాని సిద్ధులకు, విచిత్రములకు సరిహద్దు లేదు. అటువంటి శ్రేష్ఠసాధనా మార్గమువైపు ఆకర్షింపబడునట్లు చేయుట, ప్రోత్సాహించుట, సంబంధము కలిగించుట జరిగినట్లైన, దానిని పొందినవ్యక్తికంతకన్నా ఉపకారము లేదు.

ఆవ్యక్తిలో, అంతరంగంలో సాత్విక తత్వములవృద్ధి జరుగుతున్న కొలది, ఆతని ఆలోచనలు, చేయుపనులు పుణ్యమయములవుతాయి. ఆతని ప్రభావము యితరులపై ప్రసరించిన కొలది, వారుగూడా సన్మార్గము నవలంబిస్తారు. యీ శృంఖలములు బలమైన కొలది, సంసారములో సుఖశాంతులు, పుణ్యము పెరుగుట, అటులయెవరినైనా ఆత్మమార్గమువైపు పయనించునట్లు ప్రోత్సహించినవ్యక్తికి గూడా, ఆ కర్మఫలపుణ్యభాగము లభిస్తుంది.

గాయత్రీసాధన చేసే ప్రతివ్యక్తి గూడా యీవిధంగా ప్రతిజ్ఞచేయవలె. 'నేను, భగవతీ గాయత్రీని ప్రసన్నము చేసుకొనుటకును, ఆదేవి మహాప్రసాదమును, బ్రహ్మప్రసాదమును అవశ్యము యితరులకు పంచుతాను'. అని యీ ప్రసాద మీవిధంగా వుండవలె. మొదట కొన్ని శుభసంస్కారముల బీజములుండునట్లు చూడవలె. తరువాత వారిలో క్రమక్రమంగా గాయత్రీదేవి మహాత్మ్యమును, రహస్యలాభములు తెలియునట్లు చేస్తూ వుండవలె. ఆధ్యాత్మిక వున్నతిని తెలుసుకొనలేనివారికి, గాయత్రీసాధన వలన కలిగే భౌతిక ప్రయోజనములను సవిస్తారంగా వర్ణించవలె. 'అఖండజ్యోతి' వారిచే ప్రచురింపబడిన గాయత్రీ సాహిత్యాన్ని వారిచే చదివించవలె. యీ విధంగా వారి రుచి యీ దిశలో ప్రయాణించునట్లు చేయవలె. దీనివలన వారు ఆరంభంలో, సకామభావనతో నైనాసరేవారు గాయత్రీ వేదమాతను ఆశ్రయించునట్లు

చేయవలె. తరువాతవారు స్వయంగా యీ మహాలాభముపై ముగ్ధులైనందున వేదమాత సాధనను వదలుటయనే భావన వారిలో రాదు. ఒక్కసారి బండిని రోడ్డుపై వెళ్లేటట్లు చేసిన యెడల, దానంతటదే సరియైన మార్గములో పయనిస్తుంది.

యీ విధమైన ప్రసాదము అన్యస్థూల ప్రసాదములకంటే అత్యధిక మహత్వ పూర్ణమైనది. రండి, దీనిని ధనముతోనేకాదు. ప్రయత్నంతో గూడా విస్తరింపజేయుటకు వీలున్న బ్రహ్మప్రసాదమును యితరులకు పంచి, వేదమాత కృపాపాత్రులు కండి, యీ లక్ష్యము చేరుటలో భాగస్థులుకండి.

## గాయత్రీతో యజ్ఞమునకు సంబంధము

యజ్ఞము భారతీయ సంస్కృతికి ఆదిప్రతీక. మనధర్మము (మతము) లో యజ్ఞమునకిచ్చిన గొప్పతనమే యితర కర్మకు నీయబడలేదు. మనయొక్క శుభకర్మగానీ, అశుభకర్మగానీ, ధర్మకృత్యము గానీ యజ్ఞములేనిదే పూర్తి గాదు. జన్మమునుండి, అంత్య మరణము వరకు 16 (పదహారు) సంస్కారము లున్నాయి. వీటిలో అగ్నిహోత్రము అవశ్యముండి తీరవలె. బాలుడు జన్మించినపుడు ఆతని రక్షణార్థము పురుడునివారణ వరకు అఖండాగ్నిని స్థాపించవలె. నామకరణము, యజ్ఞోపవీతము, వివాహము మొదలైన సంస్కారములలో హవనము ముఖ్యముగా నుంటుంది. చివరమనము శరీరము వదలు నపుడు దానిని అగ్నికే సమర్పించుతారు. యిపుడు ప్రజలు మృత్యుసమయంలో చితిని అంటించి శవాన్ని భస్మం చేస్తారు. కాని శాస్త్రములను పరిశీలించినట్లైతే, అది గూడా ఒక సంస్కారమే. యిందులో వేద మంత్రములతో విధి పూర్వక ఆహుతులీ యబడుతాయి. తరువాత శరీరము యజ్ఞ భగవానునక ర్పింపబడుతుంది.

కథా సమయంలో, భజన కాలమందు వ్రతమొనరించునపుడు వుపవాసమునందు పర్వదినములలో, పండుగలపుడు, ఉత్సవములు జరిగేటపుడు ఉద్యాపన తీర్పువేళలందు హవనము చేయుట అవశ్యమని భావింపబడినది. ప్రస్తుతము వాటి విధానాన్ని, గొప్పదనాన్ని ప్రజలు మరచిపోయారు. కేవలం నామమాత్రంగా పని జరిపిస్తున్నారు. గృహిణులు యింటిలో యేదోరూపంలో పూజ చేస్తున్నారు. వారు పండుగదినములలో అగ్నిని ప్రజ్వరిల్లి చేయడం, అగ్నిని ముట్టించడం, యేదోఒకరూపంలో చేస్తూనే వున్నారు. కొంచెము అగ్ని కణికలను తీసుకొని, దానిపై నేతిని వేయడం, తద్వారా అగ్నిని ప్రజ్వరిల్లి జేయడం, దానిపైన పిండి పదార్థమో, మధురాహారమో కొద్ది, కొద్దిగా వేసి, మరలా నీటితో చుట్టూ చల్లుట వంటి విధానమును గృహములలో ప్రత్యేకంగా పండుగదినములలో చేయడం చూడవచ్చు. పితృకార్యము జరుగు దినమున, బ్రాహ్మణ

భోజనానికి పూర్వము,ఈ విధంగా అగ్నికి భోజనము సమర్పించుట తప్పక పరిపాటి. యీ కార్యము స్థిరంగా ఆచరించ వలసినది. యేలనన, అగ్నిముఖంగా సమర్పింపబడిన ఆహుతి దేవతలకు, పితృదేవతలకు తప్పక చేరుతుంది. ప్రతిపాత్రము గూడా.

విశేష సమయంలో హవన మొనరించవలెగూడా. నిత్యమూ పొయ్యి రాజేయడం, తిరగలితో విసరడం,కసవూడ్చడం లాంటి జీవహింస, యితర పాపముల నివారణార్థం నిత్యమూ పంచయజ్ఞము చేయవలసిన విధానమున్నది. ఆ పంచకమునకు 'బలివైశ్యము' గూడా నున్నది. బలివైశ్యము అగ్నికి ఆహుతులీయడంతో జరుగుతుంది. యీవిధంగా శాస్త్రములాజ్ఞానుసారము నిత్యమూ హవనము చేయడం గూడా మనకు ముఖ్యము. పండుగలలో ప్రత్యేకించి కొన్ని పండుగలలో హవనము అవశ్యముచేయవలె. హెూలీ యజ్ఞపు పండుగ. ప్రస్తుతము ప్రజలు కట్టెలను కాల్చడం, 'పిడకల దాలి' వేయడంతో హెూలి చేసుకుంటున్నారు. శాస్త్రములను పరిశీలించితే యీ కార్యములు యజ్ఞములు.

యీ రోజున యజ్ఞములావశ్యకతప్రజలు మరిచారు. కేవలం ఇంధనమును మండించి, ప్రాచీన పరంపరను వేరే విధంగా పూర్తిగావించుతున్నారు. యీ ప్రకారంగా శ్రావణీ, దసరా, దీపావళి దినములలో యేదో వొక రూపంలో హవనము తప్పకుండా జరుగుతుంది.నవరాత్రులలో స్త్రీలు దేవీపూజ చేస్తారు. అగ్నిముఖంలో దేవినిమిత్తము నెయ్యి లవంగపు మొగ్గలు జాజికాయలు మొదలైనవి సమర్పిస్తారు. సత్యనారాయణవ్రతకథ, రామాయణ పారాయణము, గీతాపఠనము భాగవత సప్తాహము లాటి పవిత్ర కార్యములలో హవనము జరగడం పరిపాటి.

సాధనలలో గూడా హవనమవశ్యము. యెంతపఠించినాపునశ్చరణ చేసినా, జపముగావించినా, సాధన యొనరించినా,అదివేదోక్తముగానీ, తాంత్రికముగానీ, హవనమేదో వొక రూపంలో అవశ్యమాచరించవలె. గాయత్రీ వుపాసనలో హవనము జరగవలె. అనుష్ఠానము లేక పునశ్చరణములో, జపములో పదవభాగము హవనము చేయు విధానమై యున్నది. పరిస్థితులను బట్టి పదవభాగము ఆహుతులీయ లేనపుడు, నూరవ భాగమైనా సమర్పింపవలె. గాయత్రీదేవి మాతగాను యజ్ఞభగవానుని తండ్రిగా అంగీకరింపబడినది. వీరిరువురి కలయికవలన మనుష్యుని ఆధ్యాత్మిక జన్మ సంభవిస్తుంది. దీనినే ద్విజత్వమంటారు. ద్విజ శబ్దమున కర్థము రెండవ జన్మయని బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు ద్విజులు. మనకు శరీరాన్నిచ్చి నందులకు, మాత పితలెటుల పూజనీయులో నిత్య పూజార్హులో అదేవిధంగా, గాయత్రీ మాత యజ్ఞపితల పూజచేయడం నిత్యముప్రతివొక్క ద్విజునకు ముఖ్యము, అవశ్యము, ధర్మము, కర్తవ్యము.

ధర్మగ్రంధములలోపుట, పుటలో యజ్ఞమహిమను గానంచేశారు. వేదములో యజ్ఞవిషయము ప్రధానము. యేలననగా యజ్ఞ మెలాటి విజ్ఞాన మయవిధానమనగా,

దానివలన మనుష్యునకు భౌతిక, ఆధ్యాత్మిక దృష్టినుండి గమనించిన, సకల కళ్యాణకారకము ఉత్కర్షా పూరకము. భగవానుడు యజ్ఞము వలన ప్రసన్నుడౌతాడు. యిటుల చెప్పబడినది-

యో యజ్ఞేశః యజ్ఞ పరయై రించతే తత్ర సంజ్ఞి తః
తం యజ్ఞ పురుష విష్ణుం నమామి ప్రభు మీశ్వరమ్ ।

అర్థము - యేది యజ్ఞము చే పూజింపబడుతుందో, యజ్ఞమయమో, యజ్ఞరూపమో, ఆయజ్ఞ రూప విష్ణు భగవానునకు నమస్కరించు చున్నాను.

యజ్ఞము మానవునకు అనేక కోరికలను పరిపూర్ణంగా తీర్చునట్టిది. స్వర్గప్రాప్తినికలిగించునట్టిది. ముక్తిప్రదాయని యజ్ఞములను నిర్వహించని వారిని, వదలిన వారిని, శాస్త్రములు చాలా నిందించినవి.

కస్త్వా విముంచతి సత్వా విముంచతి కస్మైత్వం విముంచతి ।
తస్మైత్వం విముంచతి పోషాయ రక్షసా భర్గోఽకసి । — **యజుర్వేదము**

అర్థము - సుఖశాంతులను కోరుయేవ్యక్తి యైనా యజ్ఞమును పరిత్యజించడు. యజ్ఞమును వదలిన వారిని, యజ్ఞరూపభగవానుడు గూడా వదులుతాడు. సర్వులఉన్నతి కోసం ఆహూతులను యజ్ఞములో సమర్పించుతారు. వదలుతారు. అటులవదలని వారు రాక్షసులవుతారు.

యజ్ఞేన పాపైః బహుభి ర్విముక్తః ప్రాప్నోతి లోకాన్ పరమస్య విష్ణోః ।
— **హారీతము**

అర్థము- యజ్ఞమువలన అనేక పాపములనుండి విముక్తి కలుగుతుంది. ఆవిధంగాపర లోకము ప్రాప్తిస్తుంది.

పుత్రార్థీల భతే పుత్రాన్ ధనార్థీ లభతే ధనమ్
భార్యార్థీ శోభనాం భార్యా కుమారీ చశుభమ్ పతిమ్ ।
భ్రష్ట రాజ్యస్తథారాజ్యం శ్రీకామః శ్రియమాప్నుయాత్
యం యం ప్రార్థయేత్ కామః సర్వే భవతి పుష్కలామ్ ।
నిష్కామః కురుతే యజ్ఞన పరబ్రహ్మ గచ్ఛతి । — **మత్స్యపురాణము**

అర్థము-యజ్ఞము వలన పుత్రార్థికి పుత్ర లాభము, ధనార్థికి ధనలాభము, వివాహార్థికి సౌందర్యవతి యైన భార్య, కుమారికి సుందరుడైన పతి. శ్రీ కామనగల వానికి ఐశ్వర్యము ప్రాప్తించును. నిష్కామభావనచే యజ్ఞానుష్ఠానమొనరించినందున పరమాత్మ యే లభించును.

నతస్య గ్రహపీడా స్యాన్నచ బంధం-ధనక్షయం।
గ్రహ యజ్ఞ వ్రతంగేహే లిఖితం యత్ర తిష్ఠతి।
నతత్ర పీడా పాపానాం నరోగో నచబంధనమ్।
అశేషా యజ్ఞఫలద మశేషా ఘౌఘ నాశనమ్। – కోటి హోమ పద్ధతి

భావము- యజ్ఞము చేయు వారికి గ్రహపీడలుండవు. బంధు నాశనము ధనక్షయము, పాపములు, రోగములు, బంధనములు, మొదలైన కష్టములుండవు. యజ్ఞ ఫలమనంతము.

"దేవా సంతోషితా యజ్ఞకోన్ సంబంధయన్త్యుత్
ఉభయోర్లోకయోదేవ భూతిర్యజ్ఞః ప్రదృశ్యతే।
తస్మాద్యద్ దేవత్వం యాత పూర్వ్యైసదమోదతే
నాస్తి యజ్ఞ సమందానం నాస్తి యజ్ఞ సమోవిధిః
సర్వధర్మ సముదేశ్యో దేవి యజ్ఞ సమాహితః – మహాభారతము

యజ్ఞముల వలన సంతుష్టి చెంది దేవతలు ప్రపంచమునకు కల్యాణమును చేకూరుస్తారు. యజ్ఞముద్వారా లోక, పరలోక సుఖము ప్రాప్తిస్తుంది. యజ్ఞము వలన స్వర్గ ప్రాప్తి లభిస్తుంది. యజ్ఞమునకు సమానమైన దానము లేదు. యజ్ఞమునకు సమానమైన విధివిధానమేదీ లేదు. యజ్ఞమునందే సర్వధర్మోద్దేశ్యములు నిండి వున్నవి.

అసురాశ్చయ సురశ్చైవ పుణ్యహేతోర్మఖ క్రియామ్।
ప్రయతంతే మహాత్మానస్తస్మాద్యజ్ఞః పరాయణమ్।
యజ్ఞై రేవ మహాత్మానో బభూవు రాధికాః సురాః। – మహాభారతం

అర్థము - అసురులూ సురులూ, అందరూపుణ్య హేతువైన యజ్ఞము చేస్తారు. సత్పురుషులెప్పుడు యజ్ఞ పరాయణులై వుండాలి. యజ్ఞము వలననే యెక్కువ మంది సత్పురుషులు దేవతలైనారు.

యది క్షితా యుర్యది వా పరేతో మృత్యోరంతికం నీతఏవ।
తమాహరాబి నమృతే రూప స్థాతస్పార్షమేనం శతశారదాయ।

– అథర్వణవేదము

రోగి తన జీవన శక్తిని పోగొట్టు కొనిన యెడల నిరాశా జనక పరిస్థితిలో నున్నప్పుడు, మరణకాల మాసన్నమైనపుడు గూడా యజ్ఞము మృత్యు ... నుండి తప్పింపగలదు. మరల నూరు సంవత్సరములకు కావలసిన బలవంతుని ...

"యజ్ఞైరా ప్యాయితా దేవా వృష్ణయుత్సర్గేణ వైప్రజాః
ఆప్యాయన్తేతు ధర్మజ్ఞయజ్ఞాః కళ్యాణహేతవః — విష్ణుపురాణము

యజ్ఞము వలన దేవతలకు బలము సంక్రమిస్తుంది. యజ్ఞమువలన వర్షము కురుస్తుంది. వర్షము వలన అన్నము, ప్రజాపాలన జరుగుతుంది, హే ధర్మజ్ఞ యజ్ఞమే కల్యాణ హేతువు!

ప్రయుక్తాయ యథా చష్టయాః రాజయక్ష్మా పురోజితః।
తాంవేద విహితా మిష్టిమారోగ్యార్థీ ప్రయోజయేత్।
— చరకుడు (చరకసంహిత)

వేడితో నున్న రోగములకు ప్రాచీన కాలంలో యజ్ఞమును ప్రయోగించి తగ్గించెవారు. రోగము నుండి విముక్తి పొందగోరిన వారికి కావలసినదా వేదవిహిత యజ్ఞాశ్రయము.

అహంక్రతురహం యజ్ఞః స్వధా హమహ మౌషధమ్।
మన్త్రోఽ హమహమే వాజ్య మహమగ్ని రహం హుతమ్। — భగవద్గీత

'నేనేక్రతువును, నేనే యజ్ఞమును, నేనే కర్తను, నేనే ఔషధిని, నేనే మంత్రమును, ఘృతమును, అగ్నిని, నేనే హవనమును'

'నాయంలోకోకస్త్య యజ్ఞస్య కుతోకన్యః కురుసత్తమమ్' — గీత

ఓ అర్జునా, యజ్ఞరహిత మనుష్యునకు యీ లోకంలో సుఖంలేదు. యిక పరలోకమందు సుఖమెట్లుండును?

నాస్తి యజ్ఞస్యలోకో వైన యజ్ఞో విన్ద తే శుభమ్!
అయజ్ఞోన చపూతాత్మాన శ్యన్తి శ్చిన్న పర్ణవత్।

యజ్ఞము చేయనివారు లౌకిక, పారలౌకిక సుఖములు పొందలేరు. యజ్ఞము చేయనివారి ఆత్మ పవిత్రముగా నుండనేరదు. వారు చెట్టు నుండి రాలిన పత్రమువలె నశించెదరు.

సహయజ్ఞా ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్ట కామధుక్।
దేవాన్ భావయతానేన తేదేనా భావయన్తువః
పరస్పరం భావ యన్తః శ్రేయః పరమ వాప్స్యధ।
ఇష్టా న్భోగాన్హి వోదేవాదాస్యన్తే యజ్ఞభావితాః। — గీత

బ్రహ్మ మనుష్యునితో పాటు యజ్ఞమును గూడ సృష్టించాడు. యీ యజ్ఞము వలన ఉన్నతి కలుగుతుంది. యీ యజ్ఞము మీ యభీష్ట కోర్కెలను తీరుస్తుంది, అవసరాలను సమకూరుస్తుందని గూడా బ్రహ్మ బోధించాడు. మీరు యజ్ఞముచే దేవతలను తృప్తి పరచండి. దేవతలు మీకు మేలు చేస్తారు. యీ విధంగా పరస్పరము మీ యిరువురూ మీ కర్తవ్యాన్ని పాలించితే కళ్యాణప్రదమవుతుంది. యజ్ఞమువలన తృప్తిపడిన దేవతలు అనాయాసంగా మీకు సుఖశాంతులు కలగడానికవసరమైః వస్తు సముదాయమును ప్రసాదిస్తారని గూడా బ్రహ్మ మనుష్యునకు వుద్బోధించాడు.

అసంఖ్యాక శాస్త్ర వచనములలో కొన్ని ప్రమాణములుపైన సీయబడినాయి. దీనివలన యజ్ఞమహాత్మ్యమును గూర్చిన సందేహములు సహజమని తోస్తాయి. పూర్వకాలంలో ఆధ్యాత్మిక, భౌతిక వుద్దేశ్యములు నెరవేర్చుటకు గొప్ప గొప్ప యజ్ఞములు చేయడం కద్దు. దేవతలు గూడా యజ్ఞముచేసేవారు. అసురులు యజ్ఞము చేసేవారు. ఋషుల ద్వారా యజ్ఞం నిర్వర్తించబడేది. రాజులు అశ్వమేధము, మొదలైన విశాల యజ్ఞముల చేయడానికి ప్రయత్నించేవారు. సాధారణ గృహస్థులు తమ తమ శక్త్యను గుణంగా యజ్ఞములను గావించే వారు. తరచుగా కాలానుగుణ్యంగా శత్రువుల ప్రయోజనాలను, లాభాలను విధ్వంసము చేయడానికిగాను, అసురులు యజ్ఞములను విధ్వంసము చేసేవారు. కావున యజ్ఞములను చేయనీయకుండా నాశనము చేసేవారు. రామాయణంలో, రాక్షసులు చేసే యజ్ఞము వర్ణింపబడినది. దానిని హనుమంతుడు నాశనము చేయడం గూడా వున్నది. యేలనన యజ్ఞము పూర్తిగావింపబడిన యెడల రాక్షసులు అజేయులవుతారు.

దశరథ మహారాజు యజ్ఞము చేసిన నలుగురు పుత్రులను పొందాడు. రాజా 'నృగ యజ్ఞములను చేయడం ద్వారా యింద్రాసనమున కధికారికాగలిగాడు. అశ్వపతిరాజు యజ్ఞముగావించడం ద్వారా సంతాన ప్రాప్తికి సుయోగ్యుడైనాడు. ఇంద్రుడుస్వయంగా ఇంద్రపదవిని పొందడం యజ్ఞముల నొనరించినందుననే. భగవాన్ శ్రీరామ చంద్రమూర్తి తానుస్వయంగా అశ్వమేధ యాగము చేశాడు. శ్రీకృష్ణ భగవాన్ ప్రేరణచే పాండవులు రాజసూయ యాగము నిర్వర్తించారు. యీ యజ్ఞంలో ఆగంతకులను అనగా వచ్చినవారిని స్వాగత సత్కార్యక్రమ (కాళ్ల కడుగుట, పీచుట, గంధమలంకరించుట మొదలైనవి) భారమును స్వయంగా కృష్ణ పరమాత్మ వహించాడు.

పాపములకు ప్రాయశ్చిత్త స్వరూపము, అరిష్టములు తొలుగుటకు, ప్రారబ్ధ జన్మదౌర్భాగ్యము శాంతించుటకు, లోటును భర్తీ గావించే నిమిత్తము సౌభాగ్య ప్రాప్తి కొరకు, రోగనివారణార్థం దేవతలను ప్రసన్నులను గావించు కొనుటకు, ధనధాన్యము లధికంగా పొందుటకు కావలసి అమృతమయ వర్షము కురియడానికి, వాయు

మండలములోని కలుషితతత్వముల తొలగించడానికి హవన యజ్ఞము చేయబడేది. దాని పరిణామము గూడా అటులనే జరిగేది.

యజ్ఞమొక మహత్తరమైన విజ్ఞానము. యజ్ఞము లాచరించుటకు వుపయోగింపబడి సమిధలు కొన్ని వృక్షముల నుండి సమకూర్చు కొంటారు. యీ సమిధ వృక్షములు గొప్ప గుణములు గలవి. యేయే ప్రయోగములకు కెలాంటి ద్రవ్య వస్తువులు హోమమున కర్పించవలెనో, దానికి గూడా ప్రత్యేక విజ్ఞానమున్నది. ఆ వస్తువుల కలయికవలన విశేషమైన సమ్మిశ్రణము తయారవుతుంది. దానిని జ్వలింప చేసినపుడు వాయుమండలంలో నొక విశిష్ట ప్రవాహము వుద్భవిస్తుంది. వేదమంత్రోచ్ఛారణ శక్తి వలన ఆ ప్రభావములో యింకా అభివృద్ధి జరుగుతుంది. ఫలస్వరూపంగా ఆ మహాకార్యములో పాలు పంచుకొని విలీనమైన వ్యక్తిపైన, సన్నిహితంగా వున్న వాయు మండలంపై దాని అధిక ప్రభావముంటుంది. సూక్ష్మప్రకృతి అంతరాళము నందున్న నానా విధములైన దివ్యశక్తులు పనిచేస్తాయి. వాటిని దేవతాశక్తులంటారు. యీ దేవతలను అనుకూలంగా జేసుకొనుట, వాటిని వుపయోగించుకొనుట వీలైన దిశలో నుంచుకొనుటకు, వాటితో సంబంధ మేర్పరచు కొనుట యే దేవతా ప్రసన్న మంటారు.

ప్రపంచములో నున్న యే వస్తువూనశించదు. కేవలము రూపాంతరము చెందుతుంది. హవనములో సమర్పింపబడిన వస్తువు, వేదమంత్రముల శక్తితో పాటు, యజ్ఞముద్వారా ఉత్పన్న సద్భావనలు, రెండూ కలసి ఆకాశములో వ్యాపిస్తాయి. దానిఫలితంగా సమస్త ప్రపంచానికి యనేక విధములైన కళ్యాణ కారక పరిణామములు సంభవిస్తాయి. యీ విధంగా ప్రపంచానికి సేవచేసినందువలన, విశ్వమంతటా సుఖశాంతులు విరజిల్లుతాయి. యిదియొక వుత్తమమైన మాధ్యమచర్య (Medium) పుణ్యపరమార్థము. యజ్ఞమువలన యాజ్ఞికునకు ఆత్మశుద్ధి కలుగుతుంది. అతని పాప తాపములు నశిస్తాయి. ఆవిధంగానే శాంతి, సద్గతులు ఉపలబ్దమవుతాయి. నిజమైన నిర్మల హృదయంతో యజ్ఞమాచరించువారికి ఇహలోక, పరలోక సుఖముకలుగుతాయి. ఆతనిపుణ్యము విస్తారమై నపుడు ఆతనికి స్వర్గముగాని విముక్తిగాని ప్రాప్తిస్తుంది. రెండవ జన్మము యొక వేళ సంభవిస్తే సుఖియై, శ్రీమంతుడై, సాధన సంపన్నమైన ఉన్నత కుటుంబములో జన్మిస్తాడు. దాని సౌకర్యముతో పాటు సత్కర్మానుష్ఠానము గావిస్తూ జీవితలక్ష్యమును విజయవంతంగా పూర్తిచేస్తాడు.

యజ్ఞమున కర్థముదానము, ఏకత్వము, ఉపాసన. యజ్ఞమున వేదోక్తమైన, శక్తివంతమైన మంత్రములను విధిప్రకారము ఉచ్ఛరిస్తుంది. విధిప్రకారము తయారు చేయబడిన కుండములు, శాస్త్రోక్త సమిధలు, నిర్దేశించబడిన సామాగ్రిని సేకరించి,

